# షేక్స్పియరు-రచనలు

## సవిమర్శక ప్రశంస

రచయిత: కళాప్రపూర్ణ డా॥ గిడుగు వేంకట సీతాపతి



దేశీబుక్ డిస్ట్రిబ్యూటర్సు
శరత్ బిల్డింగ్సు · విజయవాడ-2

*Shakspeare Rachanalu - Savimarsaka Prasamsa— by*
*Kalaprapoorna Dr. Gidugu Venkata Seethapathi.*

దేశి ప్రచురణ

ద్వితీయ ముద్రణ

Printed by :
Sri Krishna Printing Works.
Vijayawada 2

# ఉపోద్ఘాతము

**విలియమ్ షేక్స్పియరు** 1564 ఏప్రియల్ 23 వ తేదీన జన్మించినాడు. 1964 ఏప్రిల్ 23 వ తేదీ నాటికి అతడు పుట్టి 400 సంవత్సరములు పూర్తియయినవి. కనుక, అతని చతుశ్శత వర్ష పూర్తి మహోత్సవములు అతని మాతృదేశమయిన ఇంగ్లండులోనేకాక ప్రపంచమందు విద్యావ్యాప్తిగల అమెరికా, జర్మనీ, ఫ్రాన్స్ మొదలయిన పెక్కు ఇతర దేశములందును ఈ మహోత్సవములు జరిగినవి. మన దేశమందు ఢిల్లీ నగరములోకూడా ఈ మహోత్సవము సాగినది రాష్ట్రపతియయిన డా॥ రాధాకృష్ణగారు ప్రారంభోపన్యాసము గావించినారు. విద్యావేత్తలనేకులు ఈ మహోత్సవములో పాల్గొన్నారు. షేక్స్పియరు రచించిన నాటకములలో కొన్ని ప్రదర్శితములయినవి. ఇతర దేశములలో ఈ విధముగాను ఇంతకంటె ఎక్కువ వైభవముతోను మహోత్సవములు జరిగినవి. సభలలో విద్యాధికులు చదివిన ఉపన్యాసములు గ్రంథరూపమున ప్రకటితములయినవి.

షేక్స్పియరు గ్రంథములు చదివిన వారికిని, ఇతనిని గూర్చి ఇదివరకే కొద్దిగానో గొప్పగానో తెలిసికొన్నవారికిని ఈ ఉత్సవములు విపరీతముగా కనబడవుగాని, ఇతని పేరు మాత్రమే విన్నవారికిని, పేరయినా వినని వారికిని ఈ ఉత్సవములు వింతగా కనబడవచ్చును. ఎవరీ షేక్స్పియరు? ఇతడు రచించిన గ్రంథములెట్టివి ? ఆంగ్ల సాహిత్యమందేకాక ఇతర భాషల సాహిత్యములందును ఇతనిని మించిన మహాకవులు లేరా ? ఉంటే వారి పేరు ప్రఖ్యాతులు ఇతని పేరు ప్రఖ్యాతులవలె ప్రపంచమందు ఇంత ఎక్కువగా వ్యాపించక పోవుటకు కారణమేమి ? ఇతని నాటకములు ప్రపంచమందలి పెక్కు భాషలలో అనువదింపబడిన వంటున్నారు గదా ఆ నాటకములెట్టివి ? వాటిలోగల ప్రత్యేకత, విశిష్టత, గొప్పతనము ఎట్టిది ? ఇతడు 37 నాటకములు, 7 పద్య కావ్యములు రచించినా డంటున్నారుగదా ? ఇన్ని నాటకములెట్లు రచించగలిగినాడు ? ఈ నాటకములన్నీ ప్రయోగార్హములయినవేనా ? వీటిలోగల ఇతివృత్తమేమి ? నాటకకళా శిల్పమెట్టిది? పద్య కావ్యములందలి కవితా ఘనత ఎట్టిది ? ఇట్లు ప్రశ్నపరంపరలు ఉదయించుటలో వింతలేదు. ఈప్రశ్నలకుగాని, ఇంకా ఇట్టి ప్రశ్నలకుగాని సంతృప్తి పూర్తిగా కలిగించగల సమాధానములు ఇవ్వవలెనంటే ఏ ఒక్క గ్రంథమైనా చాలదు. ఏ ఒక్కరికైనా సాధ్యము కాదు. ఈ ఉత్సవముల సమయములో షేక్స్పియరు మహాకవిని గూర్చి తెలిసికొందామనే కోరిక జన సామాన్యమునకు సహజముగా పుట్టును గనుకనే ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీవారు షేక్స్పియరు సాహిత్య ప్రశంస అనే **విషయమును**

గూర్చి గ్రంథము కావలెననిన్ని పోటీగా రచయితలు రచించి పంపే గ్రంథములలో ఉత్తమమయిన గ్రంథమునకు బహుమతి ఇచ్చెదమనిన్ని ప్రకటించినారు. వారి ప్రకటన చూచి నేనీ గ్రంథము రచించి పంపినాను.

*   *   *   *

ఈ గ్రంథము రచించుటకు లభించిన కాలము పరిమితమగుట వలన గ్రంథ విస్తృతికూడా పరిమితముకాక తప్పదు కదా? అయినా ఈ గ్రంథమందుండ వలసిన విషయములలో ముఖ్యములయినవి ఏవిన్నీ విడిచి పెట్టలేదు. అవకాశమును బట్టి కొన్ని సవిస్తరముగాను కొన్ని సంక్షిప్తముగాను తెలియజేసినాను. గ్రంథ సౌష్ఠవమునకు కావలసిన చిన్న విషయములు కూడా సూచింపకపోలేదు.

షేక్స్పియరు గ్రంథములతో పరిచయమేమీలేని వారికి ఉపచరించ వలెనన్న ఉద్దేశముతో నేనీ గ్రంథము రచించినాను గనుక ఇందుగల విషయములు తెలిసిన వారికి విసువు పుట్టించ వచ్చును. అందుకు సహృదయులు నన్ను మన్నింతురుగాక ! తెలిసిన వారికైనా ఈ విషయములు జ్ఞప్తికి వచ్చి సంతోషకరములు కావచ్చునన్న ఆశయంకూడా నాకు లేకపోలేదు.

వాద గ్రస్తములయిన విషయములు నేను ఎత్తుకొనలేదు. సందర్భోచితముగా ఒకటి రెండు సూచించి నానేమో? షేక్స్పియరు రచించిన గ్రంథములన్నీ పూర్తిగా విమర్శించుటకు అనేక సంపుటముల గ్రంథము కావలెను. అందుకు నేను సమర్థుడనుకాను. సమర్థత ఉన్నంత వరకైనా వ్రాయుటకు అవకాశమూలేదు.

ఈ గ్రంథము రచించుటలో నేననుసరించిన మార్గము ముందుగా తెలియజేస్తున్నాను. మొదటి ప్రకరణములో ఎలిజబెత్ యుగము ఎట్టిదో అందులో ఆర్థిక, సాంఘిక, రాజకీయ పరిస్థితు లెట్లుండెనో సంస్కృతి వికాసములో ఎట్టి నూతన చైతన్యము కలిగినదో సాహిత్య విషయములో షేక్స్పియరు యుగము ఎలిజబెత్ యుగములో ఎట్టి స్థానము పొంది యుండెనో తెలియజేసినాను. ఆ తర్వాతి ప్రకరణమందు షేక్స్పియరు జీవిత చరిత్ర విషయములు సంక్షిప్తముగా వివరించినాను. ఆ తర్వాతను షేక్స్పియరు రచించిన గ్రంథములను కాలక్రమమును బట్టిన్ని గ్రంథముల లక్షణములను బట్టిన్ని పేర్కొన్నాను. షేక్స్పియరు గొప్ప నాటక కర్త మాత్రమే కాక చక్కని కావ్యశిల్పముగల పద్య కావ్యములుకూడా రచించిన మహాకవి. అయినా నాటకకర్తగానే జగద్విఖ్యాతి పొందినవాడు గనుక అతని నాటకములను గూర్చి ముందుగా చెప్పి అతని కావ్యములనుగూర్చి కడపటి ప్రకరణములందు వివరించినాను. అతడు రచించిన నాటకములు 37 వాటిలో 17. కామిడీలు 10 చారిత్రకములు, 10 ట్రాజడీలు. కామెడీ అనగా ఒక్కమాటలో సుఖాంతమనిగాని, శృంగార రస ప్రధానమయినదనిగాని, హాస్యరస ప్రధానమయినదనిగాని

చెప్పుటకు వీలులేదు. కనుక సౌలభ్యము కోసము కామెడీ అనే పదమే ప్రయోగించి కామెడీల కోసము ప్రత్యేకించిన ప్రకరణములో ఏయే కామెడీలు ఎట్టి లక్షణములు గలవో వివరించినాను. ఆ విధముగానే ట్రాజడీ అనగా విషాదాంత నాటకమన్నంత మాత్రాన షేక్స్పియరు రచించిన ట్రాజడీల లక్షణము మనకు పూర్తిగా బోధ పడదు. కనుక ట్రాజడీల కోసము ప్రత్యేకించిన ప్రకరణములో ఏయే ట్రాజడీలు ఎట్టి లక్షణములు గలవో వివరించినాను.

పద్య కావ్యముల గురించి ఎక్కువగా వ్రాయుటకు నా కవకాశము చాలినది కాదు. అందుచేత ముఖ్యమయిన విషయములు మాత్రమే—అనగా ఆయా కావ్యము లందలి కథా వస్తువు ఎట్టిదో చమత్కృతి ఎట్లున్నదో మనోభావనలెట్లు వ్యక్తముల యినవో సంక్షిప్తముగా తెలియజేసినాను. ఆ తర్వాత ప్రకరణమందు నాటకము లలోను కావ్యములలోను అక్కడక్కడ షేక్స్పియరు పాత్రల నోటను పలికించిన మనోభావములు-సామెతలు లోకోక్తులు ఆశయములు మొదలయినవి విషయాను క్రమ పద్ధతిని ప్రదర్శించినాను. ఆంగ్ల భాషలో ఉన్నది తెలుగులో అనువదించి చెప్పినప్పుడు మూలములోని సొగసు, తెలుగు లోనికి తీసికొని వచ్చుట కష్టము. ఏయే కావ్యములు, ఏయే నాటకములందు ఏయే సందర్భములలో రచితములయినవో సూచించినాను కనుక మూలములో ఎట్లున్నవో తెలిసికోగోరిన వారు ఆ సూచనలను బట్టి మూల గ్రంథము తీసి తెలిసికోగలరు. ముఖ్యమైనవి కొన్ని పుటయడుగున చూపించినాను.

కడపటి ప్రకరణమందు షేక్స్పియరు తన రచనలద్వారా ప్రపంచమందెంత మేర మన కన్నుల యెదుట ప్రదర్శించినాడో ఎన్నెన్ని శాస్త్రములందు ఎన్నెన్ని కళలందుగల విషయములు మనకు తెలియజేసినాడో గ్రీక్, లాటిన్, ఫ్రెంచి భాష లందుగల గ్రంథములందుగల విజ్ఞానము సూటిగా ఆ గ్రంథములు చదివిగాని, ఆంగ్ల భాషలోగల అనువాదములను చదివిగాని తెలిసికొన్నాడో అతనికి గల లోకవిజ్ఞానము, మానవమనో లక్షణ జ్ఞానము సంస్కృతి ఎంత విశాలమయినదో తెలియజేసినాను.

ఈ గ్రంథము రచించుటలో నాకు తోడ్పడిన గ్రంథముల పట్టిక అనుబంధము చేర్చి పెట్టినాను.

*        *        *        *

# విజ్ఞప్తి

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రకటించిన 1964 సంవత్సరపు బహుమానము స్వర్గీయ బుచ్చిబాబుగారు రచించిన 'షేక్‌స్పియర్ సాహితీ పరామర్శ' అనే గ్రంథమునకు లభించినది. ఆ గ్రంథము 1966 సెప్టెంబర్‌లో ముద్రితమయినది. అదే పోటీకి పంపించిన నా యీ గ్రంథమునకా బహుమతి రాలేదన్న విచారము నా కంతగా కలుగలేదు.

నేను బుచ్చిబాబుగారిని లెస్సగా ఎరుగుదును. వారు నాకు మిత్రులు. షేక్‌స్పియర్ గ్రంథాలను శ్రద్ధతో సవిమర్శకంగా పఠించినవారు. తెలుగులో రచనలను ఇంపుగా సాగించగల నేర్పు కల్గినవారు. ఇటీవలనేవారు స్వర్గస్తులైనారు. అందుకు నేనెంతో దుఃఖించాను.

ముద్రితమైన వెంటనే వారి గ్రంథమును కొని చదివినాను. నేను ఊహించిన దాని కంటే వారి రచన రసవత్తరముగా సాగినది. అయినా నేను రచించిన ఈ గ్రంథమును కూడా తెలుగు వారికి అందజేయవలసిన అవసరమున్నదని నేను భావించాను. వారి రచనకు, నా రచనకు దృక్పథములు వేరు. "ఆంగ్లభాషతో గాఢమైన పరిచయమూలేక, పెద్ద పాండిత్యమూలేక షేక్‌స్పియర్ గురించి తెలుసుకోవాలని కుతూహలపడే సామాన్య పాఠకులు ఎందరో వుంటారు. వారిని ఉద్దేశించే ఈ పుస్తకం వ్రాశాను" అని బుచ్చిబాబుగారు అన్నారే కాని షేక్‌స్పియర్ రచించిన నాటకాలు కొద్దిగానైనా చదివిన వారికే కాని ఏ మాత్రమూ చదవని వారికి (తెలుగులో పాండిత్యమున్నా లేకపోయినా) బోధపడే విధముగా వారు ఆ గ్రంథమును రచించలేదు. మన తెలుగు వారిలో ఆంగ్లభాషా పరిచయం గాఢంగా ఉన్నవారు అల్ప సంఖ్యాకులు. వారిలో షేక్‌స్పియర్ నాటకాలు చదివినవారు నూటికి ఒక్కడైనా ఉండరు. బి. ఏ., ఎమ్. ఏ. పరీక్షలలో ఉత్తీర్ణులైన వారయినా వారికీ పాఠ్యగ్రంథాలుగా ఉండిన ఐదారు నాటకాలు మాత్రము చదివిన వారే కాని పట్టుమని పదినాటకాలయినా చదివిన వారు వేయింట ఒక్కరైనా లేరనే నా నమ్మకము. అట్టి పరిస్థితులలో నాటకములలోని కథా వస్తువులు తెలియని వారికి బుచ్చిబాబుగారి విమర్శ ఎట్లు తెలియగలదు?

షేక్‌స్పియర్ రచించిన ప్రతి నాటకమును విమర్శించక పూర్వము ఆయా నాటకములలోని కథా వస్తువును సంగ్రహంగా ముందు తెలియజేసి, రచనలోని విశేషములను విమర్శించి, ఆంగ్ల విమర్శకులు, తెలియజేసిన లోపములను గూడా

చర్చిస్తూ, ఎంతవరకు ఏయే విషయములో అయా నాటకములు ప్రశంసార్హములో వివరిస్తూ నేను ఈ గ్రంథమును రచించాను. షేక్స్పియరు నాటకములతో ఏ మాత్రమూ పరిచయము లేకుండా కళాశాలలో నూతనంగా ప్రవేశించే విద్యార్థులకు నా గ్రంథము ఎక్కువగా ఉపకరించగలదని నా నమ్మకము.

ఈ ఉద్దేశ్యముతోనే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమును ముద్రణకుగాను ఆర్థిక సహాయము కోరిగా నాకు వేయి రూపాయల సహాయము లభించినది. అందుకు వారికి నా కృతజ్ఞతలు సమర్పించు కొంటున్నాను.

హైదరాబాద్
25-12-1968.

గ్రంథకర్త.

# మనవి

మా తండ్రిగారు స్వర్గీయ డాక్టర్ గిడుగు వెంకట సీతాపతిగారి గురించి తెలుగు పాఠకులకు తెలియజేయవలసిన అవసరం ఏ మాత్రమూలేదు. బాలసాహిత్యమునుండి పాండిత్య విమర్శనల వరకు వారు చేసిన వివిధ రచనలు ఆ బాలగోపాలమంతటికి సుపరిచితములైనవే. వారు రచించిన మేటి తెలుగు గ్రంథములలో ఇది చివరిది. గురుజాడ అప్పారావుగారి గురించి ఇదే విధమైన ఒక గ్రంథమును ఆంగ్లభాషలో వారు రచించారు. అది దీని తర్వాతిది. దానినికూడా త్వరలో ప్రచురించవలెనని మా సంకల్పము. ఆ గ్రంథము ఆంధ్రేతరులకు ఉపకరించుటకుగాను వారు రచించారు.

1968 లోనే ఈ గ్రంథము ముద్రితమై యుండవలసినది. కాని ఆ సంవత్సరములో మా తండ్రిగారి ఆరోగ్యముపూర్తిగాక్షీణించినది. కంటికి కేన్సరు రావడము దానితో వారు కొన్ని మాసములపాటు ఆస్పత్రులలో ఉండడము జరిగినది. ఆపరేషనుతో కంటి బాధ పోయినా వారి ఆరోగ్యము కుదుటపడలేదు. చివరకు తే 19-4-1969 దీన ఆయన స్వర్గస్థులైనారు.

ప్రభుత్వంవారి ఆర్థిక సహాయం లభించినా అనేక ఇతర కారణాలవలన ఈ గ్రంథాన్ని నేటి వరకు ప్రకటించలేనందుకు మేము విచారిస్తున్నాము.

ఈ గ్రంథము కాలేజీ విద్యార్థులకు ఎంతో ఉపకరించగలదని మా నమ్మకము. అందువలన ప్రతి కాలేజీ గ్రంథాలయములోను ఈ గ్రంథానికి స్థానం లభించగలదని ఆశిస్తున్నాము.

విజయనగర కోలనీ
హైదరాబాద్ - 28
-6-1972.

గి. వే. రామమూర్తి
విశాలా పబ్లికేషన్స్.

# షేక్స్పియర్ సంక్షిప్త జీవిత చరిత్ర

విల్యమ్ షేక్స్పియరు పూర్వులు వారిక్‌షర్ కౌంటీలో వ్యవసాయమును వృత్తిగా పెట్టుకొని ఉండేవారు. షేక్స్పియరు తండ్రి జాన్ షేక్స్పియరు 1551 లో తాను పుట్టి పెరిగిన స్నిటర్‌ఫీల్డు గ్రామము విడచిపెట్టి ఆ కౌంటీలోనే గల ఏవన్ నదీ తీరమందున్న స్ట్రాట్‌ఫర్డ్ పట్టణమునకు వెడలి స్థిరనివాస మేర్పరచుకొని ఉన్ని, తోళ్ళవ్యాపారము సాగిస్తూ ఉండేవాడు. అయిదు సంవత్సరములలో ఆ వ్యాపారము వలన అక్కడ పలుకుబడి సంపాదించుకొని సంపన్నుడై 1557 లో ఆ పట్టణమందు రెండిండ్లు కొనగలిగెను. ఆ సంవత్సరమే మేరీ ఆర్డెన్ అనే యువతిని పెండ్లి చేసుకొన్నాడు. ఈమె తండ్రి రాబర్ట్ ఆర్డెన్‌కు విల్మ్‌కోట్‌లో ఒకపెద్ద వ్యవసాయక్షేత్ర ముండెను. 1564 లో ఆ దంపతులకు మన కథానాయకుడయిన విల్యమ్ షేక్స్పియరు జన్మించెను. 1565 లో జాన్ షేక్స్పియరు ఆ పట్టణ పురపాలక సంఘమువారిచే ఆల్డర్‌మన్‌గా ఎన్నిక అయినాడు. 1568లో బెయిలిఫ్ (నేటి పరిభాషలో మేయర్)గా కూడా నియమితు డయినాడు. ఆ సంవత్సరమే రెండు సంచార నాటక బృందాలవారు ఆ పట్టణమునకు వచ్చి నాటక ప్రదర్శనాలు కావించుట జరిగినది. ఆ తర్వాత కూడా ప్రతి సంవత్సరమూ ఏదో ఒక సంచార నాటక బృందమువారు ఆ పట్టణములో నాటక మాడుతూ వుండడం జరుగుతూ ఉండేది. అందుచేత షేక్స్పియరు బాల్యదశలోనే నాటక ప్రదర్శనాలు చూస్తూ ఉండటం వలన అతనికి నాటకాల మొదల అభిరుచి అంకురించి వృద్ధిపొందినది.

మరి కొలది కాలమునకే జాన్ షేక్స్పియరుకు దుర్దశ ప్రారం
భించినది. ఆర్థిక లోపము వలన అతడు అప్పులపాలయినాడు. హెన్రీ
హిగ్గ్ఫర్డు అను వానిని నుండి 30 పౌనులు ఋణముగా తెచ్చుకొని
చెల్లించలేక పోయినాడు. ఆ ఋణదాత దావా తెచ్చినప్పుడు జాన్
షేక్స్పియరు కోర్టుకు వెళ్ళక పోవడం వలన అరెస్టువారంటుకూడా
వచ్చినది. ఆ విపత్తు ఏదో ఒక విధముగా తప్పినా జాన్ షేక్స్పి
యరు అంతకంతకు ఎక్కువగా ఋణపీడితుడై 1580 నాటికి తనస్థిరాస్థి
అంతా తనాకా పెట్టి పెద్ద మొత్తము ఋణముగా తెచ్చుకొని చిల్లర
అప్పులు తీర్చుకొన్నాడు. ఈ సంఘటనలవలన మన షేక్
స్పియరుకు బాల్యమునందే కష్టములు చవిచూడవలసి వచ్చినది. ఆ
కాలములోనే అతని ప్రాథమికవిద్య కొద్దిగా సాగినది. స్ట్రాట్ఫర్డ్
పట్టణమునందలి ఫ్రీ స్కూల్ (తర్వాత గ్రామర్ స్కూల్ అయినది)లో
చదువుకొన్నాడు. కాని ఆ స్కూల్లో అయినా అట్టే కాలము
అతని చదువుపూర్తిగా సాగలేదు. 1580 నాటికి అతని తండ్రి ఆర్థిక
ముగా దరిద్రుడగుటవలన మన షేక్స్పియరు చదువు చాలించుకొని
కుటుంబ పోషణ కొరకు ఏదో ఒక పని చేయవలసి వచ్చినది. ఆ
స్కూలులో నేర్చుకొన్న లాటిన్ భాష అత్యల్పము. అందుచేతనే
అతని బాల్యస్నేహితుడును నాటక రచయితయును అయిన బెన్ జాన్
సను షేక్స్పియరుకు స్వల్పంగా లాటిన్ స్వల్పతరంగా గ్రీకుభాషలు
అలవడినవని చెప్తూ ఉండేవాడు. 1530 లోనే అనగా 16 ఏండ్ల
వాడయినప్పుడు మన షేక్స్పియరు ఆ పట్టణమందే ఒక మాంసిక
వర్తకునికి (కసాయి వానికి) సహాయకుడుగా పనిచేస్తూ వుండెవాడని జాన్
డౌడన్ అనే యాత్రికుడు వ్రాసిపెట్టుకొన్న వ్రాతల వలన తెలియ
వచ్చినది. అది వాస్తవమే అయి వుంటుందని విజ్ఞుల అభిప్రాయము.
షేక్స్పియరు బాల్యము నుండిన్ని తెలివి తేటలు బుద్ధికుశలత గల
వాడు గనుక చిన్న విషయములను కూడా శ్రద్ధతో పరికించుచుతూ అను
భవము సంపాదించుకొన్నాడు. ఆ కసాయివానివద్ద పనిచేస్తూ ఉన్న
కాలములోనే సాధారణముగా ఆ వర్తకుని వద్దకు వస్తూ ఉండిన వివిధ
వాణిజుల చేష్టలు. సంభాషణలు, అలవాట్లు లెస్సగా గుర్తించి . ఆ

తర్వాత పెద్దవాడయి నాటకకర్తయై అయినప్పుడు తన నాటకాలలోని నీచ పాత్రలను సృష్టించినప్పుడు ఆ పరిజ్ఞానమును వినియోగించినాడు. 4వ హెన్రీ, 5వ హెన్రీ నాటకాలలోని బార్డాల్ఫ్, పైపెన్స్ పాత్రలు, మెర్రివైవ్జ్, అవ్ విన్‌డర్ నాటకములోని సర్ హ్యూ ఇవాన్జ్, జస్టిస్ షాలో పాత్రలు తాను కసాయి పుత్రునివద్ద పనూ ఉండిన వారిని జ్ఞప్తి యందుంచుకొని చిత్రించియుండునని విజ్ఞుల అభిప్రాయము. పాత్రల విషయములోనే కాక తన నాటకములందలి దృశ్యములను వర్ణించునప్పుడు షేక్స్పియరు తాను స్వయముగా చూచిన ఏవన్ నది, స్ట్రాట్‌ఫర్డ్ పట్టణము పరిసర ప్రదేశములు అక్కడి మనోహరములయిన దృశ్యములు ప్రకృతి సౌందర్యము మొదలయిన అంశములు అతని మనస్సులో విహరిస్తూ ఉండుననికూడా కొందరు తెలియజేసినారు

1583 నవంబరు 23 వ తేదీన షేక్స్పియరుకు ఏన్‌హాదవేకు వివాహము జరిగినట్లు ఒక ధర్మబద్ధ పత్రము వుస్టర్ కెతీడ్రల్‌లో బిషప్స్ రెజిస్ట్రీలో దఖలు పడినది. 1583 మే 26 వ తేదీని ఆ వధూవరులకు పుట్టిన కూతురు సుసన్న అనే పేరను బాప్టిజమ్ పొందినది. అందుచేత ధర్మబద్ధముగా వివాహము రెజిస్ట్రీ కాకమునుపే వారికి ప్రేమ బద్ధమయిన సంయోగము జరిగినదని తెలియవచ్చును. వివాహ కాలమునాటికి షేక్స్పియరు 18 ఏండ్ల యువకుడు. అతని భార్య 26 ఏండ్ల యువతి. మరి రెండేండ్లకు ఆ దంపతులకు 1535 లో ఇద్దరు కవలపిల్లలు (హామ్నెట్ అనే కొడుకు, జూడిత్ అనే కూతురు) జన్మించినారు. ఇంతకంటె ఎక్కువగా షేక్స్పియరు గృహస్థాశ్రమ జీవితమునకు సంబంధించిన విషయములు మనకు తెలియవు. తనకంటె తన భార్య 8 ఏండ్లు పెద్దదన్న విచారము ప్రారంభదశలో కలుగక పోయినా కొంతకాలము గడచిన తర్వాత కలిగినట్లు కొందరూహించినారు.

షేక్స్పియరు లండన్ నగరమునకు ఎప్పుడు వెళ్ళి అక్కడి నాటక కంపెనీలలో పని సంపాదించుకొన్నాడో సరిగా కాలనిర్ణయము చేసి చెప్పుటకు ఆధారములేదు. కాని 1592కు చాల పూర్వమే లండన్

నగరములో నివాస మేర్పరచుకొన్నట్లు నిశ్చయముగా చెప్పుటకు తగిన ఆధారము దొరికినది. 1592 సెప్టెంబరు మాసములో చని పోయిన రాబర్ట్ గ్రీన్ "గ్రోట్స్‌వర్త్ అవ్ విట్" అనే కరపత్రము రచించెను. అది మరికొద్ది దినములకే ముద్రితమైనది. అందులో తన తోడి రచయితలు విశ్వవిద్యాలయ విద్యావిశారదలు అయిన మార్లో, పీల్, లాడ్జ్‌ల కుద్దేశించిన లేఖ గలదు. ఆ లేఖలో తనకు బహుశా ఆ మిత్రులకు షేక్స్పియరు యెడల గల కటువైన ఈర్ష్య అతడు వెళ్ళగక్కినాడు. అందలి ముఖ్యవిషయమును అనువదించి తెలియజేస్తున్నాను. ఒక నూతనా గంతుక వాయసమును మనము దిగవిడచిన వెండ్రుకలతో అలంకరించుకొని నలుని చర్మము కప్పుకొని వ్యాఘ్రహృదయములో ప్రవేశించినది. మీ యందరిలో శ్రేష్ఠుడయిన రచయితవలె తాను సమాన ప్రతిభతో అంత్యప్రాస రహిత గేయము (బ్లాంక్ వెర్స్) ఎలుగెత్తి కూయగలనన్న గర్వముతో అత్యంత స్వాభిమానంతో సర్వజ్ఞత్వము వహించి దేశమంతటికిని ఏకైక ప్రేంఖద్ దృశ్యమై విహరిస్తున్నది. "ఇందులో" ప్రేంఖద్-దృశ్యమునకు మూలము "షేక్-సీన్" షేక్స్పియరును సూచించుటకు ప్రయుక్తమయినది. ఈ పత్రములోనున్న "Tigers heart wrapped in a player's hide" అనే మాటలు షేక్స్పియరు రచించిన 6—వ హెన్రీ (3-వ భాగం)లో "O Tiger's heart in a woman's hide" అనే మాటల కనుకరణములు ఇవిన్ని Shaken Scene అనే మాటలున్న నిస్సందేహంగా షేక్స్పియరును సూచించుటకే ప్రయుక్తములయినట్లు విజ్ఞులు సులువుగా తెలుసుకోగలరు. ఈ పత్రమును బట్టి షేక్స్పియరు ఆ నాటికి హెన్రీ VI 3-వ భాగంరచించి ప్రకటించినట్లు స్పష్టము గదా! తక్కిన అంశములు తెలియక పోయినా ఆనాటికి నాటక కంపెనీలలో షేక్స్పియరు పనిసంపాదించుకొని, ఇతరుల నాటకములు ప్రయోగించుట కనుకూలముగా సరిదిద్దుతూ ఉండెననిన్ని, ఆ కంపెనీలు ప్రదర్శించుటకు కావలసిన నాటకములు రచించుటకు పూనుకొనెననిన్ని, ఆ నాటకములలో తానుకూడా ఒక నటునివలె ఏదో ఒక పాత్ర ధరించి ఆడుతూ ఉండెననిన్ని తెలిసికోగలము.

పైని ఉదహరించిన లేఖలో ఈర్ష్యామయమైన వాక్యములే కాక "ఈ నాటక కంపెనీల వారిని నమ్ముకొని వారితో వ్యవహరించ కండి" అనే ఉపదేశముగల వాక్యములుకూడా ఉన్నవి. ఆ ఉపదేశ ఫలితముగానే కాబోలు ఆ విశ్వకళా విద్వాంసులు మరి యా కంపె నీలకు నాటకములు రచించి ప్రదర్శనార్థము ఈయులేదు. అంతే కాక ఆ విద్వాంసులు ఒకరి తర్వాత ఒకరు మరి మూడు, నాలుగు సంవత్స రముల నాటికి చనిపోవుటకూడా సంభవించినది. షేక్స్పియరు ప్రతిభ అంతకంతకు ఎక్కువయినది. ముప్పదియేండ్ల ప్రాయముగల వాడయి నప్పటికి అతని ప్రఖ్యాతి నాటక ప్రపంచమందే కాక సాహిత్య సంఘము లందును, రాణిగారి దర్బారులోను వ్యాపించినది.

1593 వరకి 6-వ హెన్రీ-3- భాగములు 1590 3-వ రిచర్డ్, కింగ్ జాన్ (1591) టైటస్ ఏండ్రానికస్, ద కామెడీ ఆఫ్ ఎరర్జ్ (1592) అనే నాటకాలు ప్రకటితములయినవి. 1593 లో వీనస్ అండ్ ఏడోనిస్ అనే పద్య కావ్యము రచించి ఇంగ్లండు దేశమందు ఎక్కువ ధన సంపన్నులని పేరు మ్రోగిన సౌదాంప్టన్ ప్రభువు (ఎర్ల్) హెన్రీ రయొతెస్లీకి అంకితముగా ప్రకటించెను. ఆ మరుసటి సంవత్సరము తనకు పోషకుడైన ఆ ప్రభువుకే తన రెండవ పద్య కావ్యము, ద రేప్ ఆఫ్ లూక్రిస్ కూడా అత్యంత భక్తి వినయ గౌరవ సూచకములయిన వాక్యములతో అంకితముగా ప్రకటించి యిచ్చెను. ఆ వాక్యములెట్లుం డెనో చూడండి.

"నేను కావ్యకర్తగా చేసినదంతా తమదే; నేను చేయవలసినది కూడా తమదే; నాకున్న సంపదలో ఒక పెద్ద భాగము తమ ప్రసన్న తకు లోబడినదే."

ఈ కావ్యములు ప్రకటితములంటే ముద్రితములని అర్థముకాదు. ఆనాటి ఆచారము చొప్పున కొన్ని వ్రాత ప్రతులు తయారగుతూ ఉండేవి. 1609 లో ఇవి ముద్రితములు. ఈ పద్యకావ్యములలో షేక్ స్పియరు కున్న వ్యక్తిగతమయిన ఘనత, కవిత్వ ప్రతిభ, తత్వవిజ్ఞాన సంపన్నత బహిర్గతములయినవి.

1593 లోనే గయ్యాళిని సాధువుగా చేయుట అనే అర్థముగల ద టేమింగ్ ఆఫ్ ది ష్రూ అనే నాటకమున్ను, ద టూ జెంటిల్‌మెన్ ఆఫ్ వెరోనా (వెరోనా నగరమందలి ఇద్దరు పెద్దమనుష్యులు) అనే నాటకమున్ను రచితములయినవి.

1594 లో లండన్ నగరమునందలి నాటక సంస్థల పునర్నిర్మాణము జరిగినది. వాటిలో ఏయే సంస్థలలో ఏయే విధముగా అనగా రచయితగాగాని, సంపాదకుడుగాగాని, నటుడుగాగాని అతడు పనిచేస్తూ ఉండెనో సరిగా చెప్పలేముగాని ఈ పనులు ఏవో ఒక్కొక్క సంస్థల వారికి చేస్తూ ఉండెనని మాత్రము చెప్పగలము. 1594 మార్చి 15 వ తేదీనుండి తన జీవితములో పెద్ద కాలము "లార్డ్ చాంబర్లైన్స్ మెన్" అనే సంస్థలో పని జేసినాడని చెప్పుటకు తగిన ఆధారములు గలవు. ఆ సంస్థ ప్రతిష్ఠ జరిగిన నాడే విల్యమ్ షేక్స్పియరు పేరు, విల్యమ్ కెంప్, రిచర్డ్ బర్‌బెజ్ పేళ్ళతో నాటక కర్తలుగా ప్రకటింపబడినది. ఆ సంవత్సరమే డిశంబరు 27, 28 తేదీలలో గ్రీనిచ్ భవనములందు ఆ సంస్థవారు ప్రదర్శించిన నాటకములకు ఈయబడిన ప్రతిఫలము ఈ ముగ్గురికిని లభించినట్లు తెలియవగును. 1594–1597 లో ఇతడు ఈ సంస్థవారి నాటకప్రదర్శనల కొరకు రోమియో అండ్ జూలియట్, రెండవ రిచర్డ్, ఎ మిడ్ సమర్ నైట్స్ డ్రీమ్, కింగ్ జాన్, ద మర్చంట్ ఆఫ్ వెనిస్, 4వ హెన్రీ మొదటి భాగము అనే నాటకములు రచించినాడు. 1597 నాటికి షేక్స్పియరు ధనవంతుడయి స్ట్రాట్‌ఫర్డ్ - అపాన్ - ఏవన్ అనే నగరమందు న్యూ ప్యాలస్ అనే పెద్ద భవనము కొన్నాడు. 1596 లో ఇతని తండ్రి జాన్ షేక్స్పియరు హెరాల్డ్జు కార్యాలయము వారికి దరఖాస్తు పెట్టి గౌరవ సూచకమయిన కోట్ ఆఫ్ అర్మ్సు సంపాదించెను. ఆ న్యూ ప్యాలస్ మన షేక్స్పియరు జీవితాంతము అతని స్థిరాస్తిగా నిలచినది. ఆ కోట్ ఆఫ్ అర్మ్సు చిహ్నము ఇతడు చనిపోయినప్పుడు ఆ నగరమందలి చర్చి ఆవరణలో ఇతని దేహము పాతిపెట్టినచోట కట్టిన సమాధి గృహమందు ప్రతిష్ఠితమయినది.

లండన్ నగరమందు నాటక రచయితగా ప్రసిద్ధిపొంది యుండిన కాలములో మొదట హాలైన్జ్ బిషప్ గేట్ ప్యారిస్‌లోను ఆ తర్వాత సౌత్ వార్క్‌లోను నివసించినాడు. మొదటి నివాసస్థలము ఎక్కువగా ప్రసిద్ధి పొందిన గ్లోబ్ అనే నాటక శాలకు చేరువగా నుండెను. ఈ గ్లోబ్ అనే పేరుగల నాటకశాల పేరు మారినదే కాని పూర్వపు థియేటర్ నాటక శాలయే అది నిర్మితమయిన భూస్థలాధిపతితో ఈ నాటకశాల నిర్మాతలకు 1599 లో ఏదో తగవు వచ్చినది. అప్పుడు వారు ఆ శాలను పడగొట్టి దానికి వచ్చిన భవన భాగములను తీసికొని పోయి గ్లోబ్ అనే పేరును ఒక నూతన నాటకశాలను నిర్మించినారు థేమ్జు నదికి ఆ ప్రాంతపు ఉత్తర భాగమున ఉండేది; ఈ గ్లోబ్ శాల దక్షిణ భాగమున నిర్మితమయినది. ఈ గ్లోబ్ నాటకశాలలోను మరి కొద్దికాలమునకు బ్లాక్ ఫ్రయర్జ్ అనే నాటకశాలలోను ఇతడు రచించిన నాటకములు ప్రదర్శితములగుతూ ఉండెను.

షేక్స్పియరు ఘనత ఎట్లు దినదినంతకు అధికమగుతూ ఉండెనో కాలక్రమము సరిగా నిర్ణయించి చెప్పలేము గాని కొన్ని సంఘటనలు వలన తేలిన యథార్థములు పేర్కొనగలము. అతని జీవిత కాలముందే అతని పద్య కావ్యము వీనస్ అండ్ ఎడోనిస్ ఆరుసార్లు ముద్రితము లయినది. దరేప్ అఫ్ లూక్రిన్ అయిదుసార్లు ముద్రితములయినది. అతని నాటకములు అనేక పర్యాయములు ఎలిజబెత్ రాణి కాలము లోను, జేమ్జ్ రాజయిన తర్వాతను ప్రదర్శితములయినవి. అతనికి సంబం ధించిన లార్డ్ చాంబర్లైన్జ్ మెన్ అనే నాటక సంస్థకు గౌరవముకలిగినది. 1603 మే 19 వ తేదీని ఆ సంస్థవారు కింగ్జ్ మెన్ అనే పేరను తమ నాటకములను దేశములో ఎక్కడయినను ప్రదర్శించగలుగుటకు కావ లసిన ప్రభుత్వమువారి అనుజ్ఞాపత్రమును పొందినారు. 1604 మార్చి 15 వ తేదీని షేక్స్పియరు పేరు కోర్టు రికార్డులలో కింగ్జ్ మెన్‌లో ఒకరుగా నమోదయినది. కింగ్జ్ మెన్ అయిన వారికి నాలుగు గజములు పొడుగుగల ఎర్రని గుడ్డ యిచ్చేవారు. అది రాజ లాంఛనముగాధరించి రాజుగారు నగర వీధులలో తమ పరివారముతో ఊరేగునప్పుడు ఈ

కింగ్జ్ మెన్ ఆ వస్త్రము తమ దుస్తులపై ధరించి ఆ ఊరేగు పరివార శ్రేణిలో ఉండేవారు.

కింగ్జ్ మెన్ అనే పేరను వెలసిన ఈ నాటక సంస్థలో ఎనమండ్రు వాటా దార్లుండేవారు. వారిలో షేక్స్పియరు ఒక వాటాదారు. అదే కాక గ్లోబ్ థియేటరులోను, బ్లాక్ ఫ్రయర్జ్ థియేటరులోను ప్రతి సంవత్సరము కొంత ధనము లభిస్తూ ఉండేవి. ఈ ఆదాయముల వలన ఇతడు సుమారు 700 పౌన్లు ఆర్జించి యుండవచ్చునని సర్ సిడ్నీలీ తెలియజేసినాడు. అంత ఎక్కువగా కాకపోయినా అతడు సుఖముగా జీవించుటకు కావలసినంత ధనికుడయినాడని అతని సమకాలికుల అభిప్రాయము. 1604 లో ఇతడు క్రిపిల్ గేట్ సమీపమందుండిన సెంట్ ఒలేవ్జ్ ప్యారిష్ భవనమందు మౌంట్ జాయ్ కుటుంబముతో కలసి వసతి యేర్పరచుకొన్నాడు. 1605 లో స్ట్రాట్ ఫర్డ్ లో మరికొన్ని ఆస్తులు కొన్నాడు. రచయితగా – కవిగాను, నాటకకర్తగాను అతడు ఎంత ప్రఖ్యాతి పొందెనో సమకాలిక విద్యాధికులు గొప్ప పదవులలో ఉన్నవారు వ్రాసియుంచిన వ్రాతలనుబట్టి మనము తెలిసికోగలము

1610-1616 ఈ ఆరు సంవత్సరములున్ను షేక్స్పియరు స్ట్రాట్ ఫర్డ్ పట్టణమందు తాను కొన్న న్యూ ప్యాలస్ భవనమందు విశ్రాంతి జీవితము గడపినాడు. కాని నాటక రచనకు స్వస్తి చెప్పలేదు. ద వింటర్జ్ టేల్ 1610 లోను, టెంపెస్టు 1611 లోను 8 వ హెన్రీ 1613 లోను రచించినాడు. అప్పుడప్పుడు లండన్ నగరమునకు వస్తూ ఉండేవాడు. ఒకసారి వచ్చినప్పుడు బ్లాక్ ఫ్రయర్జ్ లో నూటనలభై పౌన్లకొక గృహము కొన్నాడు.

ఆ రేండ్ల కాలంలోను, అతని కుటుంబమువారి విషయం కొద్దిగా తెలియజేస్తాను. 1596 లో అతని కుమారుడు హామ్నెట్ చనిపోయి నాడు. 1607 లో సుసన్న అనే అతని కుమార్తె వివాహం జరిగింది. అల్లుడు జాన్ హాల్ ఆ పట్టణమందే వైద్య వృత్తి చేసుకొంటూ ఉన్న సంపన్నుడు. 1616 లో అతనికి తన అంత్యకాల మాసన్నమయినట్లు

తోచింది. ఒక వీలునామా వ్రాశాడు. అందులో జూడిత్ అనే తన రెండవ కుమార్తెకు 150 పౌన్లు, గిల్ట్ వేసిన పెద్ద వెండిగిన్నె, మిగిలిన అమూల్యమైన వాటిలలో చాలా తన మనుమరాలయిన ఎలిజబెత్ హాలుకు వచ్చినట్లు తెలియజేశాడు. ఆప్తమిత్రులను మరచిపోలేదు. బర్‌బెజ్, హెమింగ్, కాండెల్ అనే ముగ్గురు మిత్రులకు తనపేర జ్ఞప్తి యుంచుకోవలెనని కోరుతూ జ్ఞాపకార్థకముగా ఒక్కొక్క అంగులీయం చేయించుకొని పెట్టుకొనుటకుగాను ఒక్కొక్కరికి 26 షిల్లింగులు 8 పెన్సులు చొప్పున అందజేయవలసినదిగా వ్రాశాడు. పొరుగున నున్న టామస్ కాంబేకు తన కత్తి బహుమతి ఇచ్చాడు. అతని రెండవ శ్రేష్ఠమైన పడక సామాగ్రి మంచం, పరుపు, వగైరా తన భార్య అయిన ఏన్‌కు అందజేశాడు. 1616 ఏప్రిల్ 23 వ తేదీని దివంగతుడైనాడు. స్ట్రాట్ ఫర్-అపాన్-ఏవన్ నగరమందలి చర్చి యావరణలో అతని భౌతిక దేహం పాతిపెట్టటం జరిగినది. అతని సమాధి కట్టడమందు తాపిన రాతిపలకపై ఈ క్రింద వివరించిన ఒక చిన్న పద్యము చెక్కి యున్నది :-

"Good friend, Jesus sake for bear
To dig the drest enclosed here
Blessed be the man that spares these Stones
And cursed be he that mones my bones."

[ప్రియమిత్రుడ ॥ యేసు ప్రభువు - పేరు దలచి ప్రేమ చూపి
ఇచట నేల త్రవ్విపట్టి - యెత్తబోకు మెన్నడయిన ఇచట
రాళ్ళు కాపాడగ - నెన్నువాడు - ధన్యుడగుత ! నా యెము
కలు తీయువాడు- నరకమందు కూలుగాక ! ]

ఇతని ఊర్ధ్వకాయమును చూపించునట్టి శిలా విగ్రహము 1623 కు పూర్వమే ఇతని సమాధి కట్టడము పైనుంచుట జరిగినది. ఘీరట్ జాన్ సన్ అను శిల్పి దీనిని చెక్కినాడు. అంతగా మెచ్చుకోదగిన శిల్ప నైపుణ్యము ఇందులో కనబడదు. కాని షేక్స్పియరు

రూపురేఖలు యథాతథముగా ఉన్నవని సమకాలికుల అభిప్రాయము. 1846 లో ప్లాస్టర్‌తో చేసిన విగ్రహము అందముగలది లండన్ నగరమందలి చీనా స్త్రీల అంగడిలో కనబడినది. అదే గారిక్ క్లబ్ వారికి బహుమతిగా ఈయబడినది. ఇట్టి విగ్రహములే వెస్టుమినిస్టర్ ఆబీ, బ్రిటిష్ మ్యూజియమ్, సౌత్ వర్క్ కెతీడ్రల్ మొదలయిన స్థలములందు అమర్చబడి కీర్తి చిహ్నములుగా నున్నవి. ఇట్టి విగ్రహము లిప్పుడు ప్రపంచమందలి సకల నాగరక ప్రదేశములందును ఉన్నవి.

ఇతని రూపురేఖలను సరిగా చిత్రించిన చిత్ర పటములు అక్కడక్కడ కొన్ని గలవు. నేషనల్ పోర్ట్రియాట్ గ్యాలరీలో ఉన్నదే అందమయినది. తక్కినవి అంతగా ఎన్నదగినవి కావు.

షేక్స్పియరు గుణగణములను అతని రచనల ఘనతను స్తుతిస్తూ బెన్‌జాన్‌సన్ మొదలయిన తాత్కాలిక విద్యాధికులు వ్రాసిన వ్రాతలు అనేకముగా నున్నవి. అవి కడపటి ప్రకరణములో ఉదాహరిస్తాను. ఇక్కడ ఒక అంశం మాత్రం తెలియజేసి ఈ ప్రకరణము పూర్తి చేస్తున్నాను. ఇతని చతుర్థ శతవార్షికోత్సవము మన దేశములోనే కాక ప్రపంచమందంతను 1964 లో జరిగినదన్న విషయమే ఇతని ఘనతకు బ్రహ్మాండమైన నిదర్శనము. ఇతడు రచించిన ఏంటనీ అండ్ క్లియోపాత్ర అనే నాటకములో క్లియోపాత్ర సౌందర్యమును గురించి ఏంటనీ మిత్రుడైన ఇనో బార్బస్ నోటను ఇతడు పలికించిన మాటలు ఇతని రచనా సౌందర్యసంపదకు అన్వయించగలవు.

Age cannot wither her  
Nor custom stale  
Her in finite variety.

ఇట్లే షేక్స్పియరు ఘనత ప్రఖ్యాతి ప్రపంచమందంతటను ఆ చంద్ర తారార్కము చెక్కు చెదరకుండా నిలచియుండునని మనము విశ్వసించవచ్చును.

---

# షేక్స్పియర్ యుగము

ఏ యుగములో షేక్స్పియరు పుట్టి పెరిగినాడో ఆ యుగము నకు ఆంగ్ల సాహిత్య చరిత్రలో షేక్స్పియరు యుగమను పేరు వచ్చినది. ఆ పేరు వచ్చుటకు అతని సాహిత్య రచనా ఘనతయే కారణము. ఆంగ్ల దేశ చరిత్రలో రాజకీయ సాంఘికాది విషయములను బట్టి ఆ యుగమునకు ఎలిజబెత్ యుగమను పేరు వచ్చినది. దీనికే ఎలిజబెత్ నాటి విస్తృతకాలమన్న పేరు కూడా కలదు. అందుకు ఆ రాణి ప్రతిభ, ఆమె పరిపాలన, ఘనత, ఆనాటి ఆర్థిక సాంఘికాది పరిస్థితులలో ఆంగ్లేయులు గావించిన అభివృద్ధికి కారణములు. అనుకూలమయిన ఈ వాతావరణమే షేక్స్పియరు గొప్ప రచయిత యగుటకు కారణమైనది. కనుక షేక్స్పియరు పుట్టిన నాటికి దేశపరిస్థితులు, అందును ముఖ్యముగా ఆంగ్ల సాహిత్య పరిస్థితి ఎట్లుండెనో షేక్స్పియరు గొప్ప రచయిత యగుటకు ఎట్టి అవకాశములు కలిగినవో తెలిసికొన్న యెడల షేక్స్పియరు ఎట్లు గొప్ప రచయిత కాగలిగినాడో ఆంగ్ల సాహిత్య చరిత్రలో అతని పేర నొక యుగము వెలయుటకు కారణమేమో మనము గ్రహింపగలము. అతని రచనలలోగల గొప్పతనము, విశిష్టత, ప్రత్యేకత మనము ఎక్కువగా తెలిసికొని ఆనందించగలము. కనుక ఆనాటి పరిస్థితులు – సాహిత్యమునకు ఎక్కువగా సంబంధించినవి ముందుగా తెలియజేస్తున్నాను.

ఎలిజబెత్ 1558 లో రాణిగా సింహాసన మలంకరించినది. మరి ఆరేండ్లకు 1564లో షేక్స్పియరు జన్మించినాడు. ఎలిజబెత్ 1603లో స్వర్గస్థురాలైనది; స్టువర్టు వంశోద్భవుడైన మొదటి జేమ్సు సింహాసన మధిష్ఠించెను. మరి 13 సంవత్సరములకు 1616 లో షేక్స్పియరు కీర్తిశేషుడైనాడు. ఈ 13 ఏండ్లలోను అతడు 13 నాటకములను రచించినా అందులో మూడు నాటకములు ఎలిజబెత్ యుగ ప్రాభవమునకును, నాలుగు నాటకములు స్వీయ చరిత్ర ప్రాభవమునకును లోబడినవి. తక్కినవి జేమ్సు రాజుగా వచ్చినందువల్ల రాజకీయ వాతావరణములో

కలిగిన మార్పు కారణముగా రచితములయినవి. ఈ సంఘటనలనుబట్టి షేక్స్పియరు యుగమని సాహిత్య చరిత్రలో చెప్పినది. దేశచరిత్రలో చెప్పిన ఎలిజబెత్ యుగమునకు చెందినదే కాగలదు.

16 వ శతాబ్దముతో ప్రపంచ చరిత్ర యందు ఆధునిక యుగము ప్రారంభమయినది. యూరప్ ఖండమందు ప్రాచీన గ్రీక్ దేశ సంస్కృతి విస్తరించి నూతన వికాసము పొందినది. క్రైస్తవ మత చరిత్రలో మార్టిన్ లూతర్ (1483–1546) కావించిన సంస్కారము వలన అతని సంస్కారము నామోదించిన వారి సాంస్కృతిక దృష్టి ఎక్కువగా వికసించి విస్తృతి చెందినది. పోప్ అధికారము తగ్గినది. ఆ సంస్కారమును ప్రతిఘటించిన కేతలిక్కుల హృదయములందును పరివర్తనము కలిగినది. 1485 లో ఇంగ్లండు దేశమున ప్రారంభించిన ట్యూడర్ వంశరాజులు ఆనాటి రాజకీయ పరిస్థితులవలన కొంతవరకు నిరంకుశాధికారముగల ప్రభుత్వమును నెలకొల్పగలిగిరి. అయినను అవి గర్వోన్నతులయిన ఫ్యూడల్ ప్రభువులను అణచివేయుటవలన జన సామాన్యమునకు అనుకూలముగానే పరిణమించినది. 1509 నుండి 1547 వరకును ఆంగ్ల దేశమును పాలించిన ఎనిమిదవ హెన్రీ తన ప్రభుత్వమును ఎక్కువగా బలపరచుకొనెను. లూతర్ సంస్కారమున ఆమోదించిన వాడు కాకపోయినా మత విషయములో కూడ తన అధికారమును వృద్ధిపరచు కొనుటకు కావలసిన చట్టములను కావించుకొని తన దేశమందలి మతసంస్థలపై అధికారమును పొందగలవాడు రాజేకాని పోప్ కాజాలడన్న రాజనీతిని నెలకొల్పెను. దానిని ధిక్కరించిన సర్ టామస్ మూర్, కార్డినల్ ఫిషరులకు మరణశిక్ష విధించెను. అయినా అటు పోప్ అధికారమును పూర్తిగా ధిక్కరించిన ప్రొటెస్టాంటిజమ్‌నకు గాని, ఇటు పోప్ అధికారమును పూర్తిగా పోషించు కేతలిక్ మతమునకు గాని సంపూర్ణావలంబావకాశము కలుగనీయలేదు. అతని తర్వాత ఆంగ్ల రాజ్యమేలిన అతని కుమారుడు ఎడ్వర్డు ప్రొటెస్టాంటిజమ్‌నకును ఆ తర్వాత రాణియైన మేరీ కేతలిక్ మతమునకును విజయము సమకూర్చుట జరిగినవి. మేరీ స్పెయిన్ రాజపుత్రుడగు ఫిలిప్పును పెండ్లి యాడుట వలన కేతలిక్ మతమును ఇంగ్లండులో పూర్తిగా స్థాపించు

టకు ప్రయత్నించినది. దానిని ధిక్కరించిన లాటిమర్, రిడ్లీ, క్రాన్మర్ లు స్వమతార్థం ప్రాణములు కోల్పోవలసి వచ్చినది. అయితే ఈ ఇద్దరి ప్రభుత్వకాలము కడు స్వల్పమైనది. 1558 లో ఎలిజబెత్ రాణియైనది. ఆమె పూర్తిగా ఏ మతమునకును ప్రాధాన్యమీయలేదు. తన తండ్రి (ఎనిమిదవ హెన్రీ) వలెనే మధ్యస్థానలంబన నియమములను పాటించినది. దాని ఫలితముగా మత భక్తి విషయములోను, మతమునకు సంబంధించిన విద్యా సంపన్నత విషయములోను తక్కువ ప్రతిభ కలవారే నియమితులు కావలసి వచ్చినది. ఈ విషయము షేక్స్పియరు తన నాటకములందు కాస్త పరియాచకముగా సూచించినాడు. లవ్ జ్ లేబర్ లాస్ట్ (Love's labour lost) అనే నాటకములోని సర్ నెదేనియల్ (Sir Nathaniel–a curate), ట్వెల్ఫ్త్ నైట్ (Twelfth night) లోని సర్ టోపస్ (Sir Topas–a curate), ఏజ్ యు లైక్ ఇట్ (As you like it) లోని సర్ ఆలివర్ మార్టెక్స్ట్ (Sir Oliver Martext–a vicar), మెర్రి వైవ్జ్ ఆఫ్ విన్డ్జర్ (Merry wives of windser) లోని సర్ హ్యూ ఏవన్జ్ (Sir Hugh evans–a welsf person) పాత్రల చర్యలలో వారి అల్పజ్ఞత్వము ప్రతిభాలోపము రూపింప జేసినాడు.

నూతన సంస్కృతి వికాసము 15-వ శతాబ్దములోనే యూరప్ ఖండమందు విశదమయినది. ఆ దేశము లందలి ప్రభుత్వములు, విద్యా పోషకులయిన ప్రభువులు, సంస్థలు నూతన సాహిత్య ముదయించుటకు తగిన సాహాయ్యము చేకూర్చుట జరిగినది. ఈ నూతన చైతన్యము 16 వ శతాబ్దమున ఇంగ్లండు దేశమందు వికసించినది. తత్పూర్వము వికసించుటకు గులాబీల కంకితములుగా పేరుబడ్డ (Wars of Roses) దేశాంతర్గత యుద్ధములు ప్రతిబంధకము లయినవి. 1485 లో ఏడవ హెన్రీ విజయముపొంది రాజయిన తర్వాత దేశమందు ప్రశాంతత కలిగినది. దాని ఫలితముగా ఈ నూతన చైతన్యము ఈ దేశమందు కూడ నెలకొని వికసించుట కవకాశము చిక్కినది. ఇదే ఎలిజబెత్ కాలము సరికి ఎక్కువగా విజృంభించి సాహిత్య రంగమున షేక్స్పియరు యుగమునకు దారి తీసినది.

ఆంగ్ల సాహిత్య చరిత్రలో ఎట్టి సాహిత్య వికాసము షేక్స్పియరు నాటికి కలిగియుండెనో మనము ముందుగా తెలిసికొన్న యెడల షేక్స్పియరు ఘనత మనము ఎక్కువగా గ్రహించగలము. కనుక సంక్షిప్తముగా తెలియజేస్తాను.

1476 లో షేక్స్పియరుకు ఇంకా 88 ఏండ్లకు జన్మిస్తాడు అనగా– కేక్స్టన్ వెస్ట్ మినిస్టర్ లో తన ముద్రాణాలయం నెలకొల్పినాడు. 1499 లో ఇరాజ్మస్ అనే డచ్ విద్వాంసుడు ఆక్స్ఫర్డ్ కువచ్చి కొన్నాళ్ళుండి కేంబ్రిడ్జ్ లో స్థిరనివాస మేర్పరచుకొన్నాడు. కాలిట్ అనే ఆంగ్ల విద్యాధికుడు విద్యా విద్యుత్ ప్రచారము లనదగు ఉపన్యాసములతో శ్రోతల మనస్సులను రంజింపజేసి 1509 లో సెంట్ పాల్ విద్యాలయమును నెలకొల్పినాడు. 1516 మూర్ రచించిన టోపియా గ్రంథము ప్రకటితమయినది. అది పాఠకుల హృదయమును వికసింపజేసినది. 1536 నాటికి ఆంగ్ల భాషలో టిండేల్, కవర్ డేల్ రచనలపై ఆధారపడిన బైబిల్ గ్రంథము నూతనముగా ప్రకటితమైనది. లాటిన్ భాషరాని ఆంగ్లేయ జనసామాన్యమునకు అది ఎక్కువగా ఉపకరించినది. ఆకాలమందే బలిడ్, ఫ్లూటార్క్, సైనికా, మార్కస్, ఆరీలియస్ వర్జిల్, మాంటేన్, అరిస్టాటిల్, వరోమర్. మొదలయిన విదేశ విద్వాంసులు రచయితలు రచించిన గ్రంథముల అనువాదములు ఆంగ్ల భాషలో ఒకటి తర్వాత ఒకటి వరదలు వచ్చినట్లు ప్రకటితములయినవి.

ఆ కాలమందే 1492 లో కొలంబస్ అమెరికా ఖండమును కనుగొన్న తర్వాత, వాస్కోడిగామా, వెస్పూచీ, మెగలన్ కాబట్ (తండ్రీ కొడుకులు) మొదలయిన నావికులు ప్రపంచమందు గల దేశములను కనుగొనుట వలన ఐరోపాఖండములో ఎడబడిన ద్వీపవాసులగు ఆంగ్లేయులు విశాల హృదయులయినారు. అంతేకాదు. ప్రాచీన నూతన ప్రపంచములకు నడుమను రెండింటికిని మధ్యస్థులయినారు.

రాజకీయ వాతావరణములో 14-వ శతాబ్ది ద్వితీయ భాగము నుండి ఫ్రాన్స్ తో ఆంగ్లేయులకు జరిగిన నూరేండ్ల సంగ్రామము

పూర్తియైన కొద్ది సంవత్సరములకే (1455-85) రోజా పుష్పాంకిత మయిన దేశాంతర్గత సంగ్రామము. అది పూర్తియయిన మీదట నూరేండ్లకు స్పెయిన్‌తో యుద్ధము సంభవించినది. 1537 లో స్పెయిన్ వారి ఆర్మేడా అనే పేరను వచ్చిన నౌకావళి దండయాత్ర ఆంగ్లేయులకు భయోత్పాతము కలిగించినది. కాండేల్ సాహస కృత్యముల వలనను విమ్కటి దైవిక సాహాయ్యముగా వచ్చిన వాతావరణము వలనను ఆ నౌకావళి చెక్కలై చెదిరిపోయి ఆంగ్లేయులకు ఘనవిజయము కలిగించినది. అయినను, ఎలిజబెత్ రాణిగా నున్నంత కాలమూ స్పెయిను వారి వలన ఎప్పుడెట్టి ఉపద్రవము కలుగునో అన్న భయము ఆంగ్లేయుల మందుండెను. ఇట్టి సంగ్రామ సంకలిత వాతావరణము రచయితలకు-అందును ఎక్కువగా నాటక రచయితలకు యుద్ధములకు సంబంధించిన ఇతివృత్తములే కథా వస్తువు లయినవి. షేక్స్పియరు పుట్టిన సంవత్సరములోనే (1564-లో) మార్లో పుట్టి షేక్స్పియరువలెనే నాటకములు రచించి 1593లో చనిపోయినా గొప్ప నాటకరచయితగా పేరు పొందినాడు. ఆ మార్లో 1537 లో రచించిన తాంబర్లేన్ నాటకము మొదలుకొని 1601లో షేక్స్పియరు రచించిన హామ్లెట్ నాటకము వరకును రచితము లయిన చారిత్రక నాటకములకు పైని పేర్కొన్న సంగ్రామములున్నూ, సంఘటనలున్నూ, దేశమందలి కుట్రలున్నూ కథావస్తువు లయినవి. మచ్చునకు కొన్ని షేక్స్పియరు రచించిన నాటకములందు ఎట్లు వివరింప బడినవో సూచించుటకు ఇక్కడ రెండు మూడుమాత్రము ఉదహరిస్తాను. తక్కినవి ఆ యా నాటకములను గూర్చి ప్రసంగించినప్పుడు తెలియజేస్తాను. ఒక విషయము ముందుగా చెప్పవలసి యున్నది. షేక్స్పియరు చారిత్రక నాటకములను సాహిత్య దృష్టితో రచించినాడు గనుక చారిత్రక విషయములు కొన్ని ఉన్న వున్నట్లుగాక కాస్త మార్పుడం జరిగినది అయినా ముఖ్యవిషయములను తారుమారు చేయలేదు. అందుకొక ఉదాహరణము, నాల్గవ హెన్రీ రాజుగా ఉన్న కాలలోను అతని పెద్దకొడుకు ప్రిన్స్ హాలు దుర్మార్గులతో స్నేహము చేసి చిలిపి చేష్టలతో లోనై తిరుగుతూ ఉండేవాడనిన్ని, నాల్గవ హెన్రీ

చనిపోయిన తర్వాత ఆ ప్రిన్స్‌హాలే అయిదవ హెన్రీగా రాజు కాగానే చపలతవపు చేష్టలు ఒక్కసారిగా విడచిపెట్టి రాజఠీవితో తదన్న ప్రాయముగా కాగల ప్రభుత్వము సాగించినాడనిన్ని చెప్పడానికి చారిత్రకాధారములు లేకపోలేదు. కాని షేక్స్పియరు తన ఊహ విస్తరింపజేసుకొని నాటక కళా ధర్మమును పాటించి పాటించి ప్రిన్స్ హాలుగా ఉండిన హెన్రీకిన్నీ, రాజయిన హెన్రీకిన్ని గల తారతమ్యము మరింత ఎక్కువగా వర్ణించినాడు

మూడవ రిచర్డ్ రాజు కాగోరి ఆరవ హెన్రీ కుమారుడయిన ఎడ్వర్డును చంపి తన చమత్కృతి చూపించి ఆ ఎడ్వర్డు భార్యయైన ఏన్‌ను వివాహమాడి తాను రాజై ఆమెను రాణిని చేసిన విషయము చరిత్రలో నున్నదే కాని ఆ రిచర్డును ఘోరమైన దుష్టుడు గాను, గూనుకాయముగల వికృతుని గాను, మాటల నేర్పుగల వక్తగాను కళాధర్మము పాటించుటకు షేక్స్పియరు ఆ పాత్రను అద్భుతంగా చిత్రించినాడు.

చరిత్రాంశములే పాత్ర పోషణము కోసం షేక్స్పియర్ కొన్ని చోట్ల ఎట్లు చిత్రిస్తాడో ఒక నిదర్శనం ఉదహరిస్తాను. దేశంలో అంతః కలహములు గాని తినుటకు కావలసిన వస్తుసామాగ్రి తక్కువగుట వలన ప్రజలలో కలిగే క్షోభగాని దేశప్రశాంతికి భంగము కలిగించు నన్న భయము కలిగినప్పుడు ఇతర దేశములతో ఏదో నిమిత్తము కలుగజేసుకొని యుద్ధములుసాగించుట ఒక రాజనీతిగా కొందరు రాజులు భావిస్తారు. ఆధునిక కాలంలో చీనా ప్రభుత్వము అట్టి రాజనీతినే అవలంబించి మన దేశము వందలి ఉత్తర ప్రాంతములను కబళించుటకు యుద్ధము సాగించినది. ఈ విధముగానే అయిదవ హెన్రీ ఆగియుండిన నూరు సంవత్సరముల సంగ్రామము సాగించుటకు పూనుకొన్నాడు. అతని తండ్రి నాల్గవ హెన్రీ కాలములో అంతః కలహములు చెలరేగినవి. వాటిని కష్టములతో రాజు అణచివేసినాడు. అందులో ప్రిన్స్‌హాలు తండ్రికి తోడుపడి హాట్‌స్పరును ఓడించి చంపి తాను కేవలము యౌవన దుర్మద దుశ్చేష్టలకు లోబడిన యువరాజు

మాత్రమే గాక రాజత్వం సాగించుటకు తగిన వీరుడే అన్న అభి ప్రాయము తండ్రికి కలిగించినాడు. అంతేకాదు దుర్మార్గపు నడవడిలో తనకు ప్రాణస్నేహితుడయిన ఫాల్‌స్టాఫును హఠాత్తుగా విడిచిపెట్టి అతని చావుకు కారకుడైనాడు. ఈ విషయమును మరికొంత సేపట్లో ఎక్కు-వగా వివరిస్తాను. ఇక్కడ ఇతర దేశములతోడి (అనగా ఫ్రాన్సుతోడి) యుద్ధమునకు వీడు ఏరీతి ప్రేరితుడైనాడో చక్కని అంశము ఎట్టి నాటక కళా ధర్మములను పాటించి ప్రదర్శించడము జరిగినదో తెలియచేస్తున్నాను. పైన చెప్పిన రాజనీతి నాల్గవ హెన్రీ తన కడపటి దశలో ప్రిన్స్‌హాలుకు తెలియజేశాడు :-

"రా! నాయనా! నా పక్కపై కూర్చో...." నేనెంత కష్టపడి, ఎన్ని మార్గముల సంచరించి ఈ రాజ్యమును సంపాదించినానో ఎన్ని అంతఃకలహములకు తట్టుకొని రాజ్యమును నిలబెట్టినానో నీకు తెలుసును. నీవు నీ కుట్రతనపు చేష్టలను విడిచిపెట్టి నాకు తోడ్పడినావని గుర్తించినాను. నీకు బలము, సాహసము, వీరత్వము మొదలయిన రాజ లక్షణములు గలవు. అయినా నా అనుభవము వలన తెలుసు కొన్న విషయములు నీకు ఉపకరింపగలవని చెప్పున్నాను. బంధువులు, మిత్రులుగా కనపడ్డ ప్రభువులే నీకు ప్రభుత్వమును వశము చేయుటకు యత్నిస్తున్నారు కనుక నా ఉపదేశమును శ్రద్ధగా విను—

"ఇతర దేశములతో సంగ్రామము సాగించి, ఇక్కడి కుట్ర దారులకు గల సంగ్రామ కాంక్ష మన దేశములో కాక ఇతర దేశము లందు వినియోగించునట్లు చేస్తే ఇక్కడి పరిస్థితులు చక్కబడగలవు—" అన్నాడు (చూ. 2 హెన్రి IV – IV. 5 చివర)

అయితే షేక్స్పియరు 5 వ హెన్రి పాత్ర నెట్లు గౌరవిస్తూ పోషించినాడో చూడండి—

కేవలము తండ్రిమాటలు పాటించి 5 వ హెన్రీ యుద్ధము సంక ల్పించినాడంటే అతని శీలము చెడుతుంది అంతే కాదు మరి యొక అంశము కూడా చూడవలెను. ఆ కాలములో చర్చికి సంబంధించిన

ఆస్తులలో పెద్ద భాగమును [illegible] కైవసము చేసుకొనుటకు ఒక చట్టము [illegible] యిచ్చెను. అది అవి మతస్వాముల సాహాయ్యమును [illegible] పూనుకొన్నాడు. 5-వ హెన్రీ యెడల [illegible] నాటకములో ఆ విషయము [illegible] దానిని మనసులో పెట్టుకొని యుద్ధమునకు దిగ[illegible] అంతేకాక యుద్ధమునకు పూనుకొనుట [illegible] విషయము మతాధికారులతో రాజు [illegible] నిలిచిపోవుటకు పనికివచ్చునన్న దురుద్దేశము ఆ [illegible] కలిగినట్లును యుద్ధమునకు తగిన కారణము [illegible] షేక్స్పియరు చిత్రిస్తాడు. అప్పటికిని [illegible] 5 వ హెన్రీకి డాఫిన్ పంపిన చౌకబారు [illegible] నీ కెందుకు యుద్ధములన్నట్లు [illegible] వలన పౌరుషము హెచ్చినది; యుద్ధముచేసి [illegible] శక్తిసామర్థ్యములను ప్రదర్శించి గౌరవము పొందవలెనన్న [illegible] యుద్ధము సాగినది. అనుజ సోదరులును, ఇతర [illegible] చరిత్ర చెప్పినట్లు కాకపోయినా ఫ్రెంచి [illegible] కేథరీన్‌ను వలచుట వలపించుకొనుట పెండ్లియాడుట [illegible] హెన్రీ చర్యలు కొన్ని గర్హించవలసినవే అయినా అవి నాటక ప్రదర్శన సమయమందు ప్రేక్షకుల మనసులకు స్ఫురింపవు ప్రదర్శిత సన్నివేశములు ప్రేక్షక జనరంజకములుగా ఉంటవి.

తాత్కాలికపు సంఘటనలు షేక్స్పియరు నాటకాలలో కొన్ని అక్కడక్కడ కనబడుతూ [illegible] 5 వ హెన్రీ నాటకములో 5 – వ అంకం ప్రోలోగ్‌లో ఎలిజబెత్ రాణి కిష్టుడైన ఎసెక్స్ ఐర్లండుకు పోయి విజయుడై వచ్చిన ముచ్చటను సంబంధించిన పంక్తులు గలవు. హామ్లెట్ నాటకములో హారేషియో హామ్లెట్ చనిపోయిన వెంటనే అన్నమాటలు ఈ ఎసెక్స్ వధ్యశిలాస్థానమున నిలచి పలికిన మాటలననుకరిస్తూ ఉన్నట్లు వినబడును.

ఇంకా ఇట్టి తాత్కాలికప్రసంగములు షేక్స్పియరు నాటక
ములో పెక్కుచోట్ల ధ్వనిస్తూ ఉంటాయి. ఇందులో ముఖ్యమైనవి
ఆయా నాటకములు ప్రసక్తి వచ్చినప్పుడు తెలియజేస్తాను. ఇక్కడ
చూపించుటకు మాత్రమే ఒకటి రెండు తీసుకొన్నాను.

ఆంగ్ల సాహిత్యరంగములో [illegible] షేక్స్పియరు నాటికి
ఎట్టి పరిణామము పొంది యుండెనో సంగ్రహంగా తెలిసికొన్న మొదల
నాటక రచన షేక్స్పియరు [illegible] ఎక్కువగా వృద్ధి
పొందినదో మనము పరిగ్రహించుటకును [illegible] విషయముకూడా
సంక్షేపంగా తెలియజేస్తాను.

ఇంగ్లండులో క్రైస్తవమతము వ్యాపించక పూర్వము నాటకము
లని చెప్పదగిన రచనలు ఉండెనో లేదో మనకు తెలియదు.
ఆ తర్వాతనైనా నార్మన్ [illegible]—అనగా 11 వ
శతాబ్దమునకు పూర్వము ఉన్నట్లు చెప్పడానికి తగిన ఆధారములు
లేవు. ఆ తర్వాత [illegible] నాటకములు వంటి
రచనలు సాగినట్లు కనబడుచున్నవి. వాటిని మిస్టరీ ప్లేజ్ అని మిరకిల్
ప్లేజ్ అని పేర్లు. బైబిల్‌లో [illegible] న్యూటెస్టమెంట్‌లో గల
గాథలు ఈ మిస్టరీ ప్లేజుకు కథావస్తువులు. ఇవి నిత్యము చర్చిలో
పూజాసమయమందు లాటిన్ భాషలో అక్కడివారే అభినయిస్తూ
ఉండేవారు. మిరకిల్ ప్లేజ్ అన్నవి సిద్ధి పొందిన సాధువుల అద్భుత
చర్యలు ఇతి వృత్తములు గలవి. ఇవి మొదట లాటిన్ భాషలో
రచితములైనా రాను రాను ఆంగ్ల భాషలో కూడా రచితములయినవి.
ఇవి చర్చిలో పూజా సమయములందే కాక, మత సంబంధముగల
ఇతర భవనములందు ఆరుబయట ప్రాంగణములందు సాలీలు, వడ్రం
గులు, కుమ్మరులు మొదలయిన వృత్తి సంఘములవారు అభినయిస్తూ
ఉండేవారు. ఆ తర్వాత మొరాలిటి ప్లేజ్ అను పేరను నీతి ధర్మము
బోధించే నాటకములు కూడా ఆడుతూ ఉండేవారు. కథా వస్తువు
సుఖాంతముగా ఉండవలెనన్న నియమమేదీ లేదు. యేసు ప్రభువు
శిలవకెక్కి విరోధులవలన దుర్మరణము పొందిన ఇతి వృత్తము సుఖాం

తము కాగలదా ? దుర్ఘటనలు, దుఃఖాంతములు గల నాటకములాడు
వప్పుడు ప్రేక్షకులకు విసుగు పుట్టకుండా ఉండేటందుకు నడుమ నడు
మను హాస్యరస ప్రధానములయిన దృశ్యములు, ప్రసంగములు, ఇంటర్
లాడ్జ్ అని పేరున్నవి ప్రదర్శించేవారు. ఇట్టి ప్రదర్శనాలు పరిణతి
పొందిన తరువాత షేక్స్పియరు మొదలయినవారు రచించిన నాటకా
లలో సైతము కనబడుతున్నవి. షేక్స్పియరు రచించిన విషాదాంతక
హామ్లెట్ నాటకమందలి మృత దేహములను పాతి పెట్టుటకు
గోతులు త్రవ్వేవారి (గ్రేవ్ డిగ్గర్ జూ) దృశ్యము యిటు వంటిదే.
1584 లో రాబర్ట్ విల్సన్ రచించిన లండన్ నగరమందలి ముగ్గురు
వనితలు (ది త్రీ లేడీస్ ఆఫ్ లండన్) అనే నాటకము మొరాలిటీ
ప్లేజ్ కుదృష్టాంతము కాగలదు.

పైని పేర్కొన్న మిస్టరీ, మిరకిల్, ఇంటర్ లూడ్ మొరాలిటి
ప్లేజ్ అనే పేళ్ళు గలవి. ఆంగ్ల దేశమునకు స్వీయములన దగినవి.
ఇక అన్య దేశముల సంస్కృతి సంపర్కము వలన వచ్చిన నాటకములు
ఆధునికములు 1453 తర్వాత వచ్చిన రినేసాన్స్ ప్రభావమువలన
పరిణమించినవి.

ఆర్యజాతి భాషలయిన సంస్కృతము, గ్రీక్, లాటిన్ భాష
లలో క్రీస్తుశకమునకు పూర్వమే నాటక రచన ఉన్నతి గాంచి వచ్చినది.
అవి ఎట్టి బీజములనుండి పరిణమించినవో సరిగా చెప్పుటకు తగిన ఆధా
రములు లేవు. కాని మన దేశమందలి దేవాలయము లందలి ఆచా
రములను బట్టి సంస్కృత నాటకములకు ఆర్యమతమునకు సంబంధించిన
సంప్రదాయముల నుండియే వచ్చిన దేమో, దేవాలయములందు
సంస్కృతభాషలోను, ఎక్కువగా దేశ్యభాషలలోను, ఆయా దేవతలకు
సంబంధించిన ప్రసంగములు పాటలుగానే రచితములై నిత్యము పూజా
సమయములందు ఆయా దేవాలయములందుగల అర్చకులు మొదలయిన
వారు నాటకముల ఆడినట్లే పాడుతూ ఉండడము నేటికి ఆచారముగా
నున్నది. "చిటపట చినుకులు దుప్పటి తడిసెను తలుపు తీయవే భామ
నువు — తలుపు తీయవే భామ" అని నాయకుడైన విష్ణువు — మురళీ
కృష్ణుడో, శ్రీనివాసుడో, వెంకటేశుడు, ఏదో ఒక పేరను ఆలయ

మందు భక్తుల పూజలనందుకొంటూ వున్న స్వామి రాత్రి ఇంటికి వచ్చిన లక్ష్మి తలుపుతట్టి తెరవమని లక్ష్మిని అడిగినట్లు, ఆమె ఖండితయైన నాయికవలె వాస్తవముగానో పరిహాచకముగానో భర్తశీలమును ఆక్షేపించి అలిగిన నాయికవలె "నే తలుపు తెరవను పోరా" అని అంటుంది. భగవంతుని బాలునిగా భావించి రాత్రి ఉయ్యాలలో పడుకోబెట్టినట్లు, ఉయ్యాల ఊపుతూ వున్నట్లు అభినయిస్తూ లాలి పాటలు, జోలపాటలు, ప్రతిరాత్రి పాడే ఆచారము నేటికిని కలదు. గంగా గౌరీ (సవతులు) కయ్యముల పాటలు సంభాషణ రూపమున రచితములైనవి. ఇట్టివి స్త్రీల పాటలలో నూర్లకొలదిగా కలవు. జయదేవుని అష్టపదులు అన్నమాచార్యుల గేయములు, మువ్వగోపాల పదములు సారంగపాణి పదములు సంభాషణ రూపములుగానే రచితములయినవి. కూచిపూడి సంప్రదాయము చొప్పున రచితములైన భామాకలాపము మొదలయిన వీధి నాటకములు దక్షిణదేశ సాహిత్యమందు ఎక్కువగా వెలసిన యక్షగానాలు, ఓఢ్రభాషలో రచితములయిన "సాక్కినట్టో" అనే పేరను సఖీనాటకములు ఇంగా ఆయా ప్రాంతములందు ఆయా భాషలలో వెలసిన నృత్య — గేయ నాటకములు, దేశ సంప్రదాయము గలవి 'దేశి'నామము నున్నవి. ఆర్యుల సంస్కృతి సంపర్కము వలన పరిణామము పొందిన కవిత్వముగాని, సంగీతముగాని 'మార్గి' అనే పేరను పరిణమించినవి.

ఇట్టి 'దేశి' మార్గి సంప్రదాయములే ఆంగ్లసాహిత్యములోని నాటక రచనలందు కనబడుచున్నవి. ఈ విషయమునకు సంబంధించిన అంశములు ఎన్నో ఉన్నవి కాని నా గ్రంథమునకు ప్రధాన మయినవి షేక్స్పియరు రచనలకు సంబంధించినది కనుక ఈ విషయములు ఎక్కువగా ప్రసంగించుట ఉచితము కాదు. వానియొక్క ముఖ్యాంశము మాత్రము తెలియజేసి ఈ ప్రసంగము పూర్తిచేస్తాను.

మన దేశములో సంస్కృత భాషను అనేక నాటకములు రచితములయినా అందులో కొన్ని పెక్కుచోట్ల ప్రదర్శిస్తూ ఉండినా ఆ నాటకముల వంటి నాటకములు తెలుగు భాషలో రచించవలెనన్న కోరిక తెలుగు వారికి నూరు సంవత్సరముల క్రిందట వరకును కలుగనే

లేదు. అంతేకాదు అభిజ్ఞాన శాకుంతలము, ప్రబోధ చంద్రోదయము వంటి నాటకాలు నాటకాలుగా కాక కావ్యరూపమున అనువదించుట జరిగినది. తెలుగు వారికి నాటకముల కంటె యక్షగానాలే ఎక్కువగా రుచించినవి. ఆంగ్లేయులకు ఇట్లుగాక గ్రీక్ లాటిన్ భాషలలో రచితములయిన నాటకాలతో పరిచయము కలిగినంతనే ఆ నాటకముల వంటి నాటకములు రచించవలెనన్న కోరిక పుట్టినది.

ఇంగ్లండులో మత సంబంధము గల దేశి నాటకాలు 1300 నుండి 1550 వరకును అనేకముగా ఉండినవి ఆ తర్వాత క్రమక్రమముగా తగ్గినవి. వాటిస్థానమందు విదేశి నాటకముల వంటి నాటకములు క్రమక్రమముగా ఎక్కువగుతూ ఉండెను. గ్రీక్ భాషలోని విషాదాంత నాటకాలు ఆంగ్లేయ రచయితలను ఆకర్షించినవి. మార్లో రచించిన టాంబర్ లేన్ నాటకములో గ్రీక్ నాటకము లందలి హెర్క్యులిజ్ టాంబర్ లేన్‌గా పునర్జన్మ పొందినాడా అనిపిస్తుంది. సుఖాంత నాటకాలలో కూడా ప్లాటస్ టెరెన్స్ నాటకాల అనుకరణాలు గోచరిస్తవి. ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయపు మొదలి ప్రవీణులని పేరుపొందిన పీల్, గ్రీన్ రచించిన సుఖాంత నాటకాలలోను, షేక్స్పియరు తొలిసారి రచించిన సుఖాంత నాటకాలలోను పైని పేర్కొన్న విదేశనాటకముల ప్రభావము కనబడుతుంది.

ఈ ప్రకరణములో తెలియజేయవలసిన మరియొక ముఖ్య విషయము నాటకశాలల నిర్మాణమునకు సంబంధించినది. బైబిల్ న్యూటెస్టమెంటులోని గాధలకు, మతాంశములకు సంబంధించిననాటకములు, చర్చి భవనము లందలి ఆవరణలలోనే ప్రదర్శితములవుతూ ఉండెను. తక్కిన నాటకాలు పధికాశ్రమాలకు మదిరాశాలలకు సంబంధించిన ప్రాంగణాలలోను, ప్రభువులకు చెందిన బహుస్థలములందును తాత్కాలికముగా నిర్మితములయిన రంగస్థలములందు ఆడుతూ ఉండేవారు.

---

1576 షోర్ డిచ్ వద్ద నిర్మితమైన నాటకశాలలో నాటకప్రదర్శనాలు జరుగుట ప్రారంభించినది. 1579-1592 లో నాలుగు నాట

కాలు ప్రదర్శితములైనవి   ప్రదర్శకులు తండోపతండములుగా ఆ ప్రదర్శనాలు చూచుటకు వచ్చేవారు. ఆ నాటకాలు నాలుగున్ను యువకుడయిన క్రిస్టఫర్ మార్లో (1564-1593) రచించినవి, టాంబర్ లేన్, డాక్టర్ ఫాస్టస్, ధనికుడైన మాల్టా యూదుని విషాదాంత నాటకము, రెండవ ఎడ్వర్డ్ మరణము. ఈ నాటకాలలో మార్లో చూపించిన ప్రతిభ, ఉద్దేశము గల సన్నివేశాలు, సంభాషణలు, పాత్రోచితమయిన భాష, గానము, జనరంజకములయిన పరియాచకములు మొదలయిన లక్షణాలు ప్రేక్షకులను ఆనందింపజేసినవి.

ఈ నాటకశాల ఇంగ్లండు దేశములో వెలసిన నాటకశాలలలో మొదటిది. దీనిని నిర్మించుటకు నిర్మాతలు చాల శ్రమ పడవలసియుండెను. ఎందుచేత ననగా ఈ నిర్మాణమునకు అనుజ్ఞ ఈయవలసిన అధికారులు ఈర్ష్యా భావముతో అనుజ్ఞ ఈయలేదు అందుచేత లండన్ మేయరు, నగర ఎమితి అధికారమునకు లోబడిన ప్రాంతము వెలుపుల ఇది నిర్మితమయినది.

ఈ నాటకశాల నిర్మాణమయిన తర్వాత కర్టెన్, రోజ్, స్వాన్, గ్లోబ్ అనే నామధేయములతో తక్కిన నాటకశాలలు నిర్మితములయినవి. ఒకటి చౌకులగాను, ఒకటి అష్టకోణములు గలవిగాను, మరియొకటి వలయాకారముననూ నిర్మితములు. నటులకు ఎత్తైన రంగస్థలము వెనుక భాగము స్తంభాలమీద నిలబడిన చాందినీ మంటప నిర్మాణముగలది. ముందు భాగము ఆరుబయటకు సాగినదిగానువుండెను. చుట్టును ప్రేక్షకుల కోసము కట్టిన గేలరీలు ఉండేవి. ఈ రంగభూమికి వెనుకను నటుల గ్రీన్‌రూమ్ గ్రీన్ - అనగా ఆహార్యధారణ గృహములుండేవి. రంగస్థలముపైన బాల్కనీ కట్టడము కూడా ఉండేవి. ఆధునిక దృష్టితో చూస్తే మనకు ఈ నాటకశాలలు దరిద్రపు నాటకశాలలుగా కనబడినా ఆ రోజులలో అవి గొప్ప శాలలుగానే లండన్ పౌరులకు కనబడినవి.

మార్లో షేక్స్‌పియర్లు ఒకే సంవత్సరము 1564 లో జన్మించినవారయినా మార్లో ప్రతిభయే ముందుగా వికసించినది. పాపము అతడు

1594 లో ముప్పది యేండ్లైని నిండక మునుపే దుర్మరణము పొందెను. గాని మరికొన్ని సంవత్సరములు షేక్స్పియరు జీవించినన్నాళ్ళు జీవించి యుండెనా షేక్స్పియరు పొందిన ఘనత కంటె ఎక్కువ ఘనత పొంది యుండునేమో అనిపిస్తుంది. ఈ అభిప్రాయము 1964లో అమెరికా షేక్స్పియరు చతుర్ధశతవార్షిక జయంత్యుత్సవములు జరిగి నప్పుడు ఇర్వింగ్, రిబ్నెర్ అనే విద్యాధికులు మార్లో- షేక్స్పియరు అనే వ్యాసంలో వ్యక్త పరచినారు. ఈ ఉత్సవములు మార్లో కీర్తికి సూచకములుగా కూడా జరుపవలెనన్న ఆశయము తెలియ జేసినారు.

షేక్స్పియరు ప్రతిభ వికసించడానికి అప్పటి కాలమానము ఎట్లు అనుకూలముగా యుండెనో స్థూలముగా తెలియజేసి ఈ ప్రకరణము పూర్తి జేస్తాను. 1558 లో ఎలిజబెత్ రాణి అయినప్పటి నుండిన్ని ఇంగ్లండు దేశమందలి అంతఃకలహముల భయము అంతరించినది. ప్రబలమయిన ప్రభుత్వము నెలకొన్నది. స్కాట్‌లండ్ వారి వలన ఆంగ్ల ప్రభుత్వమునకు కలుగవచ్చునేమో అనే భయము 1587 లో స్కాట్స్ రాణి మేరీ మరణ దండనకు పాల్పడ చేయుటవలన అంతరించినది. ప్రభుత్వము వారి క్రోధోత్పన్నము లయిన బెదరింపు-ఇప్పుడు మన దేశము వారికి కలత కలిగించు చున్న పాకిస్తాన్ వారి బెదరింపు వలెనుండినది. 1588 లో ఆర్మెడా అనే పేరుగల నౌకల బారు నశించుటవలన అంతరించినది ఆ సంవత్సరమే షేక్స్పియరు నాటక రచన ఆరవ హెన్రీ అనే నాటకరచన మొదలుపెట్టినది. నాటక రచనలోను నాటకములలో నటుడుగా అభినయించుటలోను, సూత్రధారిగా నాటకము లాడించుటలోను సహజమయిన అతని ప్రతిభ ప్రదర్శించుటకు లండన్ నగరమందు అతనికి అవకాశము చిక్కినది. ఆక్స్ఫర్డ్ విశ్వవిద్యాలయ మందలి విద్యద్వరేణ్యులని పేరు పొందిన గ్రీన్ మొదలయిన వారు రచించిన నాటకముల కంటె షేక్స్పియరు రచించిగాని ఇతరుల రచనలు సంప్రతించిగాని ప్రదర్శించిన నాటకములు ఎక్కువ జనరంజకములుగా నుండెను. అందుకు ఆ విద్వాంసులు షేక్స్పియరు మొదల అసూయ గలవారై ఉండేవారు. వారు చనిపోయిన తర్వాత

షేక్స్పియరు మొదల అందరును ప్రపత్తి గలవారుగానే ఉండేవారు. ధనికులు ప్రభువులు రాణి అందరును షేక్స్పియరును మెచ్చుకొని ఆదరించేవారు.

## షేక్స్పియర్ రచనలు

షేక్స్పియరు రచనలు – పద్యకావ్యములు – నాటకములు. ఈ గ్రంథము నాటకములను గూర్చి వ్రాసినది. నాటకములు మూడువర్గము లకు చెందినవిగా విభజించవచ్చును. (1) కామెడీలు (2) ట్రాజడీలు (3) చారిత్రకములు.

కామెడీలు అనగా స్థూలముగా సుఖాంత నాటకములనిన్ని ట్రాజడీలు అనగా విషాదాంత నాటకములు అనిన్నీ అంటున్నాము. కాని కామెడీలలో అనేక రీతుల నాటకములు కలవు. కొన్ని హాస్యరస ప్రధానమయినవి కొన్ని శృంగార రస ప్రధానమైనవి. కొన్ని ప్రహస నముల వంటివి. కొన్ని ప్రశాంతముగాను, గంభీరముగాను విషాదము లతో కలిసిన్ని నడిచి సుఖాంతములయినవి. ప్రారంభదశలో రచితము లయిన నాటకములలో కవితా శిల్పము నాటక రచన, సంభాషణలు, భాష అంత ప్రౌఢముగా ఉండదు.

ఆయా నాటకముల విమర్శలలో ఈ విషయము విశదీకరించి నాను. ముందుగా కామెడీల విషయము ఎత్తుకొంటున్నాను.

# కామెడీ ఆఫ్ ఎరర్జ్

## (పొరపాట్ల కామెడీ)

ఇది షేక్స్పియరు రచించిన కామెడీలలో మొదటిది. 1592 లో రచితమయినది.

కథా సంగ్రహము :-

సైరాక్యూజ్ నగర ప్రభువుకున్ను ఎఫిసస్ నగర ప్రభువుకున్ను ప్రబలమైన విరోధము కలిగినది. ఒక నగరమునకు చెందిన వర్తకులు రెండవ నగరమునకు వెళితే ఆ వర్తకులను ఆ నగర ప్రభువు చెర పట్టి వారి వద్దనుండి వేయి టాకల ధనము దండుగగా పుచ్చుకొని వారిని నగరమునుండి వెడలగొట్టుట ఆచారమయినది. చెల్లించుటకు వారివద్ద ధనములేని యెడల వారికి మరణ దండనము విధించుట కూడ ధర్మబద్ధమైనది. ఒకసారి సైరాక్యూజ్ నగర వర్తకుడైన ఈజియన్ ఎఫిసస్ నగరములో కనబడినాడు. అతనిని ఆ నగరభటులు పట్టుకొని ఆ నగరమునకు ప్రభువైన సోలినస్‌వద్దకు తోడ్కొని వెళ్ళినారు. అక్కడ వారి అభియోగ విచారణ జరుగుతూ ఉండగా ఆ వర్తకుడు "ప్రభువా! మీరు విధించిన దండుగ చెల్లించుటకు నావద్ద చిల్లిగవ్వయైనా లేదు. కనుక మీరు మరణదండన విధించి నన్ను వధింపుడు నా దుఃఖము నేటితో అంతమొందగలదు" అని మొఱపెట్టుకొన్నాడు. అతని బాధ దుర్భరమైనదిగా కనబడుట వలన సోలినస్ జాలి కలిగి అతని కథ తెలిసికోగోరినాడు.

అయ్యా! నాకిద్దరు కొడుకులు. వారు కవల బిడ్డలు. ఒకే పోలికగలవారు కనుక ఇద్దరికీ ఆంటిఫొలస్ అనే పేరే పెట్టినాను. వారిలో పెద్దవానిని పెద్ద ఆంటిఫొలస్‌గాను, చిన్నవాని చిన్న ఆంటి

ఫొలస్‌గాను పిలుస్తూ గుర్తించేవారము. వారు పెద్దవారయి ఒక వర్తకము చేస్తూ ఉండేవారు. వారివలెనే కవలలుగా పుట్టి ఒకే పోలికలో ఉన్న డ్రోమియో సోదరులు వారికి సేవకులైనారు. పెద్ద ఆంటిఫొలస్ వద్ద పెద్ద డ్రోమియో, చిన్న ఆంటిఫొలస్ వద్ద చిన్న డ్రోమియో చేస్తూ ఉండేవారు.

మే మందరమూ ఒకసారి సముద్రయానము చేస్తూ ఉండగా పెద్ద తుపాను వచ్చినది. మేమున్న పెద్ద ఓడ బీటలు పడి మునిగి పోతూ ఉండగా ఓడ నడిపేవారు ఆ పెద్ద ఓడకు కట్టి ఉంచిన చిన్న చిన్న దోనెలు ఎక్కి తమ ప్రాణములు తాము దక్కించుకొని పోయినారు. అట్టి సదుపాయము మాకు లేకపోయినది. కాని ఓడలో రెండు పొడవయిన కొయ్యలు కనబడినవి. అందొకటి నేను తీసికొని ఒక కొనకు నా చిన్న ఆంటిఫొలస్‌ను రెండవ కొనకు అతని సేవకుడైన చిన్న డ్రోమియోను కట్టి నట్టనడుమను నేను ఆ కొయ్యకు కట్టుకొని ఈదుకొని ప్రాణములు దక్కించుకొనుటకు సిద్ధపడినాను. నాసలహా ననుసరించి నా భార్య ఇమీలియా కూడా నేను చేసినట్లే మా పెద్ద ఆంటిఫొలస్‌ను ఒక కొనకు అతని సేవకుడైన పెద్ద డ్రోమియోను రెండవ కొనకు కట్టి, నట్టనడుమ తాను కట్టుకొని ఈదుకొని పోవుటకు సిద్ధమయినది. అందరమును ఒకే దారిని ఈదుకొంటూ పోయినా కొంత సేపటికి మా దారులు భిన్నములయినవి. వారెక్కడికి పోయినారో ఏమయినారో నాకు తెలియదు. మేము ముగ్గురమూ మాత్రమూ సైరాక్యూజ్ నగరమును చేరుకొని పోయినది పోగా ఉన్నదానితో తృప్తి చెంది మరల మా వాణిజ్య వ్యాపారము సాగించుకొంటూ ఉంటిమి. నా చిన్న ఆంటిఫొలస్ మాత్రము తల్లీ, అన్నా ఏమయినారో తెలియక బాధపడుతూ వారి కోసము వెతకడానికి తన సేవకునితో వెళ్ళవలెనని తలచి నా యనుజ్ఞ వేడినాడు. వద్దని నేనెంత చెప్పినా అతడు ఊరట చెందలేదు. సరేనని నేను సమ్మతించినాను. తన సేవకునితో అతడు వెళ్ళినాడు. పది పండ్రెండేళ్ళు గడచినవి. కాని వాని సంగతేమయినదీ తెలియదు. ఒంటరి జీవనము చేయుట నాకు

దుర్భరమయినది. వారిని వెదకుటకై నేను బయలుదేరి సకల దేశములు తిరిగి వారి జాడ తెలియక బాధపడుతూ చివరికీ నగరమునకు వచ్చి నాను. సైరా క్యూజ్ ఎఫిసస్ ప్రభుత్వములకు విరోధము నాకు తెలి యును. చేసికొన్న నిబంధనలు కూడా ఎరుగుదును. అయినా దుఃఖము దుర్భరమైన వెంటనే ప్రాణములమీద ఆశ విడచి మీ నగరము ప్రవేశించినాను. ఇక్కడనైనా వారి జాడ తెలియలేదు. ఇక నేను జీవించి ఎవరి నుద్ధరింపగలను! ఎట్లు సుఖపడగలను. కనుక మీ నిబంధ నల ననుసరించి నన్ను వధింపుడు" అని తన కథ పూసగ్రుచ్చినట్లు నివే దించుకొన్నాడు.

అందుకు మరింత ఎక్కువగా జాలి పడిన సోలినస్ ప్రభువు "వర్తకుడా! మా నిబంధనల ప్రకారము నిన్ను ఇప్పుడే వధించవలసి యున్నా నీ కథ వినుటకే దుర్భరముగా ఉన్నందున జాలిపుట్టి నేటి సాయంకాలము వరకును నీకు విధించవలసిన మరణదండనము ఆపుచేసి నాను. ఈలోగా నీవీ పురమునందు ఎవరినైన ఋణముగాని ధనముగా గాని మాకు చెల్లించవలసిన దండుగ వేయి వరహాలున్ను, సంపాదించి మాకు చెల్లింపుము నిన్ను విడిచి పెట్టెదను. నీవట్లు చేయలేకపోయిన యెడల నిన్ను నేటి సాయంకాలము వధింపజేయక తప్పదు. సాయం కాలము వరకును స్వేచ్ఛగా తిరిగి ధనము సంపాదించుటకు యత్నిం పుము నీ వెంట తిరిగి నీకు తోడ్పడుటకు ఒక బంటును నియో గింతును" అని పలికెను. ఈ నగరములో నాకు తెలిసిన వారొకరును లేరుగదా! ఎక్కడి వేయివరహాలు తేగలుగుదును! ఏమి చేయుదును. అంతవరకును జీవించి దుర్భరమైన బాధపడుటకంటె వెంటనే మర ణించుట మేలుగదా!" అని తలచినాడా వర్తకుడు.

ఆ దినముననే చిన్న ఆంటిఫొలస్, అతని సేవకుడైన డ్రోమియో (చిన్న) ఆ ఎఫిసస్ నగరము ప్రవేశించి ఒక సత్రములో బస చేసి యుండిరి. ఆ చిన్న ఆంటిఫొలస్‌కు ఆ నగరముతో పరిచయములేదు. అక్కడి నిబంధము లెరుగడు. అతనికి అక్కడి వర్తకుడొకడు పరిచయు డైనాడు. అతడు అక్కడి నిబంధనలు తెలియజేసి మీ సైరాక్యూజ్

వర్తకుని ఒకరిని పట్టుకొని వధింపనున్నారని తెలియజేసి నీవు సైరా క్యూజ్ వర్తకుడనని చెప్పుకోక మరియొక నగరవాసినని చెప్పుకొనుము. అని సలహా యిచ్చి వెడలిపోయినాడు. సరేనని ఆ చిన్న ఆంటిఫొలస్ నగరమును చూడవలెనన్న కోరికతో తనవద్దనున్న ధనము తన సేవకుడైన చిన్న డ్రోమియో కిచ్చి నేను మరల వచ్చువరకును నీవీ ధనము భద్రముగా పట్టుకొని ఇక్కడనే ఉండవలెనని చెప్పి నగరమును చూడ బోయెను.

అంతకు పూర్వము కొన్ని సంవత్సరముల క్రిందటనే పెద్ద ఆంటి ఫొలస్‌న్ను అతని సేవకుడైన పెద్ద డ్రోమియోను ఆ ఎఫిసస్ నగరము ప్రవేశించి అక్కడి వర్తకులయినట్లే నటిస్తూ నివాస మేర్పరచుకొని యుండిరి. అంతేకాదు. ఆ పెద్ద ఆంటి ఫొలస్ ఆడ్రియానా అనునొక వనితను పెండ్లియాడెను. ఆ ఉభయులున్ను అవివాహితయైన ఆడ్రియానా చెల్లెలు లూసియానా యున్ను కలిసి ఒక గృహమందు కాపురము చేస్తూ ఉండిరి. ఆనాడే పెద్ద ఆంటిఫొలస్ ఏదో పని ఉండి ఇల్లు విడచి నగరములో తిరుగుతూ భోజనమువేళ అతిక్రమించినా ఇంటికి రాలేదు. అప్పుడాతని భార్య ఆడ్రియానా అతనిని భోజనమునకు తీసుకొని రమ్మని పెద్ద డ్రోమియోను పంపినది.

చిన్న ఆంటి ఫొలస్ నగరములో సంచరిస్తూ ఒకచోటనుండగా పెద్దడ్రోమియో అతనిని కలిసికొనుట సంభవించినది. ఆ పెద్దడ్రోమియో ఆ చిన్న ఆంటిఫొలస్‌ను చూచి తన యజమానుడే అనుకొనెను. ఆ చిన్న ఆంటి ఫొలసి ఆ పెద్ద డ్రోమియోను చూచి తన సేవకుడే అనుకొనెను. సోదర ద్వయమందును పోలికలు ఒక్కలాగునే ఉండుట వలన ఈ పొరపాటు కలిగినది. చిన్న ఆంటి ఫొలస్ ఆ పెద్ద డ్రోమియోను చూచి "ఏమిరా సేవకా నేను నీవద్ద నుంచిన ధనము ఏమిచేసినావు?" అని అడిగినాడు. "నీవు నా చేతికిచ్చిన ధనమా! ఆ నాలుగు డబ్బులు నీవు చెప్పిన కూలివానికి అప్పుడే యిచ్చివేసినాను. దాని కేమిగాని భోజనమువేళ అతిక్రమించినది. ఆకలిబాధతోవున్న పెద్దమ్మగారు నిన్ను వెంటనే తీసికొని రమ్మని నన్ను పంపినారు. పద ఇంటికి పోదాము." అన్నాడు డ్రోమియును.

"అమ్మగారా ? ఎవరా పెద్దమ్మగారు ? దానికేమి నా ధనము ఏమి చేసితివో ముందుగా చెప్పి యేదు" అన్నాడు. పెద్దమ్మగారు మీ భార్య చిన్నమ్మగారు మీ మరదలు రావయ్యా ఆకలితో చస్తున్నాము" అన్నాడు ఆ సేవకుడు. అతడు తనతో పరియాచకము లాడుతున్నాడన్న కోపముతో ఆ చిన్న ఆంటి ఫోలస్ సేవకుని నెత్తిమీద మొత్తగా ఆ పెద్ద డ్రోమియోా పరుగెత్తి పోయినాడు. ఇల్లు చేరుకుని "అమ్మగారూ ! నీ మగనికి పిచ్చి ఎక్కినది. డబ్బు పిచ్చి పట్టుకొంది. భోజనానికి రండి, అమ్మగారు మీకోసం కనిపెట్టుకున్నారంటే, ఎవరా పెద్దమ్మగారు! నీచేతికిచ్చిన ధనమేమి చేసినా వంటాడు." అనితనమీద మోదినాడని మొఱపెట్టుకొన్నాడు. అడ్రియానా నోరు మతిపోయినట్లు యినది. అతని నేలాగైనా బలవంతపెట్టి ఇంటికి తీసికొని రావలెనని గట్టిగా చెప్పి పెద్ద డ్రోమియోను మరల పంపినది. అతడు ఏడుస్తూ వెళ్ళినాడు తన మగని సంగతి బోధపడక అడ్రియానా దుఃఖించినది. మరియొక స్త్రీ ఎవతెయైన తన మగని చేపట్టి భోజనానికి తీసికొని పోయినదేమో ! నాకోసం చేయిస్తున్నానన్న చంద్రహారాలు కంసాలి వద్దనుండి తీసికొనిగాని ఇంటికి రానన్నారు. అది సమకూడక పోవుట వలన వట్టిచేతులతో ఇంటికి రావడానికి లజ్జిస్తున్నారేమో ? అని పలు విధముల ఆలోచనలలో పడి ఏడ్చినది. చెల్లెలెంత ఓదార్చినా ఊరట చెందలేదు. తుదకు యిద్దరూ యిల్లు విడిచి అతనిని కలుసుకొనుటకు వెడలినారు.

ఇంక అక్కడ చిన్న ఆంటి ఫోలస్ తన ధనము పోయినదేమో అన్న భయముతో సత్రము చేరుకొన్నాడు. తానిచ్చిన ధనము సత్ర మందలి అధికారివద్ద భద్రముగాదాచి తనసేవకుడు తనకోసమే కాబోలు నగరములోనికి వెళ్ళినట్లు తెలుసుకొని నెమ్మదిగ సమకూర్చుకొన్నాడు. అంతలో ఆ చిన్న డ్రోమియో సత్రమునకు తిరిగి వచ్చెను. అతనిని చూచి "ఏమిరా! ఇందాక నాతో అంత తెలివితక్కువతనముగా పరి యాచకమాడినావు నీకేమి పిచ్చెత్తినదా ?" అని అడిగినాడు. అతని మాటలా సేవకునికి బోధపడలేదు.

అప్పుడు అడ్రియానా తన చెల్లెలయిన లూసియానాను వెంట బెట్టుకొని తన భర్తయైన పెద్ద ఆంటిఫొలస్ కోసము వెదుకుకొంటూ ఆ సత్రము చేరుకొన్నది అక్కడ చిన్న ఆంటిఫొలసున్నూ, చిన్న డ్రోమియోను కనబడినారు. వారిద్దరును చిన్న ఆంటిఫొలస్ తన భర్త అయిన పెద్ద ఆంటిఫొలసుగాను, చిన్న డ్రోమియో తను సేవకుడైన పెద్ద డ్రోమియోగాను భావించి ప్రసంగించుట జరిగినది. ఆ ప్రసంగ మంతా పోలికలవల్ల కలిగిన పొరపాట్లతో అసంగతంగానూ, అసందర్భంగానూ విన్నవారికి హాస్యప్రదంగాను సాగినది. మూలములో ఉన్నది. చదివినవారికే కాని సంగ్రహంగా ఉన్నది. చదివినవారికి అదిబోధపడదు. అడ్రియానా పెట్టినమొట్టు, లూసియానా పలికిన ఎత్తిపొడుపు మాటలు చిన్న ఆంటిఫొలసుకు మతిభ్రమ కలిగించినది. పెద్ద డ్రోమియో అతనిని అమ్మగారు భోజనానికి రమ్మంటున్నారన్న మాటలు తన సేవకుడైన చిన్న డ్రోమియోయే అన్నాడన్న భ్రమ కలుగుటవల్లను ఆ మాటల కనుగుణములయిన మాటలే యిప్పుడీ అడ్రియానా, లూసియానా ఆడుటచేతను, తనసేవకుని పరిచితుడైనవానిని పలుకరించుటచే తను చిన్న ఆంటిఫొలసు మరింత వింతపడి తన సేవకుని ద్రోహిగా తలచుట కూడా జరిగినది. ఇదంతా స్వప్నమో లేక నలుగురూ చెప్పుకొన్నట్లు ఈ ఎఫిసస్ నగరములో ఉండే భూతములో కామినులో గంధర్వులో ఇట్టి భ్రమ కలిగించు చున్నారనుకొని అడ్రియానా లూసియానాలకు లోబడి తన సేవకునితో కలిసి వారింటికి భోజనము చేయుడానికి వెళ్ళినాడు.

భోజనానికి చిన్న ఆంటిఫొలస్‌ను భోజనాల గదిలో కూర్చుండబెట్టి చిన్న డ్రోమియోను వీధి గదిలో తలుపు ప్రక్కకు కూర్చుండబెట్టి తలుపు గడియవేసి "సేవకా! మా భోజనాలయినంత వరకును నీ విక్కడనే ఉండు. వెలుపల నుండి ఎవరువచ్చి తలుపుతట్టినా తలుపు తెరవకూడదు. భోజనాలు అవుతున్నవి, తలుపు తెరవవద్దని అమ్మగారు ఆజ్ఞాపించినారు వెడలిపొండి. పని ఉంటే మరికొంత సేపయిన

తరువాత రండి అని లోపలినుండే బదులు చెప్పుము అని ఆడ్రియానా కట్టడి చేసినది.

లోపల భోజనాలు జరుగుతూ ఉండగా పెద్ద ఆంటిఫొలస్, పెద్ద డ్రోమియో, చంద్రహారాలు చేసిన కంసాలి ఇల్లు చేరుకొన్నారు. నేనాలస్యంగా ఇల్లు చేరుకొన్నందుకు నా భార్య నామీద కోపంతో మండిపడుతుంది. ఆ ఆభరణము పట్టుకొని కాని ఇంటికి రానని చెప్పి యుంటిని నా మాట నిలుపుకోడానికి ఈ ఆభరణానికి మెరుగుపెడుతూ ఉన్నంతసేపూ నేను నీవద్దనే కూర్చుండియుంటినని నీవున్ను అనవలెను. ఇంటికి రావడానికి ఆలస్యమయినందుకు ఇది కారణముగా గ్రహించి ఆమె మరి కోపించదు. అని కంసాలితో చెప్పి "తలుపు! తలుపు! తలుపు తెరవండ"ని తలుపు తట్టి అరచినాడు. కాని ఆడ్రియానా కట్టడికి లోబడిన ఆ చిన్న డ్రోమియో తలుపు తెరవలేదు. తానెవ్వరయినదీ చెప్పలేదు. తన యింటికి తాను వచ్చినప్పుడు తనను లోపలికి రానీయక తలుపుగడియపెట్టి తలుపు తెరవక లోపలినుండి ధిక్కరించి పలుకుతున్న వారెవరో తెలియక ఆ పెద్ద ఆంటిఫొలస్ వింతగా విభ్రాంతుడై మతి చెడ గొట్టుకొని తలుపు బద్దలు కొట్టుటకు సిద్ధమయినాడు అప్పుడు తనతో వచ్చియుండిన అతని మిత్రుడు అతడు తలపెట్టిన పని మంచిదికాదనిన్ని అది జరిగిన యెడల అతని భార్యలేనిపోని అపవాదులకు గురికాగల దనిన్ని నచ్చజెప్పి మరి యొక యింట భోజనము చేయుటకు అతనిని తోడ్కొని పోయినాడు. భోజనాలయిన తర్వాత ఆడ్రియానా కోపంతో తన గదిలో పడుకొన్నది. లూసియానా తన బావగారే అన్న భ్రమతో మరి యొక గదిలో కూర్చుండిన చిన్న ఆంటిఫొలస్ వద్దకు వచ్చి తన యక్కకు దుఃఖమూ కోపమూ వచ్చినట్లు చెప్పి "బావా! నా యక్కపై మక్కువ తక్కువగుట వల్లను మరి యొక వనితపై నీ కన్ను పడినా పైకైనా నా యక్కను ప్రేమిస్తూ ఉన్నట్లు కనబడుము. లేకున్న నా యక్క దుఃఖముతో కృశించు నేమోయని భయపడుతున్నావన్నది" ఇట్లు నటించమని హితో ప్రదేశము చేయుట నీకు తగదు నేనిది వరకు ఆమెను గాని, నిన్నుగాని ఎరుగని "నేను అవి

వాహితుడను, నీవును అవివాహితవు నీవు నాకు నచ్చినావు. కనుక నీ కిష్టమైన యెడల నన్ను వివాహమాడుదును" అన్నాడు చిన్న అంటిఫోలస్. "ఇదేమి ? కధ అడ్డముగా తిరుగుచున్నది! నా యక్కకు నేను ద్రోహము చేయవలెనని కోరుతున్నాడు!" అని వింతగా చూచి "నా యక్కను నీ వద్దకు పంపుతాను" అని అక్క గదిలోనికి వెళ్ళినది. ఆ వెంటనే అతడు తన సేవకుడైన చిన్న డ్రోమియోతో కలిసి ఆ యిల్లు విడిచి వెడలిపోయెను.

ఇద్దరును కొంతదూరము నడచిన తర్వాత చిన్న డ్రోమియో తా ననుభవించిన ఒక వింత సంఘటన తెలియజేసినాడు. "ఒక పెద్ద పెనుభూతమువంటి స్త్రీ తన పేరు గాగినాని చెప్పుకొంటూ నన్ను మగడా అని పిలుస్తూ నన్ను కౌగలించుకొనుటకు నామీద పడినది. నేను భయపడి దానిని ఎట్లో తప్పించుకొని నీ వద్దకు రాగలిగినాను" అని చెప్పినాడు.

ఈ సంఘటనవలన అదియొక మాయాలోకపు నగరముగా తలచి ఆ నగరమున ఆ రాత్రి గడుపుటకు భయపడి ఆ నగరమును విడిచిపెట్టుటకు నిశ్చయించుకొన్నారు. "నే నిక్కడనే ఉంటాను. నీవు నావికా కార్యాలయమునకు పోయి వడవ కుదుర్చుకొని వస్తే మన సామాను ఓడ కెక్కించి పోదాము" అని చెప్పినాడు చిన్న అంటిఫోలస్. చిన్న డ్రోమియో మంచిదని వెళ్ళినాడు.

ఆ వెంటనే కంసాలి చిన్న అంటిఫోలస్‌ను కలుసుకొని తమరు ఇక్కడనే కనబడ్డారు మంచిదేఅని తాను చేసిన చంద్రహారము అందిచ్చి ఇది మీ భార్యకు నచ్చుతుందనుకొంటాను అని చెప్తూ వెడలిపోదలచెను. "ఇదేమి? నే నెప్పుడు కోరలేదే దీని వెల ఎంత? నీవు దీని ఖరీదైనా పుచ్చుకొనక వెడలిపోతున్నావు!" అని అతడు కంసాలికి ధనమీయబోయెను. "ధనమున కేమి! సాయంకాలము ఇంటికి వచ్చి పుచ్చుకొంటాను." అని చెప్పి ఆ కంసాలి వెడలిపోయినాడు.

ఇది మరియొక ఎక్కువ వింతగా కనబడినది. "ఈ నగరమందు ఇట్లు విపరీతముగా నగలుకూడా దొరుకుతున్నవి!" అని ఆశ్చర్యపోయి నాడా చిన్న ఆంటిఫొలస్.

ఆ తర్వాత ఆ నగర రాజవీధిలో కంసాలి నడుస్తూ ఉండగా ఒక వర్తకుడు ఒక రాజభటుని వెంటబెట్టుకొని వచ్చి "అయ్యా! విశ్వకర్మా! నేనిప్పుడు పొరుగూరికి వెళ్ళవలసి యున్నది. నీవు నాకీయ వలసిన ఋణ ధనము నాకీయవలెను, లేకున్న నిన్ను ఈ రాజభటుని కప్పగించి న్యాయస్థానమునకు తోడ్కొని పోవలసి వస్తుంది." అన్నాడు "ఆంటిఫొలస్ నేను చేసియిచ్చిన చంద్రహారమునకు నాకు సొమ్మి స్తాడు అది నా చేతి కందగానే నీ అప్పు తీర్చివేస్తాను అన్నాడు. అంత లోనే పెద్ద ఆంటి వచ్చి వారిని కలిసికొనుట జరిగినది. కాని ఏమి ప్రయోజనము. ఆ హారము అతనికి ఇచ్చితినని కంసాలిన్ని ఈయలేదని ఆంటిఫొలసున్ను తగవు పడినారు. వాస్తవముగా ఆ కంసాలి అతనిని పోలియుండిన చిన్న ఆంటిఫొలస్‌కు ఇచ్చినాడు. ఈ పొరపాటు వలన ఆ వర్తకుడు, విశ్వకర్మ, పెద్ద ఆంటిఫొలస్ తగవులాడుటవలన ఆ రాజభటుడు ఆ ముగ్గురిని న్యాయస్థానమునకు తోడ్కొని పోవుటకు సిద్ధపడుతూ ఉండగా చిన్నడ్రోమియో అక్కడికి వచ్చి పెద్ద ఆంటి ఫొలసును చూచి తన ప్రభువే అనుకొని "అయ్యా మన ప్రయాణానికి కావలసిన పని అంతా సిద్ధపరచినాను. ఎపిడామ్నమ్ పడవ బయలుదేరు టకు సిద్ధముగా నున్నది." అన్నాడు. "ఓరి పిచ్చిగాడిదా! మన ప్రయాణమేమిరా? నేను నిన్ను వేపబెత్తము తెమ్మని పంపుతే పడవ ప్రయాణము సంగతి చెప్తావు! సరే ఆ ప్రసక్తి తర్వాత వింటాను." ఇప్పుడు నిలబడ్డపాటున నా భార్య అడ్రియానావద్దకుపోయి ఈ బీగము ఆమెకిచ్చి నగలపెట్టె తెరచి అందులోనే మూటగట్టిన రూపాయలు నిలబడ్డపాటున తీసికొనిరా. ఈ ధనము ఇప్పుడీ విశ్వకర్మ కీయనియెడల నన్ను రాజభటుడు న్యాయస్థానమునకు తీసుకొనిపోవుటకు సిద్ధముగా ఉన్నాడు" అని తన యింటికి చిన్న డ్రోమియాను పంపినాడు.

భోజనాంతరం చిన్న ఆంటిఫొలస్ ప్రదర్శించిన ప్రవర్తన అంతా పెద్ద ఆంటిఫొలస్ ప్రవర్తనగానే అర్థము చేసికొని విలపిస్తూ ఉన్న సమయంలో చిన్న డ్రోమియో తెలియజేసిన వార్త వల్ల మరింత ఎక్కువగా విలపించినారు అయినా అతడు కోరిన వరహాలమూట ఆ చిన్న డ్రోమియో కిచ్చి పంపినారు. బ్రదుకు జీవుడా అని ఆ మూట పట్టుకొని ఆ రాజ భటుడున్ను, తన యజమానుడే అగు ఉండునను కొన్న ఆ పెద్ద ఆంటిఫొలసున్ను నిలచిన చోటకే దారి తీసినాడు. కాని అక్కడ తనకు కనబడినవాడు తన యజమానుడు చిన్న ఆంటిఫొలసు; తన చేతికి బీగమిచ్చి ధనము తెమ్మన్న పెద్ద ఆంటిఫొలసు కాడు. అయినా అతడే అనుకొని ఆ ధనము ఇయ్యబోయినాడు, "మన ప్రయాణం మాట ఏమి చేసికొని వచ్చావు"! అన్నాడు ఆ చిన్న ఆంటిఫొలసు, చెప్పినాను గదండీ అంతా సిద్ధము చేసికొని వచ్చానని ఆ మాట తిన్నగా వినిపించుకోక నా చేతికి బీగ మిచ్చి మనం భోజనము చేసిన ఇంటికి పోయి ధనం పట్టుకొని రమ్మని నన్ను పంపి నారు గదా! పట్టుకొని వచ్చాను" అన్నాడు. ఇదంతా చిత్రవిచిత్రంగా కనబడి ఆ చిన్న ఆంటిఫొలసు మతిపోయిన వాడివలె చూస్తూ ఉండగా

మధ్యాహ్నం భోజనసమయంలో ఇంటి తలుపు తెరవక పోవడం వల్ల పెద్ద ఆంటిఫొలసు ఎక్కడ భోజనము చేయవలసి వచ్చినదో ఆ యింటి యజమానురాలు ఒక వేశ్య, ఆమె ఈ చిన్న అంటిఫొలసును చూచి పెద్ద ఆంటిఫొలసుగా నేభావించి "ఏమండీ విశ్వకర్మ చంద్రహారం ఇచ్చాడు గదండీ! నా వజ్రపు పొడి ఉంగరం మీరు తీసికొన్నారు గదండీ. దానికి మారుగా చంద్రహారం ఇస్తామన్నారు గదండీ" అంటూ తన వద్దకు వచ్చింది. "ఇదేమి! ఇదొక భూతమా? విద్యాధరస్త్రీయా!" అని భయపడి, తమకేమీ ఆమె మాటలు బోధపడలేదని అంటూ ఆ యిద్దరూ అక్కడి నుండి పారిపోయినారు.

డబ్బు పట్టుకొని రావలసిన డ్రోమియో ఎప్పటికి రాకపోవడం వల్ల పెద్ద ఆంటిఫొలసు సేవకుని మాటలు నమ్మలేదు కాబోలు నా భార్య ఆమెకు నామీద కోపం వచ్చింది. పరుషంగా వ్యవహరించింది.

భోజనానికి ఇంటికి వస్తే తలుపులు బిగించి తెరవలేదు. సేవకుడు బెత్తము తెచ్చి యిస్తే ఆమెను కొట్టవలెనని; అనుకొని రాజభటులు నితో మంచి మాటలాడి తన ఇంటికి వస్తే విశ్వకర్మకు కీయవలసిన నూరు వరహాలూ ఇస్తానని చెప్పి అతనిని తోడ్కొని వచ్చాడు. దారిలో తన సేవకుడైన డ్రోమియో కనబడినాడు. కొని తెమ్మన్న బెత్తం తెచ్చియిచ్చాడు. డబ్బుమాట అడిగితే నాకేమీ తెలియదన్నాడు. ఇల్లు చేరక మునుపే ఆ బెత్తముతో పెద్ద ఆంటిఫొలసువాణ్ణి కొట్టినాడు. రాజభటుడు అడ్డుపడబట్టి ఆ డ్రోమియోకు చావు దెబ్బలు తప్పినవి. ఇంటికి రాగానే అతడికి భూతమో పిశాచమో పట్టుకొన్నదని అందరూ అనుకొన్నారు. డ్రోమియో, అడ్రియానా లూసియానాలు ఆ నూరు వరహాల గురించి తగవులాడుకొన్నారు. యజమానికి పట్టుకొన్న భూతము సేవకునికి కూడా పట్టుకొన్నదనుకొన్నారు. భూతవైద్యుణ్ణి పిలిపించి ఆ భూతాన్ని వదలకొట్టమన్నారు. అదంతా ఒక పెద్ద చిత్ర కథలా పరిణమించింది.

చిన్న ఆంటిఫొలసు, చిన్నడ్రోమియో ప్రయాణమునకు సిద్ధమైన నగరములో నడుస్తూ వుండగా విశ్వకర్మ అతనికి ఋణమిచ్చిన వర్తకులు కనబడ్డారు. ఆ ఆంటిఫొలసు మెడలో ఆ చంద్రహారం కనబడినది. అప్పుడు "ఏమయ్యా! ఈ నగ బహిరంగంగా మెడలో వేసికొని తిరుగుతూ, ఈ నగను గురించి నాకేమీ తెలియదని అబద్ధమాడినావు!" అన్నాడు విశ్వకర్మ. నే చెప్పలేదూ అలాగనలేదన్నాడు ఆ చిన్న ఆంటి ఫొలసు. అన్నావన్నాడు అక్కడి వర్తకుడు. వారిరువురితోను చిన్న ఆంటిఫొలసుకు కలహము సంభవించినది. నలుగురు పోయినారు. అందుకు భయపడి చిన్నడ్రోమియో చేసిన సలహాను అనుసరించి చిన్న ఆంటిఫొలసు తన సేవకుని వెంటబెట్టుకొని పరుగెత్తి తనచేరువగా నున్న ఒక మఠమును చేరుకొన్నాడు. అంతలో అడ్రియానా లూసియానాలు అక్కడికి వచ్చి వారిని అల్లరిమూక కొట్టబోతున్నదని తలచి "అతడు నాభర్త ఏదో పిచ్చి ఎత్తినది. అతనివల్ల మీకేమియు బాధలేకుండా నేను చూడగలను" అని మొఱపెట్టినది. ఆ సమయమందే ఆ మఠమందున్న యోగిని బయటకు వచ్చి భయపెడుతూ

వచ్చిన ఆ చిన్న ఆంటిఫోలసును చిన్న డ్రోమియోను మఠములోనికి తోడుకొనిపోగా తక్కిన వారిని రానీకుండా చేసి వారిద్దరినీ రక్షించి నది అడ్రియానా వెళ్ళి తనకథ చెప్పుకొన్న ఆమెవారిద్దరినీ ఆమె వెంట పంపుటకు సమ్మతింపలేదు

ఆమె ఏడుస్తూ వీధిలోనికి రాగానే రాజభటుడు ఆమెనుచూచి "అమ్మా! నీవు పోయి ఎఫిసస్ నగర ప్రభువయిన సోలినసుతో వారి కాళ్ళమీద నీకు కలిగిన కష్టములు విన్నవించుకో అయిదు గంటలవేళ అయినది. వేగంగా వెళ్ళు అన్నాడు. ఆ ప్రభువే తన సిబ్బందితో వస్తున్నాడని అడిగితే సైరాక్యూజ్ నుండి వచ్చిన ఒక వృద్ధ వర్తకుడు పట్టుబడినాడు. అతడు నిబంధనల ప్రకారము దండుగ చెల్లింపలేకపోయినాడు. కనుక అతనిని బహిరంగ స్థలమున వధించవలసి యున్నది. అందుచేత ఆ వర్తకుని తోడ్కొని రాజభటులతో ఆ ప్రభువే వస్తున్నాడన్నాడు. ఆ ప్రభువు సమీపించగానే అడ్రియానా అతని కాళ్ళమీదపడి మొర పెట్టుకొన్నది. అంతలో పెద్ద ఆంటిఫోలసును పెద్ద డ్రోమియోను అక్కడికి వచ్చినారు. మఠంలోనికి పోయిన వారు ఎట్లు వచ్చినారా? అని వింతగా చూచినారు. అడ్రియానా, లూసియానా ఇంకా తక్కినవారు కొందరు ఆ మఠము వెలుపల వీధిలోనే ఒకన్యాయస్థానము ఏర్పడినట్లనయినది. ఎవరి మొరవారు తెలియజేసికొన్నారు. వారన్నది, అబద్ధమని వీరు, వీరన్నది అబద్ధమని వారు గద్దిస్తూ పలికినారు. ఇరు పక్షములవారికి అనుకూలముగా సాక్ష్యములు పలికిన వారున్నారు. ప్రభువుకు మతిపోయినట్లయినది. ఈ వాదోపవాదములు జరుగుతున్నంతసేపూ వధకు కొనిపోబడుతున్న, ఆ సైరాక్యూజ్ వర్తకుడు ఈజియస్ ఆ పెద్ద ఆంటిఫోలసును పెద్ద డ్రోమియోను అదే పనిగా చూచి అనుమానించి "ఏమయ్యా! నీ పేరు ఆంటిఫోలసు కాదా?" అని పెద్ద ఆంటిఫోలసును, "మరి నీ పేరు డ్రోమియో కాదా!" అని పెద్ద డ్రోమియోను అడిగినాడు. ఇద్దరును అవునన్నారు. "మరి నన్ను గుర్తింపలేదా?" అంటే లేదన్నారు. "మన మెడబడి నాలుగేండ్లే కదా అయినది ఈ నాలుగేండ్లలోను నా రూపు మీరు పోల్చుకోలేనంతగా మారిపోయినదా! లేక తండ్రిని

గుర్తింపలేని కొడుకువయితివా ?" అన్నాడు ఈజియస్. "అయ్యా నేను ఇరువది ఏండ్లయి ఇక్కడే ఉన్నాను. నాతండ్రిని నేను బాల్యము లోనే పోగొట్టుకున్నాను. నాతల్లి నన్నును, ఈతనిని రక్షించుకోలేక పోయినది. ఒక బెస్తవాడు మమ్ము ఒక వర్తకునికి అమ్మినాడు. అతని పోషణలో పెరిగి ఈప్రభువు దయవల్ల ఈ నగరమందే ఇరువదేండ్లయి ఉన్నాము. ఈ విషయము ఈ ప్రభువువారికి కూడా తెలియును. వీరి దయవల్ల నేగదా నాకు వివాహము కూడా అయినది. నేనూ నాభార్య నా మరదలు ఈ సేవకుడు, ఒక ఇంటనే కాపురమున్నాము." అన్నాడు ఆ పెద్ద అంటిఫొలసు ఈలోగా : ఆ మఠములో యోగిని సంరక్షణలో ఈ అంటిఫొలసు, డ్రోమియో వంటివారే ఇద్దరున్నారని విని వారిని తోడ్కొని రమ్మని సోలినస్ ప్రభువు యోగినికి కబురు చేసినాడు. ఆమె చిన్న అంటిఫొలసును, చిన్న డ్రోమియోను తోడ్కొనివచ్చినది. ఆ యోగిని మరియెవరో కాదు ఆ వృద్ధవర్తకుని పెండ్లాము.

* * *

# ది కామెడీ ఆఫ్ ఎరర్జ్ - విమర్శ
## (పొరపాట్ల కామెడీ)

షేక్స్పియరు రచించిన కామెడీలు రెండు వర్గముల క్రింద కొందరు విమర్శకులు పేర్కొనడము జరిగినది. మొదటివి, తర్వాతవి అని. ఈ వర్గీకరణము కేవలము కాలక్రమము ననుసరించి చేసినది మాత్రమే కాదు. మొదటి వర్గమునందలి కామెడీలకున్ను, రెండవ వర్గమునందలి కామెడీలకున్ను కథావస్తువు తనకు ముందు

సాగియుండిన రచనల నుండి కొద్దిగానో, అధికముగానో తెచ్చుకొన్నా తన సంకల్పమునకు అనుకూలముగా మార్చుకొనుటలోను. కావ్యకళా వికాసములోను, కథా సన్నివేశముల కూర్పులోను, రచనలోను, పాత్ర పోషణములోను ఇంకా మరికొన్ని అంశములలోను గల తారతమ్యము లను బట్టి ఈ వర్గీకరణమునకు సార్థకత కుదిరినది. మొదటి కామెడీ లలో షేక్స్పియరు ప్రదర్శించిన శిల్పమండలి నవ్యత, ప్రారంభదశ గోచరము కాగలవు. రెండవ వర్గమండలి కామెడీలలో ప్రౌఢత్వము పరిణామ దశ ప్రత్యక్షములవుతవి.

మొదటి వర్గమండలి కామెడీలలో చేరిన "ది కామెడీ ఆఫ్ ఎరర్జ్", "ది టేమింగ్ ఆన్ ద్ష్రూ", "ది టూ జెంటిల్మెన్ ఆన్ వెరోనా" అనే ఈ మూడు నాటకములందున్ను మొట్ట మొదటదేది? అనే విషయములో కూడా విమర్శకులందు అభిప్రాయ బేధమున్నది. అది పరిశీలింపగా "ది కామెడీ ఆఫ్ ఎరర్జ్" మొట్ట మొదటదన్న వారి వాదము నాకు వచ్చినది. దాని ననుసరించి ఈ నాటకం 1592 లోను తక్కిన రెండు నాటకములున్ను 1593 లోను రచితములయినట్టుగా నా గ్రంథమున పేర్కొంటున్నాను.

ఈ పొరపాట్ల కామెడీ నాటకము ప్లాటస్ అనే ప్రసిద్ధ రోమన్ నాటకకర్త రచించిన మెనీక్మి, ఆంఫిట్రుఓ నాటకములందలి కథావస్తువులపై ఆధారపడినది. కాని తనకాలమునకు తన దేశమందలి సంప్రదాయములకు, భావనలకు, అనుకూలముగా కథ మలచి షేక్స్పియరు రచన సాగించినాడు. ప్లాటస్ ఒక జత కవలలతో నాటకము సాగిస్తే, షేక్స్పియరు రెండు జతల కవలలతో కథ నడిపినాడు. ఒక జత కుదర్చడం సాధ్యమయినపుడు ఎన్ని జతలనైన కుదర్చవచ్చును. తారతమ్యములు గుర్తింప లేనంతగా కవలలుండుట సాధారణమైన సంఘటన కాకపోయినా అసంభవమనలేము. అట్టి అసాధారణ సంభావ్యములు విశాలమైన ఈ ప్రపంచములో ఒకటి ఉన్నప్పుడు ఎన్నైనా ఉండవచ్చును గదా! అదిగాక ఈ కామెడీ హాస్యరస ప్రధానమయి

వదిగా రచించుటకు షేక్స్పియరు సంకల్పించినాడు. ఒకే పోలికగల కవలలు వేరు వేరు స్థలములందు ఒకరినొకరు చూచుకొనుటకు గాని, ఒకరి ఉనికి ఒకరు తెలుసుకొనుటకుగాని అవకాశము లేని పరిస్థితులలో తక్కినవారు, ఇరువురినీ వేరు వేరు సమయములందు కలిసి వ్యవహరించ వలసి వచ్చినప్పుడు పొరపాట్లు తప్పక కలుగుతూ ఉంటవి. అట్టి పొర పాట్లు పరిహాసమునకు ఆస్పదములగుతూ ఉంటవి. అట్టి ఒకజత కవలల వలన పుట్టగల పొరపాట్లు రెండు జతల కవలల వలన-అందులోను ఒక జత కవలలు యజమానులున్ను, రెండవ జతకవలలు వారి సేవకులున్ను అయి పొరపాట్లు నాలుగింతలు అధికమగుటయే గాక ఎక్కువ వినోద కరములుగాను, ఎక్కువగా నవ్వు పుట్టించేవిగాను పరిణమిస్తవి. ఇట్టి ప్రహసనమునకు అవకాశము ఎక్కువగా ఉండగలదన్న భావముతో షేక్స్పియరు ఈ నాటకము మనోరంజకముగా కల్పించి రచించినాడు.

తల్లీ తండ్రీ వారికి కవలలుగా పుట్టిన ఇద్దరు కొడుకులు, వారి వలెనే కవలలుగా పుట్టిన ఇద్దరు సేవకులు, మొత్తం ఆరుగురిలోను తండ్రీ చిన్న కొడుకు చిన్న సేవకుడు ఒక చోటను, తల్లీ పెద్దకొడుకు పెద్ద సేవకుడు మరియొక చోటను, సముద్రయానము చేస్తూ ఉండగా, ఓడ బద్దలగుట వలన వేరై పోవుట సంభవించినది. అమ్మను, అన్నను అతని సేవకుని వెదకుటకు బయలుదేరి వెళ్ళిన చిన్నకొడుకు అతని సేవకుడు ఎప్పటికీ తిరిగి రాకపోవడము వల్ల వారిని వెదకుటకు వెళ్ళిన తండ్రి శత్రునగరమైన "ఎఫిసస్‌లో" కారాగార బంధితుడై వధింప బడుటకు సిద్ధపడవలసిన ఒక దినమున-ఒక నాటి కథా వస్తువుతో ఈ నాటకము పరిమితమయినది. తల్లి తన పెద్ద కొడుకును అతని సేవకుని పోషింపలేక ఒక వెస్తవానికి అమ్మి ఆ ఎఫిసస్ నగరమందే ఒక మఠ మందు యోగినిగా జీవిస్తూ వచ్చినది. ఆమె పెద్దకొడుకు, అతని సేవకుడున్ను, ఆ నగరమందే స్థిరనివాసము లేర్పరచుకొనుట ఆ పెద్ద కొడుకు పెండ్లియాడుట, ఆ పెండ్లానికి గల చెల్లెలు కూడా వారితోనే ఉండుట, అతడి సేవకుడున్నూ వారితో ఉండుట జరిగినది. వీరి ఉనికి

తల్లికిగాని, తల్లి ఉసికి వీరికిగాని అందరూ సుమారు ఇరువది సంవత్సరములు గడచినా తెలియలేదు.

అట్టి పరిస్థితులలో చిన్నవాడును, అతని సేవకుడున్ను ఆ నగరమే వచ్చుట సంభవించినది ఇదంతా అసాధారణమయిన సంఘటనమే. అయినా అసంభవముగాదు. ఆ ఒక్క దినమున పోలికలు కలవారు జతలో ఒకే విధముగా నుండుట వలన పొరపాట్లు చిత్రవిచిత్రముగాను, వినోదకరముగాను, హాస్యాస్పదంగాను సంభవించినవి ఈ కథ చదివే వారికిగాని, అంతకంటే ఎక్కువగా, ఈ నాటకము ప్రదర్శించినపుడు చూచే వారికిగాని నవ్వు పుట్టకపోదు. ఆ నాటి సాయంకాలము ఈజియన్ ఆ మరణమునకు చేరువగా రాబట్టి నాటకము పూర్తి కావలసి వచ్చినదిగాని లేకున్న యెడల ఆ నాటి పొరపాట్లు ఇంకా ఎన్నైనా జరిపించి నాటకము సాగదీయుటకు అవకాశము లేదు.

కథా సన్నివేశములు వడివడిగా నడపించవలసియుండెను. గనుక కవితాశిల్పము, ప్రదర్శించుటకు షేక్స్పియరునకు అవకాశము చాలినది కాదు. పాత్ర పోషణము మరింత ఎక్కువగా కావించకపోవుటకున్ను అదే కారణము, అవకాశమున్నంతలో పాత్ర పోషణ బాగుగానే సాగినది.

నాటకములో శృంగార రసము అసభ్యముగా ప్రదర్శింపబడ లేదు. ఉన్నంత వరకు మనోరంజకముగానే ఉండెను. అడ్రియానా ప్రవర్తన కొంచెం వెగటుగా కనబడినా అది సహజముగానే యున్నది. లూసియానా ప్రవర్తన మెచ్చుకోదగినదిగా నడచినది. అక్కచెల్లెండ్ర పాత్ర పోషణ రసవంతముగా జరిగినది. చిన్న సోదరుడైన ఆంటిఫొలసుకు భార్య కావడానికే ఆ పాత్ర కల్పితమయినది. ఈ నాటకము ఒకనాడు ముచ్చటలతో నడచి సుఖాంతమయినది.

# ది టేమింగ్ ఆఫ్ దిష్రూ
## (గయ్యాళిని సాధువుగా చేయుట)

ఇది 1593 లో రచితమయినది షేక్స్పియరు రచించిన తొలి కామెడీలలో రెండవది. మొదటిది 1592 లో రచితమైన 'ది కామెడీ ఆఫ్ ఎరర్జ్' ఈ రెండవ కామెడీ మొదటి కామెడీ వలెనే కేవలము వినోదార్థము రచితమైనదే కానికాని ఇందులో వింతగొలుపు శృంగార రసము ప్రదర్శింపబడినది.

కథా సంగ్రహములో మొట్టమొదటి భాగము ప్రధాన కథకు ముందుమాట వంటిది. దానిని ఇక్కడ చేర్చిన మొదల పాఠకులకు కొద్దిగానైన విసువు పుట్టించుననితోచి విడిచిపెట్టి విమర్శలో సూచించి నాను.

### కథా సంగ్రహము :-

ఇటలీ దేశములోని పాడువా అనే ఒక సుందరమైన నగరంలో బాప్టిస్టా అనే ఒక పెద్దమనిషి ఉండేవాడు. అతనికి ఇద్దరు కుమార్తెలు. ఇద్దరూ చాలా అందమైనవారు. పెద్ద కుమార్తె పేరు కేతరైన్ ఈమె గయ్యాళిగంప. రెండవ కుమార్తె పేరు బియాంకా ఈమె చాలా నెమ్మదయినది.

ఆ ఇద్దరికి యుక్తవయస్సు వచ్చినప్పటి నుండి కేతరైన్ పెండ్లి విషయమై బాప్టిస్టాకు బెంగ పట్టుకొన్నది. చాలామంది యువకులు బియాంకాను పెండ్లాడుతామన్నారే కాని గయ్యాళిగంపయైన కేత రైన్‌ను పెండ్లాడడానికి అంగీకరించలేదు. పెద్ద కూతురుకు పెండ్లి అయితే కాని రెండవ కుమార్తెకు పెండ్లి చేయనన్నాడు బాప్టిస్టా. దాంతో బియాంకాను పెండ్లాడదలచు కొన్నవారు కేతరైన్‌ను పెం

ల్లాడ గల ధైర్యవంతుడెవడైనా ఉన్నాడా అని వెతకడం మొదలు పెట్టారు.

ఇటలీ దేశంలో వెరోనా అనే యింకొక పట్నంలో పెట్రు బియో అనే ఒక ధనవంతుడైన విలాసవంతుడు ఉండేవాడు. అతడు ప్రపంచమంతా తిరిగిచూసి తగిన పెండ్లాన్ని సంపాదించుకోవాలను కొన్నాడు. అతడు తన యాత్రలో పాదువా పట్నం చేరుకొన్నాడు. అక్కడ తన స్నేహితుడైన హార్టెన్సియోను కలుసుకొన్నాడు. ఆ స్నేహితుడు బియాంకాను పెండ్లాడవలెననుకొంటున్న వారిలో ఒకడు. అతడు విషయాన్నంతా పెట్రుబియోకు చెప్పాడు. ఈ విషయాన్ని విని పెట్రుబియో ఆశ్చర్యపోయాడు. ఆ విషయంలో అతనికి ఆసక్తి కలిగింది. కేతరైన్‌ను పెండ్లాడాలనుకొన్నాడు.

"ఆ కేతరైన్‌ను నేను పెండ్లాడతాను. ఆమె ఎంత గయ్యాళి గంపయినా ఫరవాలేదు. ఉరిమినట్టు గర్జించి తిట్టినా సరే ఆమె నన్ను ప్రేమించేటట్టు చేస్తాను" అన్నాడు ఆ అందమైన యువకుడు. అతడు చాలా తెలివైనవాడు. అతడు వెంటనే హార్టెన్సియోను తీసికొని బాప్టిస్టా యింటికి వెళ్ళాడు. వెళ్ళేముందు "నీవు సంగీత విద్వాంసు డుగా నటించు కేతరైన్‌కు నీవు సంగీతంనేర్పు నేను ఆమెకు ప్రేమిం చడం నేర్పుతాను. మనిద్దరం కలిసి ఆ గయ్యాళిగంపను మచ్చిక చేద్దాం." అన్నాడు పెట్రుబియో అతని స్నేహితునితో. వారిద్దరూ బాప్టిస్టాను కలిసికొన్నారు.

"అయ్యా మీకు సుగుణవతియైన కేతరైన్ అనే పేరు గల అమ్మాయి ఉన్నదట కదా?" అని పెట్రుబియో బాప్టిస్టాను అడిగాడు. "నాకు కేతరైన్ అనే అమ్మాయి ఉంది" అన్నాడా తండ్రి. "నేను వెరోనా అనే పట్నం నుండి వచ్చాను. మీ అమ్మాయి అందం ఆమె సుగుణాలను విన్నాను. ఆమెను నేను పెండ్లాడడానికి ఈ నా స్నేహి తుడు ఆమెకు సంగీతం నేర్పడానికి మీ అనుమతిని యీయవలెనని అడుగుతున్నాను." అన్నాడు. "మీకు మా కేతరైన్ తగినదికాదేమో

వని భయంగా ఉంది" అన్నాడు బాప్టిస్టా. మీరు మీ అమ్మాయిని విడిచి ఉండలేకనో లేక నేను మీకు తగిన అల్లుడ్ని కానేమోనని మీకు భయంగా ఉన్నందువల్లనో అలాగంటున్నారు" అన్నాడు పెట్రుబియో. "అయ్యా మీరు పొరపడుతున్నారు. ఇంతకూ మీ రెక్కడుంటున్నారు? మీ పేరు?" అని బాప్టిస్టా పెట్రుబియోని అడిగాడు. వివరంగా అన్ని విషయాలువిని ఆయువకుని తండ్రి తన స్నేహితుడే అని సంతోషించాడు. కాని తన కూతురు నోటి దుడుసుతనం తెలిసినవాడు గనుక పెట్రుబియోకు ఆమెకు తగిన భార్య కాదేమోనని భయపడుతూ "నీకు మేలు కలుగుగాక! కాని నీవు కొన్ని కఠోరమైన మాటలను భరించడానికి సిద్ధపడవలసి ఉంటుంది." అన్నాడు.

అంతకుముందే కేతరైన్‌కు సంగీతం నేర్పడానికి వెళ్ళిన హోర్టెన్సియో పరుగెత్తుకొని వారున్నచోటికి వచ్చాడు. అతనితలకు గాయం తగిలింది. రక్తం కారుతున్నది. అతని ముఖం భయంతోను, కోపంతోను వికృతమయింది. "ఏమి అలాగున్నావు? ఏం జరిగింది? నా కుమార్తె సంగీత విద్వాంసు రాలవుతుందా?" అని తండ్రి అతన్ని అడిగాడు. "ఆమె మంచి సైనికురాలు అవగలదు" అన్నాడు హోర్టెన్సియో కోపంగా లూట్ అనే సంగీత వాద్యాన్ని సరిగ్గా వాయించడం కేతరైన్‌కు అతడు నేర్పబోతే ఆమెకు కోపంవచ్చి ఆ వాద్యంతో అతన్ని ఆమె తలమీద కొట్టింది. దాంతో ఆ వాద్యం విరిగింది. అతని తలకు గాయంతగిలింది. అతడు తెల్లబోయి నుంచుంటే అతన్ని అనరాని మాటలన్నది. అది ఒక హాస్యమంటూ పెట్రూబియో విరగబడి నవ్వాడు.

"ఆమె చాలా ధైర్యవంతురాలు యిది వరకు కన్నా పదిరెట్లు అధికంగా ఆమెను ప్రేమిస్తున్నాను. ఆఉల్లాసవతిని చూడ్డానికి ఆత్రుత పడుతున్నాను" అన్నాడు పెట్రూబియో. దాంతో బాప్టిస్టా హోర్టెన్సియోను బియాంకాకు సంగీతం నేర్పమని చెప్పి ఆ గయ్యాళి

గంపను తీసికొని రావడానికి వెళ్ళాడు. ఆ అడవి మృగాన్ని ఎలాగు మచ్చిక చేసికొనడమా అని ఆలోచిస్తూ ఒంటరిగా కూర్చున్నాడు. పెట్రుబియో ఆమె తిడితే "ఆహా! కోకిల్లా పాడుతున్నావంటాను. కోపంతో ముఖం చిట్లిస్తే ఉదయమే వికసించి మంచుతో కడిగిన గులాబి పువ్వులా ఉంది నీ ముఖం" అంటాను. "ఒక్క మాటయినా మాట్లాడకపోతే ఎంత బాగా మాట్లాడుతున్నావంటాను. నన్ను పొమ్మంటే నన్ను ఒకవారం రోజులు ఉండమన్నదన్నట్లు ధన్యవాదాలర్పిస్తాను. నన్ను పెండ్లాడనంటే, మన పెండ్లి ముహూర్తం ఎప్పుడని అడుగుతాను." అని యీ విధంగా ఆలోచిస్తూ ఉండగా గర్వాంతి ఆవేశంతో వచ్చింది. ఆగంతకుని చూచి చికాకు పడింది. కాని పెట్రూబియో ఏమి జంకకుండా "శుభోదయం కేట్ అనే నీ పేరని విన్నాను అన్నాడు. నాపేరు కేథరైన్ అంది ఆమె కోపంగా.

"అబద్ధం ఆడతావా! నిన్ను కేట్ అనే అంటారు! అని ఒక్కొక్కప్పుడు ముచ్చటయిన కేట్ అని దుష్ట కేట్! అని కూడా అంటారు. కాని నీవు ప్రపంచ మంతటిలో చాలా అందమైనదానివి నీ అందాన్ని, నీ శాంతాన్ని నీ సుగుణాన్ని అన్ని పట్నాలలోను, అందరూ మెచ్చుకొంటూ ఉన్నారు. నా భార్యవు కమ్మని నిన్ను అడగడానికే నేను వచ్చాను. అన్నాడు పెట్రూబియో నీకెంత పొగరు! వెళ్ళు వెంటనే వెళ్ళు అని ఆమె గద్దించింది. కాని పెట్రుబియో కదలలేదు. కేథరైన్ అతనితో వాదించింది. అతనిని తిట్టింది. కయ్యానికి కాలు దువ్వింది. కాని అతను ఏమీ పట్టించుకోలేదు. అతడు ఆమె అందాన్ని సుగుణాలను పొగడాడు. ఆమెను గయ్యాళి అన్నవారంతా అసత్య వాదులన్నాడు. "ఓ మనోహరమైన కేట్! నీవు ఇష్టపడినా పడకపోయినా నేను నిన్ను పెండ్లాడదలచుకొన్నాను. నీ తండ్రి అంగీకరించాడు నేను నిన్ను మచ్చిక చేసికొని దుర్మార్గురాలవైన నిన్ను సన్మార్గురాలను చేస్తాను. ఇదిగో నీ తండ్రి వస్తున్నాడు. కాదనకు "కేథరైన్ను నా భార్యగా చేసికొని తీరుతాను" అన్నాడు. ఇంతలో ఆమె తండ్రి తానే వచ్చాడు. వచ్చే ఆదివారంనాడు మా యిద్దరి వివాహానికి కేథ

రైన్ ఏర్పాట్లు చేస్తున్నదని అతడు బాప్టిస్టాతో చెప్పాడు. నిన్ను పెండ్లాడేముందు నీకు ఉరితీయిస్తాను. అని కోపంతో అంటూ చిందులు తొక్కి అటువంటి పిచ్చివాడిని పెండ్లాడమన్నందుకు తండ్రిని నిందించింది.

ఇంతలో ఆమె మాటలకు అడ్డువస్తూ "మీరు శాంతించండి. మీరు ఉన్నప్పుడే ఆమె ఇలా మాట్లాడుతుంది. మేమిద్దరం ఒంటరిగా ఉన్నప్పుడు, నెమ్మదిగా ప్రేమపూర్వకంగా మాట్లాడుతుంది. ఆమె నన్ను ఎంతగా ప్రేమిస్తున్నదో మీరు నమ్మలేరు." అని పెట్రుబియో బాప్టిస్టాతో అని "నా నన్ను ముద్దు పెట్టుకో కేట్ ! నేను వెన్నిస్ వెళ్ళి నగలు వస్త్రాలు కొంటాను వచ్చే ఆదివారం మన పెళ్ళిగదా! అని కేతరైన్‌తో అన్నాడు. ఈ వింతమనిషియొక్క మాటలకు కేతరైన్ సంభ్రమాశ్చర్యములను పొంది మరి మాట్లాడలేకపోయింది.

ఆదివారంనాడు విందు ఏర్పాటయింది. అతిధులు వచ్చారు. కేతరైన్ రుసరుసలాడుతున్నా నూతన వస్త్రాలతో అలంకరింపబడి పెండ్లికి సిద్ధపరచబడింది. అందరూ పెట్రూబియో రాకకోసం ఎదురు చూస్తున్నారుగాని అతడు రాలేదు. అతిథులు గుసగుసలాడడం మొదలుపెట్టారు. కేతరైను తిట్టుకొంటూ శాపాలు పెడుతూ పెట్రూబియో తనను అంతగా చిన్నబుచ్చినందుకు కన్నీళ్ళతో ఆ గది విడిచి వెళ్ళిపోయింది. "నన్ను దద్దమ్మను చేయడానికే యిదంతా అతడు చేశాడు. నన్ను పెండ్లాడాలని అతనికిలేదు" అని వడ్చింది.

అతడు రాడని అందరూ నిశ్చయించుకొన్నారు. ఇంతలో అతడు ఒక ముసలి బక్కచిక్కిన గుర్రంపైని సవారిచేసి కొంటూ వచ్చాడు. ఆ గుర్రం రోగంతో నడవలేకుండా ఉంది. పెట్రూబియో ఒక ముష్టివాడిలా ఉన్నాడు. చిరిగిన మాసిన బట్టలు తొడుగుకొని తుప్పుపట్టిన కత్తిని ధరించి వచ్చాడు. అతని నౌకరు కూడా అలాగే ఉన్నాడు. పెట్రూబియో ఆగుర్రంపైనుండి క్రిందకు గెంతి 'నా కేట్

ఏది! నా ముద్దుల భార్య ఏది అని పిలుస్తూఉంటే అతిథులు గుసగుసలాడ్డం మొదలుపెట్టారు.

అతిథులను అంతకాలం వేచి ఉంచి ఆ తర్వాత ఆ విధంగా అమర్యాదకరమైన స్థితిలో పెట్రూబియో రావడం బాప్టిస్టాకు బాధ కలిగించింది. "ఏమండీ! ఇవాళ మీ వివాహదినం అని మీకు తెలుసు కదా? వెళ్ళి మీ బట్టలను వెంటనే మార్చుకు రండి" అన్నాడు బాప్టిస్టా. "కేట్ నా బట్టలనుకాదు నన్ను పెండ్లి చేసికొంటున్నది" అంటూ మొండిగా ఏమీమార్చుకొనడానికి అంగీకరించలేదు. చేసేది ఏమీలేక కేథరైన్ చర్చికి బయలుదేరింది. ఆ శుభకార్యం జరుగుతున్నంతసేపూ పెట్రూబియో ఆ విధంగానే ప్రవర్తించాడు. పురోహితుని తిట్టి, కొట్టి అల్లరిచేశాడు. అంతవరకూ ఎప్పుడూ భయపడని కేథరైన్ భయంతో వణికిపోయింది. పెట్రూబియో ఒకకప్పు ద్రాక్ష పానీయం అడిగి పుచ్చుకొని సగం తాగి మిగిలినది పురోహితుని ముఖం మీదకు విసిరాడు. చివరకు కేథరైన్ ఎలాగో తండ్రి ఇంటికి పెట్రూబియోను తీసికొని వెళ్ళగలిగింది. కాని విందుకు ఆగడానికి వీలులేదన్నాడు పెట్రూబియో. "మనం ఉండకపోతే వచ్చినఅతిథులు ఏమనుకొంటారు? నన్ను మీరు నిజంగా ప్రేమిస్తే మీరు ఉండాలి" అని చెప్పింది. దానికి సమాధానంగా పెట్రూబియో గుర్రాలను సిద్ధం చేయమని నౌకరుతో చెప్పాడు. దాంతో కేథరైన్‌కు ఒడలు తెలియనంత కోపం వచ్చింది. "అయితే వెళ్ళండి తలుపులు తీసే ఉన్నాయి. నేను ఇవాళకాదు. రేపుకాదు. నేను బయలుదేరాలని అనుకొనేవరకు రాను" అంటూ అరచింది. "అయ్యా! అంతా పదండి నేను స్త్రీని స్త్రీకి ఈ విషయంలో శక్తి లేకపోతే నిజంగా పిచ్చిదే" అని అతిథులతో అంది కేథరైన్.

"అయ్యా! నా భార్య చెప్పినట్టు మీరంతా విందుకు వెళ్ళండి నా భార్య మాత్రం నాతో వస్తుంది. నా భార్యకు నేను నాథుడను" అన్నాడు పెట్రూబియో దాంతో కేథరైన్ ఏమీ చేయలేకపోయింది. మతిపోయిన లాగున తనకు నియమించిన గుర్ర మెక్కి వెళ్ళింది. వారు

వెళ్తున్న మార్గం బాగుండలేదు. వారి గుర్రాలు బక్క చిక్కిన ముసలి గుర్రాలు ఒక కొండ దిగుతున్న సమయంలో కేథరైన్ గుర్రం పడి పోవడంతో ఆమె బురదలో పడింది. పెట్రూచియో ఆమెకు సహాయం చేయడం మాని తన నౌకరును కొట్టడం తిట్టడం మొదలు పెట్టాడు. చివరకు ఎలాగైతే నేమి అలసి, సొలసి, ఆకలితో మాసిన బట్టలతో భర్త ఇల్లు చేరుకొంది కేథరైన్. తనొక పిచ్చివాడిని పెండ్లి చేసి కొన్నట్లు భావించి తన కష్టాలు అంతటితో గట్టెక్క లేదనుకొంది. ఇంతలో వారికి స్వాగత మివ్వడానికి నౌకర్లు బయటకువస్తే వారందర్నీ తిట్టాడు. వారితో కాస్త సభ్యతతో ప్రవర్తించమని కేథరైన్ బతిమా లింది. వంటకాలు బాగున్నప్పటికీ పెట్రూచియో ఏవో వంకలుపెట్టి కేథరైన్ ఆ రాత్రి ఏమీ తినకుండా చేశాడు. అలాగే ఆమెను పడు కోనివ్వనూ లేదు. ఎప్పుడూ చిరచిర లాడుతూ ఉండేవారితో జీవించడం ఎంత కష్టమో తెలియజేయడానికే అతడు అలా ప్రవర్తిస్తున్నాడన్న సంగతి కేథరైన్ గ్రహించలేకపోయింది. ఆ విధంగానే మర్నాడు కూడా గడిచింది. కేథరైన్‌కు ఆకలివేసి ఒక నౌకరును ఆహారం ఏదైనా తెమ్మని బతిమాలింది. యజమాని ఆజ్ఞలేనిదే అతడు తేనన్నాడు.

"నన్ను ఆకలితో మాడ్చడానికా నన్ను అతను పెండ్లాడింది.! నా తండ్రి యింటికి ముష్టి వాళ్ళు వస్తే అన్నం దొరుకుతుంది. నాకు అడుక్కోవడం చేతకాదు. నాకు ఆకలి వేస్తున్నది. రాత్రంతా: నిద్ర లేదు. నన్ను ప్రేమిస్తున్నందుకే ఇదంతా చేస్తున్నాడంటే : నాకు మరింత బాధగా ఉంది. అంది కేథరైన్ కోపంగా. ఆసమయానికే పెట్రూచియో ఒక గిన్నెతో మాంసం పట్టుకొనివచ్చి "నా మనోహర మైన కేట్! బాగున్నావా? నీ సౌఖ్యం కోసం నేనెంతగా శ్రమతీసి కొంటున్నానో తెలుసా? నా స్వహస్తాలతో నీ కోసం తినుబండా రాలు తయారు చేశాను" అన్నాడు కేథరైన్ మాట్లాడలేదు. "అవ సరం లేదా? ధన్యవాదాలు! ఒక్క పలుకైనా పలుకలేవా? యీ ఆహారం నీకు ఇష్టం కాదేమో?" అని ఆ మాంసం గిన్నెను తీసికొని పొమ్మని నౌకరుతో చెప్పాడు. "వద్దు, వద్దు! ఉండనీయండి!"

అంటూ ఆకలితో నీరసించిన కేతరైన్ అరచింది. అతి స్వల్ప సహాయానికి కూడా ధన్యవాదాలు చెప్పాలి. కనుక ఆ మాంసం ముట్టుకొనే ముందు నాకు నీవు ధన్యవాదాలు చెప్పాలి" అన్నాడు పెట్రూబియో. "మీకు ధన్యవాదాలు!" అంది కేతరైన్ నీరసంగా. ఆమెను కాస్త తిననిచ్చి ఆమెకు ఆ మాత్రం చాలన్నట్టుగా నటించి పెట్రూబియో ఆ మిగిలిన దానిని తీసికొని పొమ్మని నౌకరుతో చెప్పాడు

పెట్రూబియో అంతకు ముందే పురమాయించిన బట్టలను తీసికొని దర్జీవాడు వచ్చాడు. అతడు ఒక మంచి అందమైన టోపీని కేతరైన్‌కు చూపించాడు. "ఏమిటా టోపీ! అది చాలా చిన్నది. అది పిల్లల టోపీలా ఉన్నది. అంతకన్నా పెద్దది కావాలన్నాడు పెట్రూబియో. అంతకన్నా పెద్దది అవుసరంలేదు ఇదే ఫేషన్. గౌరవకుటుంబ స్త్రీలు ఇటువంటి టోపీలనే ధరిస్తారు" అంది కేతరైన్. "నీవు కూడా గౌరవనీయంగా ఉన్నప్పుడు నీకూ ఒకటి లభిస్తుంది." అన్నాడు చిరాకు చెందినట్లు నటిస్తూ. దాంతో కేతరైన్‌కు కోపం ఆగలేదు. "నేను మాట్లాడవచ్చుననుకుంటాను. నేను మాట్లాడి తీరుతాను. నేనేం చంటి పిల్లను కాను. నన్ను మీరు యిలా చూడ్డానికి నేను మాట్లాడితే ఇతరులు వింటున్నారు. మీరు వినలేకపోతే చెవులు మూసుకోండి" అంది ఆమె. ఆమె మాటలను వినిపించుకోనట్టు నటిస్తూ "నీవు చెప్పింది నిజమే. ఇది ఒక పిచ్చిటోపీ అదంటే నీకిష్టం కాదు గనుక నిన్ను నేను ప్రేమిస్తున్నాను" అన్నాడు పెట్రూబియో. మీరు నన్ను ప్రేమించినా ప్రేమించకపోయినా, నాకా టోపీ బాగుంది దాన్ని నేను పెట్టుకొంటాను." అన్నది కేతరైన్.

"ఓ దర్జీ! ఆ టోపీ తీసెయ్. మాకు అది అక్కర్లేదు. ఇహ కుట్టిన బట్టలను చూద్దాం" అంటూ బట్టలనుతీసి "ఏమిటీ నాసిరకం దీన్ని ఈ ప్రపంచంలో ఏమంటారు? బట్టలను తిన్నగా కత్తిరించలేక పాడు చేశావు" అన్నాడు పెట్రూబియో." ఇంత మంచి బట్టలను నేన

ప్పుడూ చూడలేదు అన్ని విధాలా యిది చాలా బాగుంది అంది కేథరైన్.

ఆ టోపీని, బట్టలను భద్రంగా కేథరైన్ [illegible] దర్జీవాడికి కూలి యిచ్చి, పంపించవలసిందిగా నౌకర్లకు చెప్పి "కేట్! పద మనం ఏం చేయగలం మనకున్న ఈ పేద వస్త్రులతోనే మీ తండ్రిగారి యింటికి వెళ్దాం" అన్నాడు పెట్రూబియో. అప్పటికి రెండు దాటింది. అయినా ఏడయిందంటూ తన నౌకర్లను గుర్రాలను సిద్ధం చేయమన్నాడు. మధ్యాహ్న భోజనానికి మామగారిల్లు చేరుకోవాలన్నాడు. "మనం వెళ్ళేసరికి రాత్రి భోజనం వేళ అవుతుంది అంది కేథరైన్" "నేను ఏది చెప్పినా అడ్డంగా వాదిస్తావు సరే ఇవాళ నేను వెళ్ళను. నేను ఎప్పుడు వెళ్ళినా అది నేను చెప్పిన వేళ కావాలి" అన్నాడు పెట్రూబియో.

ఆ మర్నాడు కేథరైన్ బుద్ధి తెచ్చుకొని అది ఏ సమయమో పెట్రూబియోతో కేథరైన్ వాదించలేదు. తనతండ్రి ఇంటికి భర్తతో కూడా గుర్రం పైనిఆమె బయలుదేరింది. కొంతదూరం వెళ్ళినతర్వాత కొద్దిసేపు విశ్రాంతి తీసికోనాలనుకొన్నారు. అది ఆనంద దాయకమైన ఉదయం. సూర్యుడు ప్రకాశిస్తున్నాడు ఆకాశం నిర్మలంగా వుంది. "చంద్రుడు ఎంత చక్కగా ప్రకాశిస్తున్నాడో" అన్నాడు పెట్రూబియో.

"చంద్రుడా! సూర్యుడనా మీ భావం! ఇప్పుడున్నది వెన్నెల కాదు"

"ఆ ప్రకాశిస్తున్నది చంద్రుడే!"

"సూర్యుడే! నాకు తెలుసు!"

"నేను నీ తండ్రి యిల్లు చేరేవరకు నా అమ్మ కొడుకుతోడుగా అది చంద్రుడు, నక్షత్రం నేను ఏదంటే అది" అన్నాడు. ఈ మనిషిని మెప్పించడం అసాధ్యమనుకొంది కేథరైన్ మనసులో. "సరే పదండి అది చందమామ. నక్షత్రమే, మీరు ఏదంటే అదే మీతో నేను వాదించను."

"అయితే అది చందమామ."

"అవును అది చందమామ అని నాకు తెలుసు"

"నీవు అబద్ధమాడుతున్నావు అది సూర్యుడు" అన్నాడతని భర్త. "కాను సూర్యుడే నీతో మరి వాదింపను" అంది కేథరైన్ నిరాశతో. ఇంతలో ఒక ముసలివాడు వారికి ఎదురయ్యాడు. కేథరైన్ సహనమును పరీక్షించడానికి పెట్రూబియో ఆ ముసలివానితో "శుభోదయం అన్నా!" అని "కేట్ చెప్పు ఇంతకన్నా అందమైన ఆడదాన్ని చూశావా! నిజం చెప్పు" అని కేథరైన్‌ను పెట్రూబియో అడిగాడు. ఆ ముసలివాని చర్మం మృదువుగాను, అందంగాను, అతని కళ్ళు నక్షత్రముల్లాగా ఉన్నాయని మెచ్చుకొన్నాడు" కేట్ ఈ సన్య అందం కోసమైనా ఆమెకు ముద్దుపెట్టుకో అన్నాడు.

ఈసారి కేథరైన్ నిజంగా గుణపాఠం నేర్చుకొంది. "అందమైన, నవయౌవన వనితా! ఎక్కడికి వెళ్తున్నావు! నీ యిల్లెక్కడ! నీ అంత అందమైన పిల్లను కన్నందుకు నీ తల్లిదండ్రులు ఎంత సంతోషించి ఉంటారో గదా!" అంటూ ఆ వృద్ధుణ్ణి ఆమె పలుకరించింది. ఆమెవంక ఆ వృద్ధుడు ఆశ్చర్యపోయి చూస్తూఉంటే పెట్రూబియో ఇలాగ అన్నాడు. "కేట్! నీవు పిచ్చిదానవు కావనుకొంటాను. నీవు అనుకొన్నట్లూ ఇతడు చిన్న ఆడపిల్ల కాదు ముసలివాడు." "నన్ను క్షమించండి నా కంట్లో ఎండ పడడం వలన మిమ్మల్ని సరిగ్గా చూడలేకపోయాను. దయచేసి నా తప్పును క్షమించండి" అంది కేథరైన్.

ఆ వృద్ధుని పేరు విన్సెంటియో అతడు కూడా పాడువా వెళ్తున్నాడు. అతని కొడుకు లూసెంటియో బియాంకాను పెండ్లాడుతున్నాడని అతడు వారికి చెప్పాడు. (పెట్రూబియో స్నేహితుడు హోర్టెన్సియో వేరొక యువతిని వివాహం చేసికొన్నాడు.)

బియాంకా పెండ్లికి అందరూ కలుసుకొన్నారు. అక్కడ పెట్రూబియోను అందరూ అతని గయ్యాళి భార్య విషయమై హాస్యం

చేయడం మొదలు పెట్టారు. అందుకు పెట్రూబియో ఎవరి భార్య ఎక్కువ న|మత చూపుతుందో చూద్దాం మీ మీ భార్యలను పిల వండి అన్నాడు. అందరూ అంగీకరించారు. లుసెంటియో తన భార్యకు కబురు పంపాడు. కాని ఆమె తొందరవలన రాలేనన్నది. హార్టెన్సియో |బతిమాలుతున్నట్టు రమ్మని కబురు పంపాడు. అలాగయితే రావచ్చు నేమోలే అన్నాడు పెట్రూబియో. |బతిమాలినా నీ భార్య రాద న్నాడు హార్టెన్సియో. ఇంతలో వెళ్ళిన నౌకరు తిరిగివచ్చి ఆమె హార్టెన్సియోని రమ్మంటున్నదని చెప్పాడు. "నా భార్యను రమ్మనమని నేను ఆజ్ఞాపిస్తున్నానని చెప్పు" అని నౌకరుతో పెట్రూబియో చెప్పాడు. అతనికితగినపరాభవం జరుగుతుందని అందరూ అనుకొంటూ వుండగా సౌమ్యంగా కేథరైన్ వచ్చి "ఏమండీ పిలిచారా ? ఏమిటి మీ ఆజ్ఞ?" అని అడిగింది. ఔను నీ చెల్లెలు, హార్టెన్సియో భార్య ఎక్కడున్నారు ? వెళ్ళి వాళ్ళను పిల్చుకొనిరా" అని పెట్రూబియో కేథరైన్‌ను ఆజ్ఞాపించాడు. వెంటనే వారిని పిలవడానికి వెళ్ళింది. "ఇదొక అద్భుతం" అన్నాడు లుసెంటియో. "ఔను అదేమిటో నాకు అర్థం కావడం లేదు" అన్నాడు హార్టెన్సియో. "అది శాంత సౌమ్య |పేమ పూరిత జీవితం ఒక్క ముక్కలో చెప్పాలంటే దాని అర్థం మధురం, ఆహ్లాదం ఇంకా స్త్ర అగారంటే ఆమె న|మత ఇంకా చూపిస్తాను" అన్నాడు పెట్రూబియో.

ఇంతలో కేథరైన్ తక్కిన యిద్దరితో వచ్చింది. "కేథరైన్ ఆ టోపీ నీకు బాగుండలేదు, దాన్ని తీసిపారేయ్!" అన్నాడు పెట్రూ బియో. ఆమె అలాగే చేసింది బియాంకా, హార్టెన్సియో భార్య చూసి ఆశ్చర్యపోయారు "ఎంత వెర్రిబాగులదానవే నీవు ! ఇటువంటి తెలివితక్కువ ఆజ్ఞలను మనం పాటించి మగడికి దాసోహం చేయ కూడదు" అన్నారు ఆ యిద్దరు. "కేథరైన్ ! మగని ఆజ్ఞ ఆజ్ఞలను ఎలా పాటించాలో బుద్ధిలేని ఈ ఆడవారిద్దరికి చెప్పు" అన్నాడు పెట్రూబియో.

అందరకూ ఆశ్చర్యం కలిగేటట్టుగా కేతరైన్ ఆ యిద్దరి ఆడ వారికీ భార్యల ప్రవర్తన గురించి సౌమ్యంగా నచ్చచెప్పింది. ఆ వెంటనే పెట్రూచియో ఆమెను ముద్దుపెట్టుకొన్నాడు. "గయ్యాళిని మచ్చిక చేసుకొన్నా"డన్నారు ఆ యిద్దరి భర్తలు.

"కేతరైన్ మరియింక గయ్యాళికాదు. ప్రేమ, దయ నమ్రత గల భార్యగ ఉంటూ వచ్చింది. కేతరైన్ హాయిగా గర్వంతో తన భార్యతో జీవించాడు పెట్రూచియో.

# ది టేమింగ్ ఆఫ్ ది ష్రూ - విమర్శ

ఈ నాటకమునకు ఇండక్షన్ అనే పేరను ఉపోద్ఘాతముగా ఒక దృశ్యమున్నది. అది నాటకములోని కథావస్తువునకు సంబంధించి నది కాదు. ఈ నాటకము ఎవరికోసం ఎవరిముందు ప్రదర్శితమైనదో తెలియ చేయుటకు కల్పితమైన దృశ్యము. "ఎ మిడ్ సమర్స్ నైట్ డ్రీమ్"లో ఏథిన్ ప్రభువు థీసియస్ తనకు భార్యకాబోతూ ఉండిన హిపోలిటా వినోదార్థము బాటమ్ చేతను ఒక నాటకము ప్రదర్శింప చేసినట్లు ఒక ప్రభువు స్లై అనే పేరు గల ఒక చిల్లర పనివాని వినో దార్థము ప్రదర్శితమైన నాటకము ఈ స్లై ఒక పూటకూళ్ళ ఇంటి వద్ద తప్ప తాగి మొద్దు నిద్దురలో పడి ఉండగా ఒక ప్రభువు తన వినో దార్థము వాడిని నిద్రలో ఉండగానే తన భవనమునకు తెప్పించి ప్రభువులు పడుకొనే ప్రక్కపై పడుకొన బెట్టి వాడికి తెలివి వచ్చే వేళకు గాన వాద్యములు ప్రయోగింపజేసి ప్రభువులకు సేవచేసే విధము గానే సేవకులచేత సేవచేయించి తానొక ప్రభువు అయినట్లే ఆ స్లైకి తోచునట్లు చేసి తన యదార్థ స్థితియే ఒక స్వప్నమందు జరిగినట్లున్నూ ఈ కల్పిత జీవితమే తన యదార్థ జీవితమైనట్లును మంత్రశక్తికి

బడిన వానివలె చేసి అతని వినోదార్థము ఆడించిన నాటకమిది. నాటకములోని కథ ఎక్కువగా ప్రేక్షకులకు వినోదము కలిగించేది కనుక ఈ ఇండక్షన్ దృశ్యము కూడా ఎక్కువగా వినోదము కలిగించేదిగానే రచితమయినది.

కథా సంగ్రహములో నాటకమందలి మొదటి దృశ్యములోని కథా భాగము పాఠకులకు విసుగు పుట్టించ వచ్చునని విడిచి పెట్టినాను. అందులో బాప్టిస్టా రెండవ కూతురైన బియాంకా హోర్టెన్సియోని పెండ్లియాడు తుందని పాఠకులు అనుకొనే రీతిగా చెప్పి చివర భాగములో ఆమె పీజా నగరమందలి ప్రభువునైన విన్సెంటియో కుమారుడైన లూసెంటియోను వివాహమాడినట్లున్ను, బియాంకాను పెండ్లియాడునని పాఠకులకు తోపింపజేసిన హోర్టెన్సియో ఒక విధవను పెండ్లియాడెననిన్ని చెప్పినాను. ఈ మార్పులు జరగడానికి తగిన కారణము కథలో లేకపోలేదు. ఈ అంశములు కథా సంగ్రహములో చెప్పుటవలన కథా సంగ్రహము చదివే వారికి ప్రధాన కథా భాగము చిక్కగా ఉండవచ్చునని అక్కడ చెప్పలేదు.

బియాంకాను పెండ్లి చేసుకొందామని ఇద్దరు యత్నించారు. వారు పరస్పర మిత్రులే, వారిలో లూసెంటియోను బియాంకా ఎక్కువగా ప్రేమించినది. అతనికి కూడా ఆమెను పెండ్లియాడవలెనన్న కోరిక ఎక్కువగానే ఉండెను. కాని అతనికి ఒక విచారము చిక్కుగా తోచినది. బాప్టిస్టా తన పెద్ద కూతురి వివాహమైతేనే కాని చిన్న కూతురి వివాహము చేయుననాడు. ఆ పెద్ద కూతురు గయ్యాళి కనుక ఆమెను పెండ్లియాడేవాడు కనబడే వరకున్ను బియాంకా వివాహ ప్రసక్తి ఉండదు. కనుక ఆ లూసెంటియోకు ఏమి చేయుటకును తోచ లేదు.

రెండవ అంకములోని మొదటిదృశ్యము కేతరైన్ బియాంకాల ప్రసంగముతో ప్రారంభమయినది. గయ్యాళియైన కేతరైన్ తనను పెండ్లిగూడుటకు సమ్మతించిన వాడు కనబడలేదనిన్ని తన చెల్లెలైన బియాంకాను పెండ్లియాడుటకు ఉబలాటము పడుచూ పలువురున్నా

రన్నిన్ని లోలోపల అసూయను పెంచుతూ చెల్లెలు ఎవరెవరిని పెండ్లి చేసుకొనదలచెనో తెలిసికొనగోరి ఒత్తిడి సలిపినది. ఆమె తన కెవ్వరూ నచ్చలేదన్నది. హార్టెన్సియోను ప్రేమిస్తూ ఉన్నావు లేదా! అన్నది గయ్యాళి. అబద్ధమాడుతున్నావని ఆ గయ్యాళి అక్క ఆమెను కొట్టినది. బియాంకా ఏడుస్తూ లోపలికిపోయినది. నిష్కారణంగా చెల్లెలిని ఎందుకు కొట్టినావని బాప్టిస్టా కోపంతో అడిగినప్పుడు "నీకు చిన్న కూతురంటే ఇష్టము నేనంటే ఇష్టములేదు" అని అలిగి ఏడుస్తూ ఆ గయ్యాళి లోపలికిపోయినది. బాప్టిస్టాకు విచారము పట్టుకొన్నది. నాకు ఆస్తి ఎక్కువగా ఉన్నా నా గృహమున సౌఖ్యము లేనిదయినది. భార్య పోయినది పుత్ర సంతానం లేదు. ఈ గయ్యాళికింపకు వరుడు కనబడడము లేదు. ఆమెకు పెండ్లి కానిదే చిన్నపిల్లకు పెండ్లి చేయనంటే ఆమెను కోరినవారిలో ఎవరయినా తమ కోరిక నెరవేర్చుకొనుటకు పెద్దపిల్లకు తగిన వరుని వెదికి తోడ్కొని వస్తారేమో అని ఈ ప్రతిన పూనినాను. ఇప్పటికి నాకేమీ మార్గము కనబడలేదు. అని అతడు చింతిస్తూ వున్న సమయంలో వచ్చారు మార్గం చూపించేవారు. గ్రేమియో లూసెంటియోలు, పెట్రుబియో, హార్టెన్సియోలు, ట్రానియో బియోండెల్‌లోలు ఈ ఆరుగురున్ను మూడు జతలుగా వచ్చారు.

వీరిలో లూసెంటియో నౌకరు దుస్తులతోను, హార్టెన్సియో లిసియో అనే పేరను గాయకుడుగాను, ట్రానియో లూసెంటియో వేషములోను, బియోన్‌డెలో లూసెంటియో అనుచరుడుగా లూట్ పుస్తకాలు పట్టుకొనిన్ని వచ్చారు. పెట్రూబియో కేథరైన్ను పెండ్లియాడుటకు సమ్మతించి వచ్చానన్నాడు. గ్రెమియో బాప్టిస్టా పొరుగున నున్నవాడు గనుక బాప్టిస్టాకు పరిచితుడు ఇతడు నౌకరు దుస్తులతో ఉన్న లూసెంటియోను చూపించి ఇతడు తను సేవకుడుగా పని చేయుటకు వచ్చాడు. ఇతని పేరు కాంబియో ఇతనిని తమ సేవకునిగా పెట్టుకోండన్నాడు. అందుకు బాప్టిస్టా సమ్మతించాడు. ట్రానియో తాను లూసెంటియో అనిన్ని తండ్రి పేరు విన్‌సెంటియో అనిన్ని తన ఊరు 'పీసా' అనిన్ని తెలియజేసినాడు. బాప్టిస్టా పెట్రూబియోతో "నీ

తండ్రిని నే ఎరుగుదును. మీరు చాలా ధనవంతులు పాపం మీ తండ్రి చనిపోయినందుకు నీతో పాటు నేను దుఃఖిస్తున్నాను నీ వివరో ఇప్పుడు తెలిసింది గనుక చెప్పున్నాను. నా పెద్దకూతురు గయ్యాళి గంప నీకు ఆమె తగిన పెండ్లాము కాజాలదు. నీవంటివాడు అల్లుడయ్యినందుకు నాకు సంతోషమే కాని నీ గౌరవానికి హాని కలిగిస్తుందేమో అని భయపడుతున్నా"నన్నాడు. "మీకా భయము అక్కరలేదు. నేనామెను సాధువుగా చేసికోగలను" అన్నాడు. అందుకు సంతోషముతో సరేనన్నాడు. పెట్రూబియో సిఫారసును మన్నించి లిసియో అనే పేరనున్న హార్టెన్సియోను సంగీత గురువుగాను, లూసెంటియో వేషములోనున్న ట్రానియోను లాటిన్ సాహిత్యం చెప్పే గురువుగాను, కాంబియో అనే పేరను సేవకుని వేషములో ఉన్న లూసెంటియోను నౌకరుగాను బాప్టిస్టా నియమించినాడు. ఇంతకు ముందుగానే హార్టెన్సియో ట్రానియోలను లోనికి పంపించడమున్నూ వారు బాప్టిస్టా కూతుళ్ళకు పాఠాలు చెప్పుటకు మొదలు పెట్టడమున్నూ జరిగినది. బాప్టిస్టా, పెట్రూబియోలు మాటలాడుతూ ఉండగానే హార్టెన్సియో తల చేతితో నొక్కుకుంటూవచ్చి "ల్యూట్‌కుగల ఫ్రెట్లు తప్పుగా నొక్కుతున్నావని అన్నందుకు కోపం తెచ్చుకొని కేథరైన్ ఆ ల్యూట్‌తో నా తల పగలకొట్టింది." అన్నాడు అందుకు బాప్టిస్టా విచారించాడు. పెట్రూబియో నవ్వి "నీ కూతురు దిట్టమయినదే. మోటుగా అయితే నేమి హాస్యము ఆడగలదన్న మాట నా కటువంటి పెండ్లామంటే ఇష్టమే" అన్నాడు పెట్రూబియో. "నేను కేటును ఇక్కడికి పంపనా లేక మీరు ఇద్దరూ ఒకరి నొకరు చూచుకొని సంభాషించు కోవడం మంచిది" అన్నాడు బాప్టిస్టా. "ఆమె నిక్కడికే పంపండి" అని పెట్రూబియో చెప్పినాడు. సరే అని "హార్టెన్సియో! నీవు ల్యూట్ వాద్యము బిగించకు చెప్పు రా లోపలికి సమాధాన పరుస్తాను" ఆ యిద్దరున్నూ లోనికి వెళ్ళారు. కేథరైను పెట్రూబియోను కలుసుకోడానికి బయటకు వచ్చింది.

ఆ తర్వాత వీరి కథ. కథా సంగ్రహములో తెలియజేయడ మయినది. కనుక బియాంకా లూసెంటియోను పెండ్లియాడిన కథ : మొట్టమొదట గ్రేమియో, లూసెంటియో వేషములో నున్న ట్రానియోలు బియాంకా విషయములో పోటీపడి బాప్టిస్టా వద్ద తమ తమ ఆస్తులవిషయము తెలియబరచుకొన్నారు. వీరిద్దరూ ధనవంతులయినా గ్రేమియో వయసు మీరినవాడు కనుక బాప్టిస్టా లూసెంటియో వేషములో నున్న ట్రానియో వైపే మొగ్గు చూపించినాడు. అతడు లూసెంటియో అన్న భ్రమతో ఇంట్లో బియాంకా మొట్ట మొదట పోటీపడిన ట్రానియో (అనగా లూసెంటియో) లిసియో (అనగా హార్టెన్సియో) లలో లిసియో వైపే మొగ్గు చూపించినది. కాని తనకు కాంబియోను వలచింది. అనగా వాస్తవంగా లూసెంటియోను అతడు లూసెంటియో అన్నమాట. అనగా పేరునుబట్టి కండ్రిన్ని ఆకారము వలపు చేష్టలు బట్టి బియాంకాయున్న లూసెంటియోనే ఎన్నుకోపడం జరిగింది. ఈ విధంగా లూసెంటియో బియాంకాలకు పెండ్లి కానున్నదనుట సంభవించినది. గ్రేమియో, హార్టెన్సియోలకు ఆశాభంగంకలిగినది. లూసెంటియోకు జయము కలిగినది. కాని హార్టెన్సియోకు ఉపకారము లేకపోయినది. ఒక విధవ అతనిని ప్రేమించినది. ఆమెను వివాహమాడినాడు. బియాంకా లూసెంటియోల వివాహము జరిగినట్లు కథలో చెప్పబడినదిగదా ?

ఇక ఈ నాటకములో విశేషములు కొన్ని వివరిస్తాను. ఇండక్షన లోను పెట్రూషియో గయ్యాళిని సాధువుగా మార్చుటలోను మన శ్శాస్త్ర విషయములు షేక్స్పియరు తెలిసుకొనుట ఆశ్చర్యకరము ఆనాటికి మనశ్శాస్త్రము ఉదయించలేదు. మంత్రముల ప్రభావము మాత్రము ఆంగ్లేయులు ఆనాటికి నమ్ముతూ ఉండేవారు. ఆదివాసులకు ప్రాచీన తమ కాలము నుండిన్ని నమ్మకముగల విషయము.

ఇటీవల 'సైకో' తెరపి వృద్ధిలోనికి వచ్చినది. వీరిటీవల చెప్పిన విధానమే షేక్స్పియరు ఆనాడు తన నాటకమందలి పాత్రల ద్వారా ప్రదర్శించుట గొప్ప విషయము; మెచ్చుకోదగినది.

* * *

8)

# ఎ మిడ్ సమ్మర్ నైట్ డ్రీమ్

ఇది శృంగార హాస్యరసములు గల కామెడీ. 1594 లో రోమియో అండ్ జూలియట్ రచితమయిన తర్వాత అచిర కాలము లోనే రచితమయినది. రెండు కథలున్నూ రాత్రిపూట చీకటిలోనే నడచినవి. కాని అది విషాదాంతమయినది. ఇది ఆనంద ప్రదమయిన వెలుగులో సుఖప్రదముగా రంజిల్లినది.

కథా సంగ్రహము:-

ఏథెన్జ్ ప్రభువు థీసియస్ అనునతడు ఏమజాన్జ్‌ను యుద్ధములో జయించి వారి రాణియైన హిపోలిటా మనోహర ప్రేమణములకు ముగ్ధుడై నిర్జితుడయినాడు. ఆమెను పెండ్లియాడుటకు ప్రతిజ్ఞ చేసి వివాహ ముహూర్తము పెట్టించుకొన్నాడు. రెండు దినములు గడచిన నాటి రాత్రి వివాహ మహోత్సవము జరిపించుకొనుటకు నిశ్చయమయి నది. అంతవరకును ఆగవలసిన కాలము తనకుగాని రాణికి గాని విసుగు పుట్టింపకుండా ఉండవలెనన్న ఉద్దేశముతో నాటక ప్రదర్శనములు గావించి వినోదములతో ఆ ప్రభువు తానున్న అడవియందే కాల యాపనము చేయుటకు తలపెట్టినాడు. అతని ఆజ్ఞ మన్నించి సాలెవృత్తి సాగించుకొంటూ ఉండిన బాటమ్ ఇతర వృత్తులు సాగించుకొంటూ ఉండిన మరి కొందరితో కలిసి ఒక నాటకము రచించి ప్రదర్శించుటకు పూనుకొన్నాడు.

ఆ సమయమందే ఈజియస్ అనునొక ఎథీనియన్ తన కూతు రైన హెర్మియాను ఆమెను వరిస్తూ ఉండిన ఇద్దరిని థీసియస్ వద్దకు తోడ్కొనివచ్చి హెర్మియా ఆ ఇద్దరిలోను డెమిట్రియస్‌ను పెండ్లి యాడ వలసినదిగా ఆజ్ఞాపింపుడని ప్రార్థించెను. తాను లైసాండరును ప్రేమించి పెండ్లియాడ దలచినట్లు హెర్మియా నివేదించి అందుకు సమ్మతింపుడని వేడుకొన్నది. అందుకు థీసియస్ సమ్మతింపక ఆమె

తండ్రి చెప్పినట్లు డెమిట్రియసునే పెండ్లియాడవలెననిన్ని అట్లుచేయని యెడల [illegible] [illegible]గాని ఆమె [illegible]ంతరము దేవాలయము[illegible] దేవదాసిగా [illegible] [illegible]గాని ఒప్పు [illegible]వలసిన్ని తీర్పు చెప్పినాడు. హెర్మియా లైసాండరులు అంత [illegible]మయిన తీర్పునకు విలపించి రహస్యముగా ఆ [illegible]డవికి చేరువగా నున్న మరియొక చిన్న [illegible]డవికి పోయి అక్కడ పెండ్లి జరిపించుకొని మారేరముగా ఎవరికీ తెలియకుండ స్థలమునకు లేచిపోవుటకు తగిన సన్నాహములు గావించుకొన్నారు. తమయొన్ను గడలు హెర్మియా తన చెలికత్తెయయిన హెలీనాకు తెలియజేసినది. ఆ హెలీనా డెమిట్రియసును ప్రేమించి అతని అంగీకారము పొందక ఖిన్నురాలయి ఉండినది కనుక తగిన సమయము దొరికినదని సంతోషించి ఆ డెమిట్రియసు వద్దకుపోయి హెర్మియా లైసాండరుల లేచిపోవు సన్నాహములు తెలియజేసినది

ఆ సమయముండే ఆ అడవిలోనే ఉండిన విద్యాధరుల రాజైన ఓబరానునకు రాణియైన టిటేనియాకు ప్రణయ కలహము పుట్టినది. అప్పుడు ఓబరాన్ తన కనుసన్నగాడైన పక్ అనే హాస్యమూర్తిని పిలిచి నీ వొక కామింప ఔషధి రసము తెచ్చి టిటేనియా నిద్రలో నుండగా మూసికొని యుండే కనురెప్పలపై కొద్దికొద్దిగా పిండవలెను. ఆ రస ప్రభావము వలన ఆమె నిద్రనుండి మేల్కొని చూచు నప్పుడు మొట్ట మొదట ఎవరు కనబడుతారో వారిని ఆమె ప్రేమించేటట్టు చేయ గలదిగా ఉండవలెను అని ఆజ్ఞాపించినాడు. ఆ సమయముండే డెమిట్రియస్ హెర్మియాను కలిసికొనవలెనన్న ప్రయత్నములో తిరుగుచూ ఉండగా అతనికి హెలీనా కనబడినది.

ఆ [illegible] [illegible] ప్రేమను పొందుటకు చేసిన ప్రయత్నము విఫలము కాగా ఒక చోట కూర్చుండి విలపించు చుండెను. ఆ సమయముండే ఓబరాన్ ఆమెను చూచి ఆమె దుఃఖమునకు గల కారణము తెలిసికొని "పక్కు"ని పిలచి ఆ ఓషధి రసము కొద్దిగా నీవు తీసికొనిపోయి నిద్రలో నున్న డెమిట్రియస్ కను రెప్పలపై చిలుకుము దాని వలన హెలీనాకు మేలు కలుగ వలయును. నేనా రసము కొద్దిగా తీసికొనిపోయి స్వయముగా నేనే నాటటేనియా కనురెప్పలపై చిలుకుదును, అని

చెప్పినాడు. ఆ సమయానికే హెర్మియా లెసాండరులు ఆ అడవికే వచ్చి ఒకచోట నిద్రించినారు. వారిలోని లైసాండరును పక్ చూచి అతడు డెమిట్రియాస్సే కాబోలునని భ్రమపడి అతని కనురెప్పలకి రసము తగిలించినాడు. అందువలన ఆ లైసాండరు నిద్రనుండి మేల్కొని చూచేసరికి ఖిన్నురాలై అక్కడ తిరుగు చుండిన హెలీనా అతనికి మొట్టమొదట కనబడినది. ఆ రస ప్రభావము వలన అతడు హెలీనాను కామించినాడు. హెర్మియాను విడిచి పెట్టినాడు.

ఆ సమయమునందు ఆ యడవిలో అక్కడనే బాటమ్ తాను తయారు చేసిన నాటక ప్రదర్శనమునకు కావలసిన ఒద్దికలు జరిపిస్తూన్నాడు. పక్ అక్కడికిపోయి తానుకూడా ఆ ఒద్దికలలో పాల్గొన గోరినట్లు నటించి బాటమ్ తలకు ఒక గాడిద తలకాయ వంటి టోపీ తగిలించి టిటేనియా నిద్రిస్తూ ఉండిన స్థలమునకు తోడ్కొనిపోయి ఆమె నిద్రనుండి మేల్కొన్న వెంటనే ఆమె కతడు కనబడునట్లుగా కూర్చుండ బెట్టినాడు. ఆ ఒద్దికలలో పాల్గొంటూ ఉండిన నటులు ఈ వింత చూచి భయపడిపారిపోయి నారేకాని పక్కనెదరించ లేదు.

ఈలోగా ఓబిరాన్ నిద్రలో నుండిన డెమిట్రియస్ వద్దకు పోయి చూడగా పక్ చేసిన పొరపాటు తెలిసినది. అప్పుడతడే ఆ డెమిట్రియస్ కనురెప్పలకు ఆ రసము తగిలించినాడు. అతడు మేల్కొని చూచేసరికి హెలీనా మొట్టమొదట కనబడినది. ఆమె నప్పుడు ప్రేమిస్తూ సరససల్లాపములాడుతూ ఉండిన లైసాండరు కూడా కనబడినాడు. తానప్పుడు ప్రేమించిన హెలీనాను కామిస్తూ ఉండిన లైసాండరుతో డెమిట్రియసు యుద్ధమునకు డీకొన్నాడు. వారి చేష్టలు చూడగా తనను వెక్కిరించబోతున్నట్లు హెలీనాకు తోచినది. హెర్మియాకు మతిపోయినట్లయినది. అప్పుడక్కడుండిన విద్యాధరులు డెమిట్రియస్, లైసాండరుల కలహము నివారించి ఆ అడవిలో కొంత సేపు తిరిగేటట్టు ప్రోత్సహించినారు. వారు తిరిగి తిరిగి అలసి నిద్రపోయి నారు. అప్పుడు పక్ తన తప్పును సరిదిద్దుకొని కామసీ జౌషధరసము మరల లైసాండరు కనురెప్పలకు పూసినాడు. అతడు నిద్రనుండి

మేల్కొని హెర్మియాను చూచి ఆమె యెడల తన కుండిన ప్రేమను మరల తెచ్చుకొన్నాడు.

గాడిద తల గల టోపీని దాల్చిన బాటమ్ కనబడుటవలన కామినీ ఔషధిరస ప్రభావ ఫలితముగా తన టిటేనియా బాటమును ప్రేమిస్తూ ఉండుట చూచి ఓబరాన్ ఆమె కనురెప్పల కంటి యుండిన రసమును తుడిచివేసి నంతనే ఆమె కా ప్రేమ మత్తు తొలగిపోయినది. తన తలకు తగిలించిన గాడిద తలటోపీ తీసి వేయగానే బాటమ్ తన స్వరూపమును పొంది తన నటులను కలిసికొని ఆడబోయే నాటకమునకు ఒద్దికలు సాగించినాడు. ఏథిన్స్ ప్రభువు తీసియస్ ఆ మరునాటి ఉదయము మృగయా వినోదము కావించిన పిమ్మట ఆ ముగ్గురు దంపతుల విచిత్ర కథ ఎట్లు పొరపాట్లతో నడచినదో హెర్మియా లైసాండరులకు తన ఆజ్ఞ ఎట్లు బాధించినదో తెలిసికొని తన ఆజ్ఞ రద్దుచేసి హెర్మియా, లైసాండరును, డెమిట్రియస్, హెలీనాను వివాహమాడుట తనకు సమ్మతమైనదని ప్రకటించినాడు.

టిటేనియా తీసియస్‌ల వివాహముతో పాటు, హెలీనా డెమెట్రియసుల వివాహమున్ను, హెర్మియా లైసాండరుల వివాహమున్ను ఈ మూడు వివాహములును కోగడ పెట్టుకొన్న ముహూర్తమునకే ఆనందదాయకముగా ఆనాటి రాత్రి జరిగినవి. బాటమ్ సిద్ధపరచిన నాటక ప్రదర్శనముకూడా తక్కిన వినోదములతో పాటు సాగినది. ఆ నాటకము పేరు "పిరమస్ అండ్ థిజ్ బి" ఇది యొక ప్రేమగాథ విషాదాంతమయినది. థిజ్ బి బాబిలోనియా దేశకన్య ఆమెను పిరమస్ ప్రేమించినాడు. అతనిని ఆమె కూడా ప్రేమించినది. ఒక నాడు ఆమె నెత్తురుమరకలతో పడియుండగా పిరమస్ చూసి సింహము ఆమెనుచంపెనన్న భ్రమతో కత్తితో పొడుచుకొని ఆత్మహత్య గావించుకొన్నాడు. కొంతసేపటికి ఆమెకు తెలివివచ్చి చూచినది పిరమస్ చనిపోయి వుండుటచూచి అతనికి తనయెడల ఎంత ప్రేమ యున్నదో గ్రహించి కత్తితో పొడుచుకొని ఆత్మహత్య గావించుకొన్నది. నాటక ప్రదర్శనమైనతరువాత విద్యార్థుల నృత్య వినోదముచూచి ఉత్సవము ముగించినారు.

* *

# ఎ మిడ్ సమ్మర్ నైట్ డ్రీమ్ - విమర్శ

ఇదియొక వినోదార్థము కల్పితమైన కథావస్తువు గల కామెడీ. విచిత్ర సన్నివేశములు గలది. ఏథెన్సు నగరమునకు సమీపమునందున్న అడవిలో రాత్రి సమయమందు జరిగిన ముచ్చటలు గలది. ఇందున్న పాత్రలన్నీ సంతోషానికి సుఖానికి అలవాటు పడ్డవే కాని దుఃఖానికి కష్టానికి ఓర్చుకోగలవి కావు. కష్టము కలిగినా అది అనతికాలములోనే తొలగిపోయేది. అంతర్నాటకము పిరమస్, తిజ్బీలకు సంబంధించినది. విషాదాంత నాటకమే అయినా ప్రేక్షకులకు అయ్యో! పాపము! అనిపించినదే కాని అట్టే కాలము దుఃఖము కలిగింపలేదు. అయినా మన సంప్రదాయమును అనుసరించియే ఈ విషాదాంత నాటకము పెండ్లి సమయమున వినోదములతో పాటు రాత్రి పండ్రెండు గంటలప్పుడు పడుకొనే ముందర ఆడించినారేమి? అనిపించక మానదు. విద్యాధరులతో మిశ్రితమయిన ఈ నాటకము అద్భుత శక్తులు ప్రదర్శించినది. వినోదములకున్నూ హాస్యమునకున్నూ అవకాశము ఎక్కువగా కలుగజేసినవాడు పక్. కామినీ ఓషధిరసము డెమిట్రియస్ కనురెప్పలకు అంటించుటకు మారుగా లైసాండరు కనురెప్పలకు తగిలించుటచేత హాస్యరసమునకు పుష్టి యెక్కువయినది. బాటమ్ తలకు గాడిదతల టోపీగా తగిలించుట కూడా హాస్యరసమును ఎక్కువగా పోషించినది. తాను చేసిన పాటుకు సమాధానముగా పక్ ప్రభువు ముందర నివేదించుకొన్నదికూడా హాస్యరసమునకు పోషకముగానే కనబడినది. అంతర్నాటకములో రసపుష్టి తక్కువ చప్పగా ఉండును గనుక తానా లోపమును పూరింపదలచినట్లు చెప్పుకొన్నాడు. ఆ నాటక ప్రదర్శనమునకు నాయకుడయిన బాటమ్ తెలివితక్కువ దద్దమ్మ అని సూచించుటకు అతని తలకు గాడిద తలటోపీ తగిలించినట్లు కనబడుచున్నది.

ఈ నాటకములో కవితా శిల్పము ఎక్కువగా కలదు పద్యభాగము కూడా ఇందు ఎక్కువగానే ఉన్నది. షేక్స్పియరు రచనలు తక్కినవన్నీ అంతరించిపోయినా ఈ నాటకమందు గల కవితను బట్టి

షేక్స్పియరు దొడ్డ కవియని భావింపగలమని ఒక విమర్శకుడు పలికిన మాటలు ముమ్మాటికి సత్యములే అనవచ్చును.

ఈ నాటకములో పేర్కొన్న చంద్రుడు, నీరు, పువ్వులు, ఓషధులు మొదలయినవి మనకు పరిచితములయిన వస్తువుల పేళ్ళేకాని వాస్తవముగా షేక్స్పియరు ఉద్దేశించినవి వేరే వస్తువులు. చంద్రుడు చల్లని నీళ్ళ మునిగి తేలుతూ ఉన్నవాడు. పువ్వులు నీళ్ళలో పుట్టినవి. ఓషధులు దివ్యమయిన ఓషధి శక్తి గలవి. కామిని ఓషధి రసము కండ్ల కంటించినప్పుడు కథలో చెప్పిన శక్తి కలుగడానికి అదే కారణముగా అన్వయించుకోవలెను. ఈ నాటకములో చాలా పాత్రలనోట నుండే చంద్రుని ప్రసక్తి వింటాము. ఆ చంద్రుడు మనకు పరిచితమైన చంద్రుడు కాడు. ఇది సాధారణ పాఠకునికి వింత కలిగింపదు. కాస్త వాస్తవికత తెలుసుకొంటూ చదివే విమర్శకునకు ఏమిటీ కల్పన అనిపిస్తుంది. అందుకు సమాధానమేమి చెప్పగలమంటే ఆ అరణ్య ప్రదేశములో మానవులతో విద్యాధరులూ ఉన్నారు. ఈ రెండు తెగలవారున్నూ ఒకరి నొకరు చాలా కాలమయి కలిసి మెలసి తిరుగుతున్నవారుగానే నాటకములో చిత్రితమయినది. అందువలన ఒక Fairy tale కు సంబంధించిన నాటకముగా సమన్వయము చేసికొని ఆనందిస్తాము అని చెప్తాము. మొత్తానికి ఇదిఒక వినోదార్థముగా రచితమయినదిగా అర్థము చేసికొని ఆనందిస్తాము. ఏదైనా ఇందలి సన్నివేశములు చర్యలు సంభాషణలు అన్నీ కల్పించుటలో వాస్తవికత గోచరిస్తూ ఉన్నట్లు రచించడంలో షేక్స్పియరు కావ్యకళ, శిల్పము చక్కగా ప్రదర్శించినాడని చెప్పక తప్పదు.

* * *

# మర్చంట్ ఆఫ్ వెనిస్

ఇటలీ దేశంలోని వెనిస్ నగరంలో ఏంటానియో అనే ఒక ఓడ వర్తకుడు పరదేశాలతో వ్యాపారంచేస్తూ ఉండేవాడు. అతడు చాలా ఉదారుడు.

బెసానియో అనే ఒక సైనికుడు ఏంటానియోకు ఆప్తమిత్రుడు. అతడు బెల్‌మాంట్‌లోని ఒకధనవంతురాలైన యువతిని ప్రేమించాడు. అతడు బీదవాడు కావడం వలన తనను పెండ్లి చేసికొమ్మనమని ఆమెను సూటిగా అడగలేకపోయాడు. కాని ఒకసారి వెళ్ళి ఆమె తనను ప్రేమిస్తున్నదో లేదో అడిగి తెలిసికోవాలనుకున్నాడు. అందుకని కొంత సొమ్ము అప్పుగా ఇమ్మని ఏంటానియోని అతడు అడగినాడు. కాని ఆ సమయానికి ఏంటానియోవద్ద సొమ్ములేదు విదేశాల నుండి తన ఓడలు తిరిగివస్తేకాని అతనికి డబ్బురాదు. అందుకని అప్పు యిచ్చే వారి ఎవరినుండైనా కావలసిన సొమ్ము తన పేరిట తీసికొనమని ఏంటానియో అతనితో చెప్పాడు. తన ఓడలు రెండు నెలలలోగా తిరిగిరాగలవు గనుక ఆ అప్పు వేగమే తీర్చేస్తానని చెప్పాడు.

ఆ రోజుల్లో వెనిస్ పట్నంలో వడ్డీ వ్యాపారం చేసే వారంతా యూదులు, వారిలో షైలాక్ అనే వాడు ప్రముఖుడు. అతడు అత్యాశా పరుడు, నీచుడు, ఇతడంటే ఏంటానియోకు అసహ్యం. అనేక సార్లు అతనితో ఏంటానియో కఠినంగా మాట్లాడి తూలనాడినాడు. అందువల్ల ఏంటానియో మీద ఏనాటికైనా పగ తీర్చుకోవాలని సమయం కోసం ఎదురు చూస్తున్నాడు షైలాక్.

బెసానియో అతని వద్దకే అప్పు కోసం వెళ్ళవలసి వచ్చినది. తన శత్రువైన ఏంటానియో తన చేత చిక్కుతున్నందుకు లోలోన సంతోషించి షైలాక్ పైకి ఉదారంగా మాట్లాడేడు. అప్పుపైని వడ్డీ యివ్వనవసరం లేదన్నాడు. కాని ఏంటానియో ౩ నెలలలోగా అప్పు తీర్చలేకపోయిన పక్షాన ఏంటానియో శరీరం నుండి ఒక పౌను మాంసం

కోసి తీసి కొనేటందుకు తనకు హామీ వ్రాసి ఇవ్వాలని తను "హాశ" కోరినట్లు కోరాడు. ఈ విషమ కోరిక హాస్యాస్పదమైన [illegible] కాదని బెసానియో భావించి అంగీకరించవద్దని [illegible]. కాని ఆంటోనియో ఆ కోరికను హాస్యంగా తీసికొని రెండు నెలలలోగా అప్పును తిర్చివేయగలననే ధైర్యం కూడా ఉండడంవల్ల అంగీకరించాడు. అయిష్టంగానే బెసానియో ఆ సొమ్మును తీసికొని గ్రాషియానో అనే మరియొక స్నేహితుణ్ణి వెంటబెట్టుకొని తాను ప్రేమించిన పోర్షియాను చూడ్డానికి బెల్మాంట్ ప్రయాణమయ్యాడు

ఆ అందాల రాణి ఒక పెద్ద భవనంలో తన చెలికత్తె నెరిసాతో కూడా వుంటున్నది. ఆమెకు ఎంతో ధనం విడిచి కొద్దికాలం క్రిందటనే ఆమె తండ్రి చనిపోయాడు. తన తదనంతరం తన కూతుర్ని ఎవరైన పెండ్లాడతానని చెప్పి మోసం చేయవచ్చునని ఆయన అనుకొన్నాడు. తగిన వాడు తన కూతురుకు భర్తగా లభించాలని ఒక ఉపాయమాలోచించాడు. మూడు పేటికలను ఏర్పాటు చేశాడు. ఒక దానిలో పోర్షియా చిత్రపటాన్ని వుంచాడు. అది వున్న పేటికను ఎవరు ఎన్నుకొంటే అతడే ఆమెకు భర్త కాగలడని నిర్ణయించాడు.

బెసానియో కన్నా ముందుగా ఆఫ్రికా దేశంనుండి మొరాకో రాకుమారుడు పోర్షియాను పెండ్లాడాలని వచ్చాడు. అతనంటే పోర్షియాకు ఇష్టతలేదు కాని తన యిష్టానిష్టాలతో నిమిత్తం లేదు. ఎవరు ఆ మూడు పెట్టెలలో ఆమె పటమున్న పెట్టెను ఎన్నుకొంటాడో అతడే ఆమె భర్త కావలెనని ఆమె తండ్రి నిరయం. ఆమెకు బెసానియోని పెండ్లాడాలనే ఉంది. అందుకని ఆ మొరాకో రాకుమారుడు సరైన పెట్టెను ఎన్నుకో కూడదని కోరుకొన్నది. తన ఆందోళనము తన చెలికత్తెకు వ్యక్తం చేసింది.

నీకు తగిన భర్త దొరికేటట్టు నీ తండ్రి ఈ పెట్టెలను ఏర్పాటు చేసి వుంటాడు. బెసానియో నీకు తగిన వాడైతే అతడు తప్పకుండా సరియైన పెట్టెను ఎన్నుకొంటాడు. నీ కోరిక నెరవేరుతుంది కనుక భయపడవద్దని ఊరడించింది చెలికత్తె.

9)

మొరాకో మూడు పెట్టెలను చూశాడు. బంగారు పెట్టెపైని "నన్ను ఎన్నుకొన్నవారికి చాలమంది అభిలషించేది లభ్యమవుతుంది." అని ఉంది. వెండిపెట్టెపైని "నన్ను ఎన్నుకొన్న వారు పొందవలసినది పొందుతారు" అని ఉంది. సాధారణంగా కనపడే సీసం పెట్టెపైని "నన్ను ఎన్నుకొన్నవారు తమకున్నదంతా త్యాగం చేసి సాహసించవలసి ఉంటుంది" అని ఉంది. "అందరూ అభిలషించేది ఏది? అది ఈ అందమైన పోర్షియా! కనుక ఈమె చిత్రం ఈ పెట్టెలోనే ఉండి తీరాలని" అని అనుకొంటూ మొరాకో బంగారపు పెట్టెను తెరచి చూశాడు. అతనికి ఒక పుర్రె కనబడింది. దాని ప్రక్కనే ఒక కాగితం పైని "మెరసేదంతా బంగారం కాదు సెలవు" అని ఉంది. మొరాకో చేసేదేంలేక పోర్షియా వద్ద సెలవు తీసికొని ఆఫ్రికా వెళ్ళిపోయాడు. తరువాత ఏరగాన్ రాకుమారుడు వచ్చి మూడు పెట్టెలూ చూశాడు" నేను పొందవలసినది పోర్షియా కనుక వెండి పెట్టెను తెరచి ఆమెను పొందుతాను" అని అనుకొంటూ వెండి పెట్టెను తెరచాడు. అందులో ఒక శుంఠ తల ఉంది: దాని ప్రక్కనే ఒక కాగితం "పైని వెండి తెర వెనుక చాలామంది శుంఠలు మరుగు పడిఉన్నారు కనుక వెళ్ళండి" అని ఉంది. మొరాకో వలెనే ఇతడుకూడా తల దించుకొని వెళ్ళి పోయాడు.

బెసానియో తన స్నేహితుడు గ్రేటానియోతో కూడా పోర్షియా వద్దకువచ్చి తన అదృష్టం ఎలా వుందో ప్రయత్నించడానికి అనుమతించమన్నాడు. అతడు కూడా సరైన పెట్టెను ఎంచుకొనలేడేమోనని పోర్షియా భయపడింది. ఆమె అతన్ని ప్రేమించినా ఏపెట్టెను ఎన్నుకొనాలో తనకు తెలిసికూడా చెప్పడానికి వీలులేదు. బెంగతో పోర్షియా నిరీక్షిస్తూ కూర్చుంది. బెసానియో మూడు పెట్టెలను చూశాడు. "పైకి అందంగా కనబడేవి లోపల అసహ్యంగా ఉంటాయి గనుక సాధారణమైన ఈ సీసపు పెట్టెనే ఎన్నుకొంటాను" అని నిర్ణయించుకొని ఆ పెట్టెను తెరచి చూశాడు. అతని అదృష్టం కొద్దీ అందులో అందమైన ఆ అమ్మాయి పటం కనబడింది. అతని ఆనందానికి అంతులేదు. అతడు ఆ పెట్టెను తెరుస్తూ ఉంటేనే పోర్షియా మనస్సు

ఆనందమయమయింది. వెంటనే వారిద్దరూ వివాహం చేసికోవాలని నిర్ణయించుకొన్నారు. ఆ ఆనందసమయంలోనే చెలికత్తె నెరిసాను పెండ్లి చేసికోవడానికి అనుమతించమని గ్రేటానియో పోర్షియాను కోరాడు. కాని అంతలో వారి ఆనందానికి అంతరాయం కలిగింది. వెనిస్ నుండి బెసానియో స్నేహితుడు లూరొంజో, అతని భార్యఅంటే షైలాక్ కూతురు జెసీకా ఒక దుర్వార్తను తీసికొని వచ్చారు.

షైలాక్ తన కూతురు జెసీకా పట్ల ఎప్పుడూ కఠినంగానే ఉన్నాడు. యూదుల జాతికి చెందని లొరెంజోను ఆమె వివాహం చేసికొంటానంటే అతడు సమ్మతించలేదు. లొరెంజో అన్యకులస్థుడు మాత్రమే కాదు ఏంటానియోకి స్నేహితుడు కూడాను. అందువల్ల షైలాక్ ఇష్టపడలేదు, అందుచేత జెసీకా చాలా నగలు, డబ్బు తీసికొని ఇంట్లోనుంచి పారిపోయి లొరెంజోను వివాహం చేసికొంది. తర్వాత వారిద్దరూ బెల్‌మాంట్‌కు ప్రయాణమయ్యారు. అప్పుడు ఏంటానియో బెసానియో కిమ్మని ఒకలేఖ వ్రాసి ఇచ్చాడు. ఆ లేఖనే వారిద్దరూ ఆ ఆనంద సమయంలో తెచ్చియిచ్చారు. బెసానియో ఆ ఉత్తరాన్ని చదువుతూ అదలిపోయాడు. ఆ లేఖ పోర్షియా కూడా చదివింది. ధనరాసులతో వస్తున్న ఏంటానియో ఓడలు సముద్ర మధ్యమున మునిగిపోయి అతనికి తీరని నష్టము వచ్చినదట. అంతేకాదు తన స్నేహితుడైన లొరొంజోను తన కూతురు వివాహం చేసికొని ఇంట్లోనించి వెళ్ళిపోవడంతో షైలాక్కు ఏంటానియో మీద పగ ఎక్కువయింది. దానితో పిచ్చిఎత్తి "నా కూతురు! నా డబ్బు! నా నగలు న్యాయం! న్యాయం!" అంటూ రోడ్లమీద తిరగడం మొదలు పెట్టాడు షైలాక్. ఓడలు మునిగిపోయి తీరని నష్టం ఏంటానియోకి కలిగిందని తెలిసి అతని మీద పగ తీర్చుకోడానికి అదే తగిన సమయమని షైలాక్ నిశ్చయించుకొన్నాడు. ఎంతమంది వారించినా వినకుండా నగరపాలకుడయిన డ్యూక్ వద్దకుపోయి ఏంటానియో పైని ఫిర్యాదు చేసి ఏంటానియో వ్రాసి యిచ్చిన హామీ పత్రాన్ని చూపించాడు. ఏంటానియో అప్పు ఏలాగా తీర్చలేదు గనుక షరతు ప్రకారం అతని

శరీరం నుండి ఒక పౌను మాంసం తాము తీసికొన వలసి ఉంటుందని అన్నాడు. ఇదే ఆ లేఖలోని సారాంశం

అందువల్ల బెసానియో వెంటనే వివాహం చేసికొని తగినంత డబ్బు నేగ పుచ్చుకొని భార్యతో చెప్పి వెనిస్‌కు ప్రయాణమయ్యాడు. నిజాయితీకి నిలబడాలన్న సంకల్పంతో వంటానియోను క్షమించమని షైలాకును కోగలేదు. డ్యూక్ మాత్రం షైలాకును కోరాడు. కాని తను వంటానియోను ప్రేమించడం లేదు గనుక దయ చూడనన్నాడు షైలాక్. "తాము ప్రేమించని వాటిని మానవులందరూ నాశనం చేస్తారా ?" అని ఆ సమయానికి వచ్చిన బెసానియో షైలాక్‌ను తీవ్రంగా అడిగేడు. "అసహ్యించుకొనే వాటిని మానవులందరూ నాశనం చేయరా ? అని తీవ్రంగా ఎదురు ప్రశ్న వేశాడు షైలాక్.

"వంటానియోను క్షమిస్తే అతను ఇవ్వవలసిన దానికి రెండింతల నిస్తా"నన్నాడు బెసానియో. ఆరింతలు యిచ్చినా అవసరం లేదు. నాకు కావలసినది ఒక పౌను వంటానియో మాంసం" అన్నాడు షైలాక్. అతను దయచూపవలసిన అవసరంలేదని అతనికి కావలసినది న్యాయమేనని చెప్పాడు. తెచ్చినకత్తిని సానపెట్టడం మొదలుపెట్టాడు షైలాక్. వంటానియోపైని పగ తీర్చుకొనే కాల మాసన్నమయిందని సంతోషించాడు. కాని అదే సమయానికి ఒక న్యాయవాది తన గుమాస్తాతో కూడా వచ్చాడు. వారిద్దరూ, నవయువనులు అయినా న్యాయమైన తీర్పు చెప్పగల సమర్థవంతుడు. ఆ న్యాయవాది అని డ్యూక్ స్నేహితుడు ఒకడు ఒక పరిచయపత్రం డ్యూక్కు వ్రాసి పంపాడు. ఆయువక న్యాయవాని న్యాయాధిపతిగా వివాద విషయాన్ని ఇరువురు నుండి విన్నాడు. వంటానియోని క్షమించమని షైలాక్‌ను అతడుకూడా కోరాడు కాని లాభం లేకపోయింది. వంటానియో శరీ ం నుండి ఒకపౌను మాంసం షైలాక్ కోసి తీసికోవచ్చునని ఆ న్యా యాధిపతి తీర్పు చెప్పాడు. అందుకు షైలాక్ అతన్ని అభినందించా ం.

వంటానియో కోటు విప్పాడు. షైలాక్ తన కత్తి పదును చూ సుకొంటూ వంటానియో గుండెకోసి ఒక పౌను మాంసం తీసికో

వాలని సిద్ధమయ్యాడు. మాంసం తూచడానికి త్రాసు సిద్ధంగా ఉందా అని న్యాయాధిపతి అడిగితే ఉందన్నాడు షైలాక్. రక్తం ఎక్కువగా కారిపోయి ఏంటానియో చనిపోకుండాచూడడానికి వైద్యుడ్ని సిద్ధంగా వుంచావా అని న్యాయాధిపతి అడిగితే ఆ షరతు ఒప్పందంలో లేదు అన్నాడు షైలాక్. చెప్పుకోవలసింది ఏమైనా ఆ సమయంలో వుంటే చెప్పుకోవచ్చునని ఏంటానియోతో ఆ న్యాయాధిపతి చెప్పాడు. తన అత్యంత ప్రియమైన స్నేహితుడు బెసానియో కోసం తన ప్రాణాలను అర్పించడానికి తాను సంతోషిస్తున్నానన్నాడు ఏంటానియో. "న్యాయ రీత్యా ఒక పౌను మాంసం మాత్రం నీవు కోసి తీసికోవచ్చునని న్యాయ స్థానం అంగీకరిస్తున్నది. అతని గుండెనుకోసి తీసికోవడానికి కూడా న్యాయస్థానం ఒప్పుకొంటున్నది." అని ఆ న్యాయాధిపతి షైలాక్‌తో చెప్పాడు.

"న్యాయాధిపతి చాల జ్ఞానవంతుడు! ఏంటానియో! రా! సిద్ధంగా వుండు!" అన్నాడు షైలాక్ కత్తి పదును చూస్తూ "కొంచెం ఆగు! ఇంకా న్యాయనిర్ణయం పూర్తి కాలేదు మీ ఒప్పందంలో నీకు ఒక్కచుక్క అయినా నెత్తురు వస్తుందనిలేదు. నీకు రావలసిన ఆ ఒక్క పౌను మాంసం మాత్రమేతీసుకో. ఒక్క రక్తపుబొట్టు పైకి చిందిందంటే నీకున్న సమస్త ధనాన్ని ఆస్తిని ప్రభుత్వానికి ఇచ్చివేయ వలసి వుంటుంది." అన్నాడు ఆ యువక న్యాయాధికారి. "షైలాక్! విన్నావా! ఆ జ్ఞానవంతుడైన న్యాయాధిపతి మాటలు!" అన్నాడు బెసానియో. "బెసానియో! నీవిస్తానన్న ఆ మూడింతల ధనాన్ని యిచ్చేయి నేనుతృప్తి చెంది వెళ్తాను." అన్నాడు షైలాక్. "తొందర పడకు షైలాక్! ఆ ధనాన్ని నీవు తిరస్కరించావు. నీకు కావలసింది న్యాయం అదే నీకు లభిస్తుంది. వెనిస్ నగర న్యాయ చట్టరీత్యా వెనిస్ పౌరుడు కాని వాడు ఎవడైనా వెనిస్ పౌరుని ప్రాణాలు తీయ దలచుకొంటే అతనికి మరణదండన విధించబడుతుంది. అతని యావ దాస్తి ప్రభుత్వానికి, ఎవరి ప్రాణాలను అతను తీయదలుచుకొన్నాడో అతనికి సగిసమానంగా పంచబడుతుంది. నీవు వెనిస్ పౌరుడవు కావు. వెనిస్ పౌరుడయిన ఏంటానియోను నీవు చంపదలచుకొన్నావు. కనుక

నీకు ఏశిక్ష విధించాలో డ్యూకే నిర్ణయిస్తాడు." అన్నాడా న్యాయాధికారి.

షైలాకు భయకంపితుడయి చతికిలబడ్డాడు. నీవు ఏంటానియో పైని దయ చూపకపోయినా నేను నీపై దయ చూపదలచాను. నీకు నేను ప్రాణదానం చేస్తున్నాను కాని నీ ఆస్తినంతటిని ఏంటానియోకి, ప్రభుత్వానికి చెరిసగం ఇచ్చి వెయ్యాలి" అని డ్యూక్ తీర్పు చెప్పాడు. డబ్బు లేనిదే వడ్డీ వ్యాపారస్థుడు జీవించేది ఏలాగు? అందుకని తన ప్రాణాల్నే తీసికొమ్మన్నాడు షైలాక్. "షైలాక్ పైని దయచూపగలవా?" అని ఏంటానియోను ఆ యువక న్యాయాధిపతి అడిగాడు. అందుకు ఒకషరతుపైని తనవాటాధనాన్ని షైలాక్ వుంచుకొనవచ్చును అన్నాడు ఏంటానియో. తన మరణాంతరం షైలాక్ తన ఆస్తినంతటిని తన కూతురికి అల్లుడికి చెందేటట్టు అంగీకరించాలన్నాడు. ఏంటానియో షైలాక్ అంగీకరించక తప్పలేదు.

తన కృతజ్ఞతకు చిహ్నంగా దేనినైనా కానుకగా స్వీకరించమని ఆ న్యాయవాదిని బెసానియో ఏంటానియోలు కోరారు. అందుకు బెసానియో వేలినున్న వుంగరాన్ని ఇమ్మని ఆ న్యాయవాది కోరాడు. పోర్షియా పెండ్లినాడు తనకు తొడిగిన వుంగరాన్ని యివ్వలేక ఇంక దేనినైనా కోరుకొమ్మన్నాడు బెసానియో అందుకు ఆ న్యాయవాది కినిసి వెళ్ళిపోయాడు. తర్వాత ఏంటానియో నిర్బంధించగా ఆ ఉంగరాన్ని గ్రేటానియో న్యాయవాదికి పంపాడు. ఆ న్యాయవాది గుమాస్తా బలవంతంచేసి గ్రేటానియో వేలినున్న పెండ్లి ఉంగరాన్ని తీసికొన్నాడు. ఏంటానియోతోకూడా బెల్‌మాంట్‌కు బెసానియో, గ్రేటానియోలు తిరిగి వచ్చారు. తమ భార్యలను తిరిగి కలుసుకొన్నందుకు బెసానియో, గ్రేటానియోలు సంతోషిస్తున్నా ఉంగరాల విషయం ఏమి చెప్పాలో తెలియక లోలోన వారు కొంత బాధపడుతూనే వచ్చారు. అనుకొన్నట్టే ఉంగరాల విషయమైవారు అడిగారు. జరిగిన దంతా ఏంటానియో పోర్షియాకు చెప్తూ "మీ విషయంలో బెసానియో మరెప్పుడూ మాట తప్పడు" అని నేను వాగ్దానం చేస్తున్నానన్నాడు. "అయితే దీన్ని జాగ్రత్తగా ఉంచుకోమనండి" అంటూ

పోర్షియా ఒక ఉంగరాన్ని యిచ్చి నె. నెరిస్సాకూడా ఒక ఉంగరాన్ని గ్రేటానియోకి ఇచ్చింది. వారి పాత ఉంగరాలనే వారు తిరిగి పొంద డంతో ఇద్దరూ ఆశ్చర్యపోయారు. యదార్థంగా జరిగినది తెలిసికొని సంతోషించారు. పోర్షియా, నెరిస్సాలు ఆ న్యాయవాదిగాను, గుమాస్తా గాను వచ్చి తీర్పు చెప్పారని తెలిసి వారంతా ఆశ్చర్యచకితులయ్యారు. అదే సమయంలో ఏంటానియో ఓడల్లో మూడు సురక్షితంగా ధనంతో కూడా రేవుచేరినట్టు వర్తమానం వచ్చింది బెల్‌మాంట్ లోని ఆ భవనంలో సంతోషం వెల్లివిరిసింది.

* * *

# మర్చంట్ ఆఫ్ వెనిస్ - విమర్శ

నా బాల్యములో అనగా 14, 15 ఏండ్ల బాలుడనై యుండి నప్పుడు నేను షేక్స్పియరు రచించిన నాటకాలలో రెండు మాత్రమే చదివినాను. వాటిలో మొదటిది మెర్చంట్ ఆఫ్ వెనిస్, రెండవది కింగ్ జాన్. అందుకు కారణము ఒకటే 1898 లో మా పర్లాకిమిడి కాలేజి విద్యార్థులు కాలేజి వార్షికమహోత్సవ సమయమున మెర్చంట్ ఆఫ్ వెనిస్ నాటకమందలి నాల్గవ అంకమందలి మొదటి దృశ్యము ప్రదర్శించినారు. అప్పుడు నేను నాల్గవ ఫార్మ్ విద్యార్థిగా ఉంటిని. ప్రద ర్శనమందు నా మిత్రుడొకడు ఐదవ ఫార్మ్ విద్యార్థి నెరిసా పాత్ర ధరించి ఆ నాటకములో పాల్గొన్నాడు. అతడు చెప్పవలసిన మాటలు కడుకొద్దిగా మాత్రమే అయినా అతడొక వేషము ధరించి పెద్ద విద్యా ర్థులతో కలిసి రంగస్థలమున నిలబడడమే చాలు అది ఒక గొప్ప అదృష్టముగా నేనున్ను మరికొందరు నామిత్రులున్ను భావించినాము. ఆ దృశ్యముతోపాటు ఆ నాల్గవ అంకమందలి రెండవ దృశ్యమున్ను ప్రదర్శించుటవలన నెరిసా వేషము దాల్చిన వానికి మరి రెండు వాక్యములు పలుకవలసిన అవసరము కలిగినది. మొదటి దృశ్యము చాలా పెద్దది. నాలుగువందల పంక్తులు గలది. షైలాక్ న్యాయస్థాన

మునకు తెచ్చిన అభియోగమును వెనిస్ ప్రభువు న్యాయాధిపతిగా విచారణ గావించే దృశ్యమది. వెనిస్ ప్రభువు షైలాకును అడిగి చూచినాడు. ఋణ ధనము కావలసి ఉంటే వడ్డీతో కూడా పుచ్చుకొంటాడో లేక చెల్లించే గడువు దాటినది కనుక పత్రములో వ్రాసి ఉన్నట్లు ఋణగ్రస్తుడైన వంటానియో హృదయమునకు చేరువగానున్న స్థలము నుండి పౌనుమాంసమే కోసికొని తీసికొంటాడో తెలిసికోగోరినాడు. పత్రములోఉన్నప్రకారము పౌనుమాంసమే కోసితీసికొంటానన్నాడు. అంతే కాని కరుణచూపనన్నాడు. అప్పుడు వెనిస్ప్రభువు న్యాయవిచారణ ఆపి "నేను బెలారియో అనే దొడ్డ న్యాయవేత్తను. ఈ అభియోగమున నాకు తోడుగా విచారించవలసినదని కోరుతూ అతనిని రమ్మని లేఖ వ్రాసినాను. అతడీ దినమందే రాగలడు కనుక అతడు వచ్చిన వరకును న్యాయ విచారణ ఆపి వాయిదా వేసినాను" అని తెలియజేసినాడు. ఆ వెంటనే ఆ బెలారియోనుండి అతని లేఖపట్టుకొని అతని వద్దనుండి ఒక రాయబారి వచ్చాడని సేవకుడు వెనిస్ ప్రభువుకు తెలియజేసినాడు. ఆ రాయబారి వచ్చి ముందుగా ఆ లేఖ ప్రభువు కివ్వగానే ఆ ప్రభువు ఆజ్ఞననుసరించి కోర్టు గుమాస్తా ఆ లేఖ న్యాయ స్థానమున అందరూ వినేటట్టు చదివి వినిపించాడు. అందులో "నా ఆరోగ్యము చెడినది. వృద్ధుడను, రాలేను. అయినా నాకు మారుగా డాక్టర్ బల్తాజర్ అనే మహా దొడ్డ న్యాయవేత్తను పంపుతున్నాను. అతడు చిన్న యువకుడని చులకనగా చూడవద్దు చిన్న శరీరము కలవాడేకాని పెద్ద తలకాయగల న్యాయశాస్త్ర కోవిదుడు." అని చదివీ చదువగానే నాటక ప్రదర్శనము చూస్తూ వుండిన వార మందరము అందులో విశేషించి విద్యార్థులము ఎక్కువగా హర్షించి చప్పట్లు కొడుతూ కేకలు వేసినాము. అందుకు తగిన కారణము లేకపోలేదు. బెల్తాజర్ వేషము వేసికొని వచ్చేది పోర్షియా అనిన్ని ఆ పోర్షియా పాత్ర ధరించిన అబ్బాయి ఊటకూరు శేషగిరిరావనిన్ని మాకు తెలుసు అతడు ఆ లేఖలో చెప్పినట్లు చిన్న శరీరము పెద్ద తలకాయ గలవాడు; చాలా తెలివితేటలు గల విద్యార్థి అని పేరు పొందినవాడు. అతనిని గురువులు మెచ్చుకొనేవారు. తోడి విద్యార్థులు ఆదరాభిమానములతో చూసేవారు. నాకు బంధువర్గములోనివాడు. అంతేకాక ఆ సంవత్సరమే

కావ్యపఠన పోటీలో ఈ దృశ్యమందే మెర్సీకి (కరుణకు) సంబంధించిన పంక్తులు "The Quality of mercy is not strained"– మొదలు కొని "Must needs give sentence 'gainst the merchant" వర కునుగల 22 పంక్తులు ఆ పోటీ పఠనానికి నియమించిన పంక్తులు ఆ పోటీలో ఈ శేషగిరిరావు మొదటి వాడుగా గెలిచి బహుమతి నందు కొన్నాడు. అందువలన మా సంతోషము ఇనుమడించినది. నాటకరంగ స్థలమునకు అతడు వచ్చినప్పుడు ఈ పంక్తులు చదువుటకు ప్రారంభించి నప్పుడు పఠనము పూర్తిగావించినప్పుడు కూడా అభినందిస్తూ చప్పట్లు కొట్టినాము. ఆ దృశ్యము 67 సంవత్సరముల క్రిందటిదే అయినా నేటికిని నా కనుల యెదుట తాండవిస్తూ ఉన్నది. ఆ పంక్తులు మేము పాఠ్య గ్రంథముగా చదువుకొన్న ఆంగ్ల వాచకములో ఉన్నవి కనుకను ఇంచు మించు ఆ పంక్తులన్నీ నాకు కంఠస్థముగా వచ్చినవే కనుకను నేనా దృశ్యమును చూచి ఎక్కువగా ఆనందించ గలిగినాను.

ఈ నాటకము 1904 లో నేను మద్రాసు క్రిస్టియన్ కాలేజీలో బి. ఏ. తరగతిలో విద్యార్థిగా ఉన్న కాలమందు ఒక నాటక సమా జము వారు ప్రదర్శించినారు. ప్రదర్శనము చాలా మెచ్చుకోదగినది గానే ఉండెను. అందులో షైలాక్ పాత్రధారుడు తక్కిన నటులకంటే ఎక్కువ మనోజ్ఞముగా ప్రాశోచితముగా నటించినాడు. అందులో నటనా సామర్థ్య మెక్కువగా చూపుటకు కావలసినంత అవకాశ మున్నదని గ్రహించినాను. ఆ నాటక మాడినప్పుడు నేనాపాత్ర ధరించి నటించవలెనని ఆశించినానుగాని అందుకు తగిన అవకాశముదిక్కలేదు. 1914 లో నేను పర్లాకిమిడి కాలేజీలో చరిత్రాచార్యుని పదవిలో ఉన్నప్పుడు కాలేజీలో విద్యార్థులచేత ఈ నాటక మాడించుట జరిగి నది. అందులో పాల్గొనవలసిన వారందరూ విద్యార్థులే కావలెనన్న నియమము పెట్టుకొనుటవలన నేను షైలాక్ వేషము వేయలేదు. కాని ఆ నాటక ప్రదర్శనము నా శిక్షణములో జరుగవలెనని మా కాలేజీ ప్రిన్సిపాలు వింకర్లు ద్వార కోరుటవలన ఈ షైలాక్ పాత్ర ధారణము ఎట్లుండవలెనో చెప్పుటకు మాత్రము అవకాశము చిక్కినది.

ఒద్దికలు జరుగుతూ ఉన్నప్పుడు నేను షైలాక్ మాటలు ఉచ్చరిస్తూ అభినయిస్తూ ఉండేవాడను. అతని మాటలలోగల ప్రత్యేకత ఆడిన వాక్యములలో ప్రతీమాటా లేదా ప్రతి పద సముదాయమూ పట్టు రెండేసి మూడేసిసార్లు అనడములో కనబడుతున్నదని చెప్పి తొలిసారి పలికినది ఎట్లుండవలెనో రెండవసారి పలికినది ఎట్లుండవలెనో పలికి చూపిస్తూ ఉండేవాడను.

అం iii దృ ౩.

ఋణము గడువు కాలములో తీర్చలేక పోయిన ఏంటానియోపై న్యాయ పీఠమున అభియోగము పెట్టుకొని న్యాయ విచారణమునకు పూర్వము అతనిని చెరసాలలో పెట్టించి ఏంటానియో తాను చెప్పే మాటలు వినుమని కోరినప్పుడు షైలాక్ నిష్ఠురముగా ఆడిన మాటలు చూడ-

"I will have my bond; I will not hear thee speak.
I will have my bond and therefore speak no more
I will have no speaking; I will have my bond."

షైలాక్ ధనకాంక్ష గలవాడే; ధనమేమాత్రము పోయినను కొంప మునిగిపోయినట్లు మొరపెట్టే స్వభావముగలవాడు తన కూతురు జెసికా తాను ప్రేమించిన లోరెంజోతో లేచి పోయినప్పుడు విలువగల నగలతోను, రెండువేల డూకెట్లతోను వెడలిపోయినది. అప్పుడతడు దుఃఖముతో సర్వనాశనము పొందినవాడివలె రోదనముచేసినాడు. అట్టి వాడు పత్రములో వ్రాసినట్లు ఏంటానియో హృదయమునకు చేరువగా నుండిన స్థలము నుండి పౌను మాంసము కోసి తీసికొనుటకే నిశ్చయించుకొన్నాడు గాని ఇచ్చిన ధనమునకు మూడురెట్లు ధనమిస్తామన్నా సమ్మతింపలేదు. అందు కతడికి ఏంటానియో మీద గల కోపము, ద్వేషము, పగ కారణములు.

పోర్షియో ప్రదర్శించిన యుక్తివలన ఏంటానియోకు గండము తప్పినది. కాని అభియోగమునకు షైలాక్ కోరినట్టు తీర్పు జరిగి

యుండిన యెడల ఈ నాటకము ట్రాజడీగా పరిణమించి ఉండును. అయిదవ అంకము ఆనంద ప్రదములయిన సన్నివేశములతో సాగుటకు అవకాశమేమీ లేకపోవును.

ఈ నాటకములో స్త్రీ పాత్రలు చక్కగా శృంగార భూయిష్ఠమైన కామెడీలకు నిండుకొలిపినవి. పోర్షియో పాత్ర సర్వాంగ సౌష్ఠవము గలది. ఆమె ప్రేమ ఆదర్శప్రాయమైనది. సౌజన్యము మెచ్చుకోదగినది. నెరిసా ఆమెకు అన్నివిధముల తగిన చెలికత్తె. జెసికా తన తండ్రికిష్టమైన షైలాకుకు గుణపాఠము నేర్పగల కూతురుగా వ్యవహరించినది

ఏంటానియో బెసానియోల పరస్పర ప్రేమ మైత్రి ఆదర్శప్రాయముగా ఉదయించి పరిణమించినది

ఈ నాటకము జనరంజక మగుటవలన విద్యావ్యాప్తిగల ప్రపంచమంతంతటను ప్రతి సంవత్సరము పెక్కుసార్లు ప్రదర్శింపబడుతూ ఉంటుంది. మన దేశములో ఇది విద్యార్థి లోకమున ఎక్కువ ఆకర్షకమయిన నాటకము.

* * *

# మచ్ అడూ ఎబౌట్ నతింగ్
## (అక్కరకు రాని గొడవ)

కథా సంగ్రహము :-

పూర్వము మెసినాను లియోనాటో ప్రభువు గవర్నరుగ పాలిస్తూ ఉండేవాడు. అతనికి ఒక కూతురు, ఆమె పేరు హీరో ఆమెకు తోడుగా ఆమె మేనత్త కూతురు బియాట్రిస్ ఉండేది. బియాట్రిస్ మాటకారి, సరదాగా ఉండే పిల్ల. హీరో మాత్రం సాధు చరిత మితభాషిణి.

ఆరగాన్ రాజయిన డాన్‌పీడ్రో ఒకసారి లియోనాటో ఇంటికి అతిథిగా వచ్చాడు. అతనితో కూడా ఫ్లోరెన్స్ రాజు క్లాడియోవాడు ఆ రాజు బెనెడిక్ కూడా వచ్చిరి. ఒకనాడు అందరూ కలసి సరదాగా కబుర్లు చెప్పుకొంటూ ఉన్నారు. వారిలో బెనెడిక్ చమత్కారంగా మాట్లాడుతున్నాడు. అందుకని మాటకారి అయిన బియాట్రిస్ "మీ మాటలు ఎవరూ వినడంలేదు" అంటూ ఆయనను హాస్యమాడింది. లోగడ ఒక సారి ఈ విధంగానే అతనిని ఆమె హాస్యమాడింది. హాస్యాలు విపరీతంగా వినమించినవి.

క్లాడియో మాత్రం మౌనంగా కూర్చుని హీరో అందాన్ని చూచి ఆనందిస్తూ ఉండెను. బియాట్రిస్ బెన్‌డిక్‌ల మధ్య జరుగుతున్న మాటల తీరును డాన్‌పిడ్రో గమనించి "బియాట్రిస్ చాలా వాక్చాతుర్యం, పౌరుషం గలది. ఈమెకు బెన్‌డిక్‌తో వివాహం జరిగితే మంచి జంట అవుతారు." అని లియోనాటోతో అన్నాడు. "ఇద్దరు ఒక్క మాదిరివారే గనుక పెండ్లి చేసికొన్న వారం రోజుల లోపున యిద్దరూ పిచ్చివారై పోతారు" అన్నాడు లియోనాటో, కాని డాన్‌పిడ్రో మనస్సులో ఆ ఆలోచన స్థిర పడిపోయింది. ఎలాగైనా వారిద్దరికీ వివాహం జరిగేటట్టు చూడాలనుకొన్నాడు అతడు.

క్లాడియోకు హీరో పైని పూర్వం నుండి అనురాగమున్నది. ఈ పెళ్ళి సంబంధానికి లియోనాటో సంతోషించాడు. అతని కూతురు హీరో అంగీకరించింది. శుభముహూర్తం కూడా నిశ్చయమైంది. కాని కాల వ్యవధి అతనికి భరింపరాని దయింది. కాలయాపనకు మనస్సును మళ్ళించడానికి బెన్‌డిక్ బియాట్రిస్‌లను ఎలాగైనా భార్యాభర్తలను చేయాలని అతడు డాన్‌పిడ్రోతో సంప్రదించాడు.

బియాట్రిస్ అతనిని ప్రేమిస్తున్నట్టు బెనిడిక్‌తో చెప్పి అతను నమ్మేటట్టు చేయాలని డాన్‌పిడ్రో ఒక ఎత్తు వేశాడు. దీనిని అందరూ ఆమోదించారు. బెన్‌డిక్ ఆమెను ప్రేమిస్తున్నట్టు బియాట్రిస్‌తో హీరో చెప్పి నమ్మించవలెనని కూడా వారు నిర్ణయించుకొన్నారు.

ఒకనాడు బెన్‌డిక్ ఒంటరిగా తోటలో ఉండగా అతనికి కన బడకుండా ఆ తోటలో అతనికి చేరువగా ఒక చోట చేరి అతనికి

వినబడేటట్టు రహస్యంగా ఏదో మాట్లాడుకొంటూన్నట్టు నటిస్తూ బియాట్రిస్ బెనడిక్కును ప్రేమిస్తున్నట్టు చెప్పుకొన్నారు. బెనడిక్కు బియాట్రిస్ పెళ్ళి చేసికొనకపోతే ఆమె బ్రతకడం కష్టమని తనతో హీరో చెప్పినట్టు క్లాడియస్ లియోనాటోతో చెప్పాడు. కాని వారి దాంపత్యం సుఖమయం కాకపోవచ్చునని లియోనాటో అన్నాడు. ఈ విషయం బెనడిక్కుతో ఎవరైనా చెప్పితే బాగుండునని డాన్‌పిడ్రో అన్నాడు. బియాట్రిస్‌ను అతడు మరింత హేళన చేయవచ్చునని క్లాడియో అన్నాడు. ఆమె అన్నివిధాలా యోగ్యురాలే కాని ఈ బెనడిక్‌ను ప్రేమించడంలో మాత్రం అయోగ్యురాలైంది అయినా అతను ఈమెను ఏవిధంగానైనా బాధిస్తే అతన్ని మనం పరిహాసంతో బాధించవచ్చునని డాన్‌పిడ్రో యితరులతో అన్నాడు. అంతటితో ఆ ప్రసంగాన్ని ముగించి వెళ్ళిపోయారు.

ఈ ప్రసంగాన్ని బెనడిక్ తనలో తాను తర్కించుకొని బియాట్రిస్ నిజంగా తనను ప్రేమిస్తున్నదని నమ్మాడు ఇంతలో బియాట్రిస్ స్వయంగా వచ్చి "నా కిష్టము కాకపోయినా నన్ను పంపిస్తారంటూ" అతనిని భోజనానికి రమ్మన్నది. ఆమె మాటలు కటువుగా ఉన్నా అతని చెవికి అవి ఇంపుగా వినబడినవి. ఆమె తనను ప్రేమిస్తున్నట్టు కనబడినది. అందువలన ఆమె యెడల దయతో ప్రవర్తించి ప్రేమించవలెనని నిశ్చయించుకొన్నాడతడు. ఈ విధంగా డాన్‌పిడ్రో వేసిన ఎత్తు పారినది.

ఇంక హీరో తన కార్యాన్ని పూర్తి చేయవలసి ఉంది. బియాట్రిస్ విషయమై తనూ తన చెలికత్తె ఉర్సుతో కలసి రహస్యంగా తోటలో ఏదో మాట్లాడుకొంటున్నట్టు బియాట్రిస్‌తో చెప్పి తోటలోనికి తీసికొని రమ్మనమని హీరో మరొక చెలికత్తె అయిన మార్గరెట్‌ను పంపినది. తన విషయమై వారేమి మాట్లాడుకొంటున్నారో వినాలన్న ఆత్రుతతో బియాట్రిస్ తోటలోనికి మెల్లగా వారికి కనబడకుండా వచ్చినట్టువచ్చినది. ఆమె రాకను హీరో కనిపెట్టి బెనడిక్ బియాట్రిస్‌ను ప్రేమిస్తున్నట్టు క్లాడియో డాన్‌పిడ్రోలు తనతో చెప్పినట్టు ఆమె తన చెలికత్తె ఉర్సుతో చెప్పినది. బియా

ట్రిస్ ఎప్పుడూ బెనెడిక్‌ను ఎప్పుడూ ఎగతాళి చేస్తుంది కాని అంతటి రూపవంతుడు, గుణవంతుడు, ధైర్యవంతుడు యువకులలో అరుదని వారిద్దరూ బియాట్రిస్‌కు వినబడేటట్లు అనుకొన్నారు. తర్వాత తమ ప్రసంగాన్ని మార్చి హీరో తన పెండ్లి బట్టలను, ఉర్సులాకు చూపిస్తానని చెప్పి ఆమెను తీసికొని తోటలోనుండి వెళ్ళిపోయినది. బియాట్రిస్ తాను విన్నదంతా నమ్మింది. ఆమె మనస్సు బెనెడిక్‌పై లగ్నమయింది.

డాన్ పెడ్రో తమ్ముడు డాన్‌జాన్ ఒక దుష్టుడు. ఎలాగైనా క్లాడియో హీరోల వివాహం తప్పిపోయేటట్లు చేయాలని నిశ్చయించు కొన్నాడు. అందుకు సహాయంగా బొరాబియో అనే ఒక వక్రబుద్ధిగల వాని సహాయం తీసికొన్నాడు. ఆ బొరాబియో చెలికత్తె మార్గరెట్‌ను ప్రేమిస్తున్నాడు. ఆ ప్రేమికుల యిద్దరి సహాయంతో ఒక చిన్న ఎత్తు వేశాడు.

రేపు పెళ్ళి అనగా ముందు రాత్రి హీరో నిద్రపోయిన తర్వాత ఆమె దుస్తులను ధరించి ఆమెవలె మార్గరెట్ నటిస్తూ బొరాబియోతో కిటికీలోనుండి మాట్లాడవలెనని వారితో చెప్పి డాన్‌జాన్ వారిని ఒప్పించాడు. పెండ్లికి ముందు రోజున అతడు డాన్‌పెడ్రో క్లాడియో లను కలిసి హీరో ప్రవర్తన మంచిది కాదని రాత్రుళ్ళు రహస్యంగా పరపురుషులతో మాట్లాడుతూ ఉంటుందని, కావాలంటే వారే స్వయంగా ఆ రాత్రి చూడవచ్చునని చెప్పాడు. అదే నిజమయితే ఆ మర్నాడు వివాహ సమయంలో ఆమెను నలుగురిలో అవమాన పరచడానికి క్లాడియో డాన్‌పెడ్రోలు నిర్ణయించుకొన్నారు. జాన్‌పెడ్రో చెప్పినట్టే ఆ రాత్రి వారికి ఆ దృశ్యం కనబడింది.

ఆ మర్నాడు చర్చిలో వివాహం జరిగే సమయానికి నలుగురి మధ్య తాను రాత్రి చూసిన విషయాన్ని చెప్పి క్లాడియో హీరోను అవమాన పరచాడు. ఏమి ! ఇది నిజమా ! అని లియోనాటో డాన్ పెడ్రోని అడగగా, హీరో పరపురుషునితో రాత్రి రహస్యంగా మాట్లా డడం నిజమేనని అతడు చెప్పాడు. దీనితో హీరోకు మతిపోయినది. తెలివితప్పి పడిపోయింది. కఠినులైన డాన్‌పెడ్రో క్లాడియోలు అక్కడి

నుండి వెళ్ళిపోయారు అంతటి అపకీర్తి తెచ్చిన హీరో చనిపోతే బాగుండునని గోలపెట్టాడు. లియోనాటో, బెనెడిక్, బియాట్రిస్, మూర్ఛపోయిన హీరోకు ఉపచారాలు చేస్తూ ఉండిపోయారు. హీరో ముఖ భావాలను గమనించిన ప్రీస్టు మాత్రము ఆమె నిర్దోషి అని గ్రహించాడు. ఇంతలో మూర్ఛతేరి హీరో తను నిర్దోషినని చెప్పినది తను దోషినైనట్లు నిదర్శనం ఉంటే తనను చంపి వేయవచ్చునని తన తండ్రితో మొరపెట్టుకొన్నది

క్లాడియో, డాన్ పెడ్రోలు యేదో భ్రమకులోనై ఆమెను అనుమానించారని తలచి ఒక ఉపాయమాలోచించారు. క్లాడియో, డాన్‌పెడ్రో అక్కడ నుండి వెళ్ళిపోయిన సమయానికి హీరో మూర్ఛపోయి ఉన్నందున ఆమె చనిపోయినదని వారికి చెప్పి నమ్మించమని లియోనాటో చెప్పాడు. ఆమెకు అపరక్రియలు జరిపించి సమాధి కట్టించమన్నాడు. దీనికి బెనెడిక్ కూడా తనకు చేతనైన సహాయం చేయడానికి సమ్మతించాడు. తాను మోపిన నిందవల్లనే ఆమె మరణించిందని క్లాడియో తలచి ఆమె చావుకు తానే కారణమని పశ్చాత్తాపం చెందక మానడని ప్రీస్ట్ భావించి ఈ ఎత్తు వేశాడు. ఇంక చేసేది ఏమీలేక లియోనాటో ప్రీస్ట్ చెప్పినట్లు చేయడానికి అంగీకరించాడు. తర్వాత బియాట్రిస్ బెనెడిక్‌లు కొంతసేపు హీరోకు జరిగిన అన్యాయం విషయమై ముచ్చటించుకొన్నారు తర్వాత "నీవు నన్ను ప్రేమిస్తున్నావు నేను నిన్ను ప్రేమిస్తున్నాను. కనుక నన్ను ఏమి చేయమంటావో యీ కత్తి సాక్షిగా ఆజ్ఞ యిమ్ము" అని బెనెడిక్ ఆమెను అడిగాడు. క్లాడియో పైని ఆమె పగ తీర్చుకొనవలెనన్న ఉద్దేశ్యంతో "అయితే వెళ్ళి క్లాడియోను వధించిరా" అని శాసించింది. తన స్నేహితుణ్ణి చంపడానికి అతడు మొదట సమ్మతించలేదు కాని బియాట్రిస్ అతనితో వాదించి తన ప్రేమను ఎరగాపెట్టి అతని పౌరుషాన్ని రేకెత్తించింది. అతడు వెంటనే కత్తిమాసి క్లాడియోతో ద్వంద్వయుద్ధం చేయడానికి వెళ్ళాడు.

ఇంతలో ఒక దండనాథుడు బొరాచియోను బంధించి తీసికొని వచ్చి రాజుముందు నిలబెట్టేడు. బొరాచియోను తాను కావించిన

దుష్కార్యాన్ని డాన్ జాన్ ప్రోత్సాహంతో చేసినట్టు రహస్యంగా తన మిత్రునితో చెప్తూ ఉండగా పట్టుబడ్డాడు. అందువల్ల అతడు యదార్థ విషయాన్ని అందరికీ తెలియజేశాడు. సత్యాన్ని తెలిసికొన్న క్లాడియోకు పశ్చాత్తాపం కలిగింది. తన తప్పుకు తగిన శిక్షను విధించమని అతడు లియోనాటోను కోరాడు. హీరో చనిపోయినది. కనుక తన పెంపుడు కూతురయిన వేరొక కన్యను వివాహమాడ వలసినదని అతడు శాసించాడు. తన తప్పిదానికి శిక్షగా క్లాడియో ఆ వివాహానికి అంగీకరించాడు.

ఆ మరునాడు మేలిముసుగులో నున్న పెండ్లికూతురు ఎవరో తెలిసికోకుండానే "నన్ను పెండ్లి చేసికొనుటకు నీ కిష్టమయితే నీ చేతిని నాకియ్యి నేను గ్రహిస్తా" నన్నాడు క్లాడియో. నేను ఇదివరకు బ్రతికి ఉన్నప్పుడే మిమ్మల్ని చేసికొనడానికి అంగీకరించాను అంటూ మేలిముసుగు తీసివేసింది హీరో. డాన్‌పిడ్రో క్లాడియోలు హీరోను చూసి ఆశ్చర్యపోయారు.

ఆ తర్వాత బెనెడిక్ బియాట్రస్‌ల వివాహం కూడా జరిగింది. అంతకు ముందే పట్నం విడచి పారిపోతున్న డాన్ జాన్ పట్టుబడ్డాడు. అతను ఏ వివాహం జరుగకూడ దనుకున్నాడో ఆ వివాహం అతని కళ్ళముందే జరిగింది. అదే అతని నేరానికి శిక్ష.

* * *

# మచ్ అడూ ఎబౌట్ నతింగ్ - విమర్శ

ఇది కొంత విషాదంతో కలిసిన కామెడీ ఆ విషాదమయినా తాత్కాలిక మయినదే కాని దీర్ఘమయినది కాదు. కథ సుఖాంత మయినది. కొందరి మానవుల స్వభావములు కొన్ని ఎంత హాస్యాస్పదం గాను, అస్తం వ్యస్తంగాను ఉంటవో తెలియజేసే సన్నివేశములతో

కథ నడచినది. బెనెడిక్ బియాట్రిస్‌లు ఆలిమగలు కాగలరని కలలో నైనను ఎవరూ అనుకోనని పరిస్థితులు ఎట్లు మారినవో షేక్స్పియరు కనబరచినాడు క్లాడియో మనోధైర్యములేని వానివలె ఆచరించడం వల్ల మానవుని దౌర్బల్యం ఎట్లుంటుందో తెలిసికొనే అవకాశం చిత్రితమయినది. స్త్రీ పాత్రల పాత్ర పోషణము నేర్పుగా జరిగినది.

ఈ నాటకము కూడా అనేక దేశములందు జనరంజకమయిన నాటకముగా ప్రదర్శితమగుతూ ఉంటుంది.

* * *

# ఏజ్ యూ లైక్ ఇట్

## (నీ కిష్టమగునట్లు)

ఇది లో రచితమైన కామెడీ; శృంగార రస భూయిష్ఠము లలితమైన హాస్యరసము కలది.

కథా సంగ్రహము :-

ఫ్రాన్స్ దేశమందొక మండలమునకు ప్రభువుగా నుండినవాడు ఉదారచరితుడు, సౌమ్యుడు, అధికార కాంక్షలేనివాడు. అతని మంచితనము దౌర్బల్యముగా నెంచిన అతని తమ్ముడు ఫ్రెడరిక్ ఆ మండలమునకు ప్రభువైన అన్నగారిని వెడలగొట్టినాడు. అందుకు అసలు ప్రభువు తమ్మునితో కలహింపక ప్రశాంత జీవితమునకు అలవాటుపడిన వాడు గనుక ఆ మండలమునకు చేరువగానే ఉండిన ఆర్డెన్ అనే పేరు గల ఒక అడవికిపోయి అక్కడ నివాస మేర్పరచుకొన్నాడు. అతని కిష్టులయిన వారు కొందరు అతనిని అనుసరించి అతనికి తోడుగా ఆ వనమందే వసతులేర్పరచుకొన్నారు. ఆ నిర్వాసితుడైన ప్రభువుకు

రోజలిండ్ అను ఒక కూతురుండెను. భార్య అదివరకే పోవుటచేత తల్లి లేని ఈ బిడ్డను ఎట్లు అడవిలో పోషించగలనన్న అతనికి విచారముండెను గాని అది హాయిగానే తప్పినది. ఫ్రెడరిక్కుకు కూడా సీలియా అనే పేరుగల ఒక కూతురు పుట్టినది. రోజలిండు సీలియాలు బాల్యము నుండిన్ని ఒకే తల్లి బిడ్డలవలె ఒకరి నొకరు ప్రేమించుకొంటూ పెరిగినారు. సీలియా బలవంతము వలన రోజలిండు ప్రభువు మందిరముననే ఉండిపోయినది. అదికూడా మంచిదే అని ఆమె తండ్రి తనతో అడవికి తీసికొనిపోలేదు. ఈ ఇద్దరు పిల్లలున్ను సుఖముగా జీవిస్తూ ఉండేవారు.

ఒకనాడు ఫ్రెడరిక్ కొలువులో మల్లయుద్ధములో ప్రవీణుడైన చార్ల్జుకున్ను ఆర్లండ్ అనే ఒక చిన్న యువకునికిన్ని మల్లయుద్ధము ప్రదర్శింపబడినది. అందులో ఆర్లండ్ చిన్నవాడే అయినా విజయుడైనాడు. అందుకు అందరికీ ఆశ్చర్యము కలిగినది. ఆ యువకునికి బహుమాన మిచ్చుట మాత్రమే కాక ఫ్రెడరిక్ అతనిని ఆదరించినాడు. కాని అచిరకాలములోనే ఆ యువకుని తండ్రి సర్ రౌలండ్ డబోయ్‌లు కొడుకని తెలిసినది. అన్నగారికి ఆ రౌలండ్ ఆప్తమిత్రుడు గనుక అతని యెడలగల ద్వేషముకొద్దీ ఈ ఆర్లండును వెడలిపొమ్మన్నాడు. అందుకు రోజలిండు సీలియాలకు కూడా దుఃఖము కలిగినది. అతడు మల్లయుద్ధమందు చూపించిన చాతుర్యమున్ను అతని సౌందర్యమున్ను వారికి ఆకర్షకములుగా ఉండెను. వారిలో రోజలిండ్ అతనిని అంతర్గతముగా ప్రేమించినది. అందుచేత అతనిని ప్రభువు వెడలగొట్టించినందుకు దుఃఖించినదే కాని పైకేమియు అనలేకపోయినది.

రోజలిండు యెడల సీలియాకు మాత్రమే కాదు ఫ్రెడరిక్ కొలువులో ఉన్నవారందరికీ ఆదరాభిమానములు ఎక్కువగా ఉండేవి. అంతేకాదు సీలియాకంటె రోజలిండే ఎక్కువగా వారి మన్ననలకు పాత్రురాలైనది. ఇది కూడా ఆ ఫ్రెడరిక్కుకు కష్టముగా తోచినది. ఆమె ఉన్నంతకాలము సీలియాను ఎవరును లెక్కచేయరన్న భయము కలిగినది. అందుచేత అసూయాగ్రస్తుడైన ఆ ప్రభువు రోజలిండును కూడా వెడలిపొమ్మన్నాడు. అందుకు సీలియా ఎక్కువ దుఃఖించినది.

"నీవు లేనప్పుడు నే నొక్క-దానిని దుర్మార్గుడయిన నా తండ్రివద్దను జీవించలేను. నీతోడనే నేనుండవలెను. కనుక నన్నుకూడా నీ వెంట కొని పొమ్మను అని సీలియా రోజలిండును వేడుకొన్నది. ఇద్దరున్ను తమ దుస్తులు, ఆభరణములు, కొంత ధనము పట్టుకొని ఒకనాటి రాత్రి ఊరినుండి రహస్యముగా వెడలిపోయినారు. ఫ్రెడరిక్ కొలువులో ఉండిన టచ్‌స్టోన్ అనే హాస్యకాడు వారికి తోడుగా వారిననుసరించినాడు. రోజలిండ్ ఒక యువకునివలె కనబడునట్లు దుస్తులు ధరించినది. గనిమీడ్ అనే పేరు పెట్టుకొన్నది. సీలియా ఒక సమాన్య కుటుంబమందలి పిల్లదానివలె కనబడునట్లు దుస్తులు ధరించి అలియనా అని పేరు పెట్టుకొని గనిమీడ్‌కు చెల్లెలు అయినట్లు వర్తించినది. టచ్‌స్టోన్ వారి సేవకుని వేషములో నుండెను.

ఈ ముగ్గురును ఆర్డెన్ వనమునకేపోయి నిర్వాసితుడైన ప్రభువు వసతికి కాస్త దూరమున ఒక పల్లెలో బస ఏర్పరచుకొన్నారు. ఆర్లండ్. ఫ్రెడరిక్ మందిరమునుండి వెడలగొట్టబడిన తర్వాత ఆ ఆర్డెన్ వనమునకే వచ్చి నిర్వాసితుడైన ప్రభువునే ఆశ్రయించి జీవిస్తూఉండెను. ఇతడు రొలండు కొడుకులలో మూడవవాడు. మొదటి కొడుకు ఆలివర్ తండ్రి చనిపోయిన తర్వాత కుటుంబమునకు పెద్దవాడయినాడు. స్వార్థపరుడు గనుక తండ్రి ఆస్తి అంతా కబళించినాడు. తన పెద్ద తమ్ముడయిన జేక్విజుకు మాత్రము కాస్త చెప్పించి నాడే కాని రెండవ తమ్ముడయిన ఆర్లెండోకు కొద్దిగానైనా చదువు చెప్పించకుండా సేవకుని చూచినట్లు చూస్తూ ఉండేవాడు. జేక్విజు మొట్ట వేదాంత పిచ్చిలోపడి నిర్వాసితుడైన ప్రభువువద్దనే ఏదో కలిగించుకొని జీవిస్తూ ఉండేవాడు. ఈ అన్నదమ్ములు ముగ్గురిలోను ఎవరికిని పెండ్లి కాలేదు. ఆర్లెండో చదువు లేకపోయినా మల్లయుద్ధము అలవరచుకొని ఆలివరు వద్దనే కాలము గడుపుతూ ఉండేవాడు. ఒకసారి ఫ్రెడరిక్ కొలువులో ఉండిన మల్లయోధునితో కుస్తీపట్టి పేరు పొందవలెనన్న కోరిక పుట్టుట వల్లనే అక్కడికిపోయి పైని వివరించిన రీతిగా మల్లయుద్ధమున విజయుడైనాడు. అక్కడ రోజలిండును చూచినప్పటినుండిన్ని ఆమె యెడల అనురక్తుడై యుండెను. కాని ఆమె తన కెట్లు

దక్కగలదన్న చింతతో నిరాశచేసికొని ప్రేమ పిచ్చితో జీవిస్తూ ఉండేవాడు. నేటి తెలుగు భావకవులవలె ప్రేమ గీతాలు రోజలిండు పేర రచిస్తూ కాగితాలపై వ్రాసి ఆ కాగితాలు ఆ అడవిలోగల చెట్ల కొమ్మలకు తగిలిస్తూ ఉండేవాడు.

ఆర్లెండు ఆ వనములోనే జీవిస్తున్నాడని తెలియగానే ఆమె కాశ్చర్యము విచారము, సంతృప్తి కలిగినవి. ఈ అడవికి వస్తాడని అనుకోలేదు. అతనికి ఈ పురుష వేషములో కనబడి అతనిని ఎట్లు పలుకరింపగలను ! అన్న ఆలోచనలోపడి అదీ మంచిదే అనుకొని సంతోషించినది. తానెవ్వరో తెలియనప్పుడే అతనికి రోజలిండు ఎడల ఎట్టి భావము జనించినదో స్వయముగా తెలిసికొన వచ్చును గదా అని సంతోషించినది. అతడు ప్రేమ గీతాలు పాడుకొంటూ అడవిలో తిరుగుతున్నాడని విని అతనిని కలుసుకోడానికి ఆరాటపడింది. అతని నొకసారి తన వద్దకు రమ్మని కబురంపినది. అతడు వచ్చి గనిమీడ్ వేషములోనున్న రోజలిండును కలుసుకొన్నాడు. కాని పోల్చుకోలేదు. రోజలిండు తానెవ్వరో తెలియనీయలేదు. మంచి మాటలతో ఆదరించి నేర్పుగా రోజలిండును ప్రేమిస్తున్నాడన్న విషయము అతని నోటనే పలికించి విని సంతోషించినది. తాను ఆమె కోసమై ఉవ్విళ్ళూరు తున్నట్లు అతడు పలుకగానే "ఆ బాధ తగ్గించుటకు నేనొక ఉపాయము చెప్తాను వింటావా !" అన్నది. "ఏమిటది! చెప్పు వింటాను" అన్నాడు. "పురుషుణ్నే అయినా నేనే ఆ రోజలెండు ననుకొని నన్నే ప్రేమిస్తూ కులాసాగా ప్రసంగించు. రోజలెండువలెనే నేనూ ప్రసంగిస్తూ ఉంటాను" అన్నది. అందుకతడు సంతోషించి ఆమె చెప్పినట్లు చేయడానికి సమ్మతించినాడు. రెండుసార్లు కలుసుకొన్న తరువాత నియమించుకొన్న వేళకు వస్తానన్నవాడు మరి రాలేదు. అందుకు రోజలెండు విలపించింది. అతడు రాకపోవుటకు కారణము లేకపోలేదు.

రోజలెండు వద్దకు వస్తూ ఉండగా ఆర్లెండుకు ఒక సంఘటనము ఎదురయినది. అతని పెద్దన్న ఆ వనమునకే వచ్చి ఒక చెట్టు నీడను నిద్రిస్తూ ఉండగా ఒక నాగుపాము అతని తలవద్ద పడగెత్తి చూచి తన జోలికి రాని వాడను కరవనేల అని అనుకొన్నట్లు వెడలిపోయి

నది. ఒక సింహము వచ్చి నిద్రలో ఉన్న వానిని చంపుటకు ఇష్టపడక అతడెప్పుడు లేస్తే అప్పుడు అతనిపై కురికి చంపి తినుటకు నిశ్చయించుకొని వేచియుండెను. ఆ పడుకొన్నవాడు తన అన్న అలివరన్న సంగతి తెలుసుకొన్న ఆర్లైండు "నా మొదల అధర్మముగా ప్రవర్తించి అన్యాయము చేసినవాడు చావనీ అన్న భావముతో వెడలిపోవుటకు మొదట నిశ్చయించుకొని వెంటనే జాలిపడి అతడెట్లు ప్రవర్తించినా నా సోదరుడే కదా" అన్న సముచిత భావము ఉదయింపగానే అతనిని రక్షించుటకు పూనుకొని ఆ సింహముతో పోరి దానిని చంపినాడు. ఆ సందడికి అలివరుకు తెలివి వచ్చినది. జరిగిన సంగతి సవిస్తరముగా తెలిసికొని తమ్ముడట్లు తన ప్రాణములు కాపాడినందుకు సంతోషించి తన స్వార్థపరత్వానికి సిగ్గుపడి తనను క్షమింపుమని వేడుకొన్నాడు. అన్నదమ్ములిరువురున్ను ఒకరి నొకరు ప్రేమించుకొన్నారు. అప్పుడు రోజలెండు సింహముతో పోట్లాడినప్పుడు చేతికి గాయము తగిలినందున కట్టు కట్టించుకోవలసి వచ్చినది గనుకను వెంటనే దానివలన అపాయము కలుగకుండా ఉండేటందుకు చికిత్స చేయించుకోవలసిన పని యుండెను గనుకను రోజలెండును కలిసికొనడానికి వీలులేక "అన్నా నీవు పోయి అక్కడ క్రొత్తగా వసతి ఏర్పరచుకొన్న గనిమీడ్‌ను కలుసుకొని జరిగిన కథ అతనికి తెలియబరచి కొద్ది దినములలో వచ్చి కలిసికొంటానని చెప్పు" వేడుకొన్నాడు. అలివర్ సరే అని గనిమీడ్ అనే పేరుతో పురుషవేషమున ఉన్న రోజలెండును, అలియనా అనే పేరనున్న సీలియాను కలిసికొని జరిగినదంతా తెలియజేసినాడు. ఎంతగా పురుషవేషములో ఉన్నా స్త్రీయే గనుక రోజలెండు ఈ ఘోరవార్త వినగానే మూర్ఛపోయి కొద్దిసేపటికి తెలివి తెచ్చుకొన్నది.

ఈ లోగా అలివర్ సీలియోలు ఒకరి నొకరు తొలిసారిగా చూచుకొన్నంతనే పరస్పర ప్రేమాన్వితులయి శీఘ్రకాలములోనే పెండ్లి చేసికొనుటకు నిశ్చయించుకొన్నారు. ఆర్లైండో తన మొదల నిండు ప్రేమగలవాడే అన్న సంగతి బోధపడిన వెంటనే ఆమె ఆర్లైండోను కలిసికొని నీకు ఆ రోజలెండును తెచ్చి పెట్టి ఇస్తాను, వచ్చ జెప్తాను పెండ్లి చేసుకొంటావా అని రోజలెండు అడుగగానే "ఓ ఆమెను

కన్నుల కద్దుకొని పెండ్లి యాడుతాను" అన్నాడు. ఆర్లెండో, ఆపిమ్మట ఆమె గనిమీడ్ వేషములోనే తండ్రిని కలుసుకొని "మీ కూతురు ఆర్లెండోను పెండ్లి యాడదలచుకొన్నది. మీ అనుజ్ఞ కోరుతున్నది దయ చూచి అనుజ్ఞ ఇవ్వండని" వేడుకొన్నది. అతడు మంచిదే అందుకు సమ్మతిస్తున్నా నన్నాడు. రెండు వివాహములకును ముహూర్తము ఒకనాటి రాత్రికి నిర్ణయించడం జరిగింది.

ఆ ముహూర్తానికే మరి రెండు వివాహములు కూడా జరుగుటకు నిర్ణయించడమైనది. రోజలిండుకు పరిచితులయినవారిలో పొరుగు పల్లె నివాసి అయిన విలియమునకున్ను పల్లె పడుచు అయిన ఆడ్రీకిన్నీ, పల్లె గొల్ల వృత్తిలోనున్న సిల్వియస్ ఫీబీలకున్ను పెండ్లిండ్లు జరుపుటకు నిశ్చయించడమయినది. ఈ నాలుగు పెండ్లిడ్లున్ను, మిడ్ సమర్ నైట్ డ్రీమ్‌లో జరిగిన నాలుగు పెండ్లిడ్ల రీతిగా ఆ ఆర్డెన్ వనములో నిర్వాసితుడైన ప్రభువు సమక్షమున వైభవోపేతముగా జరిగినవి. పెండ్లి జరుగబోవు వరకున్ను రోజలెండ్ గనిమీడ్ వేషములోనే ఉండి "ఇదిగో నేను పోయి రోజలెండ్‌ను పంపుతానని చెప్పి లోనికి పోయి తన దుస్తులు మార్చి రోజలెండ్‌గా వివాహవేదికకు వచ్చినది. అందరును ఆశ్చర్యముతో చూచి సంతోషించినారు.

ఈ నాటకము ఇంతకంటెను ఎక్కువ సుఖాంతమగుటకు మరి యొక ముచ్చటకూడా జరిగినది. తన అన్న అడవిలో జీవిస్తూ ఉండినా తన కంటే ఎక్కువ సుఖములనుభవిస్తూ క్షేమంగా ఉన్నాడని విని ఫ్రెడరిక్ మరింత ఎక్కువగా అసూయాగ్రస్తుడై పెద్ద సైన్యమును వెంటబెట్టుకొని తన అన్నను, అతని పరివారమును - అందరినీ సంహరింప దలచి వస్తూ ఉండెను. దారిలో అతని నొక సాధువు కలుసుకొని హితవు బోధించి అతని బుద్ధి మళ్ళింప జేసినాడు. ఫ్రెడరిక్ బుద్ధి తెచ్చుకొని అన్నను కలిసికొని అతని రాజ్యమతనికి అప్పగించి, సన్యాసి దుస్తులు ధరించి సన్యాసిగా జీవించుటకు నిశ్చయించుకొన్నాడు.

*　　*　　*

# ఏజ్ యూ లైక్ ఇట్ - విమర్శ

ఈ నాటకములో వాస్తవికత, ధర్మము, నీతి, చక్కగా పోషింప బడినవి. రోజలిండ్ ఆదర్శప్రాయమయిన కన్యగానే ప్రవర్తించి పురుష వేషమున ధైర్యముగానే జీవించి తన పవిత్ర ప్రేమకు భంగమువాటిల్ల కుండా కడునేర్పుతో వ్యవహరించినది. పాత్రలన్నిటను ఆమె పాత్రయే ఎక్కువ మెచ్చుకోదగినదిగా సాగినది.

సీలియా ఆమె తర్వాత మెచ్చుకోదగిన పాత్ర ఆమె ప్రదర్శించిన త్యాగబుద్ధి ఎక్కువగా ప్రశంసింపదగినది. ప్రభువు కూతురిగా రాజ భవనమునందు రాజ భోగములు అనుభవిస్తూ ఉండదగిన కన్య వాటిని వల్లక అక్కయెడలగల గాఢానురాగముతో అక్క యనుభవించు కష్టములలో తానున్న పాల్గొనుటకు నిశ్చయించుకొని ఆమెను అనుసరించినది.

టచ్‌స్టోన్ వారి యెడల తనకుగల భక్తి విశ్వాసములు పూర్తిగా ప్రదర్శించినాడు. నిర్వాసితుడయిన ప్రభువు పరమ సాధువు. "నోరు మంచిదయితే ఊరు మంచిదవుతుంది" అని ఒక సామెత కలదు. ఈ నాటకము చదివి నప్పుడు అంతకంటె ఎక్కువ గొప్ప సామెతగా "నోరు మంచిదయితే అడవియైనా మంచిదవుతుంది" అని చెప్ప వచ్చును. మన ఏవ మనుష్యాణాం కారణం సుఖదుఃఖయోః అనే నానుడికి దృష్టాంతముగా అతని పాత్ర పోషింపబడినది.

ఈ నాటకమునందు ఫ్రెడరిక్ చూపిన దౌష్ట్యము, అసూయా, వాత్సల్యరాహిత్యము సీలియా చూపిన త్యాగము, ఔదార్యము, వినయము, భక్తి, ప్రేమ రోజలెండు చూపిన చతురత, ధైర్యసాహసములు టచ్ స్టోన్ చూపిన భక్తి విశ్వాసములు అసలు ప్రభువు చూపిన నిశ్చింత, వైరాగ్యము, వాత్సల్యము; ఆలివర్ చూపిన పశ్చాత్తాపము; ఆర్లెండో చూపిన ధైర్యసాహసములు, పిచ్చి ప్రేమ; జేక్విజ్ చూపిన తత్త్వవిచారము; ఫీబీ చూపిన సహజ సామరత్వము కోరిన్

సిల్వియస్‌లనే గొల్లల సత్యావాల గుణములు కృత్రిమములేని సహజత్వ సత్యములున్న షేక్స్పియరు సులువుగా బోధపడేటట్లు కడు తేలికయిన భాషలో రచించి తన కవితాశిల్పము ప్రదర్శించినాడు.

జ్ఞాన విజ్ఞానములుగల తత్త్వవేత్తలు పలికే తత్త్వములు వంటివి పామరులు కడు తేలిక భాషలో కొందరు పలుకుతూ ఉంటారని కొన్ని వాక్యాలు ఆలివరు సేవకుని చేతను, గొల్లవాళ్ళ పగుల చేతను షేక్స్పియరు పలికించినాడు.

ఈనాటకమందు రెండవ అంకములోని ఏడవ దృశ్యము కడు మనోహరముగా రచితమయినది. అడవిలో ఒకచోట ఒక పెద్ద మేజా పైని భోజనార్థము పండ్లు మొదలయిన ఆహార పదార్థములు పెట్టుకొని నిర్వాసితుడయిన ప్రభువు అతని కొలువులో ఉండిన వారు కూర్చుని యుండగా ఆర్లండ్ వడివడిగా వచ్చి "ఆగండి మరి తినకండి" అని గద్దిస్తూ తన చేతనుండిన ఖడ్గము ఝళిపిస్తాడు. అప్పుడు జేక్విజ్ "మరి తినకండేమి! అసలు మేమేమయినా తిని ఉంటేకదా మరి తిన కండనడానికి!" "సరే తినుటకు మొదలు పెట్టనూ వద్దు మా అవసరం తీరే వరకున్న" అంటాడు ఆర్లెండు, అప్పుడు జేక్విజ్ ఆర్లెండు వింత వాక్యాలకు ఆశ్చర్యపడి "ఎట్టి కుటుంబములో పుట్టిన వాడో ఈ కోడి పుంజు!" అంటాడు అతడికి కలిగిన ఆశ్చర్యము తనకూ కలగడం వలన ప్రభువు మెల్లగా సభ్యులకు అనుగుణమయిన ప్రశాంతతతో "ఏం నాయనా! ఈ దుడుసు తనము నీ దుస్థితి వలన కలిగెనా! లేక సభ్యత యెరుగని మోటు మాటల కలవడుట వలన ఇంత పరుషముగా ప్రసంగించుట జరిగినదా!" అంటాడు ఆర్లండ్‌కు చల్లని దారముతో పీక కత్తిరించి నట్లయినది. "అయ్యా నా పోకడ పొంగు చాల చక్కగా అణగార్చారు. నాదుస్థితి వల్లనే నేను నా సభ్యత మరచిపోయి దుడుకుగా అరచినాను. "yet am I inland bred, and know some nurture" అంటాను. ఈ వాక్యమందు inland ముఖ్యమయిన మాట కనుక క్రిందగీటు పెట్టి ప్రదర్శిస్తున్నాను. ఈ వాక్యమునకు అందు ముఖ్యముగా inland అనే మాటకు వ్యాఖ్యానము వ్రాస్తూ ఒక వ్యాసము రచించినాడు మేడలీన్ డోరాన్ అనే విదూషీమణి (1959లో

పెలికన్ ప్రకటితమయిన మిడ్ సమర్ నైట్ డ్రీమ్ నాటకమును సంప్రతించిన పండితులు) inland అనే మాటకు దేశములోని భాగము అని అర్థము సాధారణమైనది. కాని ఈ సందర్భమున సభ్యత అని అర్థము. ఈ అర్థమునకు ఈ inland పదము మరి ఎవరును వాడ లేదు. షేక్స్పియరయినా ఈ ఒక్క చోటనే ప్రయోగించినాడు. ఈ సంగతి ఆక్స్ఫర్డ్ బృహన్నిఘంటువువారు సోదాహరణముగా తెలియ జేసినారు. నేను అడవిలో పుట్టి పెరిగిన వాడను కాను. నాగరకత గల ప్రదేశమందు పుట్టి పెరిగిన వాడనే అని తన విషయము తెలియజేసి కొన్నాడు. Nurture అని అతడన్నమాట కూడా సార్థకముగా ప్రయుక్తమయినది. సభ్యతలో శిక్షణ మన్న భావమును తెలియ జేస్తుంది.

ఈ దృశ్యమందే ఆకలి బాధవల్ల అడవిలోని వారు ఎట్లు బాధ పడుతున్నారో అనే ప్రసక్తి వచ్చినప్పుడు జేక్విజ్ ప్రభువుతో "మనమే కాదు ఇతడు (ఆర్లండు) ఇతని కొలుపు వాడు ఎంతగా బాధపడు తున్నారో చూచావా ఈ లోకము ఒక నాటక రంగస్థలము. లోకులు పాత్రధారులు. జగన్నాటక సూత్రధారుడైన దేవుడు మనచేత నాటక మాడిస్తున్నాడు" అంటాడు. ఆ ప్రసక్తి అందుకొని "ప్రతి మానవుడు పాత్రధారుడుగా ఏడు మెట్లు ఎక్కవలెను. ఏడు దృశ్యములందు పాల్గొన వలెను." అని జేక్విజ్ "All the world's a stage" అనే వాక్యాలు ఉపన్యాసధోరణిలో పలుకుతాడు. ఈ వాక్యముతో మొదలుకొని "Sans teeth, Sans eyes, sans taste, sans everything" వర కును గల 28 పంక్తులున్ను షేక్స్పియరు పలికిన సూక్తులందు తక్కిన మరి కొన్నిటితో ముఖ్యమయినదిగా విద్యార్థికులు ఎన్నుకొంటారు. కొందరు కంఠస్థము చేసుకొంటారు.

* * *

# ట్వెల్ఫ్త్ నైట్

## (పంద్రెండవ నాటి రాత్రి)

షేక్స్పియరు రచించిన నాటకములలో ఏకైక దీక్షతో బాహ్య ప్రపంచమంతా మరచి చదువ దగిన నాటకములు రెండు. ఇదీ దీని తర్వాత చెప్పుకోదగినది మర్చెంట్ ఆఫ్ వెనిస్.

కథా సంగ్రహము:-

ఇద్దరు యువనులు సెబాస్టియన్ అనే యువకుడున్నూ అతని చెల్లెలు వయోలా అనే చిన్నదిన్ని నావికా యాత్రచేస్తూ ఉండగా తమ ఓడ బ్రద్దలయినది. ఓడలోని వారు కొందరు సముద్రములో పడి చనిపోయినారు. కొందరు ఈదుకొని ఒడ్డు చేరుకొన్నారు. ఈ సెబాస్టియన్ వయోలాయాలు ఒడ్డుచేరుకొని బ్రదికినారు గాని ఒకరు ఒకచోట మరియొకరు దూరముగా మరియొక చోట ఒడ్డున పడుట వల్ల ఒకరి క్షేమము మరియొకరికి తెలియదు. చెల్లెలు చనిపోయి ఉంటుం దని అన్న, అన్న చనిపోయి ఉంటాడని చెల్లెలు అనుకొన్నారు. వయోలా ఇలీరియా తీరమున ఒడ్డుచేరి పట్టణములోనికి ఒకచోట విడిసి తోడు లేక స్త్రీగా ఉంటే అపాయము కలుగవచ్చునని పురుష వేషము దాల్చి అక్కడ ప్రభువు ఆర్సినో అనే వాని కొలువులో సిజారియో అనే పేరు పెట్టుకొని అంగరక్షకుని పని సంపాదించుకొని క్షేమంగా జీవించుటకు మొదలు పెట్టి, ఆ ప్రభువు దయకు పాత్రురాలైనది. ఆ ప్రభువు అవివాహితుడు, ఆ నగరమందే కల ఒక సంపన్న కుటుంబము నందు పుట్టి పెరిగిన ఒలీలియాను వలచి పెండ్లియాడదలచినాడు. ఆ ఒలీలియాకు ఆమె పినతండ్రియైన సర్ టోబీ బెక్స్ అనే వాడు ఆమెకు పెద్ద దిక్కుగాను తోడుగాను ఉండేవాడు. ఇలీరియా ప్రభువు, ఆర్సినో ఆ ఒలీలియా వద్దకు ప్రేమలేఖలు, వార్తలు పంపడానికి ఇప్పుడు మంచి సాధనముగా పురుషవేషమున ఉన్న వయోలా ఉపచరించినది.

ఒలీలియాకు ఆర్సినో యెడల ఆగరముండెను గాని ప్రేమలేదు. ఈ పురుష వేషమున ఉండిన వయోలాను ప్రేమించినది గాని పైకి ప్రకటింప లేకపోయినది అయినా ప్రేమ చూచ్కులు మళ్ళించుకో లేకపోయినది. వయోలా ఆమె హృదయము తెలిసికొన్నా తాను స్త్రీయే: కనుక పట్టించుకోలేదు. అంతేకాక ఈమెకు ఆర్సినో యెడల ప్రేమ అంకు రించినది. కాని ఏమి చేయగలదు! అతనికి బంటుగా పురుష వేషములో ఉన్నది.

వయోలా కొలువులో ఆమె ఖర్చు వెచ్చములు ఆర్థిక వ్యవ హారములు చూస్తూఉండిన మల్వాలియో ఆమెను మోహించినాడు. కాని తన మోహమును తెలియజేయుటకు సాహసించలేకపోయి ఏమి చేయుటకునుతోచక అప్పుడప్పుడు పిచ్చివానివలె ఉండేవాడు. ఈఅవస్థ వయోలా కొలువులోఉన్నవారు కొందరుగ్రహించి ఇతని ప్రేమపిచ్చిని మరింత అధికముచేసి ఇతనిచేత ఆడించి వినోదింపదలచి కొందరు ఇతనికి ఆశరేకెత్తించుటకు పూనుకొన్నారు. వయోలా అతనికి ప్రేమ లేఖ వ్రాసినట్లుగా ఒక మాయలేఖ వ్రాసి సంతకము లేకుండానే కవ రులో పెట్టి అతనికి అందేటట్లు చేసినారు. అది ఆమె సంతకము లేక పోయినదైనా ఆమె వ్రాసినదే అన్న భ్రమ కలిగినది. దానివల్ల అత నికి ప్రేమపిచ్చి అధికమయినది. ఆ లేఖలో ఉన్నట్లు పిచ్చి వేషములో వయోలా వద్దకుపోయి పిచ్చిగాప్రసంగించాడు. ఆమెకు కోపం వచ్చింది గాని అతనిని అంతగా దండింపలేదు. ఆమె కూడా ఆర్సినోను ప్రేమిం చుట వలన ప్రేమ పిచ్చి పట్టుకొన్నది. పురుష వేషములో ఉండిన వయోలాకు ప్రభువుయెడల మోహము ఎక్కువయినది. ఈ విధముగా నిష్ఫలము కాగల ప్రేమ అధికమగుతూ వచ్చింది. ఒలీలియా ఒకసారి వయోలాకు తన మోహము వ్యక్తము చేసినది. వయోలా లోలోపల నవ్వుకొని పైకి ఏమీ అనక ఒలీలియా బారినుండి తప్పించుకొన్నది. ప్రభువు బంటుగా ఉన్న అల్లుణ్ణి ప్రేమిస్తూ ఉన్నందుకు సర్ ఏగ్యూ చెక్ అనేవానికి కోపం వచ్చింది అతడు కూడా ఒలీలియాను వివాహ మాడుటకు కోరినవాడే. ఒలీలియాను ఏమీ అనలేక పురుష వేషమున ఉండిన వయోలాతో కలహించి కత్తి దూసినాడు. పాపము వయోలా

ఆత్మరక్షణముకోరి మొలనుండి కత్తి తీసినది. ఇద్దరును కత్తులతో
పోరుటకు సిద్ధపడ్డారు. అప్పుడు రక్షకభటులు అడ్డుపడి ఆ ద్వంద్వ
యుద్ధము కాకుండా చేసినారు.

అంతలో వయోలా అన్న సెబాస్టియన్ మరి యెక్కడనో
ఒడ్డు చేరుకుని బ్రతికినవాడు తిరిగి తిరిగి ఇలీరియా నగరమునకే వచ్చి
ఏదైనా జీవనోపాధి కోసం తిరుగుతూ ఉండగా అతనిని సర్ ఏగ్యూ
చెక్ చూచుట సంభవించినది. సెబాస్టియన్ వయోలాలకు చాలా
దగ్గర పోలికలు గలవు. దానికితోడు వయోలా పురుష వేషములో
ఉండెను. అందువల్ల సెబాస్టియన్ కనబడగానే అతడు ప్రభువు బంటే
అనుకొని తనకుండిన ద్వేషము చూపిస్తూ మరల ద్వంద్వ యుద్ధమునకు
సిద్ధమైనాడు. ఆ సమయానికే ఒలీలియా వచ్చి వారి కలహమును
నివారించి, సెబాస్టియన్ను లోనికి తీసుకొనిపోయి తన ప్రేమకు భంగం
కలిగింపక తనను వెంటనే పెండ్లియాడ వలసినదని బ్రతిమాలి నిర్బం
దించినది. ఇది చాలా వింతగా కనబడినా ఏదో తన మంచికే యీ
సంఘటనలు జరుగుతున్నవని యోచించి సెబాస్టియన్ సమ్మతించి
నాడు. ఆ వెంటనే ఆ యిద్దరికిని వివాహము జరిగినది

ఆ తర్వాత ఒలీలియా ప్రభువు మందిరమునకు వచ్చుట సంభ
వించినది. లోపలికి రాగానే ప్రభువు బంటు వేషమునవున్న వయో
లాను చూచి తాను పెండ్లి చేసికొన్న వ్యక్తియే (సెబాస్టియనే)అను
కొని భర్తను పలుకరించినట్లు పలుకరించినది. అందుకు ఇద్దరును తెల్ల
బోయి చూచినారు. "ఈ సిజారియోను నేనున్ను పెండ్లి చేసికొన్న
సంగతి మీకీయన చెప్పలేదా!" అన్నది "నిన్ను నేనెక్కడ పెండ్లి
యాడినాను!" ఈ అసత్య ప్రలాపమెందుకు!" అన్నది. తన బంటు
తనను మోసపుచ్చి ఒలీలియాను పెండ్లియాడినాడా! అన్న కోపముతో
ఉండెనా ప్రభువు. అంతలో సెబాస్టియను ఆ స్థలమునకు వచ్చుట
సంభవించినది. అతనిని వయోలా పోల్చుకొని పలుకరించినది కాని
అతడు పురుష వేషములోనున్న వయోలాను గుర్తించలేకపోయినాడు.
ఈ యిద్దరును ఒకే పోలిక నుండుటవలస వింతగా చూచినారు. వారి
ద్దరిలో ఎవరిని పెండ్లియాడెనో ఒలీలియా తెలిసికోలేక పోయినది.

ఆ తర్వాత వయోలా లోనికిపోయి తన మొప్పటి దుస్తులు ధరించి వచ్చినది. సెబాస్టియన్ వయోలాలు తమ తమ కథలు తెలియజెప్పు కొన్న తర్వాత యథాస్థితి అందరికీ బోధపడినది. వయోలాను ప్రభువు పెండ్లియాడినాడు. లోగడ మాల్వొలియో పిచ్చిగా ప్రవర్తించినందున కారాగారస్థుడై యుండెను. అతనికి విముక్తి కలిగినది. నాటకము సుఖాంతమయినది.

*　　　*　　　*

# ట్వెల్ఫ్ నైట్ - విమర్శ

## (పంద్రెండవ నాటి విమర్శ)

షేక్‌స్పియరు రచించిన కామెడీలలో ఇది వుత్తమ మయినదని చాలామంది విమర్శకుల అభిప్రాయము. ఇందులో నాటక లక్షణము లన్నీ పూర్తిగా ప్రదర్శితములైనవి. పాత్రపోషణము మనోహరముగా జరిగినది. సన్నివేశములు సంభాషణలు యథోచితముగా నున్నవి. కథాక్రమము సహజముగాను వడివడిగాను సాగినది. హాస్యరసము వున్నత స్థాయిలో నున్నదే కాని హేలవముగా దిగజారిపోలేదు. నీచ పాత్రలు కడు తక్కువ. నాటకము చదువుతున్నప్పుడు పాఠకులకుగాని, నాటకము ప్రదర్శించినప్పుడు ప్రేక్షకులకుగాని ప్రతి దృశ్యము మనోరంజకముగానే వుండును. గాని ఎక్కడా విసువు పుట్టదు. మర్చంట్ ఆఫ్ వెనిస్ వలె ఇది ఎక్కువ తరచుగా మనదేశ విద్యార్థులు చదువుతూ వుంటారు. ప్రదర్శిస్తూ వుంటారు.

పాత్రలలో ముఖ్యమయినది మాల్వొలియో పాత్ర. మర్చంట్ ఆఫ్ వెనిస్‌లో షైలాక్ ఎట్లు చాలా మందికి కొంత సకారణంగాను, కొంత నిష్కారణంగాను అనిష్టుడైనాడో మాల్వొలియో యీ నాటకములో అట్లే అనిష్టుడైనాడు. అయినా షైలాక్ వంటి దుష్టుడు,

క్రూరుడు కాదు మాల్వోలియో షైలాక్ ఏంటానియో యెడల తనకు గల అసూయకారణముగా తన పగ తీర్చుకొనుటకు సమయము చిక్క-గానే క్రౌర్యము వహించి, ఏంటానియోను మరణింప జేయుటకు సిద్ధపడి ఎవరెంత వేడినా పట్టిన పట్టు విడపలేదు. యూదుడై క్రైస్తవ మతమును నిందించుటవల్లను, చాలా మందికి అనిష్టుడైనాడు. అట్టి దుర్గుణములు కలవాడు కాదు మాల్వోలియో. ఇతనిలో క్షమింపదగిన లోపములు దౌర్బల్యము మాత్రమే వుండెను. సంపన్నురాలును అవివాహిత యున్ను అయిన ఒలీలియా కొలువులో ఆమె ఆర్థిక వ్యవహారములు చూచే వుద్యోగిగా వుండి ఆమెను మోహించి పెండ్లి చేసికొనవలెనన్న సాహసపు కోరికతో వువ్విళ్ళూరుతూ ప్రేమ పిచ్చి చూపులు ప్రసంగాలు చేయడమే ఇతనిలో వుండిన పెద్ద లోపము. ఇతని వలెనే ఆమెను ప్రేమిస్తూ వుండినవారు మరిద్దరున్నారు. వారిలో ఇరిలియా ప్రభువు ఆర్సినో తన ప్రభుత్వ గౌరవమునకు లోపము రానీయకుండా వ్యవహరించేవాడు. సర్ ఏండ్రూ ఏగ్యూ చెక్ మూర్ఖుడే అయినా కొంత వివేకముతో మెలగుతూ ఉండేవాడు. కాని మాల్వోలియో ప్రేమపిచ్చి బయట పెట్టుకొన్నాడు. అందుచేత ఒలీలియా కొలువులో ఉండిన వారికి అనిష్టుడును, హాస్యాస్పదుడును అయినాడు. వారు శ్రుతిమించి అతనికి ఘోరమైన అపకారమును చేసినారు. ఒలీలియా వ్రాసినట్టుగాను అతని నుద్దేశించినదిగాను ఒక దొంగ ప్రేమలేఖ వ్రాయించి అతనికి అందేటట్టు చేసినారు. అందులో ఒలీలియాకు ఇష్టముకాని పసుపు పచ్చని దుస్తులతో వేషముతో రమ్మని, అసహ్యములయిన చేష్టలు ప్రదర్శించమని ప్రేమ నిరూపించమని ఉపదేశించు సలహాలున్నవి. ప్రేమపిచ్చి అధికముకాగల మాల్వోలియో పాపము మోసపోయి ఆ లేఖలో ఉన్నట్టులే వ్యవహరించి ఒలీలియా కోపమునకు పాత్రుడై తన కనిష్టులైనవారి మోసమువలన మరింత ఎక్కువ పిచ్చివాడై కలహామునకు దిగజారి చెరసాలలో పడవలసివచ్చినది. చివరకు సత్యము బయల్పడగానే విముక్తుడైనాడు. అతనికి జరిగిన మోసమునకు అన్యాయమునకు, అపకారమునకు ఒలీలియా మొదలైనవారు కొందరు విచారించారు.

ఆర్సినో యువకుడు, అవివాహితుడు ఒలీలియాను మోహించి పెండ్లి చేసికోవలెనని కోరినాడు అది సహజముగానే ఉండెను. అతడు ప్రభువు, ఆమె సంపన్న కుటుంబములో పుట్టి పెరిగి సంస్థానమునకు యజమానురాలైనది. కాని ఆమె తన సోదరుడు, సంస్థానమునకు వారసుడు అయినవాడు చనిపోయినందుకు దుఃఖిస్తూ ఉండుట వలన కొన్నాళ్ళు తన వివాహము గూర్చి చింత లేకయుండెను. పురుష వేషములో సిజారియో అనే పేరను ఆర్సినో కొలువు అనుచరుడుగా ఉండిన వయోలా ఆర్సినో ప్రేమ దౌత్యము నడుపుటకు వస్తూ ఉన్నప్పుడు చూచి ఆ సిజారియో వేషమున నున్న వ్యక్తి స్త్రీయని తెలియక వాస్తవముగా పురుషుడే అనుకొని ఆ వ్యక్తి అందముగా కనబడుట వలన ఆ వ్యక్తిని మోహించి, ప్రేమ సంభాషణలు జరుపుటకు మొదలు పెట్టెను. వయోలా తన స్థితిని బయల్పెట్టుకోలేక ఒలీలియా యెడల జాలి పడి కడునేర్పుతో ఆమెకు లోబడకుండా తప్పించుకొంటూ వచ్చినది. ఆమెను ఒలీలియా ప్రేమిస్తూ ఉన్నట్లు తెలియగానే సర్ ఏండ్రూఏగ్యూచీక్ మొదలయినవారికి అసూయ పుట్టినది. కాని ఒలీలియాను ఏమనలేక పురుషవేషమున నున్న వయోలాను ద్వేషిస్తూ ఉండిరి. అంతలో వయోలా సోదరుడు, సెబాస్టియను ఇలిరియాకు వచ్చిన తర్వాత అతడు మూడు మూర్తులా సిజారియో వేషములో నున్న వయోలాను పోలియున్నందున చాలమంది అతనిని సిజారియోగా భావించి మోసపోయినారు ఒలీలియా అతనిని చూచి తన ప్రేమ వ్యక్తము చేసినది. అతడును ఇలిరియాలో చూస్తూ వచ్చిన వింతల వలన మోసపోయి స్థిరముగాను నెమ్మదిగాను ఉండదగిన స్థలము కనబడక చింతిస్తూ ఉన్న సమయంలో కోరికోరనట్లు ఇటు వంటి సంఘటన కలుగగానే ఇది తన మంచికే దైవికంగా వచ్చిందని సంతోషించి ఆమెను పెండ్లియాడుటకు సమ్మతించినాడు. ఆ వెంటనే పెండ్లి కూడా జరిగినది. ఇందువల్ల ఆమెను కామిస్తూ ఉన్నవారికి అసూయ కలిగినది. ఆ తర్వాత అతడెక్కడికో వెళ్ళి వేగముగా తన మందిరమునకు రాక పోవుటవల్లను. అతనికై ఆర్సినో మందిరమునకు వచ్చి అక్కడ సిజారియోను చూచి "నాథా ! ఇంటికి రా" పోదమన్నది. అప్పుడు

ఆర్సినో ఆశ్చర్యముతో చూచి, సిజారియో, ప్రేమ రాయబారము నడుపుతూ స్వామి ద్రోహముచేసినావా? అని సిజారియో నిందించినాడు. నేనెక్కడ వివాహము చేసికొన్నాను అని వయోలా అన్నది. ఆ సమయమందే ఏంటానియో ఆర్సినో మందిరమునకు వచ్చి సిజారియోను చూచి సెబాస్టియన్‌గా భావించి నా కీయవలసిన ధనమీయక నన్ను మోసపుచ్చుట తగదని తగవు పెట్టాడు. ఇదంతా ఆర్సినోకు, వయోలాకు వింతగా కనబడినది. కొంతసేపటికి సెబాస్టియాన్ అక్కడికి రాగానే ఇద్దరు వ్యక్తులు! ఒకే రూపము, ఒకే వేషము. ఏమి ఈ చిత్రము అని అందరూ తెల్లబోయినారు. కొంతసేపటికి సెబాస్టియన్ వయోలాలు ఒకరి నొకరు గుర్తించుకోవడంతో పోలికలవల్ల కలిగిన పొరపాట్లన్నీ బయల్పడినవి.

వయోలా చూపిన సాహసము; ధైర్యము, ప్రభుభక్తి, ఋజువర్తనము మొదలయిన సద్గుణములన్నీ అక్కడ నున్న వారందరూ మెచ్చుకొన్నారు. ఈ గుణములన్నీ షేక్స్పియరు గుర్తింపగలిగినట్లు చిత్రించినాడు. నాటకము కడు మనోరంజకముగా సుఖాంతమయినది.

* * *

# టెంపెస్ట్

## (తుఫాను)

ఈ నాటకము 1611 లో రచితమయినది. సుఖాంతనాటకములలో కట్టకడపటిది. ఇందులో విషాదము సంతోషము శృంగారము హాస్యము అన్నీ కొద్ది కొద్దిగా మిశ్రితములయినవి. మానవుడు పొంద గోరిన మంత్రశక్తి కూడా సూచితమయినది. షేక్స్పియరు పొంద గోరిన శక్తి సామర్థ్యములు కూడా సూచితములయినవని చెప్పవచ్చును.

కథా సంగ్రహము -

పూర్వం ఇటలీ దేశంలోని మిలాన్ రాజ్యాన్ని ప్రాస్పెరో అనే డ్యూక్ పరిపాలిస్తూ వుండేవాడు. అతనికి దేశ పరిపాలన మీద కన్నా పుస్తకాలను చదవడం మీద ఎక్కువ శ్రద్ధ వుండేది. అందువలన పరిపాలనా దక్షతను తన తమ్ముడైన ఏంటోనియోకు అప్పజెప్పి అతడు మనశ్శాస్త్రాలను, మత గ్రంథాలను చదువుతూ వుండేవాడు.

తన అన్న బ్రతికి వున్నంతకాలం తనను ఎవరూ పరిపాలకుడుగా గుర్తించరని భావించి ఏంటోనియో నేపిల్స్ రాజైన ఆలోంసోతో కలిసి కుట్ర పన్ని ప్రోస్పెరోను దేశంలో నుండి వెడలగొట్ట దలచు కొన్నాడు.

ఒకనాటి రాత్రి తుపాను వచ్చి భయంకరంగా ఉన్న సమయంలో ఏంటోనియో తన అన్నను, అన్న కుమార్తె మూడేండ్ల మిరండాను బంధించి తీసికుపోయి ఒక పాత పడవలోఎక్కించి, కూడూ గుడ్డా లేకుండా వారిని నడి సముద్రంలో వదలి పెట్టించాడు. ఆ తుపానులో ఆ పాత పడవ ఎలాగూ మునిగి పోతుందని వారిద్దరూ ఎలాగూ చనిపోతారని అతడు ఊహించాడు. ప్రోస్పెరో మీద భక్తిగల గొంజాలో అనే వృద్ధుడు రహస్యంగా కొన్నిబట్టలను, కొన్ని గ్రంథాలను, కొన్ని తిను బండారములను ఆ పడవలో పెట్టాడు. ఆ భయంకరమైన సముద్రములో పడవ తప్పక మునిగిపోతుందని ప్రోస్పెరో భయపడినాడు. మిరండా పసిపిల్ల గనుక హాయిగా నిద్రపోయింది.

ప్రోస్పెరోకున్న మంత్ర శక్తివలననో మరి యే శక్తి వల్లనో గాని తుపాను వెలిసింది. దేవతలే వారిని కాపాడి ఉండవచ్చును. ఏమైతే నేమి వారిద్దరూ క్షేమంగా తెల్లవారేసరికి ఒక లంక చేరుకొన్నారు. ఆ లంకలో కూరగాయలు, పండ్లు, మంచినీటి వనరులు పుష్కలంగా ఉన్నాయి. హాయిగా బ్రతకడానికి తగిన వసతులున్నందుకు ప్రోస్పెరో సంతసించాడు.

ఒక నా డతడు ఆ లంకలో ఒక అడవిగుండా వెళ్తూ వుండగా ఒక చెట్టులో నుండి అతనికి ఏడుపు వినబడింది. ప్రోస్పెరో అతని

మంత్ర శక్తితో ఆ చెట్టును చీల్చివేశాడు. అందులోనుండి ఒక గంధ ర్వుడు వెలికి వచ్చాడు. అతని పేరు ఏరియల్, పన్నెండు సంవత్సరాల క్రితం సైకోరాక్స్ అనే ఒక దుష్టమాంత్రికురాలు తన ఆజ్ఞలను ఈ ఏరియల్ యింకా ఇతర గంధర్వులు పాటించలేదని వారినందరినీ ఆ విధంగా బాధించింది. తర్వాత ఆమె చనిపోయింది. ఆమె కొడుకు మాత్రం యింకా బ్రతికి వున్నాడు అతనికి మతిలేదు. అతనిది వికృత రూపం ఆ లంకలో మానవులు ఎవ్వరూ లేరు.

ఆ గంధర్వులను బంధవిముక్తులను చేసినందుకువారు ప్రోస్పెరో ఆజ్ఞలను పాలించడానికి అంగీకరించారు. తర్వాత ప్రోస్పెరో కాలి బాన్ను వెతికి పట్టుకొన్నాడు. అతనికి విద్యాబుద్ధులు చెప్పాలని ప్రయ త్నించాడు. గాని ఆ అనాకారి దుష్టుడై, కృతఘ్నుడవడం వలన ప్రోస్పెరో అతడ్ని బానిసగా చేసికొనక తప్పింది కాదు.

ఆ లంకలో ఆ గంధర్వుల సహాయంతో కాలిబాన్ సేవలతో ఆ తండ్రీ కూతురూ పన్నెండు ఏళ్ళు గడిపారు. ఆ కాలంలో మిరండా తన తండ్రిని తప్ప వేరొక మానవ పురుషుణ్ణి చూడలేదు. ఆమెకు తన చిన్ననాటి జీవితం గుర్తులేదు. అందువలన ఆమె జీవితము అంతవరకు హాయిగానే వున్నది.

ఒక రోజున ఆమె సముద్రపు టొడ్డున నిల్చుని ప్రకృతి సౌంద ర్యాన్ని చూస్తూ ఆనందిస్తూ ఉండగా తుపాను వచ్చి సముద్రములో మునిగిపోతున్న ఒక ఓడ కనబడింది. ఆ ఓడలోని నావికులు తమను రక్షించమని మొరపెట్టుకొంటున్న కేకలు కూడా వినబడినవి. వెంటనే ఆమె వెళ్ళి తన తండ్రితో తను చూసినది చెప్పినది. ఆమె మాటలకు ప్రోస్పెరో ఒక చిరునవ్వు నవ్వాడు. ఆ తుపాన్ను సృష్టించినది తనేనని, ఆ ఓడకు గాని, నావికులకు గాని అపాయమేమీ కలుగదని ఆమెకు చెప్పాడు అతడు.

"వారు నీకేమి హాని చేశారని వారిని అలా బాధ పెడు తున్నావు" అని ఆమె అడిగింది. అప్పుడు ప్రోస్పెరో తను పూర్వగాధ నంతా చెప్పి "ఈనాటికి మిలాన్‌కు న్యాయ సమ్మతమైన డ్యూకును

నేనే." నా శత్రువు లందరూ ఆ ఓడలో వున్నారు. నేపిల్స్ కు రాజైన అలోంసో తన కుమార్తె వివాహాన్ని ఆఫ్రికా దేశంలో చేసి, తిరిగి స్వదేశానికి ఆ ఓడలో వస్తున్నాడు. ఈ విషయాన్ని నేను నామంత్ర శక్తివల్ల తెలిసికొన్నాను. వారు నా పట్ల కావించిన అన్యాయమునకు గాను పశ్చాత్తాపం చెందేటట్లు చేస్తున్నాను. అంతేకాని వారిలో ఎవరికీ ఎటువంటి అపాయము సంభవించదు." అని ఆమెకు నచ్చ చెప్పాడు. దానితో ఆమె ఆ రాత్రి హాయిగా నిద్రపోయింది.

తెల్లవారిన తరువాత ప్రాస్పెరో ఏరియల్ ను పిలిచాడు. కాని అతడు అలసిపోయి వున్నాడు. "ఏమిటి ? నాతో ఇంకాపనుందా ! ? నాకు మీరేం చెప్పారు. నేను నమ్మకంగా ఈపనిని పూర్తిచేస్తే నాకు స్వేచ్ఛను ప్రసాదిస్తామని మీరు అనలేదా! నాకుఇప్పుడు స్వేచ్ఛ కావాలి అన్నాడు ఏరియల్.

"ఇంకా ఆ సమయం ఆసన్నంకాలేదు. నేను నిన్ను ఎటువంటి కఠిన బంధాలలోనుండి విముక్తుణ్ణి చేసానో అప్పుడే మరచిపోయావా ? ఇంక రెండు రోజులు నామాట వింటే చాలు, తర్వాత, నీ యిష్టం వచ్చిన చోటుకు నీవు పోవచ్చును" అన్నాడు ప్రాస్పెరో.

"మీరు చాల దయగలవారు. నేను ఏం చేయాలో చెప్పండి" అని అడిగాడు ఏరియల్. నీవు జలదేవతగామారి వెళ్ళి, ఆ ఫెర్డినండ్ ను ఇక్కడకు తీసికొని రా అని ఆజ్ఞాపించాడు ప్రాస్పెరో.

వెంటనే ఏరియల్ ఒక ప్రాస్పెరోకి తప్ప యింకెవరికీ కనిపించని రూపం ధరించి వెళ్ళి ఒక్క ఫెర్డినెండ్ మాత్రము ఒడ్డుకు వచ్చేటట్టు చేశాడు. తన తండ్రితో సహా యితరులందరూ ఓడతోకూడా మునిగి పోయి ఉంటారని ఫెర్డినండు భయపడ్డాడు. "నీ తండ్రి సముద్రంలో మునిగి పోయా" డంటూ ఏరియల్ అతనికి కనబడకుండా మరింత భయపెట్టాడు. ఆ తర్వాత తన సంగీతంతో ఫెర్డినండును ఆకర్షిస్తూ మిరండా ప్రాస్పరోలు ఉన్నచోటికి తీసుకువెళ్ళాడు ఏరియల్.

దూరం నుండి ఆ రాజకుమారుణ్ణి చూసి గంధర్వుడను కొంది మిరండా. కాని అతడుకూడా మానవుడేనని తండ్రి చెప్పగా తెలిసి

కొంది. దూరం నుండి ఫెర్డినెండ్ మిరండాను చూసి ఆమె ఒక దేవత అనుకొన్నాడు. తనను ఆకర్షించిన సంగీతం ఆమె పాడినదే అని భావించాడు. ఆమెను సమీపించి "నీవు దేవతవా?" అని అడిగాడు. "కాను, నేనూ నీ వలెనే ఒక మనిషిని" అని ఆమె చెప్పింది. ఆ సుందరి తన మాతృభాషలో మాట్లాడడం విని ఆశ్చర్యపోయాడు. ఫెర్డినెండ్, ఆ నవయావనులిద్దరూ తొలిచూపుల్లోనే ఒకరి నొకరు ప్రేమించుకొన్నారు. ప్రోస్పరో కోరుకున్నది కూడా అదే.

కాని నిజంగా తనకుమార్తెను ఫెర్డినండ్ ప్రేమిస్తున్నదీ లేనిదీ తెలిసికొనడానికి ప్రోస్పరో అతని పట్ల కాస్త కఠినముగా ప్రవర్తించి, కర్రలు కొట్టే బానిస వృత్తికి అతన్ని నియోగించాడు. మిరండా మీద అతనికున్న ప్రేమకొద్దీ ఫెర్డనండ్ శ్రమకు లెఖ్ఖచేయకుండా పని చేస్తూ వచ్చాడు. అతనికి శ్రమ కలుగకుండా మిరండా అతనితో అనునయంగా మాట్లాడుతూ వచ్చింది. వారిద్దరి మధ్యా ఏర్పడిన గాఢ ప్రేమను చాటునుండి ప్రోస్పరో తెలిసికొని ఆనందించాడు. వారిద్దరి వివాహానికి అంగీకరించాడు.

అదే సమయంలో ఆలోంసోరాజు, గొంజాలో, యితర నావికులు ఆలంకలోని వేరొక ప్రాంతానికి చేరుకొన్నారు. తన కుమారుడు సముద్రంలో మునిగిపోయి ఉంటాడని రాజు విచారిస్తూ ఉంటే ఫెరండ్ గజఈతగాడు గనుక అతడు సురక్షితంగా లంక చేరుకొని ఉంటాడని గొంజాలో ఆయన్ని ఊరడిస్తున్నాడు. కాని రాజుకు నమ్మకం కుదరలేదు.

అలంసోరాజు, సెంటానియో ఇంకా యితరులు అలసిపోయి ఒకచోట కూర్చుని ఉండగా వారిని వింత వింత అరుపులతో ఏరియల్ భయపెట్టాడు. ఆకలి దప్పులకు తట్టుకొనలేక ఆలోంసో, గొంజాలో నిద్రపోయారు. అదే మంచి సమయం తలచి దుష్టబుద్ధియైన సెంటానియో వారిద్దర్నీ చంపి సెబాసియన్ను నేపిల్సుకు రాజుగా చేయాలనుకొన్నాడు. కాని మంత్రశక్తివల్ల ఈ విషయాన్ని ప్రోస్పరో తెలిసికొన్నాడు. ఆలోంసోకు ఏ అపాయం కలుగకుండా చూడమనిన్ని

కొంది. దూరం నుండి ఫెర్డినెండ్ మిరండాను చూసి ఆమె ఒక దేవత అనుకొన్నాడు. తనను ఆకర్షించిన సంగీతం ఆమె పాడినదే అని భావించాడు. ఆమెను సమీపించి "నీవు దేవతవా!" అని అడిగాడు. "కాను, నేనూ నీ వలెనే ఒక మనిషిని" అని ఆమె చెప్పింది. ఆ సుందరి తన మాతృభాషలో మాట్లాడడం విని ఆశ్చర్యపోయాడు ఫెర్డినెండ్, ఆ నవయౌవనులిద్దరూ తొలిచూపుల్లోనే ఒకరి నొకరు ప్రేమించుకొన్నారు. ప్రోస్పరో కోరుకున్నది కూడా అదే.

కాని నిజంగా తనకుమార్తెను ఫెర్డినండ్ ప్రేమిస్తున్నదీ లేనిదీ తెలిసికొనడానికి ప్రోస్పరో అతని పట్ల కాస్త కఠినముగా ప్రవర్తించి, కట్టెలు కొట్టే బానిస వృత్తికి అతన్ని నియోగించాడు. మిరండా మీద అతనికున్న ప్రేమకొద్దీ ఫెర్డనండ్ శ్రమకు లెఖ్ఖచేయకుండా పని చేస్తూ వచ్చాడు. అతనికి శ్రమ కలుగకుండా మిరండా అతనితో అనునయంగా మాట్లాడుతూ వచ్చింది. వారిద్దరి మధ్యా ఏర్పడిన గాఢ ప్రేమను చాటునుండి ప్రోస్పరో తెలిసికొని ఆనందించాడు. వారిద్దరి వివాహానికి అంగీకరించాడు.

అదే సమయంలో ఆలోంసోరాజు, గొంజాలో, యితర నావికులు ఆలంకలోని వేరొక ప్రాంతానికి చేరుకొన్నారు. తన కుమారుడు సముద్రంలో మునిగిపోయి ఉంటాడని రాజు విచారిస్తూ ఉంటే ఫెరండ్ గజఈతగాడు గనుక అతడు సురక్షితంగా లంక చేరుకొని ఉంటాడని గొంజాలో ఆయన్ని ఊరడిస్తున్నాడు. కాని రాజుకు నమ్మకం కుదరలేదు.

అలంసోరాజు, ఏంటానియో ఇంకా యితరులు అలసిపోయి ఒకచోట కూర్చొని ఉండగా వారిని వింత వింత అరుపులతో ఏరియల్ భయపెట్టాడు. ఆకలి దప్పులకు తట్టుకొనలేక ఆలోంసో, గొంజాలో నిద్రపోయా అదే మంచి సమయం తలచి దుష్టబుద్ధియైన ఏంటానియో వారిద్దర్నీ చంపి సెబాస్టియన్ను నేపిల్సుకు రాజుగా చేయాలనుకొన్నాడు. కాని మంత్రశక్తివల్ల ఈ విషయాన్ని ప్రోస్పరో తెలిసికొన్నాడు. ఆలోంసోకు ఏ అపాయం కలుగకుండా చూడమనిన్ని

తాము చేసిన తప్పులకు వారందరూ పశ్చాత్తాపం చెందేటట్లు చేయ మని చెప్పి ఏరియల్‌ను ప్రోస్పరో పంపాడు. గొంజాలో, ఆలోంసోలను చంపడానికి ఏంటానియో, సెబాసియన్లు సిద్ధంగా ఉన్న సమయానికి ఏరియల్ వెళ్ళి వారిని రక్షించాడు.

వారిని రక్షించినా వారికి తగిన బుద్ధి చెప్పాలని ఏరియల్ తలచి వారికి చక్కని సంగీతం వినిపించాడు. తన సహచరులయిన యితర గంధర్వుల సహాయంతో వారందరికి మంచి విందు ఏర్పాటు చేశాడు. వారంతా విందు ఆరగించడానికి సిద్ధంగా ఉన్న సమయంలో ఏరియల్ ఒక వికృతమైన పక్షి ఆకారాన్ని ధరించి, తినుబండారాలను మాయం చేశాడు. "మీరు ముగ్గురు దుష్టులు! ఇతర మానవులతో కలసిమెలసి ఉండడానికి మీరు అనర్హులు. అందుకనే మీరు ఈ లంకకు చేరుకొ న్నారు. ప్రోస్పరోకు మీరు చేసిన అన్యాయానికి ఇక్కడ మీరు శిక్షను అనుభవిస్తారు. మనఃపూర్తిగా మీరు పశ్చాత్తాప పడితేనే తప్ప మీరు చావు నుండి తప్పించుకోలేరు." అని చెప్పి ఒక్క మెరు పులా మెరసి ఒక పిడుగుపాటు సృష్టించి ఏరియల్ మాయమయ్యాడు.

ఆలోంసో, ఏంటానియో, సెబాసియన్లు ముగ్గురిలోను భయం ఆవరించింది. విచారం కలిగింది. గడచిన 24 గంటల్లోను అనేక భయంకరమైన విచిత్రాలను వారు చూశారు వారికి ఈ శిక్ష తగిన దనే వారు భావించారు. పశ్చాత్తాపం చెందారు. భావిలో ఉత్తమ జీవితం గడపడానికి ప్రమాణం చేశారు.

అనుభవించిన శిక్ష వారికి చాలని తలచి ప్రోస్పరో వారి వద్దకు మంత్ర కవచం తొడుక్కొని వెళ్ళాడు తొలుతవారు అతన్ని గుర్తించ లేరు. మంత్రకవచాన్ని తీసివేసిన తరువాత ప్రోస్పరోను వారు గుర్తిం చారు. అతనికి వారు క్షమాపణ చెప్పుకొని మిలాన్‌డ్యూక్ పదవిని మళ్ళా స్వీకరించమని వారు ప్రోస్పెరోను కోరారు.

"నా పదవిని నాకు తిరిగి యిస్తున్నందుకు మీకు తగిన బహు మతి నిస్తా"నంటూ ఆలోంసోను తన వెంట గుహకు తీసికొనివెళ్ళి ఫెరండోను చూపించాడు. ఫెర్డినండోను చూసి రాజు ఆనందభరితు

డయ్యాడు. అతనితో కూడా చిన్న అమ్మాయి ప్రోస్పరో కూతురు మిరండా అని తెలిసికొని సంతోషించి ఆమెను క్షమాపణ కోరుకొన్నాడు. ఫెర్డినండో మిరండాలు ఒకరినొకరు ప్రేమించుకొని వివాహం చేసికొనబోతున్నారని తెలిసి మరింత ఆనందాన్ని పొంది "మీ ఇద్దరి క్షేమాన్ని కోరనివారి భావిజీవితాలు దుఃఖమయమవుతాయి" అంటూ మిరండా, ఫెర్డినండో చేతులను కలిపాడు అలోంసో.

అదే సమయానికి ఏరియల్ యితర నావికులను అక్కడకు తీసికొని వచ్చాడు. ఓడ మునిగిపోలేదని అంతా సురక్షితంగా ఉన్నారని రాజుకు తెలిసి సంతోషించాడు.

ఆ మర్నాడు అంతా కలసి ఓడలో మిలాన్‌కు ప్రయాణమయ్యారు. వారికి అపాయం ఏదీ కలుగకుండా చూస్తూ ఇటలీ వరకూ ఏరియల్ ఓడపైన ఎగురుతూ వెళ్లాడు. తర్వాత అతనికి సంపూర్ణమైన స్వేచ్ఛ లభించింది సంతోషంగా పాడుకొంటూ తిరిగి వెళ్ళిపోయాడు.

ప్రోస్పరో మరల మిలాన్‌కు డ్యూక్ అయ్యాడు. ఫెర్డినండో, మిరండాల వివాహం వైభవోపేతంగా జరిగింది. ప్రజలంతా సంతోషించారు.

* * *

## టెంపెస్ట్ - విమర్శ

టెంపెస్ట్ నాటకములో సకల విధములయిన నాటకముల లక్షణములున్ను మిళితములయినవని మొదటనే చెప్పియున్నాను గదా! అంతేకాక ఇది షేక్స్పియరు తన కడపటి దశలో వ్రాసినాడు. తన శక్తి సామర్థ్యముల పరిణామ దశ సూచకముగా వ్రాసియుండునని విమర్శకులు కొందరూహించినారు. మానవుడు తన కుండగల శక్తి సామర్థ్యములు పూర్తిగా అర్జించుకోలేడనిన్ని, కానింతవరకు అర్జించినవి

కొద్దిగామాత్రమే ఆర్జింపబడినవనిన్నీ, ఆర్జించుకోగలిగినవి చాలా ఉన్నవనిన్నీ నేటి శాస్త్రజ్ఞులు కూడా అంటూ ఉంటారు. అట్టి ఆర్జించుకోదగినవి ఎట్లుండునో నిరూపించుటకే షేక్స్పియరు ఈ నాటకము రచించి యుండునని విమర్శకులు కొందరన్నారు. ఈ నాటకమందలి ప్రోస్పరో తన చిత్తవృత్తులకు అనుకూలముగా చిత్రింపబడినట్లు కనబడుతున్నది. దుష్టబుద్ధులు ప్రతి యుగమందున్నూ ఉంటూనే ఉంటారనుటకు తార్కాణంగా ఏంటానియో, అలోంసో పాత్రలను సృష్టించాడు. ముగ్ధత్వం, అమాయకత్వం మూర్తీభవించిన వ్యక్తిగా మిరండాను ప్రదర్శించాడు. దయా దాక్షిణ్యం, ప్రభుభక్తి, విశ్వాసముగల పాత్రగా గోంజాలో ప్రవర్తన కనబడినది.

మానవుడు తన మంత్రశక్తివలన అకస్మాత్తుగా తుపాను పుట్టించగలడు; అపాయములు తప్పించగలడు. అద్భుతకార్యములు చేయించగలడు. యక్షులను, గంధర్వులను, కిన్నరులను, రాక్షసులను లోబరచుకోగలడు. వారిచేత పనులు చేయించుకోగలడు అని నిరూపించుటకు కాబోలును ప్రోస్పరో యక్షుడో, గంధర్వుడో అయిన ఏరియల్‌ను చెరనుండి విడిపించి, రక్షించి, అతని చేతను తనపనులు చేయించుకొని తుదకు స్వేచ్ఛ ఇచ్చి సంతోషపరచినాడు. దుష్టబుద్ధులయిన రాక్షస జాతి వారికి చెందిన కాలిబాన్ను సయితము లోబరచుకొని తన పనులు చేయించుకోగలిగినాడు. ఇట్టి ఘనకార్యములు నేటికిని అసంభవములే అయినను వాస్తవికతకు విరుద్ధముగా సంఘటనలు కల్పించినాడని షేక్స్పియరును మనము నిందించరాదు. ఇట్టి పనులు మానవుడు తన మంత్రశక్తి వలన చేయగలడేమో! చేయగలిగితే మానవుని ప్రకృతి విజయము ఎంతగొప్పది కాగలదో అని నిరూపించుటకు ఈ నాటకము యీ రీతిగా రచించినాడని షేక్స్పియరును ప్రశంసించవలెనే కాని నిందించరాదని చాలమంది విమర్శకుల అభిప్రాయము.

ఈ నాటకము విషాద సంఘటనతో ప్రారంభించినది. అసలు కథా వస్తువు కూడా ప్రోస్పరో, మిరండాల సముద్రయానంతో విషాదముతోనే ప్రారంభమయినది. చివరకు ఏమగునో అన్న భయముతోనే నడచినది. చివరకు సుఖాంతమయినది.

ప్రోస్పరో తనకు గల తమ్ముని వల్ల ఘోరమైన అపకారము కలిగినందున గ్రీక్ ట్రాజడీలలో ఉన్నట్లు ప్రతీకారము జరుపుటకు ఈ నాటకములో అవకాశము లేక పోలేదు. కాని అట్టి ప్రతీకారము ఆ ప్రాచీనకాలములో సంభవమూ, సాధారణమూ అయి ఉండినా రెండు వేల సంవత్సరములు గడిచిన తర్వాతనైనా మన వేమన్న చెప్పినట్లు

చంపదగిన యట్టి శత్రువు తన చేత
జిక్కెనేని కీడు సేయరాదు,
పొసగ మేలుచేసి పొమ్మనుటే చాలు
విశ్వదాభి రామ వినుర వేమ.

మనము కరుణ హృదయము గలవారమయి వ్యవరింపవలదా? అన్నట్లు షేక్స్పియ రూహించెనేమో?

* * *

# విషాదాంత నాటకము (ట్రాజిడీ) లు

నాటకములు కేవలమువిషాదాంతములుగా ఉన్నంత మాత్రాన ట్రాజడీలు కాజాలవు. కథ అంతా సుఖవంతంగా నడచి చివరికి ఏదో దైవ సంఘటనవలన విపత్తుకలిగినప్పుడు అది విషాదాంతకమే కావచ్చు గాని అది ట్రాజిడి అనే నాటకము కాదు. దుష్టనాయకుని చావుతో అంత మొందిన నాటకము విషాదాంత నాటకమే అయినా ట్రాజడీ కాదు. రావణాసురునివంటి దుర్మార్గుని మరణము వలన అతని కుటుంబము వారికి విషాదము కలుగుట సహజమే. ఆ సంఘటనతో అంత మొందిన నాటకము ప్రదర్శించినప్పుడు ప్రేక్షకులకు సంతోషమే కాని విషాదము కలుగదు, కనుక అది ట్రాజిడి కాదు. అట్టి నాటకమయినా మన దేశమువారు విషాదాంతముగా ముగించుట కిష్టపడక మంగళకర

మయిన ఒక దృశ్యమును చేర్చి ప్రదర్శిస్తూ ఉంటారు. నరకాసుర విజయ నాటకము నరకుని మరణముతో ముగించక అతని కుమారుడైన భగదత్తుని రాజ్యాభిషేకముతో పూర్తి చేస్తారు. ధర్మచ్యుతి కలిగినప్పుడు దుష్టజన సంహారము సాధురక్షణముచేసి ధర్మము యథోచితముగా నిలబెట్టడానికి అవతరిస్తూ ఉంటానని కదా కృష్ణ భగవానుడు ప్రకటించినాడు. ఈ నమ్మకమున్నవారికి విషాదాంత నాటకములు సమ్మతములు కానేరవు. యూరప్ ఖండమందలి దేశములలో కూడా క్రీస్తుమతము వ్యాపించిన తర్వాత చాలాకాలము వరకును ట్రాజడీలు రచితములు కాలేదు. అందుకు క్రీస్తుమతనీతియే కారణము. హత్యకు ప్రతీకారముగా హత్య—ఘోరతరమైనహత్య అనే నీతికి విరుద్ధముగా నీ విరోధి నీ కుడి చెంపపై కొట్టినప్పుడు రెండవ చెంపపై సయితము కొట్టుమన్నట్లు నీ ఎడమ చెంప నందిమ్ము అని కదా క్రీస్తు బోధించినాడు. మన దేశమునందును అట్టినీతి బోధించిన వారు కలరు. చంపదగినయట్టి, శత్రువు తనచేతఁ జిక్కెనేని కీడు చేయరాదు; పొసగ మేలు చేసి పొమ్మనుటే చాలు విశ్వదాభిరామ వినుర వేమ." అని కదా మన వేమన యోగి పల్కినాడు. సాహిత్యము, ధర్మము, నీతి బోధించవలెననే కాని అధర్మమును అవినీతిని ప్రేరేపించునట్టివి కారాదు. కళ కోసమే కళ అనే వాదము ఆదరణీయము కాదు. ఆధ్యాత్మిక విద్యా తత్వమునకు పరోక్షముగానైనా ప్రతికూలములయిన సాహిత్య రచనలు పనికిరావు, అనే మతముగలవారు గనుక అధర్మమునకు అత్యాచారములకు అవినీతికి జయము కలుగునట్లు సూచించే సాహిత్య రచనలను ప్రోత్సహించలేదు సరే కదా చూచి సహింపనైన సహింపలేరు. విషాదాంత నాటకములయిన ట్రాజిడీలు అధర్మమును అత్యాచారమును అవినీతిని బోధించేవి కావు ప్రోత్సహించవు జయము పొందగలవనియైనా తెలియజేసేవి కావు. అయినా నిత్యకళ్యాణము పచ్చతోరణమూ కావలెనని కోరేవారము కనుక మన కావ్యములూ, నాటకములూ శుభసూచకములైన శ్రీకారముతోనో, ఓంకారముతోనో ప్రారంభించు ప్రార్థనలతో మొదలుపెట్టి ఇతిశమ్ అని మంగళ సూచకములు

గల భరత వాక్యములతో అంతమొందవలెను. నాటక ప్రదర్శనము చూచి ఇంటికిపోయి నిద్రించునపుడు మనోహరములయిన దృశ్యస్మృతులతో హాయిగా నిద్రించవలెనన్న కోరిక గల వారము గనుక ట్రాజిడీలలో గల ఘోర దృశ్యములూ, విషాదకరములైన అత్యాచారములు జ్ఞప్తికి వస్తూ వుండుటవలన సుఖముగా నిద్రింపలేము. వాటివలనకలిగే దుఃఖము భరింపలేము.

ప్రాచీన కాలములోనే నాటక రచన యవనులు అనగా గ్రీక్ దేశమువారు మొదలుపెట్టి ప్రఖ్యాత రచయితలుగా కీర్తిశేషులైనారు. ఈస్కైలస్ (క్రీ. పూ. 525-486) సాఫక్లీజ్ (495-406) యురిపడీజ్ (480-406) ట్రాజడీజ్ (విషాదాంత నాటకములు) రచించినారు. మరి నాలుగువందల సంవత్సరములు గడచిన తర్వాత సెనకా (క్రీ. పూ. 4 క్రీ శ 65) రోమన్ రచయిత ట్రాజిడీలు రచించినాడు. ఈ నలుగురు రచించిన నాటకములు అన్నీ ట్రాజడీలను పేరనున్నా ట్రాజడీ లక్షణములు భిన్నములుగా ఉన్నవి. అవి ఎట్లు. ఏయే అంశములలో భిన్నములైనవో సవిస్తరముగా వివరించి చెప్పుటకు ఇక్కడ అవకాశములేదు. కనుక సంక్షిప్తముగా మాత్రమే తెలియజేస్తాను. ఆపని చేయుటకు పూర్వము ట్రాజడీ లక్షణము అరిస్టాటిల్ (క్రీ పూ (384-322) అనే గ్రీక్ పండితుడు, తత్వజ్ఞుడు ఎట్లు నిర్వచించినాడో క్లుప్తముగా తెలియజేస్తాను. ట్రాజడీలకు ఆరు లక్షణము లుండువన్నాడు. కథానాయకునికి గాని. ట్రాజడీ జరిపిన పాత్రకుగాని శీలమందలి దౌర్బల్య లక్షణము-దురాశయా ? అధికార మదాంధతయా ? వ్యభిచార వాంఛయా ? అసూయ సహన భావోద్రేకమా ? అనే లక్షణము ఏది ప్రధానమయినదో స్పష్టపడవలెను. కథలో -అది పౌరాణికమయినా చారిత్రికమైనా అందులో దురంతమునకు దారితీసే సన్నివేశముల విషయములలో కల్పన ఉండవలెను. నాటకము నందలి పాత్రల నడవడి స్పష్టముగా తెలిసేటట్లు పాత్రపోషణము జరుగవలెను. భాష పాత్రోచితముగ రచితము కావలెను. కథకు, సన్నివేశములకు భావగాంభీర్యమున్నట్లుగా గేయము లుండవలెను. నాటకము ప్రదర్శించునప్పుడు కథాసన్నివేశములు స్పష్టపడు దృశ్యలక్షణములుండవలెను. ఈ

ఆరు లక్షణములను ఆంగ్ల భాషలో Theme (or Thought), Plot, Character, diction, (a language), Music, and Spectacle అని ఆంగ్ల పండితులు పేర్కొన్నారు.

ఈ లక్షణములలో కథా సన్నివేశముల కల్పన (Plot) ముఖ్యమన్న విషయము అందరికీ సమ్మతమే. ఆ కల్పనలో ప్రారంభము సుఖప్రదములయిన సన్నివేశములు కలది కావచ్చును. కాకపోవచ్చును. కాని నాటకము విషాదాంతము కావలెనన్న లక్షణము కూడా అందరికీ సమ్మతమయినదే-అయితే ఆ విషాధము ఎట్టిదై ఉండవలెను? ఎవరికీ కలుగవలెను. అనే విషయములలో అభిప్రాయ భేదములు కొన్ని కలవు. హిరణ్యాకశిపుని విష్ణువు నరసింహావతార కృత్తి చంపుటతో ప్రహ్లాద నాటకము ముగించిన యెడల అతని మరణము వలన, అతని భార్యకు ఆప్త బంధువులకు విషాదము కలుగును. గాని ప్రేక్షకులకు మాత్రము సంతోషమే కలుగును. అయినా ఇది విషాదాంత నాటకముగానే మన వారు భావించి ప్రహ్లాదుని పట్టాభిషేకముతో నాటకము పూర్తి చేస్తారు. మంగళ ప్రదమయిన భరతవాక్యం చదివిస్తారు. అంతేకాని ఆ బీభత్స దృశ్యముతో నాటకము ముగించరు.

ఇది పాశ్చాత్య దృష్టిలో ట్రాజడీ కానేరదు ఎందుచేతనంటే విషాదము ప్రేక్షకులకు కలుగలేదు. ప్రేక్షకులకు సానుకంపముతో పాటు విషాదము కలుగవలెను. ఒక విధమైన భయము కూడా జనింపవలెను. అది కలిగినప్పుడే అది ట్రాజడీ కాగలదు. ఇందులో ఒక చిక్కున్నది. సానుకంపము భయము రెండున్ను ఏకముఖముగా నడిచే లక్షణములు కావు. సానుకంపము మనమనస్సును దానిని కలిగించేవారి వద్దకు తీసికొనిపోతుంది. భయము మన మనస్సును దానిని కలిగించే వారి వద్ద నుండి దూరముగా తొలగిస్తుంది. ఈ రెంటికిని సమన్వయ మెట్లు కుదురును? సానుకంపము కలిగించే వ్యక్తి బాధితుడు. భయమును కలిగించే వ్యక్తి బాధకుడు. కనుక సమన్వయము సులువుగానే కుదరగలదు.

మరియొక విషయము కూడా ముందుగా తెలిసికొని ట్రాజడీ లెట్లు రూపొందినవో పరిశీలిద్దాము. ఏ ట్రాజడీ కయినా ఆఖ్యాధారము

నరహత్యవంటి ఘోర కృత్యమునకు పూనుకొన్నవాని మనస్సు పాప చింత కలది కావలెను. అది యీ రూపము దాల్చినప్పుడే సంఘము నకు హాని కలిగించే నేరమయి ప్రభుత్వ దండనకు పాత్రమవుతుంది. ఆ పాపచింతనము క్రియారూపమును దాల్చకపోయినా క్రియారూప మును దాల్చినను బయల్పడకపోయినా అది ఆత్మగతముగానైనా ఆ వ్యక్తిని బాధించకపోదు. సంఘములోని వారికి తెలియకుండా దాచినా సర్వజ్ఞుడైన భగవంతునికి తెలియకపోదు. నరక ప్రాప్తి తప్పదు. బయ ల్పడినప్పుడు మరణదండనమో యావజ్జీవిత కారాగార బంధమో కాక తప్పదు. పశ్చాత్తాపునికి ఆధ్యాత్మికముగా నిష్కృతిన్ని సాంఘిక ముగా ప్రతీకార తీవ్రత తగ్గుట క్షమించుట కూడా కలదు. ఈ నమ్మ కము దేవుడు, పుణ్యము, పాపము కలవని నమ్మినవారిలో కనబడు తున్నది. ట్రాజిడీ రచయితలు కూడా ఈ నమ్మకము కలవారయిన ప్పుడు ఈ నమ్మకమునకు అనుగుణముగానే తమ రచనలు సాగిస్తారు. ప్రేక్షకులుకూడా ఈ నమ్మకముకలవారే కనుక అట్టి రచనలనే మెచ్చు కోగలరు. అయితే అత్యాచారములు జరిపించేవారికి పాపభీతి లేదా ? తమ నేరము బయల్పడకపోయినా నరక ప్రాప్తి యమయాతనము కలుగునన్న భయములేదా ! దీనికి సమాధానమేమి ! మానవుడు దుర్బలుడు తగిన శిక్షణ, సంస్కృతి ఉంటేనే తప్ప ఆశాపాశములకు కట్టుపడకాడు. అవమానమో అసూయయో, కామమో ఉద్రేకించి నప్పుడు పాపభీతిలేక దుష్కార్యములు చేస్తాడు. అతని శీలము పడును పోయి పరుష మవుతుంది. లోకములో ప్రాకృత లక్షణములుగల మాన వుని జీవితము ఎట్లున్నదో ట్రాజిడీలు తెలియజేస్తవి. సంఘ జీవితము సాహిత్యమందు ప్రతిబింబింపజేయవలెనన్న లక్షణము ముఖ్యమయి నదిగా పరిగణించినవారు కనుక గ్రీక్ రచయితలు సంఘమందలి సద్గుణ ములు, దుర్గుణములను రెండింటిని తమ రచనలందు ప్రదర్శించినారు. సంఘ జీవితమును ప్రతిబింబితము చేయుటకంటె సద్ధర్మమును బోధిం చుటే ఎక్కువ ముఖ్యమయినదిగా పరిగణించిన వారు కనుక మన భారతీయ రచయితలు భీభత్సము కలిగించే దృశ్యములు తొలగించి, సద్ధర్మములను బోధించే సన్నివేశములనే ప్రదర్శించు నాటకములను

ప్రోత్సహించినారు. భీభత్స దృశ్యములు కలవయినా లోకమందెట్టి ఘోర కృత్యములు ప్రబలుతూ ఉన్నవో చూపించుట వలన మేలు కలుగునే కాని కీడు కలుగదనిన్ని, లోకములో ఒకొక్కప్పుడు అధర్మము జయించినట్లు కనబడినా జయించినా అది తాత్కాలికమే కాని స్థిరమయినది కాదనిన్ని బోధించేటట్లు కథ నడుపుటవలన నాటకములు చదివేవారున్ను, ఆ నాటక ప్రదర్శనములు చూచేవారున్ను సద్ధర్మములను అలవరచుకోగలవారు కాగలరనిన్ని కొందరు విశ్వసించి ట్రాజడీ నాటకములను ఆదరిస్తున్నారు.

షేక్స్పియరు కాలమునకు పూర్వము ట్రాజడీ రచనలు ఎట్లుదయించి పరిణమించినవో సంక్షిప్తముగానైనా తెలిసికొన్న యెడల షేక్స్పియరు రచించిన ట్రాజడీల రచనా సమర్థత ఎక్కువగా గ్రహించగలము గనుక యవనుల కాలమునుండిన్ని పరిణమిస్తూ వచ్చిన ట్రాజడీల చరిత్ర అతి క్లుప్తముగా తెలియజేస్తాను.

ఈ స్కైలస్ రచించిన నాటక త్రయమునకు ఓరెస్స్టియ త్రలజి అని పేరు. ఇందులో మొదటి దానిపేరు ఏగమెన్నన్, రెండవదాని పేరు కోఫొరోయి, మూడవదాని పేరు యూమెనిడీజ్.

కథా సంగ్రహము :-

ఆర్గస్ రాజయిన పేలప్సుకు ఇద్దరు కొడుకులు పెద్దవాడు ఏట్రియస్, చిన్నవాడు త్తైయెస్టీజ్. చిన్నవాడు తన అన్న భార్యయైన ఈత్రను చెఱచి వ్యభిచరించినాడు. ఆ సంగతి తెలిసిన్ని తెలియనట్లు నటించి, వ్యభిచరించిన తన తమ్ముని కొడుకులలో ఇద్దరిని రహస్యముగా చంపించి వారి మాంసము వండించి ఒక విందు ఏర్పరచి తన తమ్ముని ఆ విందుకు పిల్చి అతనిచేతను అతని పుత్రుల మాంసము తినిపించినాడు. తమ్ముడు తనకు చేసిన అపకారమునకు ప్రతీకారముగా ఏట్రియస్ ఈ జుగుప్సాకరమయిన పనికావించినాడు. తమ్ముడు చేసిన పని పాతకమే అయినా అతడు ప్రతీకారముగా చేసిన పని ఘోరతరమయిన పాతకముగా పరిణమించినది. ఇది ఆ అన్నదమ్ముల సంతతి వారికి బద్ధవైరమునకు ఘోరతర కృత్యములకు దారి తీసినది. గతించిన ఈ కథకు

పర్యవసానముగా ట్రీలజీలోని మొదటి నాటకము ఎగమెమ్నన్ అనే పేర రచయితమయినది. ఏట్రియస్ కొడుకులలో పెద్దవాడు ఎగ మెమ్నన్ మైసీని నగరమునకు రాజు; రెండవవాడు మెనలేయస్ స్పార్ట నగరమునకు రాజు. ఇతని భార్య హెలెన్ (జ్యూస్ దేవుని కూతురు) ఈమెను ఆసియా మైనరులో వాయువ్య దిక్కున సముద్ర తీరమందుండిన ట్రాయ్ నగర రాజు పారిస్ ఎత్తుకొని పోయెను. సీతాపహారణమువలన రామ రావణ యుద్ధము జరిగినట్లు ఈ హెలెన్ అపహారణమువలన ట్రోజన్ సంగ్రామము జరిగినది. ఇది పండ్రెండేండ్ల పాటు సాగినది. కనుక ఎక్కువ ఘోరమయినదిగా ఎన్నవచ్చును. హెలెన్ బావయైన ఎగమెమ్నన్ గ్రీక్ సేనలకు నాయకుడుగా యుద్ధము నడిపించెను. యుద్ధమునకు పోయేముందర ఎగమెమ్నన్ దేవ తల ఆశీస్సులను కోరి వారి ప్రీతికై తన కూతురయిన ఇఫజనియను బలిగా యిచ్చెను. గాని ఆమెను కాపాడి ఆర్టిమిస్ దేవత అర్చకు రాలుగా నియమించుకొనెను. ఎగమెమ్నన్, మెనలేయస్ మొద లయిన గ్రీకునాయకులు ట్రోజన్ సంగ్రామమునందు నిమగ్నులై యున్న కాలమందు త్రైయస్టీజ్ కొడుకులలో ఇద్దరు చనిపోగా సజీవుడై మిగిలిన మూడవ వాడు ఈజిస్తస్ పగ సాధించుటకు అవకాశము చిక్కినది. ఇతడు ఎగమెమ్నన్ భార్యయైన క్లీటమ్ నెస్ట్రను వశపరచు కొని భార్యగానుంచుకొన్నాడు. ఈమె అతనికి లోబడుటయేకాక తన కూతురయిన ఇఫజినియను దయావిహీనుడై దేవతలకు బలిగా సమ ర్పించినాడన్న కోపముతో ఈజిస్తసును గాఢముగానే ప్రేమించినది. ఈమెకు ఎగమెమ్నన్ వలన కలిగిన సంతానములో ఓరెస్టీజ్ అనే కుమారుడున్ను ఇలెక్ట్రా అనే కూతురున్ను తల్లియెడల తీవ్రమయిన కోపము కలవారే అయినా ఏమీ చేయలేక లోలోపల దుఃఖముతో కుమిలి యుండిరి. ట్రోజన్ సంగ్రామములో విజయుడై ఎగమెమ్నన్ తన నగరమునకు మరలి వచ్చినాడు. అంతేకాదు పారిస్ సోదరియైన కెసాండ్రాను తన సొత్తుగా తోడ్కొని వచ్చినాడు. క్లీటమ్నెస్ట్ర పతివ్రతగానే నటించి స్వాగతము పలికినది ముందుగా ఎగమెమ్నన్ తన మందిరములోనికి తన పరివారముతో క్లీటమ్నెస్ట్ర వెంట రాజ

గౌరవ మర్యాదలతో వెళ్ళినాడు. కెసెంద్రా ఇంకా మందిరము బయటను రథములోనే వున్నది. ఆమె కప్పుడే మందిరములో జరిగిన హత్యా దుర్గంధము నాసికకు తట్టినది ఎగమెమ్నన్‌ను క్లీటమ్నెస్ట్రి, ఈజిస్తులు హత్య గావించినారు. ఈజిస్తసు పగసాధించినాడు. ఆ నగరమునకు రాజున్ను క్లీటమ్నెస్ట్రికి మగడున్ను అయి బహిరంగముగా రాజ్యమేలుటకు మొదలుపెట్టినాడు. దీనితో త్రిలజీలో ఎగమెమ్నన్ అనే మొదటి నాటకము పూర్తి అయినది.

దీని తర్వాత వచ్చిన కథ choe phoroe అనే రెండవ నాటకమునకు ఇతివృత్తమయినది. ఎగమెమ్నన్ కుమారుడైన ఓరెస్టీజ్ తన కులవేల్పయిన అపాలో దేవుని ఆ దేశమును పాటించి తన ప్రాణమిత్రుడైన పైలడీజ్‌ను తన సోదరియైన ఇలెక్ట్రను తోడ్కొని పగసాధించుటకు ఆర్గస్ నగరమునకు వచ్చి తన తండ్రిని చంపిన ఈజిస్తసును క్లీటమ్నెస్ట్రిను చంపినాడు. క్లీటమ్నెస్ట్రి ఎంత దుష్టురాలనైనా నేను నీ తల్లిని గదా! నిన్ను కనిపెంచితిని గదా! నన్ను చంపవద్దని ఎంత బతిమాలుకొన్నా ఓరెస్టీజ్ వినలేదు; చంపివేసెను, అందుకు కోపావేశముతో మరణించిన క్లీటమ్నెస్ట్రి దయ్యమై ఫ్యూరీజ్ అనే భీకర మూర్తులను అహ్వానించినది. ఆ భీకరమూర్తులు ఓరెస్టీజును పట్టి చంపుటకు పరుగెత్తి వచ్చినవి ఆ భీకరమూర్తులను చూచి భయపడి ఓరెస్టీజ్ ఆర్గసు నగరమునుండి పారిపోయి డెల్ఫై నగరమందు ఆలయములో నుండిన అపాలో దేవుని శరణుచొచ్చెను.

దీని తర్వాత యూమెనిడీజ్ అనే పేరను మూడవ నాటకము కథాశేషమును పూర్తి చేసినది. అపాలోను ఆశ్రయించిన ఓరెస్టీజ్‌ను అతని చంపుటకై వెంబడించిన క్రోధమూర్తులును ఏథెన్జ్ నగరమందలి అతీన దేవాలయమందు ప్రత్యక్షమగుటతో ఈ నాటకము మొదలుపెట్టినది. ఓరెస్టీజ్‌ను రక్షింపదలచిన అపాలో దేవతయున్ను తల్లిని చంపిన ఓరెస్టీజ్‌ను చంపుటకై భీష్మించిన క్రోధమూర్తులున్ను న్యాయ స్థానమందలి అభియోగ ప్రత్యర్థులవలె నిలబడినారు. అరియాపగస్ న్యాయమూర్తి సమితివారు ఆ అభియోగ విచారణ కావించినది. పదుంతి సభ్యులలో సగం మంది ఒకరి పక్షము తరపున, సగం మంది

రెండవ పక్షము తరవున తీర్పు చెప్పుటకు సిద్ధమయిందని అప్పుడు అధ్యక్షత వహించిన సెలస్ అతీన తన అధికారమును వహించి ఓరెస్టీజ్ పక్షము తీర్పు చెప్పి, ఓరెస్టీజ్‌ను రక్షించినది. అప్పుడు క్రోధమూర్తులు యూమెనిడీజ్ అను పేరను శాంతమూర్తులయినారు. తల్లిని చంపుట వలన కలుషితమైన ఓరెస్టీజ్ ఆత్మ ప్రక్షాలితమయినది. అందరును తమ పగలకు స్వస్తి చెప్పి లోకకళ్యాణము శాంతి కలుగునుగాక అని కోరి అందుకు అనుకూలముగా ప్రవర్తించుటకు నిశ్చయించుకొన్నారు. ఇది రానున్న క్రైస్తవమతమునకు "సర్వేజనాః సుఖినోభవన్తు" అనే భారతీయుల నీతికి గాంధీమహాత్ముని ఆశయాలకు ప్రస్తుతము లోకమంతటా అన్ని దేశముల వారూ కోరుతూ ఉన్న ప్రశాంతి స్థాపన యత్నములకు సౌభ్రాత్రము, సౌహార్దయము, సౌజన్యము, లోకకళ్యాణము కావలెనన్న వాంఛలకు స్వాగతమనే సంఘటనగా పరిణమించినది.

ట్రాజిడీ రచయితలలో రెండవ వాడు సొఫక్లీజ్ (క్రీ. పూ. 495-406) ఇతడు రచించిన ట్రాజిడీలలో ఈడెపస్ అనేది, ఈస్కలన్ రచించిన ఓరెస్టీజ్ అంత ఘోరమయినది కాకపోయినా హృదయ విదారకమయినదే అనకతప్పదు. ఈడిపస్ తండ్రి లేఅస్; తల్లి జొకెస్టా, లేఅస్ తీబ్జ్ నగరమునకు రాజు. శత్రుభయము వలన ఈడపస్సు పసి కూనగా ఉన్నప్పుడే తల్లిదండ్రులకు దూరమయి పెరిగి పెద్దవాడయి వీరుడైనాడు. కారింత్ నగర రాజు పోషణలో సైన్యాధిపతియై స్ఫిన్క్స్ సమస్యను తీర్చి తీబ్జ్ నగర రాజును ఓడించి చంపి ఆనాటి మర్యాదలననుసరించి అతని భార్యను వశపరచుకొని తీబ్జ్ నగరమునకు రాజయినాడు. తన చేత నిర్జితుడై హతుడైనవాడు తన తండ్రి లేఅస్ అనిన్ని, తాను వశపరచుకొని పెండ్లి చేసి కొన్న ఆరాణి తన తల్లి జొకెస్టా అనిన్ని పాపమూ ఈడిపస్ ఎరుగడు. ఈ యువకుడు తన కుమారుడే అన్న విషయం పాపమూ తల్లికి తెలియదు. ఈ ఈడిపస్ జొకెస్టాలకు సంతానము కూడా కలిగినది. పొలినిసీజ్ అనే కొడుకు ఎన్టిగనీ అనే కూతురు జన్మించినారు. మరికొంత కాలానికి ఈ ఘోర [illegible] యథార్థతి తెలిసికొనుట సంభవించినది. అప్పుడు కలిగిన

దుఃఖము భరించ లేక జొకెస్టా ఆత్మహత్య చేసికొన్నది. ఈడిపస్ తన కన్నుల నుండి గ్రుడ్లు పెకలించుకొన్నాడు.

సొఫొక్లీజ్ రచనలలో వాస్తవికతకు ప్రాధాన్యమెక్కువగా కవి సంకల్పించినట్లు కనబడుతుంది. రచనలో ఎక్కువ ప్రౌఢత్వము సన్నివేశాల దృశ్యములలో ఎక్కువ స్పష్టత గోచరిస్తుంది.

యురిపిడీజ్ (481-406) ఈ గ్రీక్ ట్రాజడీ రచయితలలో మూడవ వాడు ఇంచుమించు సొఫొక్లీజుకు సమకాలీనుడే అని చెప్ప వచ్చు.

* * *

# షేక్స్పియరు రచించిన ట్రాజడీలు

షేక్స్పియరు పండ్రెండు ట్రాజడీలు రచించినాడు. వాటిలో హామ్లెట్, ఓతెలో, కింగ్‌లియర్, మాక్‌బెత్ – ఈ నాలుగున్ను ప్రౌఢమైన రచనలు; టైటస్ ఏన్ డ్రానికస్, జూలియస్ సీజర్, ఏన్టనీ అండ్ క్లియోపాట్రా, కొరియలానస్, ఈ నాలుగున్ను రోమన్ చరిత్రకు సంబంధించినవి. రెండవరిచర్డ్, మూడవరిచర్డ్ ఈ రెండున్ను ఆంగ్ల దేశ చరిత్రకు సంబంధించినవి. రోమియో అండ్ జూలియట్ ఇటలీలోని వెరోనా నగరమునకున్ను టైమాన్ ఆన్ ఏ తన్స్ గ్రీసు దేశమందలి ఏతన్స్ నగరమునకున్ను సంబంధించిన కథలు. వీటిలో రెండవ రిచర్డ్, మూడవ రిచర్డ్ నాటకములు రెండున్ను విషాదాంతములుగా ప్రకటితములయినవి గనుక ట్రాజడీలన్నామే కాని వాస్తవంగా చారిత్రక నాటకాలు గనుక ఆవర్గంలోనేచేర్చి విమర్శించినాను. తక్కువ 10 నాటకములలోను టైటస్ ఏండ్రానికస్ అనేట్రాజడీ మొదటిది. ఇది 1592 లో రచితమైనది. షేక్స్పియరు కిది ట్రాజడీ రచన విషయములో ప్రథమ ప్రయత్నము గనుక భాషలోను భావములోను

ప్రౌఢత్వము కనబడదు. గ్రీక్ రోమన్ ట్రాజిడీలలోని సన్నివేశముల అనుకరణములు ఎక్కువగా కనబడుతవి. వాటిలో ఉన్నట్లే ఘోరము యినదుశ్చరితము దానికి ప్రతీకారముగ ఘోరతరమయిన హత్యదానికి ప్రతీకారముగ అంతకన్న ఘోరమైన హత్య ఈ విధముగా ఆ ట్రాజిడీల వలెనే ఈ ట్రాజిడీ కూడా నడచినది. ఈ స్కైలస్ రచించిన ట్రిలజీలో ఏట్రియస్ తన భార్యను తన తమ్ముడు చెరచినాడన్న కోపముతో ఆ తమ్మునికి తెలియకుండా అతని కొడుకులలో ఇద్దరిని చంపి వారి మాంసమును పలావుగా వండించి అతనిచేత తినిపించినట్లే యీ టైటస్ ఏండ్రానికస్ నాటకములో ఏండ్రానికస్ తన కొడుకులలో ఇద్దరిని నిష్కారణముగా దుర్మార్గులు రాక్షసి వంటిది అయిన ఉమోరా (చక్రవర్తి భార్య) చంపించినదన్న కోపముతో ఆమె పుత్రులలో ఇరువురిని - తన కూతురిని బలవంతంగా చెరిచి ఆమె నాలుక, చేతులు ఖండించిన వారిని చంపి వారి మాంసం వండించి ఆ ఉమోరా చేతను తినిపించినాడు. ఇటువంటి సన్నివేశాలు గ్రీక్ రోమన్ ట్రాజిడీల నుండి తెచ్చుకొన్నవి. ఈ నాటకములో కనబడుతవి.

కథ తెలిసికొన్నగాని విమర్శ బోధపడదుగనుక సంక్షిప్తముగా కథ తెలియజేస్తాను :-

కథానాయకుడైన టైటస్ ఏంట్రానికస్ గాత్తులను జయించి రోమ్‌నగరము చేరుకొన్నాడు. గాత్తుల రాణియైన ఉమోరా, ఆమె ముగ్గురు కొడుకులు ఆమెకు ప్రియుడైన ఆరన్ అను పేరుగల మూర్ జాతివాడు అతనివెంట పట్టుపడిన వారుగా వచ్చారు. ఆ సమయమందే రోమ్ నగరమున చక్రవర్తి పదవికి ఎన్నికలు జరుపుటకు టైటస్ తమ్ముడును ట్రిబ్యూను అయిన మార్కస్ ఏండ్రానికస్, సెనేట్ సభ్యులు సభా సమావేశమును జరుపుకొన్నారు. గతించిన చక్రవర్తి కొడుకులు శటర్నైనస్ బాసియానస్ ఇరువురును చక్రవర్తిపదవి ఆశించినవారే. టైటస్ గంభీరముగా ప్రసంగించి కావించిన వెంటనే ఉపదేశమును పాటించి సభ్యులు శటర్నైనస్‌ను చక్రవర్తి పదవిని ప్రతిష్ఠింప చేసినారు. టైటస్ ఆ సమయమున తన కూతురైన లవీనియాను చక్రవర్తి కిచ్చి వివాహము జరుపుతున్నానని పలికెను. ఆమెకదివరకే బాసియా

నస్ ప్రేమించి వశపరచుకొని యున్నవాడుగనుక ఆమె చేయిపట్టుకొని ఈమె నా భార్య అని తన ప్రక్కకు తీసికొన్నాడు. శటర్నైనస్ అందుకేమీ తగవులాడక గాత్తుల రాణియైన ఉమోరాను చేపట్టి తన రాణిగా నుంచుకొన్నాడు. అందుకు తక్కిన వారందరును సమ్మ తించారు: ఇంతవరకును కథ ప్రశాంతముగానే సాగినది. కాని కథ విషాదమగుటకు మొదలు పెట్టినది. టైటస్ కొడుకులు ఇరవైయైదు గురిలోను ఇరవైఒక్కరు గాత్తులతోడి యుద్ధములందు హతులైనారు. కనుక వారి ఆత్మశాంతికై ఉమోరా ముగ్గురి కొడుకులలోను పెద్దవాడ యిన అలార్బస్సును బలిగా హోమగుండమున పడవేసినారు. ఆ సమ యమున ఉమోరా ఎంత దీనముగా బతిమాలుకొన్నా కార్యము లేక పోయినది. ఆ ఘోరకృత్యమునకు ప్రతీకారము కావించవలెనన్న కోరిక ఉమోరాకును, ఆమెకు ప్రియుడైన ఆరన్‌కును ఆమె కొడుకులలో మిగిలియున్న ఇద్దరికిని కలిగినది. అందు కనుకూలమయిన సమయము, స్థలము సమకూడినవి. చక్రవర్తి నగరము వెలుపల వినోదార్థము అడ వులలో వేట యేర్పాట్లు కావించెను. ఎవరికిష్టమయిన క్రీడలో వారు తమ కనుకూలమయిన ప్రదేశమందు విహరించుటకు వీలు చిక్కినది. అలార్బస్సును బలిగా హోమగుండమున పడవైచెనన్న కోపముతో ఉమోరా టైటస్ వారందరును పగ సాధించుటకు వీలు చిక్కినది. బాసియానస్ టైటస్‌కు అల్లుడగుటవలన ఉమోరా పార్టీకి శత్రువై నాడు. కనుక అతనిని ఆమె తనప్రియుడైన ఆరన్‌చేత చంపించి ఆఅడ విలో ఒకమూల ఘుమగుండ మనదగిన లోతుగల ఒక గోతిలో కూలు నట్లు చేసినది. పైకి గోయివలె కనబడకుండునట్లు కొమ్మలు రెమ్మలు ఆకులు దట్టముగా పేర్చి ఆరన్ కప్పివుచ్చినాడు. టైటస్ కొడుకులిద్దరు ప్రమాదవశమువ ఆ గోతిలో పడుట సంభవించినది. ఉమోరా కొడుకు లిద్దరును లవీనియాను ఎత్తుకొనిపోయి ఒక మారుమూలచోట ఆమెను చెరచి ఆమె నాలుక తెగకోసి రెండుచేతులను ఖండించి విడచిపెట్టి పోయినారు. ఆరన్ టైటస్ కొడుకులే బాసియస్‌ను చంపినారని వెల్ల డించాడు. చక్రవర్తి అతని మాటలను నమ్మి ఆ యువకులేమి చెప్పు కొనుటకును అవకాశమీయక వారికి మరణదండనము విధించినాడు.

అందుకు టైటస్, మార్కస్ ఏంద్రానికస్, టైటస్ కొడుకు లూసియస్ ఈ ఘోర సంఘటనలకు దుఃఖిస్తూ ఉండగా ఉమోరా ఆరమ్‌ను వారి వద్దకు పంపి వారిలో ఎవరైనా తనచేయి ఖండించుకొని పంపినయెడల చక్రవర్తి ఆ ఇద్దరు యువకులను చంపక విడచి పెట్టగలడని తెలియ జేసెను. టైటస్ తన చేయి ఖండించుకొని పంపించాడు. కాని ఆ మాట వట్టిదయినది. చక్రవర్తి ఆ యువకులను చంపించి వారి తలకాయలను, టైటస్ పంపిన చేతిని వానికి అందజేసినాడు. అంతేకాక లూసియసు (టైటస్ కొడుకు) విప్లవదారుడని నేరముమోపి రాజ్యము నుండి వెడలగొట్టెను. ఆ లూసియస్ గాత్తులను ఆశ్రయించి వారి సేనలతో దండెత్తి రోమ్ నగరమును ముట్టడించెను. చక్రవర్తి భయ పడి టైటస్ వద్దకు రాయబారులను పంపి అతడు జరిగినదంతా మరచి తనను రోమ్ నగరమును రక్షింపవలసినదని కోరినాడు.

టైటస్ తన దుఃఖము ఎట్లు మరువగలడు! క్రోధమును ఎట్లు శాంతింప చేసికోగలడు! ఈలోగా ఉమోరాకు పురుడు వచ్చినది. పుట్టిన కొడుకు ఆరమ్‌ను పోలియుండెను. ఆ శిశువును చూచినవారికి ఆ శిశువు ఆరమ్‌కు పుట్టినట్లు తట్టకమానదు. అయితే ఆ శిశువును కన్నతల్లి, మంత్రసాని, నర్సు తప్ప తక్కిన వారెవరును చూడకుండా ఉన్నప్పుడే ఆరమ్ చూచినాడు గనుక ఆ నర్సును, మంత్రసానిని చంపి సాక్ష్యమిచ్చే వారెవరును లేకుండాచేసి రహస్యముగా ఆసమయమందే పుట్టిన శిశువును తెప్పించి ఉమోరా పడక గదిలో తల్లి పక్కన పెట్టించి తనకు పుట్టిన ఆ శిశువును రహస్యముగా ఊరి వెలుపలనున్న ఒక గుడికి తీసికొనిపోయెను. ఈలోగా కొందరు గాత్తు సైనికులు అతని చూచి పట్టుకొని టైటస్ వద్దకు తోడ్కొని వచ్చినారు. లూసియస్ తన గాత్ సేనలను ఊరిబయటనే ఉంచి తన తండ్రివద్దకు వచ్చినాడు. ఉమోరా కడపటిసారి రాయబారిగా టైటస్‌వద్దకు మారువేషములో వచ్చినది. టైటస్ మెత్తని మనస్సుగల వానివలె నటించి హైత్రి సమకూర్చెదనని చెప్పి ఆరాత్రి విందు ఏర్పరచి. చక్రవర్తిని, ఉమోరాను ఆమె పిలలను ఆహ్వానించినాడు. ఆ తర్వాత ఆ పిల్లలను రావించు వారితో నిద్రించి మాటలాడుతూ ఉన్నట్లే నటించి

లోనికి తీసికొనిపోయి వారిని చంపి వారి రక్తమాంసములతో పలావు వండించి ఆ రాత్రి విందులో ఉమోరాచేత తినిపించినారు. టైటస్ ఇంత ఘోరంగా పగతీర్చుకొనుటవలన తనకు చావు తప్పదనిభావించి అప్పుడు నాలుక, చేతులు తెగిన తన కూతురు లవీనియా బ్రతుకు మరింత దుర్భరము కాగలదు గదా ఆమెను తానే చంపి ఉమోరాను కత్తితో పొడిచి చంపెను. అతనిని చక్రవర్తి చంపెను. ఆ చక్రవర్తిని లూసియస్ చంపెను. ఈ మూడు హత్యలున్ను ఒకటి తర్వాత ఒకటి వడివడిగా జరిగినవి ఇక మిగిలినవారు – టైటస్ తమ్ముడు, మార్కస్ కొడుకు లూసియస్, మనుమడు చిన్న లూసియస్, మార్కస్ కొడుకు పబ్లియస్, ఉమోరా ప్రియుడు ఆరన్ అతనికి పుట్టిన శిశువు ఇంకా చిల్లర సేవకులు. ఆరన్ పశ్చాత్తప్తుడై జరిగిన కథ అంతా వివరించి తెలియ జేసాడు. అతని ఘోరాతి ఘోరాలకు మరణము తగిన దండ నము కాజాలదు. ఘోరాతి ఘోరమయిన దండనము దినదిన గండము వేయేండ్లాయువు అన్నట్లు వుండవలె నన్నారు. టైటస్ కొడుకును తమ చక్రవర్తిగా రోమనులు ప్రకటించారు. చచ్చినవారికి ఖనన సంస్కా రాలు యథావిధిగా జరిగినవి. ఏ సంస్కారము లేకుండా ఉమోరా దేహమును అడవిలో కాకులు, గద్దలు, నక్కలు అడవి మెకములు తినుటకు వీలుగా పారవేయవలెనని లూసియస్ చక్రవర్తి శాసించాడు.

ఈ నాటకము నలభై సంవత్సరాల క్రిందట సగము చదివి మరి చదవ లేక విడచి పెట్టినాను. ఇప్పుడు చదవక తప్పదుగదా అని కష్ట పడి చదవ గలిగినాను. చదువుతూ ఉన్నప్పుడు ఇది వట్టి కథయని తెలిసి ఉండిన్నీ కంట తడి పెట్టకుండా చదవలేకపోయినాను. ఈనాటక ప్రదర్శనము ఎలిజబెత్ కాలంనాటి ప్రజలు ఎట్లు చూడగలిగినారో ! అన్న ఆలోచనలో పడ్డాను. బహుశా ఆ దినములలో ఇట్టి ఘోరమైన ట్రాజిడీల ప్రదర్శనాలకు ఆనాటి ప్రజలు అలవాటుపడినారు కాబోలు !

ఈ నాటకము హత్యలతోను ప్రతీకార హత్యలతోను జుగుప్స కలుగుజేసే దృశ్యములతోను నిండియున్నది. రచనలో ఉదార ఆశయ ములుగాని భావ గాంభీర్యముగాని, సద్భావములుగాని అంతగాలేవు. రచనలో ప్రౌఢత్వము కనబడదు. అయినా కవితా కళా ధర్మము లేక

పోలేదు. అక్కడక్కడ మానవత్వము తొంగి చూడకపోలేదు. ఉమోరా తన పెద్ద కొడుకు బలిగుండమునకు తీసికొనిపోతూ ఉన్న ప్పుడు టైటస్‌ను కలిసికొని నాయనా! యుద్ధములో మరణించిన నీ కొడుకుల ఆత్మశాంతి కోసం నా కొడుకును బలిగా అర్పించి హోమ గుండమున పడవేయదలచినావా! నీ కొడుకులు నీకెంత ప్రియమయిన వారో నా కొడుకు నాకంత ప్రియమైనవాడు కాడా! అంటుంది (చూ. అం 1 దృ 1 పం 104) అప్పటికీ ఆమె టైటస్‌కేమీ అపచా రము చేయలేదు. ఈ ఘోర కృత్యముతోనే ఘోరాతి ఘోర ప్రతీ కారములు వడివడిగా జరిగినవి.

మరియొక సమయమున (చూ III -2-50) టైటస్ తన యింట మార్కస్, లవీనియా, చిన్న లూసియస్‌లతో భోజనము చేస్తూ ఉన్న సమయమందు లవీనియా భంగపాటు, అవస్థ తలచుకొని దుఃఖిస్తూ ఉన్నప్పుడు ఆహార పదార్థములగల పళ్ళెముపైని ఒక ఈగ వ్రాలినది. దానిని మార్కస్ కత్తితో పొడిచి చంపినాడు. అప్పుడు టైటస్ జాలి పడి- "మార్కస్! నీవు ఘాతకృత్యము కావించితివి. నా గుండెను పొడిచి నట్లయినది. పాపం! పాపలేక అమాయకమైన ఈగను చంపి నాడవు. ఈపని నా తమ్ముడైనవాడు చేయదగినది కాదు" అన్నాడు. "ఈ ఈగ ఆమూర్ వంటిదిగా నాకు కనబడినది" అన్నాడు మార్కస్. "మంచి పని చేసితివి. ఆ ఆరన్ అతి నీచుడు. అతడు మనకు ఘోర మైన అపకారము చేసినాడు. అదిచాలక మన భోజన పదార్థములలో విషము కలుపుటకు ఈ ఈగను పంపినాడు కనుక చంపితివి" అన్నాడు టైటస్. ఇందులో టైటస్ మదిలో శబలితమైవున్న మనోభావములను షేక్‌స్పియరు ఎంత చక్కగా విశదపరిచినాడు.

ఈ మొదటి ట్రాజిడీలో రాబోయే ట్రాజిడీలలోగల కొన్ని సన్నివేశాలకూ, సంఘటనలకూ సూచన లనదగినవి కలవు :-

శటర్నైనస్, ఉమోరాల వివాహము సహజమైనది కాదు. దీని తర్వాత 1594 లో రచితమైన రోమియో అండ్ జూలియట్ అనే ట్రాజిడీలో విరోధముగల రెండు భిన్న కుటుంబములకు చెందిన రోమియో జూలియట్లులు దంపతులైనారు. ఐతే వీరి దాంపత్యము

ప్రేమోద్రేక ఫలితమయినది. ఆన్టనీ క్లియోపాత్రాల దాంపత్యం కూడా ఇట్టిదే. హామ్లెట్ నాటకములో ఒఫీలియా అవస్థకు సంబంధించిన ఘట్టములు చదువుతున్నప్పుడు వసీనియా అవస్థ జ్ఞప్తికి వస్తుంది. జూలియస్ సీజర్‌లో రోమన్ల అవివేకపు తొట్రుపాటు ఈ నాటకమందు నిరూపితమైనట్లే నిరూపితమైనది. కోరియలానస్‌లో కోరియలానస్ తల్లి వోలమ్నియా కుమారునితో పలికిన మాటలు ఊమోరా టైటస్‌తో తన కుమారుని చంపవద్దని వేడుకొన్న మాటలవలె స్త్రీలకు సహజమైన పలుకులుగాను, జాలి కలిగించునట్టివిగాను గోచరిస్తవి. హామ్లెట్ నాటకములో వినోదార్థము కత్తిపోటు క్రీడ జరుగుతూ ఉన్న సమయంలో నడివడిగా జరిగిన గెర్ట్రూడ్, క్లాడియస్ వేయర్ప్రిబ్, హామ్లెట్ మరణముల గూర్చి చదువుతూ ఉన్నప్పుడు ఈ నాటకమందు విందు సమయమున వడివడిగా జరిగిన, లవీనియా, ఊమోరా, టైటస్, శటర్నైనస్ మరణముల విషయము జ్ఞప్తికి వస్తుంది. ఈ విధముగా రాబోవు నాటకములలోగల సంఘటనలకు సన్నివేశములకు ఈ నాటకములోగలవి భావిసూచకములుగా కనబడుతవి.

*   *   *

# రోమియో అండ్ జూలియట్

ఇది రెండవ ట్రాజిడి; 1594 లో రచితమయినది.

కథా సంగ్రహము:-

ఇటలీ దేశమందలి వెరోనా నగరమున మాంటేగ్ కాప్యులెట్ అనే రెండు కుటుంబముల వారికి కొన్ని తరముల నుండిన్ని విరోధము అనుక్రమిస్తూ ఉండెను. ఈ విరోధము కుటుంబనాథులకే కాక వారి కుటుంబములోని వారికిన్ని వారి బంధువులకున్ను సేవకులకున్ను వ్యాపించి యుండెను. మన కథా కాలము నాట కాప్యులెట్ కుటుంబ యజ

మానుడు సర్ కాప్యులెట్ ఒక విందుచేసి తన బంధుమిత్రులను ఆహ్వా నించెను. విరోధులు గనుక మాంటేగ్ కుటుంబము వారి నెవరినీ ఆతడా హ్వానించలేదు. అయినా ఆ మాంటేగ్ కుటుంబమునకు పెద్దయయిన సర్ మాంటేగ్ కుమారుడు మారువేషముతో ఆ విందుకు వెడలెను. అందుకు కారణమేమంటే అతని మనస్సును ఆకర్షించిన రోజలిన్ అనే ఒక యువతి ఆ విందుకు వస్తుంది గనుక ఆమెను తృప్తితీర చూడ వచ్చును గదా అని ఆశించెను. కాని ఆ విందులో నుండిన జూలియట్ అనే కన్య రోజలిన్ కంటె చాల ఎక్కువగా అతని హృదయమును ఆకర్షించినది. కనుక ఆమెనే ఎక్కువగా చూస్తూ ఉండెను. ఆమె ఎవరో తెలిసికొనవలెనన్న కోరిక అతనికి పుట్టినది కాప్యులెట్ ప్రభువు భార్యకు మేనల్లుడైన టైబాల్ట్ అతనిని గుర్తింప గలిగెను. అతని ఉద్దేశము తెలిసికొని ఈ విందు వేడుక సమయములో నీవేమీ రసాభాస చేయగూడదని రహస్యంగా చెప్పుట వలన టైబాల్ట్ ఏమీ చేయలేదు అనలేదు.

జూలియట్ కూడా రోమియోను చూచి మోహపరవశురాలై నది. ఆ సుందరుని పేరు కూడా తెలిసికొన్నది. విందు ముగిసిన తర్వాత జూలియట్ బాల్కనీ మీదికిపోయి తన ప్రేమ విషయం అన్యాప దేశముగా వెల్లడించినది. ఆసమయమందు ఆ బాల్కనీ క్రింద నుండిన రోమియో ఆమె పలుకులు విని ఆమెకు తన మీాద మక్కువ ఉన్నట్లు తెలిసికొని సంతోషముతో ఆమెను కలిసికొని ప్రసంగించినాడు. ఇరు వురును సంప్రతించుకొని రహస్యముగా పెండ్లి చేసికొనుటకు సమ్మతించి ఆ మరుసటి దినమే రోమియోకు మిత్రుడైన ఫ్రయర్ లారెన్స్ వద్దకు పోయి అతని యాజమాన్యమున అతని శుభాకాంక్షలతో పెండ్లి చేసి కొనిరి. వివాహమైనదినముననే రోమియో మిత్రులిద్దరు—బెన్ వోలియో, మెర్క్యూటియోలు వెరోనా వీధులలో పంచరిస్తూ ఉండగా టైబాల్ట్ వారిని కలిసికొని ఆహూతుడు కాకపోయినా విందారగించుటకు వచ్చి యుండిన రోమియోనుకలిసికొని తగవులాడదలచినట్లు తెలియజేసినాడు. అప్పుడా రోమియో మిత్రులతో టైబాల్ట్‌కు జగడము పుట్టి అంత కంతకు ఎక్కువయి విషమించబోవు సమయమునకు రోమియో ఆ స్థల

మునకు వచ్చుట సంభవించినది. జూలియట్‌ను వివాహ మాడి వస్తూ ఉన్నవాడు గనుక వారి జగడమాపుటకు ప్రయత్నించినాడు. తనను టైబాల్ట్ నిందించినా పట్టించుకోక మంచి మాటలాడి అతని నిందకు సమాధానము శాంతముగా తెలియజేయుటకు పూనుకొనెను. కాని అతని మిత్రులు రోమియో మెత్తని మాటలు దౌర్బల్యమును చూపించునవిగా ఎంచినారు వారిలో మెర్క్యూటియో తొందరపడి దుర్భాషలాడుతూ ఉండిన టైబాల్ట్‌ను కత్తితో పొడవబోగా టైబాల్ట్ తన కత్తి దూసి మెర్క్యూడియోను చంపెను. అందుకు రోషము తెచ్చుకొని రోమియో టైబాల్ట్‌ను పొడిచి చంపెను. ఈ హత్యా నేరము వెరోనా పాలకుడైన ఎస్కాలస్ విచారణకు వచ్చినది. రోమియోను దోషిగా ఎంచి ఆ ప్రభువు రోమియోకు ప్రవాస దండనము విధించెను. రోమియో నగరము విడిచిపోవలసి వచ్చినది. నూతన దంపతులు ఒక్క రాత్రి మాత్రమే సుఖముగా గడిపి ఎడబడవలసి వచ్చినది. జూలియట్ ఎక్కువగా దుఃఖించినది. వీరి వివాహ విషయం ఏమీ తెలియని సర్ కాప్యులెట్ తన కూతురు జూలియట్టును తనకు దగ్గర బంధువైన పారిస్సు నిచ్చి పెండ్లి చేయ దలచుకొన్నాడు.

ఈ విషమ పరిస్థితికి మతి ఏమిచేయుటకును తోచక జూలియట్ ఫ్రయర్ లారెన్సు వద్దకుపోయి ఏమిచేయవలెనో ఉపదేశిండుమని అతనిని వేడుకొనెను. తండ్రి కుదిర్చిన సంబంధమునకు సమ్మతించిన దాని వలెనే నటించుచు వివాహము కావలసినదినము "ఇదిగో నేను ఇస్తున్న ఔషధము ఎవరికిని తెలియకుండా త్రాగు దీనివలన నీవు చనిపోయిన దానివలె పడియుందువు. నీవు చనిపోయినావన్న అభిప్రాయముతో నీ దేహమును శ్మశాన స్థలమునకు తీసికొని వెళ్తారు. ఈలోగా రోమియోకు కబురు అందుతుంది. అతడువచ్చి నిన్ను రక్షిస్తాడు." అనిచెప్పి ఫ్రయర్ లారెన్స్ ఒకఔషధము ఇచ్చినాడు. అతడు చెప్పినట్లే జూలియట్ ఆచరించినది. కాని ఆమె చనిపోయినట్లు పడియుండుట చూచి వాస్తవంగానే చనిపోయినదని ఆమె బంధువులు ఆమె దేహమును శ్మశానమునకు తీసికొనిపోయి పాతిపెట్టుటకు సిద్ధముగా నుండిరి.

ఆమె చనిపోయినదన్న వార్త రోమియోకు తెలిసినది. అతడు వెంటనే ఆమె పడియున్నచోటికి వచ్చి ఆమెలేని బ్రతుకు నాకెందుకని విషము తెచ్చుకొని ఆత్మహత్య చేసికొని ఆమె ప్రక్కనే తానుకూడా పడియుండుటకు నిశ్చయించుకొన్నాడు. ఆమె యుండిన గదిలోనికి వెళ్ళడానికి చూస్తూ ఉండగా ఆమెను పెండ్లియాడవలసిన పారిస్ అతనిని అడ్డగించినాడు. అతనిని చంపి లోనికిపోయి విషము త్రాగి జూలియట్ ప్రక్కనే పరుండి మరణించినాడు. మరి కొంతసేపటికి జూలియట్‌కు తెలివి వచ్చినది. ఆ సమయానికే ఫ్రయర్ లారెన్సు వచ్చి యుండెను. జరిగినదంతా అతనివలన తెలిసికొని నా ప్రియుడు లేని బ్రతుకు నాకెందుకని ఆమె రోమియో ప్రక్కనున్న కత్తితో తన హృదయమును పొడుచుకొని మరణించినది. ఈ ఉభయుల ఘోర మరణముల ఫలితముగా ఆ రెండు కుటుంబముల వారున్ను మైత్రి చేసి కొన్నారు.

ఈ నాటకము ట్రాజిడియే అయినా శృంగార రస భూయిష్ట ముగా మొదలుపెట్టినది. యువకుల ప్రేమకు సంబంధించునది. ఇరవై ఎనిమిదేండ్ల యువకుడుగా ఉండిన షేక్స్పియరు రచించినది. ప్రేమికు లయిన నాయికా నాయకులు వలెనే షేక్స్పియరు కూడా విశ్వవిద్యా లయ విద్యార్థులవలె గ్రంథములోని కావ్య భాషా పదములకు అల వాటు పడినట్లు నాటక రచన సాగించినాడు. నాటకములో మొదటి హత్య (మెర్క్యూటియో మరణము) జరిగినదాకా శృంగార హాస్యరస భూయిష్టములయిన పదజాలము కనబడుతున్నది. వెరోనా నగరమం దలి వీధిలో తన మిత్రులకున్ను టైబాల్టుకున్ను జగడము జరుగుతూ ఉండినప్పుడు తన రహస్య వివాహము కావించుకొనివచ్చిన రోమియో పలికిన మాటలు పరస్పర విరుద్ధములయిన ద్వంద్వ పదములతో నిండి యుండెను. ఆ పదములు గల పంక్తులు (చూ ) చదువుతూ ఉన్నప్పుడు సర్వజ్ఞ సింగ భూపాల విరచితమైన రత్నపాంచాలిక (కువల యావళి) నాటకమందలి మొట్టమొదట శ్లోకము జ్ఞప్తికి వచ్చినది !–
"శృంగార వీర సౌహార్దల। మాధ్యమైయాశ్య సౌహృదయం। కాప్య తాండవ సౌజన్యం। దాంపత్యం తద్ భజామహే॥" నాటకము

లోని సన్నివేశములు కూడా అనాలోచిత సంఘటనలుగాను, అనుకూల ప్రతికూల సంఘటనల కలయికలుగాను పరిణమించినవి. సర్ కాప్యులెట్ తన యింటి విందుకు గండని వ్రాసిన ఆహ్వాన పత్రికలు ఆహూతులకు బట్వాడా చేయుటకు తీసికొని వెళ్ళిన సేవకుడు ఎవరి పేరను ఏ పత్రము నున్నదో తెలిసికోలేక రోమియో సాహాయ్యము ఆపేక్షించుట సంభవించినది. జూలియట్ మనసార ప్రేమించి వివాహమాడవలెనన్న ఉద్దేశముతో ఆమె తల్లి పారిస్ సౌందర్యమును వర్ణిస్తూ "అతడొక చక్కని గ్రంథము వంటివాడనిన్ని ఆ గ్రంథము యొక్క చక్కదనమునకు సుందరమైన అట్టలే లోపముగా ఉన్నవనిన్ని ఆ లోపము సుందరాంగియైన జూలియట్ కలియకవల్ల తీరుటయే కాక పారిస్ పూర్ణ చంద్రవదనుడై మరింత ఎక్కువగా శోభిల్లగలడనిన్నీ బోధిస్తుంది." (చూ 1, 3) "నా వివాహమునకు వీరు (అనగా తలిదండ్రులు) తొందరబడనేల?" అని జూలియట్ అన్నప్పుడు మన హైందవ మాతలన్నట్లే ఆమె తల్లి కూడా పలికినది. "ఈ వెరోనా నగరమందు నీ కంటె చిన్న కన్యలు పెండ్లి చేసికొని బిడ్డల తల్లులైనారు నీ యిప్ప యీడున ఉన్నప్పుడే నాకు నీవు పుట్టినావు. నీపెండ్లికి మేము తొందరపడుటలో వింతలేదు. ఇది మాకు విహితమైన కార్యము" అని ఆమె పలికినది.

"ప్రేమ ప్రేమ అని ప్రేమను తలచుకొని మురిసిపోయేవారు వట్టి తెలివితక్కువ నాగమ్మలు. ప్రేమ పిచ్చిది. గ్రుడ్డిది. మంచీ చెడ్డా ఆలోచించక ప్రేమించుకొన్నామని, పెండ్లి చేసుకొన్నవారు ఆ ప్రేమ తాలూకు మొదటి పొంగు అణగిపోగానే కలతలకులోనై తమ జీవితము దుఃఖభాజనము చేసికొంటారు. పసిపిల్లలకు తమకేది మంచిదో ఏది కాదో అనుభవము లేకపోవుటవల్ల తెలియదు. అనుభవముగల తలిదండ్రులు సంప్రదాయము సిరీ సంపదా, కుటుంబ గౌరవము కుదిర్చిన సంబంధాలు ఎన్నికకు వస్తవి." అని భావించే పెద్దలు ప్రతి యుగంలోను ఉంటారు. షేక్స్పియరు నాటకాలలో సర్ కాప్యులెట్ వలె పలికిన వారు పొలొనియస్‌ల ఫోమెసీనియస్. రెండవ రిచర్డ్‌లోని యార్కు ప్రభువు మొదలయినవారు ఎందరో ఉన్నారు. వయస్సును

బట్టి ప్రేమకు సంబంధించిన భావాలు మారుతూ ఉంటవి. తాను తెచ్చిన సంబంధమునకు అనుకూలముగా లేనట్లు కనబడగానే జూలియట్‌ను కోపముతో తండ్రి సర్ కాప్యులెట్ కూతురిని తూలనాడినట్లే నేటి తండ్రులలో కూడా తాము తెచ్చిన సంబంధాలకు సమ్మతింపని కొడుకులను తిట్టి ఇంటి నుండి వెడలగొట్టిన వారున్నారు. ప్రేమోద్రేకముతో చేసికొన్న వివాహమునకు ముప్పుకలిగితే "నేనప్పుడే అన్నాను యిది సవ్యంగా పరిణమించదని ! నా మాట విన్నాడు కాదు" అనేవారు. తాము తెచ్చిన సంబంధమునకు సమ్మతించి చేసికొన్న వివాహమునకు అట్టి ముప్పే కలిగినప్పుడు "అది వాడి గ్రహచార ఫలము. ఎవరు చేసికొన్న కర్మ వారనుభవించక తీరదు" అని వేదాంత వాక్యములు పలుకుతారు. వివేకులయినవారు కుటుంబ సంప్రదాయముతో పాటు యువకుల ఇష్టాయిష్టములు కూడా పాటిస్తారు.

షేక్‌స్పియరు మనకు నీతిని బోధించుటకు పూనుకొని నాటకాలు రచించలేదు. లోక పరిస్థితులు ఉన్నవి ఉన్నట్లుగా అద్దంలో ప్రతిబింబితము లగునట్లు రచిస్తున్నాడు. వాస్తవికతతో పాటు తనకు నచ్చిన నీతి ననుసరించి కళాభిజ్ఞతతో తన రచనలు తీర్చి దిద్దుకొంటున్నాడు. లోకో భిన్న రుచిః అని కదా అంటారు. అందుచేత భిన్న రుచులుగల పాఠకుల నందరినీ మెప్పించగలడా ? ఇది సహజమా ? భావ్యమా! సంభావ్యమా ? అని పరిశీలించి దేశ కాల పాత్రలను అర్థం చేసికొని మనము అతని గ్రంథములను విమర్శించాలి. అంతేకాక అతడు తన నాటకాలు తనను పోషిస్తూ ఉన్న సమాజములవారు ప్రదర్శించడం కోసం రచించిన నాటకాలు జనరంజకంగా ఉండాలి అలాగని పామర జనుల నీచభావములకు అసభ్యతలకు లోబడి అతడు తన రచనలు సాగించినట్లు కనబడదు. ప్రేక్షకులకుజ్ఞానోపదేశము కలిగించేవిగాను ఉదాత్త భావములు పేరేపించునట్టివిగాను ఉన్నవా? లేవా? అని కూడా మనం చూడాలి. ఈ దృష్టితోనే ఈ 400 సంవత్సరాలలోను పుట్టిన విమర్శకులు అతని నాటకాలు విమర్శించారు. కొన్ని విషయాలు వచ్చునివి కనబడ్డా మొత్తముమీద మంచియే ఎక్కువగా కలదని మెచ్చుకొన్నారు. షేక్‌స్పియరు రచించిన నాటకాలు విమర్శిం

చిన వారిలో ఎవరికెన్ని లోపాలు కనబడ్డా ఒక ముఖ్యమయిన విషయంలో అందరును ఏకీభవిస్తున్నారు. అతని నాటకాలు చదివిన వారికి గాని ప్రదర్శించినప్పుడు చూచిన వారికిగాని ఒక విచిత్రమైన అనుభవం తప్పకుండా కలుగుతూ వుంటుంది. కొన్ని సన్నివేశములలో నిమగ్నులయి ఇది నాటకమన్నమాట మరచి ఆయా పాత్రలలో లీనమయిపోయి సాను కంపమును పొందడం సంభవిస్తుంది. దీనికి షేక్స్పియరు రచనలో ప్రదర్శించిన కళా కౌశలము, పాత్రపోషణము, భాషాశక్తి కారణమనక తప్పదు. ఈ సద్గుణములు ఈ నాటకములో ఎక్కువగా కలవు. కనుకనే ఇది తరచుగా ప్రదర్శిస్తూ ఉంటారు.

ఈ నాటకములలో పద చమత్కారం ఎక్కువగా కనబడుతుంది. భావి సూచకములయిన, ధ్వని, శ్లేషగల పదములు అనేకముగా వున్నవి. అవి ఇతరభాషలలోనికి అనువదించి తెలియచేయుట సాధ్యము కాదు. ఒక్కొక్కప్పుడు రెండుభిన్న భాషలలో సమానశ్లిష్టార్థములుగల మాటలు కనబడుతవి. ఈ నాటకములో జూలియట్ సౌందర్యమును గూర్చి "Beauty two rich for use, for earth two clear" అని రోమియో చమత్కరించి వర్ణించాడు. ఈ వాక్యములో to top rich use earth, dear అనే మాటలు శ్లిష్టార్థములు గలవి. ఈ మాటలకు అనువాదములుగా అమూల్యము అనగా చాల విలువగల వెల (కట్టుటకు వీలులేని), వాడుటకు – అనగా వాడుక చేయుటకు వాడిపోవుటకు ! నేల అనగా భూమి, మట్టి, చాలా ప్రియమైన అనగా మనోహరమైన, ఎక్కువ ధరగల చెప్పదగిన పదములు మన భాషలో ఉన్నవి. మనదేశ కవులు కూడా మాటలు చమత్కరించి ప్రయోగిస్తూ వుంటారు. ఉదా.– రత్నపాంచాలిక (కువలయావళి) నాటకములో నాయకురాలి కంటిలో పుష్పపరాగము పడి బాధించినది. చెలికత్తె ఊది ఆ పరాగము వెడల గొట్టినది. కాని కంటిలో పుట్టిన మెర మెర, ఎరుపు రంగు ఇంకా ఉండినవి. ఆ సమయమందలి సన్నివేశము నాయకుని దర్శన భాగ్యము, అకస్మాత్తుగా పుట్టిన ప్రేమ కలది. కనుక చెలికత్తె "పరాగము పోయినది గాని రాగము పీడలేదు" అని చమత్కరించినది. రాగమంటే అనురాగమనిన్ని ఎరుపురంగు అనిన్ని అర్థములు.

ఈ కువలయావళి నాటకములోనే సింగ భూపాలుడు మరియొక చోట చక్కని శ్లిష్ట పద ప్రయోగము కలదు." ఈ యారామమందు నిన్ను వీక్షించుటకు అవతరించిన యీ విలాసా ద్యాన మాధవుని శోభ చూడుము" అని చెలికత్తె మాధవుని అనగా వసంతుని అన్న అర్థముతో పలికినది. నాయకురాలు కృష్ణుడు అను నర్థమున అన్వయించు కొని ఆర్య పుత్రుడెక్కడ ? అని అడిగినది. ఇట్టివి సంస్కృత భాష నుండి అనువదింపగలము. కాని వసంతం మాధవం అన్నప్పుడు ద్వితీయా విభక్తిలో వసంతుని అనిన్ని, వసించియున్న వానిని అనిన్ని రెండర్థములతో నున్నది. తెలుగులో అన్వయించునట్లు అనువదింప లేము. ఆంగ్ల భాషలోగల శ్లిష్ట పద ప్రయోగములు మన భాషలో అనువదించుట అసాధ్యమని తెలియజేయుటకు ఈ ఉదాహరణములను ప్రదర్శించినాను.

ఇట్టి శ్లిష్టపద ప్రయోగములు షేక్స్పియరు నాటకములం దన్నింటను ఎక్కువగా కలవు. ఈ నాటకములో చాలా వున్నవి. రోమియో జూలియట్ల ప్రేమనుగూర్చి ఒక ముఖ్య విషయము తెలియ జేసి ఈ ప్రకరణము ముగిస్తాను. యీ నాయకానాయికల ప్రేమ తల వని తలంపుగా ప్రథమ సందర్శనమందే తటల్లతవల్ల అకస్మాత్తుగా జనించి వడివడిగా తల కెక్కినది. దీనివల్ల ఎట్టి ఆపద కలుగునో అన్న ఆలోచన ఏమీ లేకపోయినది. అందుచేత వీ రుభయులున్న తమ సంకల్పమునకు ప్రతిభంగము కలిగినప్పుడు తట్టుకో లేకపోయినారు. వివేక శూన్యులయి విమర్శలేకుండా ప్రవర్తించినారు. ఇట్టివి సమాజ విరుద్ధముగాదు గాని సాధారణముగా జరిగేది కాదు. షేక్స్పియరు ట్రాజిడీలలో కథా సన్నివేశములను యీ విధముగానే కల్పించాడు.

*　　　　*　　　　*

# షేక్‌స్పియరు రచించిన ట్రాజిడీలలో ప్రౌఢమయినవి

ప్రౌఢమయిన రచనలలో నున్నవి నాలుగు ట్రాజిడీలు. హామ్లెట్ (1601), ఒతెలో (1604-5), కింగ్‌లియర్ (1605) మాక్‌బెత్ (1606). 1595 లో రోమియో అండ్ జూలియట్ రచితమైన తర్వాత 1601 లో హామ్లెట్ రచనకు పూర్వము షేక్‌స్పియరు రచించిన నాటకములలో ట్రాజిడీలు అని చెప్పదగినవి రెండవ రిచర్డ్ (1595), జూలియస్ సీజర్ (1599) రెండవ రిచర్డ్ 1594 లో రచితమైన మూడవ రిచర్డు నాటకమువలె ఎక్కువగా చారిత్రికాదికము కనుక ట్రాజిడీ నాటకలక్షణాలు కొన్ని ఉన్నా చారిత్రిక నాటకముల ప్రకరణములోనే చేర్చి విమర్శించినాను. రెండవ రిచర్డ్ ప్రవర్తనమందు విషాదాంత సంక్షోభము అంతగా లేదు. అంతకంటె ఎక్కువగా విషాదాంత దౌర్బల్యము కనబడినది. అదే అతని పతనమునకు హేతువయినది. 1596 లో రచితమయిన మెర్‌చంట్ ఆఫ్ వెనిస్ కామెడీ నాటకముగా రూపొందినా అందులో ట్రాజిడీ లక్షణాలు కొద్దిగా ఉన్నవిగాని లేకపోలేదు. అంతేకాదు తొలిసారి యీ నాటకము చదువుతూ ఉన్నవారికిగాని, ప్రదర్శింపగా చూచిన వారికిగాని షైలాక్‌గల దృశ్యాలు చూడగానే ఇదేమి ట్రాజిడీ నాటకమా ! అనే భ్రాంతి జనింపక మానదు. జూలియస్ సీజర్ నాటకమందలి ట్రాజిడీ నాయకుడు బ్రూటస్ సుఖవిలాసములకు అతీతుడు. సుఖ దుఃఖముల యెడల ఉదాసీనుడు. అందువలన భోగలాలసుల యెడల అధికార వాంఛతో ప్రబలుతూ ఉన్నవారి యెడలను కఠినముగాను, పరుషముగాను ఉండుటకు అలవాటు పడ్డవాడు. అంతేకాక మిత్రుడైనా బంధువైనా వ్యక్తిగతంగా నిష్ఠురశాసను డగుటకు యత్నిస్తున్నాడంటే అతడు దేశ విరోధియని భావించి ట్రాజిడీ కార్యములు జరిపించుటకు గాని జరుపుటకుగాని ముందడుగు వేసే స్వభావము గలవాడు. అందువల్లనే

జూలియస్ సీజరు తనకు మిత్రుడై ఉండినా అతడు నిష్ఠురశాసనుడగు తున్నట్లు విప్లవకారు నచ్చచెప్పిన తర్వాత వారితో కలిసి సీజరు హత్యలో పాల్గొన్నాడు అయినా రెండవ రిచర్డ్ వలె తాను పూను కొన్న కార్యము నిర్వహించలేని దుర్బలుడు. ఒక్కొక్కప్పుడు తన కనిష్టములయిన దుర్గుణములు తనకే ఉన్నవేమో అని వితర్కించే స్వభావము కలవాడు. తన ఆశయాలకు సంబంధించిన కలలు కంటూ ఉండేవాడు. మొత్తానికి దుర్బలుడు. ట్రాజిక్ నాయకుడుగా విజయము పొందగల సమర్థతలేనివాడు. అందువల్లనే జూలియస్ సీజర్ తనను పొడిచి చంపుతూ ఉన్నవారిలో బ్రూటస్‌ను చూచి ఆశ్చర్యముతో "ఈ కుట్రలో నీవూ ఉన్నావా?" అన్నాడు.

* * *

# హామ్లెట్

ఇక హామ్లెట్ నాటకము ఎట్లు ప్రౌఢ రచనలో సాగినదో చూదాము.

కథా సంగ్రహము :-

డెన్మార్క్ రాజకుమారుడైన హామ్లెట్ తన తండ్రి మరణము నకు దుఃఖస్తూ ఆ మరణమును గూర్చి పలువురు పలు విధములుగా చెప్పుకొనుట విని ఆ మరణము వాస్తవముగా ఎట్లు సంభవించినదో తెలిసికొనగోరు సమయమున ఎల్సినార్ నగరము వద్దనుండిన క్రోన్ బర్గ దుర్గమును రక్షిస్తూ ఉండిన భటులు హామ్లెట్‌ను కలిసికొని తమ కా దుర్గ ప్రాకారములపైని ఒక భేతాళము కనబడినదనిన్ని అది మూడు మార్తులా అతని తండ్రి ఆకారమున ఉన్నదనిన్ని తెలియ చేసినారు. అది ప్రతి రాత్రి అక్కడ సంచరిస్తూ ఉంటుందని కూడా

కొందరన్నారు. అందుచేత దానిని చూడవలెననిన్ని, తండ్రి ఆకార మునసే ఉన్న యెడల పలుకరించి అతని మరణము ఎట్లు జరిగినదో తెలిసికొనవలెనన్న కోరిక పుట్టినది. ఆ మరుసటి రాత్రి అతడు ఆ భేతాళమును చూచి ప్రసంగించి తెలిసికొన్నాడు. తన తండ్రి మరణమును గూర్చి విన్న ఘోర పరిస్థితి భూతమైయుండిన తన తండ్రియే చెప్పుటవలన వాస్తవమైన దన్న నమ్మకము పూర్తిగా కలిగినది. హామ్లెట్ తండ్రిని నిద్రలో నుండిన సమయమందు పిన తండ్రియైన క్లాడియస్ విష ప్రయోగముతో చంపి హామ్లెట్ తల్లియైన గెర్ట్రూడ్‌ను పెండ్లి చేసికొన్నాడని ఆ భూతముగా నుండిన తండ్రి తెలియజేసినాడు. అంతేకాదు తండ్రి యెడల ఆదరానురాగములు వాస్తవముగా ఉన్నవాడే అయిన యెడల కొడుకు ఈ వార్త బయులు పెట్టకుండా రహస్యముగా పన్నుగడ పన్ని పగ తీర్చుకొని తండ్రి ఆత్మకు శాంతి కలిగించవలసినదని కూడా ఉపదేశించినాడు. ఈ సంగతి పైకి ఏ మాత్రమైనా తెలియకుండా రహస్యముగా ఉంచవలెనని హామ్లెట్ ఆ రక్షక భటులకు తెలియజేసినాడు. వారును అందుకు సమ్మతించారు.

ఆ తర్వాత హామ్లెట్ పిచ్చివానివలె ప్రవర్తిస్తూ వచ్చాడు. అది అతని మనసు చెడుటవలన కలిగిన పిచ్చియో లేక నటనయో ఎవరును చెప్పలేనంత చక్కగా నిరూపించినది. అతని తండ్రి క్లాడియస్ రాజుగా పరిపాలనము సాగిస్తూ వుండెను. తల్లి అతనికి భార్యయై రాణిగా విలసిల్లుతూ వుండెను. చాంబర్లైను అనే రాజోద్యోగిగా వుండిన పొలోనియస్సు పెద్దవాడు చాలా కాలమయి రాజసేవచేస్తూ వుండినవాడు. అతని కొక కొడుకున్ను ఒక కూతురున్ను ఉండిరి. కొడుకు పేరు లియార్టిజ్, కూతురు పేరు ఒఫీలియా. ఆ ఒఫీలియాను హామ్లెట్ ప్రేమించియున్నవాడు కనుక ఆమెకు ప్రేమలేఖలు వ్రాస్తూ వుండేవాడు. పిచ్చిగా వ్యవహరిస్తూ ఉండుటవలన అతని పన్నాగములు బయులుపడకుండా సాగుతూ వుండినవి. ఆ కాలమందే ఒక సంచార

నాటక సమాజము రాజమందిరము ప్రవేశించి రాజుగారి వినోదార్థము తమ నాటకములు ప్రదర్శింపగోరినది. క్లాడియస్ సమ్మతించినాడు. నాటకములందు తనకు అభిమానము కలదని తెలియజేసి హామ్లెట్ ఆ సమాజము వారిచేత తాను సంకల్పించిన నాటకము రాజ సమక్షమున ప్రదర్శింపజేసెను. అందుకు కావలసిన ఒద్దికలు తన పర్యవేక్షణలో జరిపించెను.

ఆ సమాజమువారు ప్రదర్శించిన నాటకమునకు ఇతివృత్తము హామ్లెట్. తండ్రి మరణమునకు అనురూపమైనది. వెనిస్ ప్రభువును ఒకరు చంపి ప్రభుత్వమును స్వాధీనపరచుకొన్నారు. భర్తను హత్య చేసిన వానిని పెండ్లియాడినది. ఆ ప్రభువు భార్య. నాటక ప్రదర్శనము జరుగుతూఉన్నప్పుడు హామ్లెట్ దృష్టి నటులమీదను లేదు. ఆయా సన్నివేశముల సమయమున తన పినతండ్రి ఎట్టి ప్రతిక్రియా మనోభావములు తన ముఖమందు వెల్లడించు చుండెనో జాగ్రత్తగా హామ్లెట్ పరీక్షించుచుండెను. కొంతసేపటికి ప్రదర్శనము చూచి తట్టుకోలేక ఆ క్లాడియస్ ఏదో ఒకసాకు చెప్పి ఆ స్థలము విడిచి లోనికి పోయినాడు. ఆ తర్వాత మరికొంతసేపటికి ప్రదర్శనము కూడా ముగిసినది. తల్లి, గెర్ట్రూజ్ కూడా ప్రదర్శనము చూచి తట్టుకోలేకపోయినది. దుఃఖితురాలై తన గదిలోనికి హామ్లెట్‌ను రమ్మని పిలిచి అట్టి ప్రదర్శనము గావించినందుకు అతనిని నిందించినది. అప్పుడు హామ్లెట్ మెత్తబడి ఊరుకోలేక తల్లి నెదిరించి తిరస్కార భావము ప్రకటిస్తూ ప్రసంగము గావించినాడు. ఆమె కొడుకుపలికిన పరుష వాక్యములకు – అవి యథార్థములే కనుక తీవ్రమయిన మనస్తాపముకలిగి లజ్జాక్రాంతయై దుఃఖించినది. అదృష్టవశమున తన తండ్రి రూపము కనబడి నివారించుట వలన హామ్లెట్ ఆడిగినాడు. లేకపోతే సాహసముతో చేయిచేసికొని ఆమెను హింసించి యుండును. ఆ సన్నివేశము పొంచుండి చూస్తూ ఉండిన పోలోనియస్ కనబడగానే క్రోధాంధుడైన హామ్లెట్ అతడు తనతండ్రియే అనుకొని అతనిని కత్తితో పొడిచి చంపెను.

ఈ వార్త విని కోపోద్దీపితుడైన క్లాడియస్ హామ్లెట్‌పై ఘోరమైన హత్యాపరాధముమోపి, విచారణ గావించి హామ్లెట్‌కు నిర్వాస

దండనము విధించెను. అతనిని దేశము నుండి కొనిపోవుటకు యిద్దరిని నియమించెను. ఆ ఇద్దరును బాల్యావస్థలో హామ్లెట్టుకు తోడి విద్యార్థులు. వారి హామ్లెట్టును ఇంగ్లండ్ దేశమునకు తోడ్కొనిపోయి అక్కడ నతనిని విడిచి పెట్టవలసినదిగా ఆజ్ఞాపించెను. అంతేకాక అక్కడ అతనిని చంపవలసినదని తెలియజేసెను. లేఖలు కూడా అక్కడి అధికారుల పేర వ్రాసి పంపెను. కాని కథ అడ్డముగా తిరిగినది. కొంతవరకు పొరపాట్లు వల్లను కొంతవరకు తంత్రముల ఫలితముగాను హామ్లెట్‌ను చంపుటకు నియమితులైనవారు హామ్లెట్టును చంపుటకు మారుగా అతనిని తోడి తెచ్చిన ఆ ఇద్దరిని చంపినారు.

ఆ సమయమందు ఎల్సినార్ నగరమున కథ వింతగా సాగినది. తన తండ్రి మరణించుటచేతను ప్రియుడైన హామ్లెట్ నిర్వాసితుడగుట చేతను సోదరుడు ఆ కష్టకాలమున దగ్గరలేక దేశాంతర మందుండుట చేతను ఒఫీలియా పిచ్చిదయి సంచరిస్తూ ఉండెను. క్లాడియస్ మందిరమునకు పిచ్చి పాటలు పాడుకొంటూ మార్గమున పువ్వులు విసురుకొంటూ ఉండేది. నగరము వెలుపల నుండిన నదీ తీరమునకుపోయి అక్కడ గట్టుమీద కూర్చుండి పాడుకొంటూ ఉండేది. ఒకనాడు గట్టుమీద నుండి ఏటిలోనికి పడి మునిగిపోయి మరణించినది. ఆమె దేహమును యథావిధిగా పాతిపెట్టుటకు సిద్ధముగా నుండిన సమయమునకు ఇంగ్లండ్ దేశము నుండి మరలి వచ్చిన హామ్లెట్ ఆ స్థలముచేరుకొన్నాడు. ఆ ఖనన సంస్కారమునకు క్లాడియస్ ఒఫీలియా, రాజోద్యోగులు, అనుచరులు వచ్చియుండిరి. తన తండ్రి మరణించిన వార్త విని వచ్చిన లీయార్టిజ్ కూడా ఆ స్థలమందుండెను. హామ్లెట్ జరిగిన విషాద వృత్తాంతము తెలిసికొని ఆ వెంటనే శవమును పాతిపెట్టుటకు త్రవ్విన గోతిలోనికిఉరికి లీయార్టిజ్‌ను నిందింపసాగెను. "ఈ మరాంతసంఘటనలన్ని నీచర్యలవల్లనే సంభవించినది." అంటూ కోపోద్రిక్తుడై లీయార్టిజ్ హామ్లెట్టును చంపబోయెను. కాని క్లాడియస్ అతనిసాహసకృత్యమును నివారించి ఆ పిమ్మట వినోదార్థముగాక త్తిసాము క్రీడపర్చరచి లీయార్టిజ్ హామ్లెట్టులు ద్వంద్వయుద్ధ క్రీడ కత్తులతో గావించునట్లు చేసినాడు. ఆ క్రీడలో హామ్లెట్ చనిపోవలెనని కోరినవాడు

గనుక లీయార్టీజ్ పట్టుకొన్న కత్తికొన విషములో ముంచి యుంచ వలెనని కోరినాడు. రాజు కోరినట్టు లీయార్టీజ్ తానుపట్టుకొన్న కత్తి కొన విషసిక్తము గావించియుంచెను. ఒకవేళ ఆ ప్రయోగము పని చేయకపోయిన మొదల హామ్లెట్ మరణము మరియొక విధముగానైనా జరిగి తీరవలెనన్న పట్టుదలతో విషము కలిపిన మధువు హామ్లెట్టుకు పానీయముగా ఇచ్చుటకు పనికి వచ్చునని క్లాడియస్ స్వయంగా ఒక పాత్రలో పోసియుంచెను. కాని ఈ రెండు ప్రయత్నములున్ను హామ్లె ట్టును బాదించలేదు సరికదా తనకేముప్పు తెచ్చిపెట్టినవి. ఆ ద్వంద్వ యుద్ధ క్రీడలో క్లాడియస్, హామ్లెట్టు దేహమును రెండుసార్లు తగిలినది గాని తీవ్రగాయ పరచలేదు. అందువలన అతనికి అపాయమేమియు కలుగ లేదు. కాని ఆ క్రీడా సమయమున హామ్లెట్ లీయార్టీజ్ చేతినుండి అతని కత్తి తీసికొని లీయార్టీజ్ దేహమును తీవ్రముగా గాయపరచెను. విషము అతని దేహమున కెక్కినది. అతడు చనిపోవుట జరిగినది. ప్రాణము పోవుటకు పూర్వము లీయార్టీజ్ తాను గావించిన మోస కృత్యమును బయలుపెట్టి తాను గావించిన ద్రోహమునకు అది దండ నగా పరిణమించినదని ఒప్పుకొని తన అపరాధమును క్షమింపుమని హామ్లెట్టును ప్రార్థించెను. ఈలోగా గెర్ట్రూడ్ నోరెండి దాహ ముగా నుండుట వలన అక్కడ సిద్ధముగా నుండిన ఆ విషపూరిత పానీయము త్రాగి మరణించినది. అది అంతా క్లాడియస్ చేసిన దుస్తంత్రముయొక్క ఫలమని తెలిసికొని కత్తి పూని క్లాడియస్‌ను చంపినాడు. తల్లి త్రాగిన పానీయము తాలూకు శేషము కొద్దిగా పాత్రలో ఉండిపోయినది, అది త్రాగి హామ్లెట్ కూడా మరణించి నాడు.

*　　*　　*

# విమర్శ

ఇది ఒక అద్భుతమైన ట్రాజడీ నాటకము. ఇందులో ఇరువై దృశ్యము లున్నవి. వీటిలో నాలుగైదు దృశ్యములు తప్ప మిగిలిన దృశ్యములు పదునైదున్ను రసవంతమైనవే. ప్రతిదీ నాటకమునకు ప్రాణము వంటిదే. ఇరువై దృశ్యములున్ను ఒకదాని తర్వాత ఒకటి అంటిపెట్టుకొని ఉన్నవి. ముఖ్యమయిన పదునైదు దృశ్యములలోను కవితా శిల్పము పదలాలిత్యము, అర్థగౌరవము భావస్ఫూర్తి మొదలయిన కావ్య గుణములనుబట్టి తారతమ్యములను నిర్ణయించుట అసాధ్యము లోకో భిన్న రుచిః కనుక ఒక్కొక్కరికి ఒక్కొక్క దృశ్యము ఎక్కువ గొప్పదిగా కనబడవచ్చును. గానిఅన్నిటను గ్రంథము చదువు వారికిన్ని ప్రదర్శనము చూచువారికిన్ని మనస్సును తదేక దృష్టితో వీక్షింపచేయగల సన్నివేశములు ప్రసంగములు ఉన్నవి. కొన్ని దృశ్యములందలి సన్నివేశములు ఒక దానిని మించి మరియొకటి ఎక్కువ ఆకర్షకముగా పరిణమించినవి. ప్రసంగములలో భావిసూచకములయిన పద చమత్కృతి గోచరిస్తూ ఉంటవి. మనోభావములు ధ్వనిస్తూ ఉంటవి. ఈ ఇరువై దృశ్యములలో రెండవ అంకం చాలా పెద్దది 600 పంక్తులుకు పైగా ఉన్నవి. సన్నివేశముల పరంపరలు అనేకము లున్నవి. దృశ్యము పెద్దదైనా గ్రంథము చదువుతూ ఉన్నవారికి గాని ఆ నాటక ప్రదర్శనం చూస్తూ ఉన్నవారికిగాని విసుగు పుట్టదు. ఆ దృశ్యమందలి సన్నివేశాలూ ప్రసంగాలూ ఆకర్షకములుగా ఉంటవి. ఈ దృశ్యమందలి మొదటి సన్నివేశంలో రాజు రాణీ హామ్లెట్ దుస్థితి తలచుకొని విచారిస్తూ చాలా కాలమయి ప్రభువుల సముఖస్థులై ఉండిన రోజన్ క్రాస్టిజ్, గిల్డెన్‌స్టెర్న్ అనే వారిని పిలిచి హామ్లెట్‌తో ముచ్చటిస్తూ ఆనందింపచేస్తూ ఉండవలసిన దనిన్ని అట్లు చేసిన యెడల అతని పిచ్చి కుదిరి అతని ఆరోగ్యం బాగుపడవచ్చునని చెప్తారు. అందుకు వారు సమ్మతించి వెళ్తారు. తర్వాత పోలో

నియస్ వచ్చి నార్వే నుండి రాయబారులు వచ్చినారన్న వార్త తెలియజేయడం వారితో రాజు ప్రసంగించడం జరుగుతుంది. ఆ తర్వాత పొలోనియస్ హామ్లెట్ తన కూతురయిన ఒఫీలియాకు పిచ్చి పిచ్చి ప్రేమలేఖలు వ్రాసి అందజేస్తున్నాడనిన్ని దానివల్ల ఆమె బాధపడుతున్నదనిన్ని ఆమె తన యెడల అనురాగం చూపకపోడంవల్ల అతని పిచ్చి అధికమగుతున్నదనిన్ని తెలియజేస్తాడు. ఇంతవరకును తండ్రి మరణమునకు దుఃఖిస్తూ ఉండడంవల్ల హామ్లెట్ పిచ్చివాడయినాడనుకొంటూ ఉన్న రాజూ రాణీ ఇది కూడానా! అని వింతగాచూస్తారు. ఈ ప్రేమ పిచ్చి అతనికి అధికంగా ఉన్నదని రుజువు పరచుటకు పొలోనియస్ ఒక సన్నివేశాన్ని కల్పిస్తాడు. హామ్లెట్ మందిరమందు తన కూతురి గది ప్రక్కనున్న వసారాలో పదే పదే సంచరిస్తూ ఉంటాడనిన్ని అప్పుడు తన కూతురిని పంపించి అతనిని కలిసేటట్లు చేస్తాననిన్ని అప్పుడతని ప్రవర్తన యెట్లుందో మనం రహస్యంగా పొంచుండి చూడవచ్చుననిన్ని రాజూ రాణీలకు తెలియజేస్తాడు. అందుకు వారు సమ్మతిస్తారు కాని ఆ సన్నివేశం మూడవ అంకం మొదటి దృశ్యంలో కనబడుతుంది. ఈ రెండవ అంకం రెండవ దృశ్యంలో రెండు సన్నివేశాలు జరిగినవి పొలోనియస్ హామ్లెట్‌ను కలియడం, హామ్లెట్ పొలోనియస్‌ను కొంతవరకు గుర్తించనట్లు కనబడి వెటకారంగా ప్రసంగించడం, తర్వాత అతనితో వినోదకరంగాముచ్చటిస్తూ ఆనందం కలుగజేస్తూ ఉంటామని రాజూ రాణీలతో చెప్పిన సుముఖస్థులిద్దరూ హామ్లెట్‌ను కలియడం వారితో కూడా అతడు పిచ్చిగా ప్రసంగించడం జరుగుతుంది. ఈ విధంగా ఆ ఒక్క దృశ్యంలోను ఆరు సన్నివేశాలు ఒకదాని తర్వాత ఒకటి వడివడిగా సాగిపోతవి. ప్రసంగాలు ఆకర్షణీయములుగా ఉంటవి. హామ్లెట్ పిచ్చి ఎవరికిని అపాయకరంగా కనబడదు, బోధపడదు. ఒక ఒఫీలియా విషయంలో మాత్రం పొలోనియస్‌కు బాధకలిగిస్తుంది. ఒఫీలియా హృదయం ఎట్లున్నదో తెలిసికోవడం కూడా కష్టంగానే ఉన్నది. అతని ప్రేమకు ఆమె వాస్తవంగా విముఖురాలా? లేక తండ్రి కిష్టములేకపోవుటవల్ల విముఖురాలుగా నటిస్తున్నదా అనే సందేహం కొందరికి పుట్టక పోదు.

హేమిలెట్ ఆమెను ప్రేమిస్తూ వుండినట్లు పోలోనియస్ పూర్తిగా నమ్మినాడు. ఆమెను పాతిపెట్టే సమయంలో రాణి గెర్ట్రూడ్ "నీవు నా భార్యవవుతావని ఆశించాను అంటుంది. హేమిలెట్ "నేను ఆమెను ప్రేమించాను" అంటాడు.

హేమ్లెట్ పిచ్చికి కారణమేమి ? అనే ప్రశ్నకు సమాధానం చెప్పడమెంత చిక్కుగా ఉన్నదో ఒఫీలియా పిచ్చికి కారణమేమి ? అనే ప్రశ్నకు కారణము చెప్పడం కూడా అంత చిక్కుగానే ఉన్నది. తండ్రి మరణము వలన అతనికి పిచ్చి కలిగిన దన్నవారున్నారు. క్లాడియస్సుకు అదే నమ్మకము తండ్రి మరణము వల్లనే ఒఫిలియాకుకూడా పిచ్చి పుట్టినదన్న నమ్మకము గలవారున్నారు. మరణములు రెండున్ను సమాజ సిద్ధములయినవి కావన్న విషయం ఇద్దరికీ తెలుసును అయితే ఈ రెండింటిలోను కొంత వ్యత్యాసమున్నది. హేమ్లెట్ తండ్రి మరణము తన పిన తండ్రివలన కలిగినదని భూత రూపమున తన తండ్రి తెలియ జేయుటవల్లను తన తల్లి ఏ కారణము చేతనైతేనేమి అచిర కాలంలో మరిదిని పెండ్లి చేసికొన్నదన్న రోషమువల్లను క్లాడియస్ కావించిన ద్రోహమునకు పగ సాధించవలెనన్న పట్టుదల చేతను అతని మనస్సు క్షోభ చెందినది. ఈ సందర్భంలో పగ సాధించుటకు ఆలస్య మెందుకు చేస్తూ వుండెను. అన్నది కూడా చిక్కయిన ప్రశ్నయే. భూతము పలికెనన్నంత మాత్రాన తొందరపడకూడదన్న ఆలోచన కూడా అతనికి లేకపోలేదు. అందుచేతను సంచార నాటక సమాజము వారిచేతను తన తండ్రి మరణమునకు సదృశమైన ఇతివృత్తముగల నాటకము వారిచేత నాటించి క్లాడియస్ ఆ నాటకము చూచినప్పుడు అతని చిత్తవికారము అతని ముఖమందు ఎట్లు ప్రతిబింబితమగునో చూడకోరినాడు. క్లాడియస్ ఆ నాటక ప్రదర్శనము చూచి తట్టుకో లేక లోపలికి వెడలి పోవుటవల్ల హేమ్లెట్ తాను భూతము పలికినది నిజమై యుండునన్న నమ్మకము పూర్తిగా కలిగినది. ఐనా తల్లి ఎంత వరకు దుష్టురాలు ? భర్త బ్రతికియున్నప్పుడే క్లాడియస్‌తో వ్యభిచ రిస్తూ ఉండెనా ? తండ్రి మరణము హత్యవల్లనే జరిగినదైతే తల్లి

కూడా ఆ కుట్రలో పాల్గొన్నదా ! ఇష్టపడి ప్రేమించి క్లాడియస్‌ను పెండ్లి చేసికొన్నదా ! ఈ ప్రశ్నలకు తగిన సమాధానము సప్రమాణముగా తెలియక పోవుటవలన హామ్లెట్ మనసు క్షోభించినది. ప్రభుత్వ ధర్మములకును, సాంఘిక మతాచారములకును ఈ క్లాడియస్ గెర్ట్రూడ్‌ల వివాహము ఆ కాలములో మహాపాతకముగా ఎన్నబడి యుండెను. వధూవరులు రాణియును రాజును గనుక డెన్మార్కులో ఎవరు వారిని దండింపగలరు ? కాని షేక్స్పియరు రచించిన ఈ మహా నాటకము లండన్ నగరంలో ప్రదర్శించినప్పుడు ప్రేక్షకులు హర్షింప గలిగినారా ! అంటే ఎనిమిదవ హెన్రీ వదినగారిని పెండ్లియాడిన వాడేగా ! అతని కూతురు ఎలిజబెత్ రాణి కాలంలో ఎవరు లోలోపల నిందించినా పైకి ఏమనలేరు గదా !

హామ్లెట్ తండ్రి మరణము తలచుకొని దుఃఖిస్తూ ఉండిన దను టలో అభిప్రాయ భేదము లేదు. అని వారిద్దరి దుఃఖములోను కొంత వ్యత్యాసమున్నది. తన తండ్రి మరణము హత్యవల్ల జరిగినదన్న అను మానము నిజమే అని భూత రూపమున తండ్రి పలకడము వేదుక కోసం ఆడించిన నాటకము చూచి తట్టుకోలేక క్లాడియస్ లోపలికి పోవుటచేత ఆ అనుమానం మరింత ధృవపడడం మూలంగా అతని దుఃఖము మరింత ఎక్కువయినది. ఇక ఒఫీలియా విషయంలో తన తండ్రి మరణముకూడా హత్యవల్లనే జరిగినా అది పొరపాటున జరిగిన దన్న అభిప్రాయం ఒకటి బయలుదేరింది.

ఇక ప్రేమ విషయం హామ్లెట్ ఒఫీలియాను ప్రేమించడం వాస్తవమే అని కొంతవరకు స్పష్టమైనది. అది ఒఫీలియా తృణీకరించడంవల్ల భగ్నమైనది. ఆ తృణీకారం ఆమెకు త్రికరణశుద్ధిగా ఇష్టము కాకపోవుటవల్లనా ! లేక తండ్రీ సోదరుడు నివారించుట వలనా అనే ప్రశ్నలు విమర్శకులను బాధిస్తున్నవే కాని హామ్లెట్‌కు మాత్రము ఆమె తృణీకారమే తాను పట్టించుకోవలసిన విషయం.

ఒఫీలియా తన తండ్రి పోయిన తర్వాత సోదరుడు తనవద్ద లేక దూరము నున్నప్పుడు హామ్లెట్ నిర్వాసితుడు కాక ఎల్సినారులోనే

తనకు అందుబాటులోనే ఉన్న మొదల కథ ఎట్లు జరిగి యుండునో ఎవరి మట్టుకు వారూహించుకోవలిసిన విషయమే కాని ఎవరూ స్పష్టంగా చెప్పలేరు. వాస్తవంగా హామ్లెట్ మొదల అనురాగము కలది యయితే హామ్లెట్ మారణము గుట వలన ఒఫీలియా వాంఛలు విరుద్ధము లగుట వలన పిచ్చిదయినదని చెప్పగలము. ఆమె పిచ్చి ఏ రూపమున చిత్రింపబడినదో పరిశీలించి మనశ్శాస్త్రికేత్తలయిన విమర్శకులు కొందరు అది ప్రేమకు సంబంధించిన పిచ్చిగానే భావించారు.

మరియొక విషయంకూడా మన మాలోచింప దగినది కనబడు తున్నది. హామ్లెట్ ఒఫీలియా గదిలోనికి ప్రేమ పిచ్చి పిచ్చిగా ప్రద ర్శించి నప్పుడు ఆమె తన గుండె బ్రద్దలయినంతగా హడలిపోయినది. జరిగినదంతా తండ్రికి తెలియజేసింది. అతడు "జాగ్రత్తమ్మా!" అతనిని రానీయకు సాధ్యమయినంతవరకు అతని కంటబడకు తప్పించుకు తిరుగు" అని ఉపదేశించాడు తండ్రికి చాలా విధేయురాలు గనుక ఆమె అట్లే ఆచరించినది. ఆ తర్వాత హామ్లెట్ పిచ్చి ఎక్కువయిన వానివలె ప్రవర్తిస్తూ వచ్చాడు. "అతని ప్రేమ నేను నిరాకరించడం వల్లనే కాబోలు పాపము అతని పిచ్చి అధికమయినది" అని తలచుట వల్ల ఆమెకు పిచ్చి వచ్చినది.

పోలోనియస్ ఒఫీలియాకు ఇచ్చిన ఉపదేశము రెండు వక్రగతులలో నడచినది. హామ్లెట్టుకు వాస్తవంగా పిచ్చిలేదు. అతడు క్లాడియస్‌ను వధించే ప్రయత్నములో నుండెను. తన సంకల్పము నెరవేరక మునుపు బయలు పడితే ముప్పు వాటిల్లగలదన్న భయముతో పిచ్చివానివలె నటిస్తూ ఉంటే తానేమి చేసినా పిచ్చి వలన జరిగినట్లు అన్వయించుకో డానికి వీలుగా ఉంటుందన్న ఉద్దేశముతో మరింత పిచ్చివాడయినట్లు నటించినాడని కొందరు విమర్శకు లూహించినారు. మరియొక విధ ముగా కూడా పోలోనియస్ పొంచుండి వారి సంభాషణలు వింటూ ఉండెను. చీకటిలో ఒకమూలనుండిన ఆపోలోనియసు క్లాడియస్ అయి ఉంటాడన్న భ్రమతో అతనిని హామ్లెట్ వధించాడు. అతని ప్రేమ తన కూతురు నిరాకరించునట్లుచేశాడన్న కోపంతో పోలోనియస్‌ను హామ్

లెట్ చంపినాడు. పిచ్చివాడు కనుక వివేకశూన్యుడై ఆపని చేశాడన్న అభిప్రాయము నలుగురికీ కలిగినది. ఆ అభిప్రాయమే ఒఫీలియాకు కూడా కలిగింది. ఈ అభిప్రాయమే క్లాడియస్సుకు కూడా కలిగుండవచ్చు. అయితే ప్రవాస దండన మెందుకు విధించాడన్న ప్రశ్న పుట్టుటకు అవకాశము లేకపోలేదు. దానికి సమాధాన మేమిటంటే అట్టి దండనము విధిస్తేనే కాని పొలోనియసు కొడుకు లీయార్టీజ్‌కు కూతురయిన ఒఫీలియాకు ఓదార్పు చేకూరదని క్లాడియస్ భావించాడు. తన్ను చంపుటకే ఉద్దేశించి ఆ పొంచి చూస్తున్న వ్యక్తి తానే అయి ఉంటాడన్న ఉద్దేశముతో హామ్లెట్ ఆ హత్య కావించి ఉంటాడు. అన్న అనుమానము పైకి అనకపోయినా లోలోపల ఉండవచ్చును. అందువల్ల హామ్‌లెట్‌ను దూరదేశమునకు పంపించివేయడమే మంచిదని క్లాడియస్ ఆలోచించి యుండవచ్చును. అంతేకాక అతడు బ్రతికి యుండిన యెడల తనకేమి ముప్పు వచ్చునో అన్న భయము వలన హామ్లెట్టును ఇంగ్లండులో చంపివేయవలెనన్న వార్త కూడా పంపించాడు. డెన్మార్కులో చంపిస్తే తల్లికి తెలియక తప్పదు అప్పుడామె దుఃఖము దుర్భరమవుతుంది. హామ్‌లెట్ చచ్చిపోవలెనన్న కోరిక క్లాడియస్‌కు ఉన్నదన్న విషయము తుది సన్నివేశములందు స్పష్టమయినది.

హామ్‌లెట్ ఒఫీలియాల పిచ్చివిషయములో మరియొక ముఖ్యమయిన తారతమ్యము కనబడుతున్నది. హామ్‌లెట్ పిచ్చిలో ఏదో ఒక విశిష్టమయిన పద్ధతి కలదని పొలోనియస్ అన్నాడు. అతని పిచ్చి చాలావరకు నటనగానే ఉన్నదని విశదపరచడమైనది. నటన అనే అభిప్రాయమును బలపరచే విషయము మరియొకటి కనబడుతున్నది. నాటకములో ఎక్కడా అతని తెలివితేటలు లోపించలేదు. స్మశాన భూమి వద్ద గోయి త్రవ్వేవారితో సంభాషణలో కూడా అతని చమత్కారము తన ప్రాణమిత్రుడైన హొరేషియోతో ప్రసంగించినప్పుడు ఆడినమాటలలో గల పొందిక పరిశీలించిన వారెవరూ యితనికి పిచ్చిగలదని అనుకోరు.

* * *

# హామ్లెట్ తల్లి గెర్‌ట్రూడ్

ఈమె ఏ పాపమూ ఎరుగని సాధ్వి అనిన్ని, మగడు బ్రతికి యుండగా క్లాడియస్‌ను కలియలేదనిన్ని, క్లాడియస్సును పెండ్లియాడుటలో ఆమె రాజకీయ పరిస్థితులకు లోబడినదే కాని, మోహమునకు గాని, కామమునకు గాని లోబడినది కాదు అనిన్ని, ఇల్లాలుగా గాని, తల్లిగా గాని, రాణిగా గాని ఆనాటి (అనగా కథాకాలమునాటి లేదా ఎలిజబెత్ కాలమునాటి) సాంఘిక నీతినియమములకు వ్యతిరేకముగా ప్రవర్తించలేదు అనిన్ని కొందరు విమర్శకులు అభిప్రాయపడినారు. ఈమె దుష్టహృదయ కాదు; తెలివితేటలు లేనిది; మెత్తని మనస్సు గలది; తాత్కాలికపు పరిస్థితులకు సులువుగా లోబడే స్వభావముగలది; సౌఖ్యమును కోరినది. హామ్లెట్ సుఖంగా జీవించవలెనని కోరి "గతించిన దానికి దుఃఖించుటకన్న ఉన్నదేదో చూచుకొని హాయిగా ఉండు" మని బోధించినది అని బ్రాడ్లీ మొదలయిన విమర్శకులు కొందరు తెలియజేసినారు. ఆమెకు కామోద్రేకము ఎక్కువగా ఉండి యుండవలెను; భర్త జీవితకాలములో క్లాడియస్‌తో పొత్తు కలిసినా, కలియకపోయినా కామోద్రేకము కలది గనుకనే భర్త చనిపోయిన తర్వాత ఆలస్యము చేయక శీఘ్రకాలములోనే క్లాడియస్సును పెండ్లి చేసికొన్నది అని అభిప్రాయపడిన విమర్శకులు కూడా ఉన్నారు. భిన్న గతులలో నున్న ఈ అభిప్రాయాలన్నీ ఎవరికి తోచినట్లు వారు ప్రకటించినవే కాని ఆమె వాస్తవముగా ఎట్టి గుణము గలదో నిస్సందేహముగా ఎవరు చెప్పగలరు!

ఎవరికైనా షేక్‌స్పియర్ రచించిన నాటకములో గల ప్రసంగముల బట్టిన్నీ, సన్నివేశముల బట్టిన్నీ చెప్పదగిన అంశములే ఆధారములు గనుక అవి ఎట్లున్నవో చూడవలెను. ఈ నాటకములో గల దృశ్యములు ఇరువై. వాటిలో పది దృశ్యములందు ఈమె కనబడుతుంది. అయిదు దృశ్యములందు మాత్రమే కనబడి వీటిలో ఒఫీలియా

మొత్తంమీద ఆడిన మాటలకంటె తక్కువ మాటలే గెర్ట్రూడ్ ఈ పదింటను పలికినది. అంతేకాక ఒఫీలియా రంగస్థలమందు ముఖ్య పాత్ర ధరించిన దానివలె మాటలాడేది. గెర్ట్రూడ్ ఏదో చిల్లర పాత్ర ధరించినదానివలె మాటలాడేది. మొదటి అంకము రెండవ దృశ్యమందు తొలిసారిగా రంగస్థలము మీదికి వచ్చినంత వరకున్ను ఈ గెర్ట్రూడ్ ఎట్లుంటుందో, ఎటువంటిదో ప్రేక్షకుల కెవరికీ తెలియదు. ఆ దృశ్యములో అరవైయారు పంక్తులయిన తర్వాత ఆమె మాటలు వినబడతవి. మొత్తంమీద మూడుసార్లు మాటలాడుతుంది. తొలిసారి ఒక పంక్తి, రెండవసారి ఆరు పంక్తులు, మూడవసారి రెండు పంక్తులు. అంతా తొమ్మిది పంక్తుల గ్రంథము. అంతా హామ్లెట్టును ఓదార్చి, అతడు విట్టన్‌బర్గ్‌కు చదువుకోసం వెళ్ళకుండా తమ వెంటనే ఎల్సినార్ దుర్గమందుండుమని చెప్పటకు జరిగిన ప్రసంగము. ఈ దృశ్యమందు, మరి మూడు దృశ్యము లందున్ను ఆమె క్లాడియస్ ముఖము, మాటలు, మనోభావములు కనిపెట్టి ముక్తసరిగా మాటలాడడమున్ను భర్త, పద పోదా మనగానే అతనితో వెడలి పోవడమున్ను జరుగుతుంది.

మొదటి అంకం అయిదవ దృశ్యములో హామ్లెట్టుకు అతనితండ్రి భూతం మరియొకసారి కనబడుతుంది. క్లాడియస్ కావించిన విషప్రయోగము వలన తన తండ్రి ఎట్లు చనిపోయినాడో, తల్లి ఎట్లు క్లాడియస్‌కు లోబడి కులటగా వ్యభిచరించి భర్త చనిపోయిన తర్వాత శీఘ్రకాలంలోనే క్లాడియస్సును పెండ్లియాడి మొదట భర్తకు, కుమారుడైన తనకు ఎట్లు అన్యాయము గావించినదో హామ్లెట్ తెలుసుకొంటాడు. ఇక్కడ మన మొక విషయము మాలోచించాలి. ఆ రాజు (హామ్లెట్ తండ్రి) నిద్రలో నుండగా ఈ విషప్రయోగము జరిగినది కదా ! అంత వరకు తెలియని సంఘటనలు అతని కెట్లు తెలియవచ్చినవి ! భూతము కాగానే గతము తెలుస్తుందా ! ఆ భూతము చెప్పిన మాటలు ఎట్లు ప్రమాణములు కాగలవు ! అయితే ఈ హేతువాదముతో మనకు పని లేదు. షేక్‌స్పియర్ ఏమి ఉద్దేశించినాడన్నది మనకు ముఖ్యము. అతని ఉద్దేశమును మన మతని రచనబట్టి తెలిసికొనవలెను. ఇతరులకు

బయటపెట్ట కూడదన్న అంశములను నాటక సంప్రదాయముల ననుసరించి షేక్స్పియర్ పాత్రల స్వగతములందు తెలియజేస్తూ వచ్చాడు. ఒథెలో నాటకములో ఇయాగో మనసులోనున్న భావాలను అతనిస్వగతాలలో తెలియజేశాడు. స్వగతాలు గ్రంథము చదివే వారికి ప్రదర్శనము చూచేవారికి తెలుస్తూ ఉంటవి కాని వాటిని పలికే పాత్రలకు చేరువగానున్న ఇతర పాత్రలకు వినబడవు, తెలియవు. ఇది ఒక నాటక సంప్రదాయము. హత్య విషయముగాని గ్రెట్రూడ్ శీలము విషయము గాని ఇతరులకు తెలియుట సాధ్యము కాకపోయినా క్లాడియస్, గ్రెట్రూడ్లకు తెలుసుగదా? ఆ అంశములను వారి నోటను స్వగతములుగా పలికించవచ్చును గదా? షేక్స్పియర్ ఆ పని చేయలేదు. దీనినిబట్టి మనమేమి ఊహించవలెను? ఇది షేక్స్పియరు రచనలో ఒక లోపమనుట భావ్యముకాదు. కనుక ఈ తెలియజేయని అంశములు పాఠకులకు గాని ప్రేక్షకులకుగాని సందేహాస్పదములుగాను, ఎవరిమట్టుకు వారు ఊహించుకొనవలసినవిగాను చిత్రించుట ఒక కళా ధర్మముగా షేక్స్పియర్ భావించినాడు అనవలెను.

నాటకము, విమర్శలు శ్రద్ధగా చదివి నేను తెలిసికొన్న విషయములు విశదపరుస్తున్నాను :

హామ్లెట్ తన తండ్రి భూత రూపమున దర్శనమిచ్చి చెప్పిన మాటలు పూర్తిగా నమ్మినాడు. కృత్రిమ నాటక మాడించినప్పుడు క్లాడియస్ ప్రదర్శించిన ప్రతీకార వికృత చేష్టలను బట్టి తన తండ్రి మరణమునకు క్లాడియస్ కావించిన హత్యయే కారణమన్న నమ్మకము ధృవపడినది. గెర్ట్రూడ్ భర్త బ్రతికియున్న కాలములో క్లాడియస్తో వ్యభిచరించినట్లు స్పష్టపడకపోయినా భర్త చనిపోయిన తర్వాత శీఘ్రకాలంలోనే సంప్రదాయ ధర్మ విరుద్ధమయిన పనియన్న ఆలోచన లేక మరదిని వివాహమాడినదన్న రోషము మాత్రము హామ్లెట్కు ఎక్కువయినది. అందువల్లనే ఆమె గదిలో ఆమెతో ప్రసంగించినప్పుడు ఆమె తనను నిందించి నందుకు బాధపడి, ఆమె తన తల్లి యన్న విషయము మాలోచింపక ఆమెను హామ్లెట్ ఎదిరించి,

నిందించి, చంపుటకు సిద్ధపడెను. భూత రూపమున తన తండ్రి కనబడి నివారించియుండక పోయిన మొదల చంపియే యుండునని నా అభిప్రాయము. అతని ప్రయత్నమును నివారించుటలో అతని తండ్రి ఉద్దేశమేమో నాటక రచనబట్టి తెలియుట కాని మాతృ హత్య మహాపాతకమనిన్ని అట్టి పాతకమునకు తన కొడుకు దిగజార కూడదనిన్ని తలచెనేమో !

గెర్ట్రూడ్ తనను కొడుకు నిందిస్తూ ఎదిరించి నప్పుడు పశ్చాత్తప్త కాలేదు. స్వగతముగానైనా ఆమెనోట షేక్స్పియరు పలికించలేదు. పొలోనియస్‌ను చంపిన హామ్లెట్ తననుకూడా చంపునేమో నన్న భయముతోచి క్లాడియస్ అతనిని నిర్వాసునిగా దండించి ఇంగ్లండ్ దేశమునకు పంపించెను. రాజుగదా, హామ్లెట్టును వెంటనే చంపించక ఇంగ్లండ్‌లో రహస్యముగా చంపించుటకు ప్రయత్నించెనేమో అనే ప్రశ్నకు సమాధానము క్లాడియస్‌తో యాక్టిబ్ సంభాషణముబట్టి తెలిసినది. తల్లియైన గెర్ట్రూడ్ ఎక్కువగా దుఃఖించు ననిన్ని, హామ్లెట్టు పక్షమున ఉన్నవారు తిరుగుబాటు చేయువచ్చుననిన్ని అతడు భయపడినట్టు కనబడినది. హామ్‌లెట్ ఇంగ్లండ్‌నుండి మరలి వచ్చిన తర్వాత ఓయార్టీజ్ అతనిని చంపనుద్దేశము కనబరచినప్పుడు అతనిని వారించి అతని సంకల్పము ఆక్షేపమునకు గురికాని రీతిగా నెరవేరునట్లు క్లాడియస్ పన్నుగడ పన్నెనే కాని తాను ధైర్యముగా చంపలేదు. ఓయార్టీజ్ చంపుటకు సిద్ధపడినా అందుకు సమ్మతించలేదు. గెర్ట్రూడ్ కీ విషయము ఏమీ తెలియదు.

హామ్‌లెట్ ఒఫీలియాలు అన్యోన్య ప్రేమగలవారే అని నమ్ముటకు తగిన ఆధారములు నాటకములో నున్నవి. వారి ప్రేమ సఫలము కాకపోవుటవల్లనే హామ్‌లెట్ పిచ్చి అధికమయినట్లు నిరూపితమైనది. ఒఫీలియాకు పిచ్చిపుట్టినది. హామ్‌లెట్ పిచ్చినటనయే కాని వాస్తవము కాదనుటకు అతడు తెలివితేటలతో చివరవరకును కావించిన ప్రసంగములే ఆధారములు. ఇతరులతో మాట్లాడినప్పుడు పిచ్చితనము ప్రదర్శించేవాడు. స్వగతములు చక్కగా పలికేవాడు. స్వగతములలోని

రచనకును ప్రసంగములలోని రచనకును వ్యత్యాసము స్పష్టముగా కనబడుతున్నది. షేక్స్పియర్ నకు గల కళాకౌశలమునకు ఇదియొక చక్కని నిదర్శనము.

ఈ గ్రంథమందు ఇంతకంటె ఎక్కువగా హామ్లెట్ నాటక మును గూర్చి వ్రాయుటకు అవకాశము లేదు. ఇప్పటికే ఈ గ్రంథము ఎక్కువయినది. ఏదైనా ఒక ముఖ్య విషయము విపులముగా చర్చించ దలచి వ్రాసినాను. ఈ విధముగానే తక్కిన నాటకములోని ముఖ్య విషయములున్ను చర్చించవలెనన్న సంకల్పము కలదుగాని అందుకు తగిన అవకాశ మిప్పుడు లేదు.

*   *   *

## జ్యూలియస్ సీజర్

ఇది లో రచితమయినది. చారిత్రక నాటకములలో ట్రాజడీ. ఇతర దేశములందు రోమన్లకు జరిగిన యుద్ధములందు విజ యము పొంది సీజర్ రోమ్ నగరమునకు రాగానే అతనికి తమ ఉత్సా హము. అతనియెడల తమకుగల అదరాభిమానములు కృతజ్ఞత తెలియ జేస్తూ అభినందించడానికి రోమన్ పౌరులొక పెద్ద సన్మాన సభ సమా వేశపరచినారు. ఆ సభలోనే అతనికి అత్యంత మిత్రుడైన మార్క్ ఏంటనీ అతనికి రాజలాంఛనముగా కిరీటముసమర్పించుటకు ముమ్మారు ప్రయత్నించడము ముమ్మారున్ను సీజర్ వద్దనడము జరిగినది. అప్పటి కిని రిపబ్లిక్ గా ఉన్న రోమ్ రాజకీయ సంస్థ రాజ సంస్థగా మారునన్న భయము చేతను సీజర్ యెడల జనించిన అనుమానము చేతను కాసియస్ మొదలయిన రోమన్ ఘనులు కొందరు అతనిని పడద్రోయుటకు కుట్ర పన్నినారు. రోమన్ పెద్దలలో బ్రూటస్ అగ్రగణ్యుడు. అతడు ధర్మ

వర్తనుడు. సీజరుకు హాని చేయదలచినవాడు కాదు. అందుచేత కాసి
యస్ మొదలయిన కుట్రదారులు లేనిపోని భయములు పెట్టి బ్రూటస్‌ను
లోబరచుకొన్నారు. సీజరు బ్రతికియున్న యెడల రాజ్య వ్యవస్థ మారి
పోవునన్న అంశమతని తలకెక్కించినారు. రిపబ్లిక్ సంస్థయెడల ప్రీతిగల
బ్రూటస్‌కు కుట్రదారులు పెట్టిన భయ కారణము అతనికి వచ్చినది.
అందువలన బ్రూటస్ కుట్రలో చేరినాడు.

సీజరు రోమన్ నగరము ప్రవేశించిన కొద్ది దినములలోనే సోది
చెప్పేవారు మార్చి 15 వ తేదీ అతనికి గండమున్నదనిన్ని అందువలన
సీజరు అప్రమత్తుడై మెలగవలెననిన్ని చెప్పినారు. కాని సీజరు వారి
మాటలు నమ్మలేదు. సభాసమావేశము ఆ మరునాడు జరుగుననన్న
నాటిరాత్రి సీజరు భార్యకు ఘోర స్వప్నములు వచ్చినవి. అందువలన
ఆ మరునాడు సభకు వెళ్ళుటకు సిద్ధపడుతున్న సీజరును నిరోధించి
సభకు వెళ్ళవద్దని అతని భార్య బ్రతిమాలినది. ఈ విషయము ముందు
గానే తెలిసికొన్న కుట్రదారులు అతనిని గౌరవముగా అతని ఇంటినుండి
సభా మందిరము వరకున్ను సంబరముతో తోడ్కొని రా దలంచినట్లు
నటించి అతని గృహమునకు వెళ్ళినారు. అట్టి పరిస్థితులలో "నేడు
నేను సభకు రాజాలను" అని ఎట్టినెపము చూపినా 'సీజరు పిరికివాడు'
అని అనిపించుకోడానికి ఇష్టపడక సీజర్ సభకు వెళ్ళినాడు.

సభ సమావేశము ప్రారంభింపగానే ఏవో మహజర్లు దాఖలు
చేస్తూ ఉన్నట్లు నటించి కుట్రదారులు అతని చుట్టూ మూగి ఒకొక్క
డొకొక్క కత్తిపోటు పొడిచినాడు. చివరికి బ్రూటస్ కూడా పొడిచి
నాడు. బ్రూటసను చూచి "బ్రూటస్! నీవూనా?" అని ఆశ్చర్య
ముతో గద్దించి సీజరు స్పృహతప్పి పడిపోయి ప్రాణములు విడిచినాడు.

ఆ సమయమున మార్క్ ఏంటనీ అక్కడ లేడు. ఈ ఘోరసంఘ
టనము తెలియ వచ్చిన వెంటనే అతడు సభామందిరమునకు వచ్చి
కుట్రదారుల నెదిరించక సదుద్దేశముతోనే వారాపని చేసినారని తాను
కూడ విశ్వసించిన వానివలె నటిస్తూ అతని దేహమును పాతిపెట్టుటకు
సిద్ధమయిన సమయమున సనాతన ధర్మమునననుసరించి ఆ సమయమున

చేయవలసిన అంతిమ ఉపన్యాస కార్యక్రమములో తన ఉపన్యాస మునకు కూడా అవకాశముంచ వలసినదని కార్యకర్తలను కోరినాడు. అతనికి అట్టి అవకాశము యిచ్చిన యెడల అతడెట్లు ప్రసంగించి ప్రజలకు తమ యెడల ద్వేషము ప్రేరేపించునో అన్న భయము కుట్రదారులకు కలిగినది. అట్టి అవకాశమీయని యెడల తమకు సీజరును చంపుటలో దురుద్దేశముకాని సదుద్దేశములేదన్న అభిప్రాయము కలిగి రోమన్ పౌరులు తమ్ము ఎదిరించి కలహించవచ్చునన్న భయముకూడా పుట్టినది. అందువలన వారు తీవ్రముగా ఆలోచించి చివరకు ఏంటనీ ప్రసంగించుటకు అనుమతించినారు. కాని ముందుగా బ్రూటస్ ఉపన్యసించుననిన్ని ఆ తర్వాత ఏంటనీ ఉపన్యసించవచ్చుననిన్ని ప్రకటించి అతని ప్రసంగము బ్రూటస్ చెప్పిన దానికి విరుద్ధముగా నుండకూడదని శాసించినారు. అందుకు నేర్పుగా మాటలాడగల నేర్పు ఏంటనీ సమ్మతించినాడు. రెండు ఉపన్యాసములున్ను సాగినవి. బ్రూటస్ మాటలాడినప్పుడు అతని మాటలు నమ్మదగినవిగానే వుండెను. ఏంటనీ మాటలాడినప్పుడు ఇతని మాటలు కూడా నమ్మదగినవిగానే ఉండెను. అట్లుండుటకు కారణము వారు ప్రసంగించుటలో గల నేర్పు. శ్రోతలు పామరులై మాటల చమత్కారమునకు లొంగిపోవడమున్ను అనవలెను. ముందు ప్రసంగించినవాడు అధికుడుగా కనబడినా రెండవ ఉపన్యాసకర్తకు బలము ఎక్కువగుతుందని కార్యకర్తలు ఆలోచించలేదు. ఏంటనీ, బ్రూటస్ మాటలను ఖండించినట్లు కనబడలేదు. గౌరవాస్పదుడైన బ్రూటస్ చెప్పినది అసత్యము కాజాలదు. అయినా............ అంటూ చమత్కారముగా ప్రసంగించి తలలో చాలా మందికి ఉద్రేకము కలిగింపగలిగినాడు. చివరికి అతని ఉపన్యాసము పూర్తి కాగానే రోమన్లు కుట్రదారులు ఘోరమైన దుష్కార్యమునకు తలపడి రోమ్ రాజ్యమునకు అపకారము చేసినారని నమ్మి ఆ కుట్రదారులను సంహరించుటకు పూనుకొన్నారు. వారి కోపావేశమునకు భయపడి ఆ కుట్రదారులు నగరము విడిచి పారిపోయినారు.

19)

రోమనులు రెండుకక్ష్యల క్రింద విడిపోయినారు. ఆ రెండింటిలో ఒకదానికి కాసియస్, బ్రూటసులు, నాయకులు. రెండవదానికి, మార్క్ ఏంటనీ, ఆక్టేవియస్, సీజర్, లెపిడస్ నాయకులు. ఫిలిప్పై వద్ద జరిగిన యుద్ధములో కాసియస్, బ్రూటస్ ఓడిపోయినారు. రెండవ కక్ష్య నాయకులు ముగ్గురున్ను రాజ్యపాలక త్రయమైనారు.

*　　　*　　　*

# జూలియస్ - సీజర్ - విమర్శ

ఈ నాటకము తక్కిన నాటకములందు లేని - ఉన్నా అంతగా లేని కొన్ని విశిష్ట లక్షణములు గల ట్రాజడీ. గ్రీక్ రోమన్ చారిత్రక నాటకముల కథావస్తు విషయములోను, పాత్రలను చిత్రించడంలోను షేక్స్పియరు ఎక్కువగా ప్లూటార్క్ రచించిన గ్రీక్ రోమన్ నాయకుల జీవిత చరిత్రలపై ఆధారపడినాడు. ఆంగ్ల దేశ చారిత్రక నాటకముల విషయములో క్రానికిల్స్ పై ఆధారపడినాడు. ఈ రెంటింటను ఒక వ్యత్యాసము కనబడుచున్నది. తన దేశ చరిత్రలో కేవలము క్రానికిల్స్ లో ఉన్నట్లుగా గాక ఇతర ఆధారముల బట్టిన్ని తనకు గల బుద్ధి విశేషము చేతను నాటక రచనకు అనుకూలమైన మార్పులు చేర్పులు చేయడానికి ఎక్కువగా సాహసించినాడు. ఈ విషయము చారిత్రక నాటకములు అనే ప్రకరణములో ఎక్కువగా వ్రాయదలచినాను. కనుక ఇక్కడ అంతగా వ్రాయనక్కరలేదు. గ్రీక్ రోమను చారిత్రక నాటకములలోను కొద్దిగా నాటక రచనకు కావలసిన మార్పులు చేయక పోలేదు. గాని అంతగా కనబడవు. ప్లూటార్క్ చెప్పినది అందులోను ఆయా నాయకుల వ్యక్తిత్వమును గూర్చినది. ఎక్కువగా ఇతనికి ప్రమాణమైనది. అందుచేత ఆంగ్ల చారిత్రక నాటకములందలి అయిదవ హెన్రీ విషయములో మూలాధారమునకు భిన్నముగా ఆ హెన్రీ

పాత్ర పోషణ గావించినట్లు ప్లూటార్కు చెప్పినది యథాతథముగా అనుకరిస్తూ ఈ నాటకమందలి పాత్రలను పోషించినాడు. అందులోను బ్రూటస్ పాత్ర పోషణము మరీ ఎక్కువగా ప్లూటార్కు వ్రాసినది ఎక్కువగా అనుసరించినాడు. బ్రూటస్‌ను గూర్చి ప్లూటార్కు వ్రాసినది షేక్స్పియరుకు ఎక్కువగా నచ్చినది.

ఈ నాటకములోగల పాత్రలందు పెక్కు పాత్రల పోషణము విమర్శించ దగినదేగాని అది అంతా వివరించి వ్రాయడానికి అవకాశం చాలదు. గ్రంథము ఎక్కువగా పెరిగిపోతుంది. కనుక ముఖ్యమయిన పాత్రలను గూర్చియే వ్రాస్తున్నాను. జ్యూలియస్ సీజరు సంపన్న వంశమునకు చెందినవాడు కాడు. ఇతని పూర్వులు సామాన్య వర్గమునకు చెందినవారు. అయినా సీజరు తనకు సహజముగాగల శక్తిసామర్థ్యము వల్ల గొప్ప వీర నాయకుడు కాగలిగినాడు. ఇతడు ఉత్తమ సంపన్న వర్గమునకు చెందినవాడు కాడు కనుకనే ప్లూటార్కు ఇతని జీవిత చరిత్రకు స్థానమీయలేదు. ఆ కారణము చేతనే రోమన్ సంపన్న వర్గము వారిలో కొందరు అసూయాగ్రస్తులైనారు. ఇతని యుద్ధ పరాక్రమము విజయములు మెచ్చుకొన్నారే కాని ఇతడు రాజు కావలెనని వంటనీ వంటివారంటే సహింపలేకపోయినారు. ఇతనికి ఐశ్వర్యము పట్టినందుకు కూడా ఓర్చుకోలేక పోయినారు. ఇతనివంటివాడు రాజయితే సంపన్న వర్గము వారి గౌరవమునకు భంగం కలుగుతుందన్న భయము కూడా కొందరి కుండెను. బ్రూటస్ వంటివాడు కూడా ఈ భయము అంతర్గతంగా పొందకపోలేదు. కాని సీజరుకు వాస్తవంగా రాజు కావలెనన్న కాంక్ష అంతగా లేదు. ఆ కారణము వల్లనే వంటనీ కిరీటము సమర్పించుటకు మున్మార్లు ప్రయత్నించినా సీజరు వద్దన్నాడు. తాను సంపన్న వర్గమునకు చెందినవాడు కాకపోవుట వలన అసూయాగ్రస్తులయిన వారు కొందరు గలరని అతడు తెలిసికొనకపోలేదు. కిరీటము ధరిస్తే ఆ అసూయ మరింత ఎక్కువగుతుందని కూడా అతడు గ్రహించాడు.

సీజరుకు గల లోపములలో ముఖ్యముగా చెప్పదగినది కొద్దిగా అహంభావం, వీర, శౌర్య, సాహస లక్షణాలు తనకున్నంతగా తక్కిన

వారికి లేవన్న అభిప్రాయము అతనికి ఎక్కువగా ఉండేది. తన కుటుంబము ఆదర్శప్రాయమైనదని నమ్మినవాడు. తన భార్య గొప్ప పతివ్రత యని నమ్మి తక్కినవారున్ను నమ్మవలసినదిగా కోరినవాడు కనుకనే Ceasar's wife must be above suspicion అన్నాడు. అనగా సీజరు భార్యయొక్క శీలము ఇతరులెవ్వరును శంకించుటకైనను వీలు లేనిదిగా ఉండవలెనని అతని ఆశయము ఇల్లాలు అంతగొప్పదే అయినా తనకు అనుకూలవతిగాను, తన యెడల వినయ విధేయతలు కలదిగాను ఉండవలెనని అతని కోరిక – కోరిక మాత్రమే కాదు శాసనము కూడాను అందుచేతనే ఆమె సభకు వెళ్ళవద్దని ఎంత చెప్పినా ఎంత బ్రతిమాలినా వినలేదు. ఇంత గొప్ప యుద్ధవీరుడూ విజయుడూను పెండ్లానికి దాసుడే అని అంటారేమో అని భయపడినాడు. ఆమెకు ఆ క్రిందటి నాటి రాత్రి ఘోరమైన దుస్వప్నము వచ్చినదన్నా, సోదె చెప్పిన వారు మార్చి 15వ తేదీనాడు మారకమున్నది జాగ్రత్త అని హెచ్చరించినా వినలేదు. ఇంత గొప్ప నాయకుడు సోదెలకు స్వప్నాలకు భయపడే పిరికిపంద అని ఎవరైనా అనగలరని భయపడినాడు.

అతని కుట్రదారులు కత్తులతో పొడిచి చంపుతూ ఉన్నప్పుడు ధైర్యముతో నిలచినవాడు బ్రూటస్ పొడిచినప్పుడు మాత్రము "బ్రూటస్ నీవూనా ?" అని కండ్లు మూయుటలో ఎన్ని భావాలో ఇమిడి ఉన్నవి. బ్రూటస్ తనకు మిత్రుడనిన్ని, తన యెడల ఆదరాభిమానాలు కలవాడనిన్ని కుట్రలో చేరవలసినవాడు కాడనిన్ని తొందరపాటు పడక నిదానముగా ఆలోచించనిదే ఇటువంటి దుష్కార్యములకు దిగజారే వాడు కాడనిన్ని నమ్మినవాడు కనుకనే బ్రూటస్ కూడా తనను చంపుటలో పాల్గొన్నందుకు, ఇక ఇట్టి వానికి కూడా నేను బ్రతికియుండుట అసమ్మతము, అసహ్యమూ అయినప్పుడు నా జీవితమెందుకు! అని విరక్తి చెందినవానివలె కండ్లు మూసినట్లు నేను భావిస్తున్నాను.

బ్రూటస్‌కు గల లక్షణములలో పైని సూచించినవి మాత్రమే కాక ఇంకా చెప్పదగినవి మరికొన్ని గలవు. అతనికి వ్యసనములు లేవు.

కొన్ని ఉదారమైన ఆశయములు భావనలు కలవు. లోపల ఒక మాట పైకొక మాట చెప్పవలసినవాడు కాడు. రాజ్యవ్యవస్థ రిపబ్లిక్‌గా ఉండవలెనన్న అభిప్రాయము గలవాడు. ప్రసంగిస్తున్నప్పుడు గొప్ప గంభీరమైన పలుకులు పలికేవాడు. అందులో స్వార్థపరత్వము ఉండేది కాదు. ప్రజాయోగక్షేమములు కోరినవాడుగానే మాటలాడేవాడు. వాస్తవముగా కూడా అట్టి కోరిక గలవాడే అందువల్లనే కుట్రలో తొందరపడి చేరలేదు. కాని అట్టే విమర్శజ్ఞానము పరిశీలన గలవాడు కాకపోవుట వలన కాసియస్ మొదలయిన కుట్రదారులు ఉన్నవీ లేనివీ చెప్పిన మాటలు సత్యమని నమ్మి కుట్రలో చేరినాడు.

సీజరును చంపిన తర్వాత బ్రూటస్ ప్రజలతో ప్రసంగించి చేసిన ఉపన్యాసములో అతని హృదయ పూర్వకముగా ఆడిన మాటలు ప్రజలు నమ్మి సీజరును చంపుటలో దోషము లేదన్నారు. ఆ తర్వాత ఏంటనీ ప్రసంగించబోవునప్పుడు కొందరు అతడు ప్రసంగించబోవుటకు ఇష్టపడ లేదు. అప్పుడు బ్రూటస్ ఔదార్యము చూపి అల్లరి చేయకండని వేడుకొని ఏంటనీ ప్రసంగం కానిచ్చినాడు. ఏంటనీ వాస్తవముగా గొప్ప వక్త. అతని మాటలు పైకి బ్రూటసు యెడల గౌరవము కలవిగానే కనబడినా వాటిలో సున్నితము లయిన ఎత్తిపోటు మాటలు చాలా ఉన్నవి. బ్రూటసువలె తాను గొప్ప వక్త కానట్లు మాటి మాటికి చెప్పడంలో సూచన ఏమనగా మాటల నేర్పుతో బ్రూటస్ హత్యా కారణము కప్పిపుచ్చ గలిగినాడనిన్ని అట్టి నేర్పుగలవాడు తను కాకపోయినా కేవలము సత్యము వలుకుతున్నాను. అవి మీరు నమ్ముటకు సత్యమే కారణము గాని నా మాటలలో గల వాగ్ధాటి చమత్కారము, శైలి, కాదు సుమండీ అని చెప్పినట్లయినది. బ్రూటసును మెచ్చుకొన్న శ్రోతలు అప్పుడు ఏంటనీని మెచ్చుకొనుట కుపక్రమించినారు. ప్రజలు సీజరును చంపుట వలన తాము గొప్ప నష్టపడితిమి అని దుఃఖించినారు. తుదకు సీజరును చంపిన వారందరూ దేశద్రోహులని నమ్మినారు. హంతకు లను చంపుటకు పూనుకొన్నారు. వారి ఇళ్ళు తగల బెట్టుటకు సిద్ధపడి నారు.

బ్రూటస్ అట్టి పరిస్థితులలో దూరదేశమునకు పోవుటే యుక్తమని తన మిత్రులతోను, సేనలతోను గ్రీసు దేశమునకు పారిపోయినాడు.

నాల్గవ అంకమందు అతనికిన్ని కాసియస్సుకున్ను జరిగిన సంభాషణములో బ్రూటసు ఎట్టి సుగుణములు గలవాడో బోధపడుతుంది. ఆ దృశ్యము సార్డిస్ నగరమువద్ద బ్రూటస్ గుడారములోనిది. కాసియస్ సార్డిస్ ప్రజలను బాధించి ధనము స్వార్థపరత్వముతో పోగుచేసిన వాడన్న నేరము మోపికొందరు బ్రూటస్‌కు తెలియబరచినారు. అట్టి విషయములో బ్రూటస్ అగ్నిహోత్రమువంటి ఋజుమార్గవర్తనుడు. ఆ సమయమందే తన భార్య పోర్షియా చనిపోయిన వార్త విన్నాడు. అది తన హృదయములో అణచిపెట్టుకొని కాసియస్సును లంచగొండిగా భావించి కఠినముగా మాటలాడినాడు. యుద్ధమునకు కావలసిన ధనము లేకపోవుటవలన కొంత ధనము పోగుచేసిన మాట నిజమే కాని స్వార్థపరత్వముచేత చేసిన పని కాదని కాసియసు చెప్పిన మాటలు నమ్మలేదు. "నీవు చెప్పినది నిజమైతే అట్టి ఖర్చువెచ్చములకు నాకు ధనము కావలెనని నేను కోరినప్పుడు నావద్దను ధనములేదని ఎందుకు కబురు చేసినావు?" అన్నాడు బ్రూటసు. "నీవు అట్లు కోరినట్లు నాకు తెలియదు. నేనట్టి కబురు పంపనూ లేద"న్నాడు కాసియస్. ఇద్దరూ తగవుపెంచుకొని ఒకరితో ఒకరు పోట్లాడుకొందురేమో అన్న అభిప్రాయము బ్రూటసు ఔదార్యమువల్లను, కాసియసు చూపిన ఓర్మివల్లను అంతరించినది.

అప్పుడు అట్లు జరిగినా బ్రూటస్‌వంటి ఋజుమార్గవర్తనుడు కాడు కాసియస్. అతని యెడల చాలామందికి సద్భావములేదు. సీజరు మిత్రులలో ఎవరికినీ లేదు. ఆ ఒక్క బడుగు దేహముకలవాడు, కుచ్ఛితుడనిన్ని, నమ్మదగని వాడనిన్ని చాలామంది చెప్పుకొనేవారు. అతనికి కళల యెడల అభిలాష వుండేదికాదట. సంగీతమంటే అసహ్యమట అట్టివాడు దుర్మార్గుడు మోసకాడు కాగలడన్న నమ్మకము రోమన్లకుండేదని షేక్స్పియరు ఈ నాటకములో తెలియజేసినాడు.

ఏంటనీ ధీరలలితుడు. విలాసమునకు అలవాటుపడి రాత్రులు సుదీర్ఘ కాలము విలాసములతో గడిపేవాడు. ఈ గుణము ఏంటనీ అండ్ క్లియోపాత్ర నాటకములో ఎక్కువగా కనబడుతుంది. సీజరుకు ప్రాణమిత్రుడు కాబట్టి సీజరుకు దత్తుడు, వారసుడు అయిన ఆక్టేవియసుకు కూడా ఇష్టుడైనాడు

ఈ నాటకములోని నాయకులు సెనేట్ సభ్యులు శబ్దాలంకార శాస్త్రమునందున్ను వక్తృత్వమునందున్ను శిక్షణ పొందిన వారివలె ప్రసంగములు సాహితీవేత్తలవలె నడిపింపగలవారు ప్రజలను లోబరచుకొని వ్యవహరింప సమర్థులు. వీరిలో ట్రిబ్యూన్‌గా ఉండిన మరులస్, బ్రూటస్, ఏంటనీ దొడ్డవక్తలుగా ఈ నాటకమందు ప్రదర్శింపబడినారు. సీజర్ గద్య రచించుటలో గొప్పవాడు ఆనాడు రోమన్లకు వక్తృత ! అలంకార శాస్త్రము, కవిత్వము అభిమానిత విషయములుగా ఉండేవన్న సంగతి తెలియజేయుటకు షేక్స్పియరు అలంకార శాస్త్ర గురువైన నైడస్ ప్రదేశమందలి ఆర్డిమిడోరస్‌ను, సినా అనే కవిని కూడా పాత్రలుగా నాటకములో పాల్గొన చేసినాడు.

నాటకము మొదటి నుండి కొనవరకును వడివడిగా నడిచిపోతుంది. ప్రదర్శనమునకు అన్ని విధములా అనుకూలమయిన దృశ్యములు గలది. ప్రేక్షకుల దృష్టిని ఆకట్టగల సన్నివేశములు, సంభాషణలు, ప్రజల దేశాభిమానము ఆవేశములుగల నాటకము. అందుచేతనే ఈ నాటకము ప్రపంచమందలి విద్యార్థులు తరచుగా ఆడుతూ ఉంటారు.

* * *

## ఓ తె లో

కథా సంగ్రహము -

వెనిస్ నగర రాజ్యమందు ఓతెలో అనే మూర్ జాతి ప్రభువు వర్గ సంపన్నుడు ఉద్యోగి. ఆ రాజ్య పరిపాలన సమితి సభ్యుడైన

బ్రబాంటియో కూతురు డెజ్డెమోనాకున్ను ఓతెలోకున్ను పరస్పర ప్రేమ అంకురించి రహస్యంగా ఫలించినది. ఆ సంగతి తెలిసికొని బ్రబాంటియో ఆ సమితి కధ్యక్షుడైన వెనిస్ ప్రభువు సన్నిధికి అభియోగ పత్రము సమర్పించుకొన్నాడు. అది ఆ సమితి విచారణకు వచ్చినది. ఓతెలో, డెజ్డెమోనాల సమాధానములకు ఆ సమితివారు సుముఖులైనారు. వెనిస్ ప్రభువు తదనుకూలముగానే తీర్పు చెప్పినాడు. ఆ సమయమందే వెనిస్ రాజ్యమునకు చెందిన సైప్రెస్ అనే ద్వీపమునకు తురుష్కులు దండెత్తి రానున్న వార్త తెలియవచ్చుటచేత ఆ ద్వీపరక్షణకు ఓతెలో సైన్యాధిపతిగా నియమితుడైనాడు అతనికి సహాయ సైన్యాధిపతిగా ఉండుటకు ఇయాగో అభిలషించెను. కాని ఓతెలో అతనిని నియమించలేదు కాసియోను నియమించెను. సంగ్రామ క్రీడా కౌశలము తనకున్నంత లేకపోయి నా కాసియో నియమితుడగుట వలన ఇయాగోకు ఓతెలో కాసియోలపై కోపము ఈర్ష్యాపుట్టినవి. ఏదో ఒక విధముగా వారిద్దరికిని అపకారము కావించవలెనన్న కోరిక కూడా జనించినది. అంతకు పూర్వము రొడరీగో అనే సంపన్నుడు డెజ్డెమోనాను కామించి నాడన్న సంగతి తెలిసికొని ఇయాగో అతనితో మైత్రి సమకూర్చుకొన్నాడు. పగ సాధించుకొనుటే కాక ధనము కూడా సంపాదించుకొన దలచి డెజ్డెమోనాను అతనికి లభ్యమగునట్లు చేయగలననిన్ని తన పన్నుగడలు ఫలింపజేయుటకు ధనము కావలెననిన్ని ఇయాగో రొడరీగోకు తెలియజేసెను. కామోద్రేకము గల రొడరీగో ఇయాగోకు కావలిసినంతధనమిచ్చినాడు. కాని ఇయాగో ప్రయత్నములు ఫలింపగలవి కావు. కనుక ఇయాగో తన పగ సాధించుకొనుటకు ఘోరమైన పని చేయుటకే సంకల్పించుకొన్నాడు. అంత తీవ్రయిన సంకల్పమునకు ఓతెలో తనను తప్పించి కాసియోను సహాయ సైన్యాధి పతిగా నియమించి నాడన్నది తగిన కారణము కారాదు. అందుకు మరియొక కారణముత్పన్నమైనది. ఇయాగో భార్య అమీలియా డెజ్డెమోనాకు పరిచారికగా నియుక్తురాలై యుండెను. ఓతెలో తన భార్యను వశపరచుకొన్నాడన్న అనుమానము కలిగినది. (చూ I. 3, 411. 2) ఈ అనుమానము అనతికాలములోనే ప్రబల రూపము దాల్చినది. (చూ II, 1, 327-32)

కథా సంఘటనలు ఎట్లు నడచినవంటే ఓతెలో సైన్యాధిపతిగా నియుక్తుడైన వెంటనే సైప్రెస్ ద్వీపమునకు పోవలసి వచ్చినది. వెనిస్ పట్టణమునుండి ఓడలు వెడలినవి. మొదట ఓడలోనే ఓతెలో ప్రయాణము సాగించినా ఆకస్మికముగా తుపాను వచ్చుట వలన అతని ఓడయే తక్కిన ఓడల కంటే ఎక్కువ ఆలస్యముగా సైప్రెస్ ద్వీపము చేరుకో వలసినది. కాసియో ఎక్కిన ఓడ మొదట చేరినది. ఆ తర్వాత డెజ్‌డెమోనా, అమీలియా ఇయాగో ఉండిన ఓడ చేరినది. వీరందరూ సైప్రెస్ చేరిన వెంటనే తన పగ సాధించు కొనుటకు ఇయాగోకు తగిన అవకాశము చిక్కినది. ఆ ద్వీపమందలి కోటలో నిలచి తురుష్కుల దాడి కనిపెట్టి ఆ కోటను సంరక్షించే పని కాసియో ఇయాగోలు చేయవలసి వచ్చినది. కాసియో మధుపానాసక్తి ఎక్కువగా గలవాడన్న విషయము ఎరిగినవాడు గనుక ఇయాగో మధువు ఎక్కువగా తెప్పించి తాను కొద్దిగా త్రాగుతూ కాసియో మితిమీరి త్రాగునట్లు చేసి రోడరీగో, కాసియోలకు అదివరకుండిన కలతలు ఎక్కువగు నట్లు చేసి ఇద్దరికిని ద్వంద్వ యుద్ధము సంభవింపజేసినాడు. వారిరువురును కలహించి కత్తులు దూసుకొంటూ ఉండగా వారిని నివారించుటకు ఆ సైప్రెస్ ద్వీపపాలకుడుగా నుండిన మాన్‌టానో అడ్డుగానిలచినాడు. మధుపానమత్తుడైన కాసియో మాన్‌టానోను యెదిరించెను. ఆ మాన్‌టానోకు కాసియో కత్తి తగిలి గాయపరచినది. పెద్ద అపాయము కలుగుటవలన భయము కలిగినవానివలె నటించి కేకలు పెట్టవలసినదని రోడరీగోను ఇయాగో హెచ్చరించినాడు. అప్పుడా రోడరీగో పెట్టిన కేకలు వినబడగానే ఓతెలో ఆ స్థలమునకు వచ్చి ఏమి జరిగినదని ప్రశ్నింపగా కాసియో మధుపానమత్తుడై అత్యాచారము జరిపిన వాడుగా నిరూపితమైనది. ఆ వెంటనే కోపోద్దీపితుడైన ఓతెలో కాసియోను సహాయ సైన్యాధిపతి పదవి నుండి తొలగించినాడు. ఇయాగో సంకల్పించిన రెండు పనులలో మొదటిది సులువుగానే ఈడేరినది. కాసియో పదవీ భ్రష్టుడైనాడు.

20)

రెండవది ఓతెలోకు కష్టము కలిగించుట డెజ్‌డెమోనాను విడచి పెట్టుట ఆమె రోడరీగోకు లభించుట అంత సులభమైనది కాదు. అందుకు కుట్రలు పన్నుటకు ఇయాగో మొదలు పెట్టినాడు. కాసియోను పదవీ భ్రష్టుని గావించుటలో ఇయాగో తన పన్నాగమును బయల్పడనీయలేదు. అందుచేత అతను కాసియోకు విరోధి కాలేదు అంతేకాదు కాసియో యెడల సానుకంపముగల వాడుగానే నటించి ఆ పదవి మరల పొందుటకు చేయదగిన పని ఉపదేశించినాడు. ఓతెలోకు తన భార్యయైన డెజ్‌డెమోనా యెడల అనురాగము మెండుగా కలదు. ఆమెను నీవు ఆశ్రయించి మొరపెట్టుకో ఆమె గట్టిగా శిఫారసు చేసిన యెడల ఓతెలో కాదనలేడు. మరల నీకా ఉద్యోగము లభించగలదు అని ఉపదేశించినాడు. అతని మాటలు నమ్మికొని కాసియో ఆమెను ఆశ్రయించి తన కోరిక తెలియజేస్తూ వుండగా ఆ ప్రదేశమునకు ఓతెలో ఇయాగోలు రావడం సంభవించినది. కాసియో ఆమె వద్దనుండి సెలవు తీసికొని వెడలుతూ ఉండెను. అప్పు డేదో శంకించిన వానివలె నటించి అంతవరకును ఓతెలోతో ఏదో చెప్తూ వుండిన ఇయాగో చట్టున తన మాటలు ఆపి చూచినాడు. దానితో ఓతెలో మనస్సున ఇయాగో సంకల్పించిన విషబీజము ప్రవేశించినది. కాని ఓతెలో దానినంతగా పాటించలేదు.

ఓతెలో యింట్లోకి రాగానే డెజ్‌డెమోనా అతనిని కలిసికొని కాసియో మొర తెలియజేసి అతడు యుద్ధ ప్రావీణ్యము గలవాడనిన్ని అతనిని మరల సహాయ సైన్యాధిపతిగా నియమించవలసిన దనిన్ని గట్టిగా శిఫారసు చేసినది; కాసియో తన తప్పు క్షమించవలసినదని ప్రార్థించుటకు రానున్నాడనిన్ని అతనికి దర్శన మిచ్చి అతని మొర వినవలసినదనిన్ని వేడుకొన్నది. ఆమెయందు తనకుగల అనురాగము గాఢముగానే ఉండుటవలన సరే ఆలాగునే చేతునని ఓతెలో ఆమెకు తెలియజేసినాడు.

ఇయాగో ఓతెలోను మరల కలుసుకొని డెజ్‌డెమోనా రెండు హృదయములు గల దానివలె కనబడుతూ ఉన్నదనిన్ని మూర్ జాతి వల్లని మానవుని పెండ్లియాడి నందుకు నొచ్చుకుంటున్న దనిన్ని తన

జాతి శ్వేతవర్ణుడగు కాసియోను కామించు చున్నదనిన్ని కాసియో
కూడా ఆమెను కామిస్తున్నాడనిన్ని ఉభయులున్ను కలిసికొంటూ
మాటలాడు కొంటున్నారనిన్ని ఓతెలోకు వచ్చి చెప్పినాడు. ఓతెలో
హృదయము చలించినది. కోపము రగిలినది. గాని ఇయాగో మాటలు
పూర్తిగా నమ్మలేక నిదర్శనము చూపవలసినదని ఓతెలో ఇయాగోను
నిర్బంధించినాడు.

ఇయాగో తాను చెప్పినది సత్యమే అని నచ్చచెప్పుటకు తగిన
అవకాశము ఒక చిన్న సంఘటనవలన చక్కగా లభించినది. ఓతెలో
డెజ్‌డెమోనాకు తన వివాహ సమయమున ఆమె యెడల తనకుగల
అనురాగమునకు సూచనగా ఒక చక్కని చేతి రుమాలు బహుకరించి
నాడు. అది రహస్యముగా తనకు అందజేయవలసినదని ఇయాగో డెజ్
డెమోనా పరిచర్య చేస్తూ ఉండిన తన భార్య. అమీలియాను కోరి
నాడు. పాపమామెకు ఇయాగో కుతంత్రము తెలియదు. ఓతెలో
తొలిసారి ఇయాగోతో ప్రసంగం జరిగిన నాటి రాత్రి తలనొప్పి వచ్చి
నది. అది ఉపశమింప జేయుటకు డెజ్‌డెమోనా ఆ చేతి రుమాలు
అతని నెన్నుదురు బిగియకట్టినది. దాని వలన ప్రయోజనము కనబడ
లేదని ఓతెలో దానిని విప్పి నేల బడవేసినాడు. అది నేలమీద జీరా
డుతూ ఉండినా డెజ్‌డెమోనా చూడలేదు. దానిని అమీలియా తీసి
తన మగడు ఇయాగో లోగడ కోరినట్లు అతనికి రహస్యముగా అంద
జేసినది. ఆ చేతి రుమాలు ఇయాగో కాసియో ఇంటి కిటికీ ఊచల
నడుమ చేయిదూర్చి అతని గదిలో పడవేసినాడు. ఆ తర్వాత ఓతె
లోను కలిసికొనుట సంభవింపగానే ఆ చేతి రుమాలుతో కాసియో
తన ముఖము తుడుచుకొంటూ ఉండగా చూచినట్లు చెప్పినాడు. ఆ
రాత్రియే ఓతెలో ఆరుమాలు కావలెనని డెజ్‌డెమోనాను కోరినాడు.
ఆమె కది కనపడలేదు. అది ఎక్కడనో ఉన్నది కనబడలేదు తర్వాత
వెదకి ఇస్తానని ఆమె చెప్పినది. అట్లు పనికిరాదు వెంటనే దానిని తీసి
కొని వచ్చి చూపించ వలసినదని అతడు నిర్బంధించినాడు. పాపం!
ఎంత వెదకినా ఆ మెకది కనబడలేదు. దానితో ఓతెలోకు ఇయాగో
చెప్పిన మాటలు ఎక్కువగా తలకెక్కినవి. కాని ఇంకా పూర్తిగా

అతనికి నమ్మకం కుదరలేదు. అందుచేత ఇయాగో మరియొక పన్నుగడ పన్నినాడు.

కాసియోకు బియాన్కా అను నొక వేశ్యతో సంబంధముండెను. ఆమె అతనిని గాఢముగా ప్రేమించినది. ఆ విషయము ముచ్చటించుటకు కాసియోతో ఏదో నిమిత్తము కల్పించి డెజ్‌డెమోనాకు కాసియో యెడల గల ప్రేమ సమాచారము కాసియో నోటనే పలికింతునని నచ్చచెప్పి తాను కాసియోను కలియుటకు సంకల్పించిన ప్రదేశమునకు చేరువగా ఒక రహస్య ప్రదేశమున ఓతెల్లోను నిలబెట్టి కాసియో మాటలను స్వయంగానే విందువుగాక యని పలికి కాసియోను కలిసి బియాన్కా పేరు కడు మెల్లగా పలికి ఆమెకు తనమీద నుండిన ప్రేమ ఎంతగాఢమో తెలియజేయుమని కాసియోను ఇయాగో కోరినాడు. అప్పుడామె పేరు పైకి అనకుండానే కాసియో వర్ణించి చెప్పినాడు. బియాన్కా గురించి చెప్పిన అతని మాటలు డెజ్ డెమోనా గురించి పలికినట్లుగా ప్రసంగం నడిపించుటలో ఇయాగో తన చమత్కారశక్తి అంతా వినియోగించినాడు. ఇది నాల్గవ అంకం మొదటి దృశ్యములో విశదమయినది. ఈ అద్భుత కల్పన అంతా రచించుటలో షేక్‌స్పియరు తన రచనా సామర్థ్యమును ఎక్కువగా ప్రదర్శించినాడని చెప్పక తప్పదు. ఇయాగో ఎత్తుగడ పూర్తిగా సఫలమైనది.

ఇది జరిగిన వెంటనే ఓతెల్లో పూర్తిగా కోపోద్రిక్తుడైనాడు. ఇంతలో మరియొకసంఘటన సమకూడినది. వెనిస్ నగరాధిపతి రాయబారము వచ్చినది. రాయబారి లోడవీకో ! డెజ్‌డెమోనాకు తండ్రియైన బ్రబాంటోకు దగ్గర చుట్టము. అతడు వెనిస్ నగరాధిపతి నుండి వచ్చిన ఆజ్ఞాపత్రమును ఓతెల్లోకు అందజేసినాడు. అందులో కాసియోకు తన ఉద్యోగాధికారమును అప్పగించి ఓతెల్లో వెనిస్ నగరము నకు రావలెనని ఉన్నది. దానితో ఓతెల్లో వెర్రివానివలె ప్రవర్తించినాడు. కాసియో పక్షంగా ఒకమాట అన్నందుకు డెజ్‌డెమోనా దవడపై అతడొక లెంపకాయ కొట్టినాడు. ఆమె విలపించినది. ఇది

లోడవీరోకు వింతగా తోచినది. కాని వానికి యథార్థము తెలియదు. ఆ ఆజ్ఞాపత్రములో తన కనిష్ఠామె కష్టపెట్టిన విషయముండుట వలన అతడట్లు ప్రవర్తించియుంటునని ఇయాగో తప్ప తక్కిన వారనుకొన్నారు. ఇయాగో ఓతెలో మెదడులో నాటిన విష ద్రుమిక పూర్తిగా ఫలించినది. ఓతెలో ఇయాగోకు పూర్తిగా లోబడినాడు. అతడు తన భార్యకు విషమిచ్చి చంపుతానంటే పీక నులిమి చంపుమని ఇయాగో సలహా ఇచ్చినాడు. ఇతని సలహా ననుసరించి ఓతెలో తన భార్య నిద్రలో ఉండగా ఆమెను లేపి ఆమె పీక నులిపి చంపినాడు.

ఈలోగా రొడరీగో ఇయాగోను కలిసి ఏమయ్యా నా మాట ఏమి చేశావు? నేను బహుకరించిన ఆభరణాలు కూడా డెజ్‌డెమోనాకు ఇచ్చినావుకదా ఆమెతో నాకు కలయిక ఎప్పుడు జరుగనున్నది? గాయశారాలతో కాలక్షేపాలు చేయడమెందుకు? నేనే డెజ్‌డెమోనను కలిసికొని నాతో వస్తానా? లేక నేనిచ్చిన ఆభరణాలు వాపసు చేస్తావా? అని అడుగుతానన్నాడు. ఆపని చేస్తే ఇయాగో కుట్ర అంతా బయటపడుతుంది. అందుచేత వెనిస్ నగరాధిపతి నుండివచ్చిన ఆజ్ఞాపత్ర వార్త ఇయాగో తెలియజేసినాడు. "అయితే ఆమె ఓతెలోతో కలిసి వెనిస్ నగరమునకు వెడలిపోతుంది. ఆమె మరి నాకు చిక్కేదేమిటి?" "అన్నాడు రొడరీగో." కాసియోకు ఛార్జీ అప్పగించి కదా ఓతెలో ఇక్కడ నుండి వెడలవలెను. కనుక ఈరాత్రి నీవు కాసియోను కడతేర్చవలెను. అప్పుడు ఓతెలో ఇక్కడనే ఉండిపోకతప్పదు. కొద్ది దినములలో డెజ్‌డెమోనా నీ ఒడిలో పడునట్లు చేయగలనన్నాడు. అందుకు తగిన ఏర్పాట్లు కూడా సమకూర్చాడు. కాని చివరకు కథ అడ్డముగా తిరిగినది. రొడరీగో కాసియోను గాయపరచినాడే కాని చంపలేకపోయినాడు. కాసియో కత్తివేటుకు అతడే మరణించినాడు. ఆపని కావలెననియే ఇయాగో కోరియుండెను.

డెజ్‌డెమోనాను హత్యచేసిన వెంటనే ఓతెలో గదిలోనికి అందరూ ప్రవేశించినారు. యథార్థ విషయములన్నీ ఒకటి తర్వాత ఒకటి బయల్పడినవి. నిష్కారణముగా అమాయకురాలు దోషరహిత

దొడ్డ పతివ్రత సుగుణరాశి అయిన భార్యను తన చేతులారా తానే ఆ దారుణ కృత్యమొనరించి చంపితినన్న దుఃఖ భారముతో ఓతెలో ఆత్మహత్య చేసికొన్నాడు. అంతకు ముందు ఇయాగోను చంపదల చెను గాని మరణము నీకు తగిన దండనము కాజాలదు అంతకంటె ఎక్కువ బాధాకరమైన దండనమును నీ వనుభవించవలెనని చెప్పి చంపక విడిచిపెట్టెను.

*　　　*　　　*

# ఇయాగో
## పాత్ర పోషణము : షేక్స్పియరు కళా నైపుణ్యము

ఓతెలో ఘోరవిషాదాంత నాటకము : నాయకుడైన ఓతెలో స్వతసిద్ధముగా కావట్యమెరుగని ధర్మమూర్తి : మహాదరుడు మహా శయుడు అట్టివాడు తనను గాఢముగా ప్రేమించి తన హృదయపూర్వక ప్రేమకుపాత్రమైన తనధర్మపత్నియైన డెజ్‌డెమోనాను అతిదారుణంగా పీక నులిపి చంపి అట్లు చంపుటకుగల కారణము అసత్య నిరూపణము వలన కలిగినదని ఋజువైన వెంటనే పశ్చాత్తాప్తుడై దుఃఖ సముద్ర ములో మునిగి వివేకశూన్యుడై ఘోరమైన తన మహా పాతకమునకు తానే దండన విధించుకొని తన కత్తితో తానే పొడుచుకొని ఆత్మ హత్య గావించుకొన్నాడు. ఈ ఓతెలో, డెజ్‌డెమోనాల మరణము లకు మిత్రద్రోహియైన ఇయాగో కావించిన దుష్కృతులే కారణమని చెప్పుటలో అభిప్రాయభేదములేదు. కాని ఇయాగో అట్లు ప్రవర్తించు టకు హేతువేమి? అపకారమేదో పొందినవాడే కదా సాధారణముగా ప్రతీకారమునకు పూనుకొంటాడు. ఓతెలో అతనికి అపకారము చేసిన వాడా? కాదు. అంతేకాదు రాష్ట్రాధిపతితో కథారంభములోనే "ఈ ఇయాగో నా పతాక వాహకుడు : ఋజుమార్గ వర్తనుడు : విశ్వాస

పాత్రుడు" అని చెప్పి "నేను ముందుగా సైప్రెసు వెడలవలెను గనుక ఈ రాత్రే నేను వెళ్ళుచున్నాను నా భార్యను నీ కప్పగిస్తున్నాను. నీ భార్య ఆమెకేమి కావలెనో చూస్తూ ఉండగలదు మీరు ముగ్గురును రేపు బయలుదేరి రావలెను" అని పలికిన ఓతెలో తన యెడల సద్భావముతో ఉన్నవాడే కాని అపకారము చేసినవాడు కాడు గదా! కావి సహాయ సైన్యాధిపతి ఉద్యోగము పదవికి తానే ఎక్కువ అర్హత గలవాడయినా అది తన కీయక కాసియోకిచ్చినాడు గనుక అపకారముచేసి నాడన్న కోపము మాత్రము లేక పోలేదు. నిజమే కాని ఇది తుదకు జరిగిన దారుణ కృత్యములకు దారి తీయవలసినంత పెద్ద హేతువు కాజాలదు.

కాసియో యెడల ద్వేషము వహించుటకున్ను ఇదియే కారణము. సైప్రెస్ ద్వీపము ప్రవేశించిన నాటిరాత్రి దుర్గ రక్షణము చేయవలసిన బాధ్యత కాసియో ఇయాగోలకు ఓతెలో అప్పగించుటచేత కాసియో యెడల తనకుగల పగ సాధించుకొనుటకు తగిన అవకాశము ఇయాగోకు లభించినది. కాసియోను బుజ్జగించి మధుపానమత్తుని గావించి పన్నిన పన్నుగడ సఫలమయినది. ఓతెలో కాసియోను ఉద్యోగమునుండి తొలగించినాడు. ఈ పన్నుగడ రహస్యము కాసియోకు తెలియదు. తన నేరమునకు తగిన దండనము కలిగినదనే భావించుకొన్నాడు కాసియో. అపకారమునకు ప్రతీకారము జరిగినది కనుక అటుపైని ఇయాగోకు ఎవరిమీదను కోపము వహించవలసిన పని ఉండనక్కరలేదు గదా! కాసియో పని తన కప్పగించలేదన్న కోపము ఓతెలోమీద నుండెనేమో అని ఊహించుటకు అవకాశము లేదు. ఇయాగో ఓతెలో కెన్నడునూ ఈ కోరిక యథాలాపముగానైనా తెలియజేయలేదు. తాను యాచించకుండానే ఆ పని తన కీయలేదన్న కోపముండెనేమో అంటే అది తుదకు జరిగినంత ఘోర కృత్యమునకు దారి తీయవలసినంత కోపము రాదగునా! రోడరీగోకు డెజ్‌డెమోనా, లభించునట్లు చేయదలచినట్లు మాట యిచ్చి అతనివద్దనుండి ధనము గుంజుతూ ఉండెను గనుక ఓతెలో ఏ కారణము చేతనైనా డెజ్‌డెమోనాను విడిచిపెట్టే సాధనము కోసము కుట్ర పన్నుతున్నా

డేమో అని అనుకుందామంటే "ఇయాగో తన ఆత్మగత ప్రసంగ ములలో ఎక్కడా ఆమాట అనుకోలేదు. మీదు మిక్కిలి "రోడరీగో వట్టి మూర్ఖుడు: అందని ద్రాక్ష పండ్లకు అర్రులు చాపుతున్న చవట" అని పలికినాడు. రోడరీగో కోరిక నెరవేరదని తెలిసిన్నీ డబ్బు గుంజుటకు అతనికీ యాస కల్పించినట్లు మొదటి అంకము చివర వ్యక్త మయినది. కనుక ఓతెలో యెడల ఘోరమైన అపకారము గావించుటకు అదియొక కారణము కాజాలదు. అంతేకాదు ఓతెలో యెడల పగ పట్టుటకు అతడు తనకు గావించిన అపకారమేదీ ఇయాగో తెలియ జేయలేదు. సూచనగా నైనా చెప్పలేదు. అందుచేత ఓతెలో మెదడు లోనికి విషబీజములు నాటుటకు ఇయాగో ఎందుకు పూనుకొన్నాడన్న విషయము కాల్‌రిడ్జ్, బ్రాడ్లీ మొదలయిన విమర్శ కాగ్రేసరులకు సైతము చిక్కు ప్రశ్నయైనది. దారుణమైన కుట్ర పన్నుటకు ఏ మాత్రమైనా బయల్పడిన యెడల తన పని తనకే ప్రాణహాని కలిగించునన్న సాహస కృత్యములకు తానెందుకు పూనుకొంటున్నాడో ఇతరులకు తెలియదు సరే కదా అతనికైనా తెలియదేమో! అన్నారు కొందరు విమర్శకులు. ఎంత మూర్ఖుడైనా తగిన హేతువు లేకుండా ద్వేషబుద్ధి గల వాడు కాగలడా! అని కొందరు ప్రశ్నిస్తే కాగలడని కొందరు సమాధానము లిచ్చినారు.

రాగ ద్వేషములు జన్మాంతర వాసన వలన కలుగుతవి అని చెప్పిన వారితో హేతువాదము చేసినందు వలన ప్రయోజనముండదు. కాళిదాసు "రమ్యాణి వీక్ష్య మధురాన్ శ్చనిశమ్య శబ్దాన్" అనే శ్లోక భావమదే కదా! "భవబూతి వ్యతిషజతి పదార్థాన్ అంతరః కోపి హేతుః...." అనే శ్లోకంలో అంతః కారణమేదో అనురాగముల వల్ల కలిగే కలియికలకు ఉంటుందన్నారు. దీనిని బట్టి ద్వేషాలు పుట్టుటకున్ను అంతః కారణమేదో ఉంటుందని కూడా చెప్పవచ్చును. ఏదో ఉంటుందంటే యదార్థము తెలియదన్న మాట. హేతు వాదము చేసే వారికి ఇట్టి ఆధ్యాత్మికావాదము తృప్తి కలిగించదు.

ఓతెలో గురించి ఇయాగో అన్న మాటలు జ్ఞప్తికి తెచ్చుకొని విమర్శిద్దాము. మొదటి అంకము మూడవ దృశ్యము చివరి భాగములో

"ఆ మూరుజాతి ఓతెలో యెడల నాకు ద్వేషముజనించినది" అన్నాను. కారణము స్పష్టముగా చెప్పలేదు. కాని ఆ వెంటనే అతడు నా భార్యను వశపరచుకొన్నాడని కొందరను కొంటున్నారని విన్నాను. ఇది కేవలము అనుమానించే విషయంగానే ఉన్నదే కాని నిశ్చయముగా నమ్మదగినదికాదు. ఏదైతేనేమి ఇది సాకుగా పెట్టుకొని పగ సాధించాలి. "ఓతెలో నాయెడల అనురాగముకలవాడు కనుక అదినాకు వచరించగల సాధనమే కాగలదు." అని తన పన్నుగడ ఆలోచిస్తున్న వానివలె ఆగి మరల తన ఆత్మగత శేషము బయల్పరచినాడు. "కాసియో అంద మైనవాడు స్త్రీలను వశపరచుకోగల సమర్థత గలవాడు కనుక మిత్రమా! పోగొట్టుకున్న ఉద్యోగము మరల పొందుటకు తగిన ఉపాయము ఆలో చించినాను. డెజ్ డెమోనాను ఆశ్రయించి మొరపెట్టుకో ఆమె నీ అవస్థకు జాలిపడి భర్తతో నీ పక్షము వహించి శిఫారసు చేస్తుంది. ఆమె యెడల తనకున్న అనురాగముచేత ఆమె మాట కాదనలేడు." అని కాసియోకు ఉపదేశించాడు. అతడు నేను చెప్పినట్లు ఆమెను ఆశ్ర యిస్తాడు. ఆమె ఓతెలోకు శిఫారసు చేస్తుంది. ఇది వారిద్దరికి గల రహస్య పరస్పర ప్రేమ ఫలమని ఓతెలో మెదడు లోనికి ఎక్కిస్తాను. నా బుద్ధిబలము అప్రతిహతమైనది. సఫలముకాక తప్పదు. ఓతెలో వట్టి అమాయకుడు అందరూ తనవలెనే ఋజువర్తనముగల వారను కొంటాడు. అట్టి వాడు గనుకనే నా మాట నమ్ముకొంటాడు. అతనికి నచ్చచెప్పుటకు తగిన కుట్ర జరిపి సన్నివేశములు కల్పించవలెను. ఇందులో నేను కృతార్థుడను కాక పోవుదునా! అని సగర్వముగా తనలో తాను అనుకొంటాడు.

ఇతని మాటలు వట్టి వ్యర్థ ప్రలాపములుగా కనబడతెవి. భవ భూతి మాలతీ మాధవ నాటకములో కామందకీ నీతి శాస్త్రములోని వాక్యము ఒక శ్లోకములో తెలియజేసినాడు.

బహిస్సర్వాకార ప్రవణ రమణీయా వ్యవహారన్
పరా భ్యూహస్థానాన్య పితనుత రాణి స్థగయతి।

జనం విద్వానేకః సకలమతి సంధానయు కపటైః
తటస్థః స్వానర్థాన్ ఘటయతి వ మౌనం చ భజతే॥

ఇయాగో ప్రవర్తన ఈ శ్లోకమందలి లక్షణమునకు పూర్తిగా కాకపోయినా కొంతవరకు లక్ష్యముగా ఉన్నట్లు గోచరిస్తుందిగాని కుట్రకు తృప్తికరమైన హేతువు కనబడదు. ఎట్టి ఘోర కృత్యమైనా తాను సాధించగలనని అహంభావముతో ఉన్నవారికి అట్టి కృత్యములు గావించుటకు హేతువు ఉండ నక్కరలేదు. అట్టి వారికది యొక వేడుక అని కొందరంటారు.

విమర్శకులలో కొందరేమన్నారంటే మెత్తనివాణ్ణిచూస్తే మొత్త బుద్ధి, పిచ్చివాడు కనబడితే వాణ్ణి హింసించే బుద్ధి. పాపం! మనజోలికి రాక లేయెండలో తిరిగే తూనీగలను బట్టుకొని పీడించే బుద్ధి అకతాయి పిల్లలకు ఎందుకకలుగుతుంది. అందుకు కారణమేమిటి! అదియొక వేడుక. పిల్లికి చెలగాట ఎలుకకు ప్రాణ పోకట. ఇయాగో తన తెలివితేటలు చతురత చూచి పొంగిపోతున్నాడు తన పన్నుగడలకు అపజయ ముండదన్న అహంభావము గలవాడు అని కొందరు ద్వేషమునకు నిమిత్తముతో పనిలేదన్నారు. ఐతే తుదకు ఏమి జరిగినదో, అదే జరుగు నన్న దూరదృష్టి ఇతనికి లేదు. ఎప్పటికప్పుడు ప్రత్యుత్పన్నమతియై ఇతడు నెగ్గుకొంటూ వచ్చాడు. అంతేకాదు తన కుట్ర వలన ఇంత ఘోరమైన విపత్తు జరుగునన్న విషయముకూడా అతడు ముందుగా అనుకొనలేదు. సన్నివేశములను బట్టి కథ నడుస్తూ ఉంటే అందుకు తగినట్లు తన కల్పనలను నడిపిస్తూ వచ్చాడు. తుదకు తాను స్వప్నమందైనా ఊహించి యుండని చోట నుండి అనగా తన యిల్లాలి నోట నుండి అతని రహస్యము బయల్పడినది. అయితే మాత్రం ఏం ప్రయోజనం! నాయికానాయకులు అతని భార్య అమీలియా చావులు తప్పినవి కావు. చేతులు కాలిన తర్వాత ఆకును పట్టుకొనుట వలన ప్రయోజనమేమి కలదు! ఏమైనా సరే పాపము బయలు పడకమానదు. ఇయాగో వలె అహంభావముతో విర్రవీగు మానవమాత్రుడు తాను తీసికొన్న గోతిలో తాను పడక మానడు అనే నీతికి నిదర్శనము కాగలదీ నాటకమని కొందరు విమర్శకు లన్నారు.

ఇది చారిత్రక నాటకమైంతే వస్తునిరూపణము యథాతథంగా ఉన్నదా ! లేదా! అనే విషయము మన మాలోచింపదగినది. యథాతథంగా ఉన్నదైతే "ఏమి భగవంతుడా ! కథ ఈ విధముగా పరిణమింప జేశావు!" అని సృష్టికర్తయైన బ్రహ్మ ననుగవలెను. కాని ఇది చారిత్రకము కాదు. కవి కల్పితము కనుకనే ఈ ప్రశ్నకు షేక్స్పియరు సమాధాన మీయవలె నంటాము. ఐతే కవి కూడా సృష్టికర్త వంటి వాడే కనుక ఈ షేక్స్పియరు కవి బ్రహ్మకూడా ఆ బ్రహ్మవలెనే సమాధానమేమీ ఈయడు. ఏ మాటా అనడు. ఎవరిమట్టుకు వారు తమకుగల బుద్ధి వినియోగించుకొని తెలిసికోవలెనన్నట్లుగా మౌనం వహించినాడు. ఇట్టి కృత్యములు భగవల్లీలలు అంటారు గదా తత్వజ్ఞులు. వాటి నిరూపణమే యీ కవి బ్రహ్మ గావించినాడని మనము తెలిసికొని తృప్తిపొందాలి.

జాన్ గెన్ సన్ అనే విమర్శకుడు ఓతెలో ఇయాగో పాత్రపోషణము విమర్శిస్తూ షేక్స్పియరు 84 సార్లు "అనుకొంటాను" అనే అర్థంలో "I think" అనే పదములున్నూ నాకు తెలుసును అనే అర్థములో "I know" అనే పదము పెక్కుసార్లు ప్రయోగించినాడు. ఈ పదప్రయోగాలవల్లనే ఆ పాత్రల మనో భావ నిరూపణము గావించినట్లు తెలియజేసినాడు. తెలుసును అన్న యాధార్థ్యమును సూచిస్తుంది. అనుకొంటాను అన్నది హేతువును సూచిస్తుంది. అనగా అనుకోడానికి తగిన కారణమున్నట్లు తెలియజేస్తుంది. ఆ కారణము యథార్థమయినది కావచ్చును లేదా ఊహా జనితము కావచ్చును. ఊహా జనితమంటే ఆ ఊహ కూడా అనుకొనుట వంటిదే కనుక దానికొక యాధార్థ్యము కారణమైయుండాలి అనుకొన్నది అసత్యమని ఋజువైతే ఊహించుటలో దోషమున్నదనాలి. ఇయాగో మొదట నుండి చివర వరకును అబద్ధాలే ఆడుతూ వచ్చాడు. తాను చూడనిది చూచానని తెలియని విషయము తెలుసునని చెప్తూ వచ్చాడు కనుక అతడు తెలుసును అనుకొన్నాను అనుకొంటున్నాను అనేమాటలన్నీ బూటకాలే ఓతెలో అన్న మాటలు అటువంటివి కావు 'తెలుసును' అని అంటే వాస్తవముగా తెలుసునని నమ్మవచ్చును. అనుకొన్నది అసత్యమైతే

అతడుఅనుకొనుటకు కారణమైనది తాను స్వయముగా తెలుసుకొన్నది కాక ఇతరులు చెప్పగా విన్నది కావలెను. ఆ విన్నది అసత్యమై ఉండవలెను. తాను చూచినదే అయినా తాను విన్నది సత్యమే అయినా దానిని ఆధారముగా పెట్టుకొని అనుకొన్నది అసత్యముగా ఋజువయితే అతడు అనుమయించడంలో లోపముండవలెను. ఆ లోపమునకు కారణము అతని వివేకములోనో తెలివితేటలలోనో ఉన్న లోపమయి ఉండాలి. ఈ రీతిగా విమర్శించి ఓతెలో పాత్రను ఆ విమర్శకుడు పరిశీలించాడు.

ఓతెలో గొప్ప యోధుడు, సైనిక విద్య నేర్చినవాడు, సమర విద్యలో అనుభవము గలవాడు. అంతేకాని ప్రపంచజ్ఞానము గలవాడు కాడు. అమాయకుడు, ఉద్యోగ ధర్మము నిర్వర్తించుటలో కఠినుడు, సుశిక్షితుడు, సత్యశీలుడు, దయార్ద్ర హృదయుడు, ఏకపత్నీ వ్రతుడు, మత విషయములో తన మత మెట్టిదైనా ఇతరుల నమ్మకమును చెడగొట్టువాడు కాడు. లోకానుభవము చాలకపోవుట వలన యితరులందరును తన వంటివారే అనుకొని ఎవరేమి చెప్పినా నమ్ముకొనే స్వభావము కలవాడు. డెజ్ డెమోనాను త్రికరణ శుద్ధిగా ప్రేమించినవాడు. ఆమె తన యెడల వాస్తవమయిన ప్రేమగలదనిన్ని తనను వివాహమాడునప్పుడు తండ్రి విరోధించినా తనను వివాహమాడి దానివలన కలిగే నష్టములకు ఓర్చుకొన్న గొప్ప ఉదారబుద్ధి గలదనిన్ని తలచినాడు కనుకనే తగిన నిదర్శనము చూపించిన వరకున్నూ ఆమెను దుశ్శీలగా భావించననిన్ని స్పష్టముగా పలికినాడు. అతనిశీలము, వర్తనము, మనోభావములు, అతని తెలివితేటల లోపములు అన్నీ పూర్తిగా ఎరిగిన వాడే కనుక ఇయాగో తన పన్నుగడలు ఎట్లుసాగింపవలెనో తెలిసికొనగలిగినాడు. అస్త్రశస్త్రము లేవిధముగామంచికిని చెడుగునకునువినియోగపడునో తెలివి తేటలుకూడా మంచికిని చెడుగునకు వినియోగపడునుకదా. ఇయాగో తన తెలివితేటలు జీవహింస కుపయోగించినాడు. దుష్కృతులు గావించుటలో అతని తెలివి తేటలు పూర్తిగానే ఫలించినవి. కాని ప్రమాదో ధీమతామపి అన్నట్లు ఇయాగో వక్రబుద్ధిలో ఒక లోపము కలిగినది. భార్య చేతి రుమాలు విషయములో

బయలు పెట్టకుండా ఉండే ఉపాయ మాలోచించుకోలేదు. ఆ రహ స్యము బయలుపడక యుండిన యెడల ఈ నాటకము ఇందుకు భిన్న ముగా నడచి యుండును. ఇయాగో పూర్తిగా విజయుడై యుండును. అనగా అసత్యమునకూ, మోసమునకు, అవినీతికి విజయము కలిగించిన నాటకమయి ఉండును. అట్టి నాటకమును ఎవరును హర్షించరు. ఎవ రును ప్రదర్శించుటకు అంగీకరించరు.

షేక్స్పియరు దుష్కృతికి, అవినీతికి జయమిప్పించే నాటకము రచించుటకు పూనుకోలేదు. పాపముదాగదు. ఎప్పటికయినా సత్యము బయటపడకపోదు. దుష్టులు నశించకపోరు. సాధువులకు రక్ష కలుగక పోదు అనేనమ్మకమునకు అనుకూలముగానే షేక్స్పియరు తన నాట కములు రచించినాడు.

ఇయాగోను ఓతెలో చంపక విడిచి పెట్టినట్లు కథ ముగించు టలో షేక్స్పియరు గొప్ప భావమును వ్యక్తపరచినాడు. ఆ భావము ఓతెలో నోటను పలికించినాడు. ఇయాగో కావించిన మహాపాతకము నకు మరణము తగిన దండనము కాజాలదని ఓతెలో అభిప్రాయము. చచ్చినవానికి చైతన్యము పోతుంది గనుక ఏదీ నొప్పికలిగించదు బాధించదు అని అతని ఉద్దేశము కనుక ఇయాగోకు చైతన్యముతోనే జీవిస్తూ అనుక్షణం అతని దేహానికీ మనసుకు బాధకలిగించే దండనము కావలెనని అతని కోరిక.

* * *

## డెజ్ డెమోనా పాత్ర

షేక్స్పియరు సృష్టించిన స్త్రీ పాత్రలలో డెజ్ డెమోనా ఉత్తమ శ్రేణిలో ఉండదగినది. ఈమె అందాల భరణిగాను సుగుణాల రాశిగాను చిత్రితమయినది. పాతివ్రత్యమునకు పేరుపొందిన భారతీయ

నారీమణులలో సీత, సావిత్రి, శకుంతలల వంటిది. రాముడు లోకోప వాదునకు భయపడి సీతను అరణ్యవాసమునకు పంపించినపుడు సీత తన యెడల క్రూరముగా ప్రవర్తించి పంపుటకు మగని కాస్తయినా నిందించిన దేమోకాని డెజ్‌డెమోనా తనను భర్త పీక నులిపి చంపుతూ ఉన్నా పతిని నిందించలేదు. చనిపోతూ ఉండిన సమయాన అమీలియా వచ్చి "ఏమమ్మా" అని అడిగినప్పుడు "ఆత్మహత్య" అన్నదే కాని మగడు చేసిన హత్యయని తెలియజేయలేదు. ఈ సన్నివేశమందే ఆమె మగని పేరు అపఖ్యాతి పాలుపడకుండ చేయుటకు అబద్ధమాడినది. దుష్యంతుడు శాపవశమున మైమరచి శకుంతలను గుర్తింపలేక ఆమెను స్వీకరించలేదు. ఓతెలో ఇయాగో మాయకు లోబడి వివేక శూన్యుడై డెజ్‌డెమోనా శీలమును శంకించి చంపినాడు. అభిజ్ఞాన సూచకమయిన ఉంగరము కనబడగానే జరిగిన సంగతి జ్ఞప్తికి తెచ్చుకొని దుష్యంతుడు పశ్చాత్తప్తుడై దుఃఖించినాడు. అమీలియావల్ల సత్యము తెలిసికొని ఓతెలో గతించిన వివేకము మరలపొంది తాను చేసిన మహాపాతకమునకు తానే దండన విధించుకొని ఆత్మహత్య చేసికొన్నాడు. శకుంతలా దుష్యంతుల అన్యోన్య ప్రేమవలె డెజ్‌డెమోనా ఓతెలో పరస్పర ప్రేమ గాఢమైనది; పవిత్రమైనది. ఇయాగో మాయ మాటలకు మోసపోయి రోషావేశములో డెజ్‌డెమోనాను ఘోరముగా హత్య చేయుటకు సిద్ధమైన సమయములో కూడా ఆమె తనను త్రికరణ శుద్ధిగా ప్రేమించుచుండెనన్న విషయము జ్ఞప్తికి తెచ్చుకొని ఆమెను ముద్దు పెట్టుకొన్నాడు దుష్యంతుడు శకుంతలను మారీచాశ్రమమందుండిన శకుంతలను కలిసికొనగలిగెను. అట్టి అవకాశము తనకు లేదు గనుక ఓతెలో మాయతొలగి చైతన్యము రాగానే డెజ్‌డెమోనా దేహము పడియుండిన మంచముపైనే తన దేహము కూడా పడియుండవలెనన్న కోరికతో ఆత్మహత్య గావించుకొని ఆమె దేహం మీదనే తన దేహమున్ను ఉండునట్లు మరణించినాడు. అంతేకాదు ఇద్దరి ఆత్మలు ఒక్కచోటనే ఉండునుగాక! అని కోరినాడు.

డెజ్‌డెమోనా సుగుణ సంపత్తి పూర్తిగా గ్రహించినవాడు కనుకనే ఇయాగో మాటలు మొదట నమ్మలేకపోయినాడు. మోస

పుచ్చి మాయా సన్నివేశము కలిగించి చేతి రుమాలు గారడీ విద్యకు లోబరచి డెజ్‌డెమోనా శీలమును దుష్టమైనదని ఇయాగో నిరూపించినాడు. కనుక ఓతెలో ఇయాగో మాటలు పూర్తిగా నమ్మి వివేకశూన్యుడయినాడు.

అమిలియా మొత్తంమీద మంచిదే కాని సామాన్య స్త్రీకి ఉండే లోపములు కనబరచుకొన్నది. చేతి రుమాలు విషయములో తప్పు చేసినది. మగని కోరిక నెరవేర్చవలెనన్న ఉద్దేశముతో ఆ పని చేసినదే కాని మగని కపట హృదయము తెలిసికోలేక పోయినది. అతని ద్రోహము తెలిసికోగానే అతని దుశ్చరిత బయలు పెట్టినది. మగని కత్తిపోట్లకు భీతిల్లలేదు. నిజము పలికినది. నాటకము పూర్తిగా విషాదాంతమగుటకు ఆమె సత్యము పలుకుటయే కారణము. ఒక్క విషయము మాత్రము కోరదగినది జరిగినది. ఓతెలో మరణించుటకు పూర్వము సత్యము తెలిసికొన్నాడు. తన భార్య ఏ మాత్రమూ చెడని సాధ్వియున్నా తన యెడల ఆమెకుగల ప్రేమ పవిత్రమైనదనిన్ని అది పవిత్రతలో కాని తీవ్రతలోగాని లేశమైనా తగ్గలేదనిన్ని గ్రహించినాడు. కాసియో శీలముకూడా నిర్దుష్టమని తెలిసికొన్నాడు.

* * *

# కింగ్ లియర్

షేక్‌స్పియరు రచించిన పెద్ద ట్రాజడీలలో నాల్గింటను కింగ్ లియర్ మూడవది.

కథా సంగ్రహము :-

పూర్వమనేక శతాబ్దాల క్రిందట ఇంగ్లండ్ దేశమునకు లియర్ రాజుగా నుండెను. అతడు వార్ధక్యము వచ్చిన వరకున్ను దేశ

మును యథోచితముగా పరిపాలించెనన్న పేరు పొందినాడు. ముసలి తనము రాగానే రాజ్యమేలే బలము ఓపిక లేక అతడు తన రాజ్యమును తన సంతానమునకు అప్పగించి విశ్రాంతి తీసికోవలెనని తలచినాడు. అతనికి ముగ్గురు కూతుళ్ళు పుట్టినారే కాని పుత్ర సంతానము కలుగ లేదు. అందుచేత అతడు తన రాజ్యమును మూడు భాగములుగా విభ జించి ముగ్గురు కూతుళ్ళకును పంచి యిచ్చుటకు నిశ్చయించుకొన్నాడు. ఆ ముగ్గురి కూతుళ్ళలోను మొదటి ఇద్దరికిని వివాహములయినవి. మొదటి కూతురు పేరు గొనెరిల్, ఆమె భర్త ఆల్బెనీ ప్రభువు. రెండవ కూతురు పేరు రీగన్ ఆమె భర్త కార్న్‌వాల్ ప్రభువు. మూడవ కూతురు పేరు కార్డీలియా ఈమెకు ఇంకను వివాహము కాలేదు. కాని ఆమెను వరించుటకు ఫ్రాన్సు దేశపు రాజున్ను, బర్గండీ ప్రభువున్ను రాజమందిరమునకు అతిథులుగా వచ్చి యుండిరి.

రాజ్యము మూడు భాగములుగా ఎట్లు విభజించవలెనో అతడు తన మట్టుకు తానే ఆలోచించి దేశపటములో గుర్తించుకొన్నాడు. ఆ మూడు భాగాలలోను ఏ భాగము ఏ కూతురి కివ్వవలెనో అనే విషయముకూడా గుర్తించుకొన్నాడు. ఒకనాడు అతడు తన కూతు ళ్ళను అల్లుళ్ళందరిని దర్బారు మందిరములోనికి రమ్మని ప్రభువులు, సేవకులు కొలువుండగా తన సంకల్పమును తెలియజేసి, తన యెడల తన కూతుళ్ళకు ఎట్టి అనురాగము, భక్తి వినయములు కలవోముందుగా తెలిసికొన గోరినాడు. పెద్దకూతురు గొనెరిల్ తన అభిప్రాయము తెలియజేసినది. "తండ్రీ నీ యెడల నాకుగల ప్రేమ నానోటి మాటలు తెలియజేసిన దానికంటె అత్యధికము. నా దృష్టికంటెను, ప్రాణము కంటెను స్వేచ్ఛకంటెను ఎక్కువగా నిన్ను ప్రేమిస్తున్నాను. నాకంటె తండ్రిని ఎక్కువగా ప్రేమించిన కూతురు ఉండబోదు." అని పలికినది. అందుకతడు చాలా సంతోషించి దేశపటములో ఆమె వంతుకు చెంద వలసిన ప్రదేశమేదో చూపించినాడు. పిమ్మట అతడు తన రెండవ కూతురైన రీగన్ వైపుకు తిరిగి "నీ ప్రేమ ఎట్టిదమ్మా!" అని ప్రశ్నిం చెను. "అక్క చెప్పినట్లే నేనున్ను చెప్పదలచినాను కాని ఆమె పలికినది.

నాకు నీ యెడల గల ప్రేమలో సగమైనా వ్యక్త పరుపజాలదు. ఒక్క మాటలో చెప్పవలెనంటే నీ సేవ చేసినప్పుడే నాకు సుఖము కలుగగలదు. అని రీగన్ పలికినది. అందుకు చాలా ఆనందించి, లియర్ దేశపటము విప్పి ఆమెకు చెందవలసిన భాగమేదో చూపించినాడు. పిమ్మట కార్డీలియా వైపుతిరిగి "నీ ప్రేమ ఎట్టి దమ్మాయీ!" అని ప్రశ్నించినాడు.

అక్క లిరువురును చెప్పిన మాటలు విని కార్డీలియా వివగించు కొన్నది. తండ్రిని పొగడి అతని మెప్పు పొందుటకు ఆ విధముగా పలికినారే కాని తమకు కలదన్న ప్రేమలో సగమైన వారికి లేదన్న విషయము ఆమెకు లెస్సగా తెలియును. అందుచేత వారిద్దరును పలికినట్లుగా ఆమె పలుకలేదు. "తండ్రీ నిన్ను ప్రేమించుట నాకు హితమైన కార్యము కనుక ధర్మము బోధించునంత ప్రేమ నేను నీ యెడల పూర్తిగా వహించిన దానను. అంతకంటే లేశమయినా ఎక్కువా కాదు. తక్కువా కాదు." అని కార్డీలియా పలికినది. ఆమె పలుకులు గిం డికి రుచింపలేదు. ఆశ్చర్యము కోపము కలిగించినవి. "అమ్మాయీ! నీ మాటలు విని నేను సహింపలేను. లెస్సగా ఆలోచించుకొని మాటలాడు, అట్లు కాని యెడల నా రాజ్యములో నీకే మాత్రమైన ఈయజాలను" అని లియర్ గట్టిగానొక్కి చెప్పినాడు. అందుకు ఆమె భయపడలేదు. "మహారాజా! నీవు నాకు తండ్రివి, నన్ను కని ప్రేమతో పెంచిన వాడవు. నీ యెడల కృతజ్ఞురాలను వినయ విధేయతలు, ప్రేమ గల దానను. నా అక్కలు ఇద్దరును పలికినట్లు నేను పలుకజాలను. తమకున్న ప్రేమ అంతా నీ ఒక్కడికే ధారపోసినామన్నారు. అదే నిజమయితే పెండ్లి చేసికొన్నారు గదా! ఇక తమ భర్తల యెడల వహించుటకు ప్రేమ యెక్కడి నుండి రాగలదు? నేను పెండ్లియాడిన పిమ్మట నాకు గల సగము పాలు నా భర్తకు చెందకతప్పదు గనుక మిగిలిన సగపాలు మాత్రమే నీ మీద యుండగలదు" అని కార్డీలియా స్పష్టపరచినది. ఈమాటలు లియర్‌కు వింతగాతోచినవి. అతడు కోపముతో పిచ్చివాని కేకలు పెట్టి "సరే ఇదే నీ నిశ్చయమయి నప్పుడు నీకు నా

రాజ్యములో లేశమయినను ఇవ్వజాలను. నీ కోసమని కేటాయించిన భాగమూ నీ అక్కలిరు వురికిని పంచియిస్తాను. నీ ప్రేమయే నీ భర్తకు వరశుల్కముగా ఇచ్చుకొని పెండ్లియాడు. ఇక నీవు నా కూతురివి కావు. నేను నీకు తండ్రిని కాను. నా రాజ్యములో నీకు స్థానము ఇంక ఉండదు. వెడలి పొమ్ము" అని పలికినాడు.

అప్పుడా కొలువు కూటములో కెంటుకుండల ప్రభువు కూడా ఉండెను. అతడు రాజు యెడల భక్తి వినయములు కలవాడు. అయినా కార్డీలియా యెడల కఠినముగాను ధర్మవిరుద్ధముగాను వ్యవహరించి నందుకు రాజు నెదిరించి కార్డీలియా పక్షము వహించి మాటలాడినాడు. అందుకు లియరు మరింత కోపము తెచ్చుకొని కెంటును దేశమునుండి బహిష్కరించినాడు. కెంటు కొలువు కూటమునుండి వెడలిపోయెను. వెడలి పోతూ "భగవంతుడు, కార్డీలియాను రక్షించుగాక, ఆమెకు తగిన స్థానము సుఖముగా జీవించుటకు తగిన వసతి ఒసంగును." గాక అని ప్రార్థిస్తూ వడచినాడు.

ఆ పిమ్మట లియరు బర్గండీ ప్రభువునూ, ఫ్రాన్సు దేశపురాజును కొలువు కూటమునకు రప్పించి మొదట బర్గండీ ప్రభువు నుద్దేశించి "అయ్యా ఈ వివాహము ఈ మూడవ కూతురికి వరుడు కావలెను. కాని వరశుల్కముగా నేనేమీ ఈయను. మీకిష్టమైన ఎడల ఆమెను వివాహమాడవచ్చును." అని పలికెను వరశుల్కము లేని వధువు నా కెందుకు? అని పెండ్లియాడుటకు సమ్మతింపలేదు అందుకు కార్డీలియా కూడా సంతోషించినది. "అతనికి కావలసినదిముఖ్యముగా వరశుల్కము, అంతేకాని నేను కాదు. కనుక అట్టి భర్త నా కెందుకు?" అన్నది.

ఆ పిమ్మట ఫ్రాన్సుదేశపు రాజు నుద్దేశించి "మీ రేమందురు?" ఆమెను పెండ్లియాడుటకు మీరు సమ్మతింతురా? వరశుల్కమే మియ్యను లేదు. నా రాజ్యము నా రాజ్యములో ఏ మాత్రమును ఆమెకు నేనీయను" అని పలికెను.

ఫ్రాన్సుదేశపురాజు కార్డీలియా వైపు తిరిగి "అమ్మాయీ! రాజ్యభాగమేమి లేనిదానవయినా నీవే చాలా భాగ్యవంతురాలవు.

నీ సుగుణ సంపదయు. సౌందర్యము ఎనలేని వరశుల్కము. నేను నిన్ను ప్రేమించి పెండ్లియాడ దలచినాను. ఏమందువు?" అన్నాడు "నిన్ను పెండ్లియాడుటకు నేను త్రికరణ శుద్ధిగా సమ్మతిస్తున్నాను" అని ఆమె సంతోషముతో పలికినది. "మీరును మహారాజా మేమిద్దరమును ఒకరి నొకరు ప్రేమించుకొని పెండ్లి చేసికో దలచినాము" అని పలికెను.

"సరే మంచిది, ఆమెను తోడ్కొని నీవు నీ దేశమునకు వెడల వచ్చును. ఇక నామె మొగము నేను చూడను. నా ఆశీర్వాదములు లేకనే నీవు ఆమెను పెండ్లి యాడి ఉంచుకో వచ్చును." అని లియరు నిర్దాక్షిణ్యముగా పలికినాడు.

ఆ పిమ్మట కార్డీలియా ఫ్రాన్సుదేశపు రాజుతో కలసి వెడలి పోవుటకు లేచి "అక్కలారా! నాన్నగారి సేవ ఏ లోపమూ లేకుండ చేయుదురు గాక" అన్నది. "మేమేమి చేయవలెనో మాకు తెలియును నీవు మాకు బోధించనక్కర లేదు" అని వారు తిరస్కార భావముతో పలికినారు. సరే అని కార్డీలియా ఫ్రాన్స్‌దేశపు రాజుతో కలిసి వెడలి పోయినది. స్వార్థపరత్వము గల తన అక్క లిద్దరును తండ్రిని సురక్షిత ముగా చూడరని కార్డీలియా బాధపడినది. ఆమె అనుమానించినట్లే జరిగినది.

రాజ్య విభాగము జరిగినప్పుడు చేసికొన్న ఒప్పందము ప్రకా రము లియరు తన రాజ బిరుదము ఉంచుకొనుటకున్ను, కొంతకాలము ఒక కూతురున్ను, మరి కొంత కాలము రెండవ కూతురున్ను అతనిని తమ వద్ద నుంచుకొని అతని వసతి భోజనాదుల సౌకర్యములు చూచుటకున్ను అంతేకాక అతని అంగరక్షకులుగా నుండిన నూర్గురు అశ్వభటుల భోజన వసతి సౌకర్యములు కూడా చూచుటకున్ను కూతుళ్ళిద్దరూ సమ్మతించినారు. ఆ ఒప్పందము నను సరించి లియరు మొట్టమొదట తన పెద్ద కూతురయిన గొనెరిల్ మంది రము వద్ద తన నూర్గురు అశ్వభటులతోను బసచేసి యుండెను. అతడు తన కూతురికి అల్లుడికి అతిథి మాత్రమేకాని వారి సేవకులపై అధికా

రము చెలాయించుటకు తనకేమీ హక్కు లేదన్న విషయము రాజు గ్రహించవలసి యుండెను. కాని అతడట్లు గ్రహించ లేదు. వారి చేతను తన పనులు చేయించుకొంటూ, చేయకపోతే కేకలు వేస్తూ ఉండేవాడు. అంతేకాక అతనికి అంగరక్షకులుగా ఉండిన ఆ నూర్గురు అశ్వభటులున్నూ ఆ సేవకులపై అధికారము వహించి పనులు చేయించుకొంటూ ఉండేవారు. చేయకపోతే దండిస్తూ ఉండేవారు. గొనెరిల్ సేవకులు కూడా లియరును గౌరవముతో చూచేవారు కారు. వారిలో ఒకడు అతనిని తిరస్కరించుట జరిగినది. వానిని లియరు కొట్టినాడు. అందుకు గొనెరిల్‌కు కోపము వచ్చినది. ఆ సమయమున కెంటుప్రభువు మారువేషమున అక్కడనే యుండెను.

ఈ కెంటు ప్రభువును లియరు దేశము నుండి వెడలి పొమ్మని శాసించిన సంగతి పైని చెప్పినాము గదా! అతడు లియరు యెడల చాలా అనురాగము రాజభక్తి గలవాడు. కనుక రాజును విడువలేక సాధారణ సేవకునివలె వేషమువేసి లియరు నాశ్రయించి అతనిసేవచేసే బంటుగా కుదురుకొని అతనికెప్పుడేది కావలెనో తెలిసికొంటూ అమర్చి పెడుతూ ఉండేవాడు. రాజును తిరస్కరించిన గొనెరిల్ సేవకుని తిట్టి దండించినాడు.

గొనెరిల్ తండ్రిని పూర్తిగా ద్వేషించినది. ఆమెలో కలిగిన మార్పు లియరు గ్రహించినాడు. ఆమెను విడిచి తన రెండవ కూతురయిన రీగన్ వద్దకుపోయి అక్కడ నివసింప దలచినాడు. గొనెరిల్ భర్త అల్బనీ తమ వద్దనే ఉండమని ఎంత ప్రార్థించినా వినలేదు. ఆ అల్బనీ ప్రభువు చాలా యోగ్యుడే కాని భార్యను అదుపులో పెట్టుకో లేని దుర్బలుడు.

లియరు రీగన్ వద్దకు పోవుటకు సిద్ధమయినప్పుడు తన అంగరక్షకులుగా ఉండిన నూరుగురు అశ్వభటులలోను ఏబదిమంది కనబడ లేదు. ఏమయినారంటే నూరుగు రెందుకు? వృధా వ్యయము. వీరిని

పంపి వేసినదని చెప్పినారు. సరే అని లియరు ఆ ఏబది మంది అంగ
రక్షకులను సేవకుడుగా "కేయస్" అను పేర నున్న కెంటును వెంటబెట్టు
కొని తన రెండవ కూతురుండిన కార్నివాల్ మందిరమునకు ప్రయాణ
మైనాడు. "నంకుల్ ! నంకుల్ !" అని అరుచుకొంటూ ఆగని వెంట
పడి అతని విదూషకుడు తననుకూడా తోడ్కొనిపొమ్మని ప్రార్థించెను.
అందుచేత లియరు ఆ విదూషకుని కూడా తోడ్కొని పోయెను. అది
మంచిదే అయినది. ఆ విదూషకుడు లియరుకు కలిగిన దుఃఖమును
మరచిపోవునట్లు హాస్యరస ప్రధానమైన మాటలు పలుకుతూ లియరు
మనసుకు వినోదము కలిగిస్తూ ఉండేవాడు.

లియరు తాను తన పరివారముతో గొనెరిల్ మందిరము విడిచి
వస్తూ ఉన్నట్లు ముందుగా తెలియచేస్తూ రీగన్‌కు ఒక లేఖ వ్రాసి కెంటు
చేతికిచ్చి పంపించినాడు. ఆ లేఖ పట్టుకొని రీగన్ మందిరము చేరేసరికి
అతనికంటె ముందుగా గొనెరిల్ సేవకుడు లోగడ రాజు చేతను, కెంటు
చేతను దెబ్బలు తిన్న అస్వాల్డ్ అనే సేవకుడు గొన్‌రిల్ వద్దనుండి ఒక
లేఖ తెచ్చి రీగన్‌కు అందచేసినాడు. ఆ లేఖవల్ల జరిగిన సంగతులు
అన్నీ తెలిసికొని తండ్రిని ఆదరించి తనవద్ద నుంచుకొనుటకు ఇష్టపడక
రీగన్ భర్తతో కలిసి గ్లస్టర్ మందిరమునకు పోయెను. అస్వాల్డ్‌వల్ల
జరిగినది తెలుసుకొని కెంటు ఎట్లయినా రీగన్‌కు లియరు వ్రాసిన లేఖ
అందచేయవలెనన్న పట్టుదలతో గ్లస్టర్ మందిరమునకు పోయెను.
అక్కడికి వెళ్ళిన సరికి అస్వాల్డ్ అతనికంటె ముందుగానే కెంటుకు
ప్రత్యక్షమయినాడు. ఆ అస్వాల్డ్‌ను చూడగానే కెంటు కోపోద్దీపితుడై
అస్వాల్డును పచ్చిగా పడగొట్టి కొట్టినాడు. గ్లస్టరు కొడుకు (ముందుకు
పుట్టిన) ఎడ్మండు అను వాడు కెంటు తెచ్చిన లేఖ అందుకొని లోనికి
పోయినాడు.

అస్వాల్డును పడ తిట్టి కొట్టినట్లు తెలుసుకొని కెంటును ఇంటి
వెలుపలను నిలబెట్టిన కొయ్యపెట్టెలో కాలుద్రోసి కూర్చుండ బెట్టవలె
నని రీగన్ అతనికి కఠిన దండనము విధించినది. ఆ పెట్టెకు మీదనున్న
కన్నములలో నుండి చేతులను క్రిందనున్న కన్నములలోనుండి కాళ్ళను

వేంవేసికొని ఆ రాత్రి అంతా మంచులో బందీగా కూర్చుండవలసి
వచ్చినది.

తెల్లవారిన సరికి లియరు తన పరివారముతో అక్కడికి వచ్చి
ముందుగా కెంటు అవస్థను చూచి జరిగిన సంగతంతా తెలుసుకొ
న్నాడు. గ్లస్టరు ప్రభువు రాజును ఆదరించినాడు. రాజసేవకుడైన
గేయసును (అనగా కెంటును) అంత కఠిన దండనకు పాల్పడ చేయ
వద్దని ఎంత బతిమాలినా రీగన్ కార్న్‌వాల్ ప్రభువులు వినలేదనికూడా
రాజుకు తెలియచేసినాడు. రీగన్ కూడా తనను ఆదరించదన్న సూచన
లియరుకు తట్టినది. అయినా ఆమెను చూడవలెనన్న ఉద్దేశముతో
లియర్ అక్కడనే ఆగి గేయసును విడిపించి తాను వచ్చినట్లు లోనికి
కబురు పంపినాడు. ప్రయాణబడలికలో విశ్రాంతి తీసుకొంటున్నాము
గనుక మేడదిగి క్రిందికి రాలేమని రీగన్ కబురుచేసినది. సరే విశ్రాంతి
పూర్తిగా తీసుకొన్నతర్వాతే చూడవచ్చును. ఆమెను చూడకుండా,
ఆమెతో ప్రసంగించకుండా ఇక్కడినుండి కదలను అని భీష్మించుకొని
కూర్చున్నాడు. ఇక అతనిని చూడకతప్పదని గ్రహించి రీగన్, కార్న్
వాల్ ప్రభువులు అతనిని కలుసుకొని అతని మొర విన్నారు. కాని
ఆదరము చూపలేదు. నా అక్క గొనెరిల్ దయార్ద్రహృదయ, నిన్ను
తిరస్కరించే స్వభావము కలది కాదు. వార్ధక్యము వలన కాస్త మతి
చెడి నీవు ఆమెను సరిగా అర్థము చేసికొనలేదు. నీవు మరల అక్క
డికే పోయి ఆమెతో పొందు సమకూర్చుకొని మొదట మనము అను
కొన్నంత కాలమున్న నీవు ఆమె వద్దనే నివసించి అటుపైని నావద్దకు
వచ్చి యుండుము" అని రీగన్ ఓదార్చినది. అందుకు లియర్ సమ్మ
తించలేదు. "నేను, నా భర్త ఇక్కడ గ్లస్టర్‌కు అతిథులుగా ఉన్నాము
గదా! నీవు కూడా ఎక్కడ ఉండగలవు!" అన్నది రీగన్. "మీరు
వచ్చిన దాకా వంట చేయించుకొంటూ మీ మందిరములోనే
ఉంటాను" అన్నాడు లియరు. "నీ అంగరక్షకులుగా ఉండిన అశ్వభటు
లలో సగము మందిని ఆమె తొలగించినందుకు సంతోషిస్తున్నాను.
కాని అంత మాత్రము చాలదు. నేను వారిలో ఇరువై యయిదుగురిని
తొలగిస్తాను. వాస్తవముగా నీకు అంగరక్షకుడుగా ఒక్కడయినను

ఉండనక్కరలేదు. నా సేవకులే నీ సేవ కూడా చేయగలరు" అన్నది రీగన్. "గొనెరిల్ కంటె ఎక్కువ అనాదరముగా చూపిస్తు పరుషముగా మాటలాడుతున్నావు. ఇది నీకు తగదు. నా రాజ్యము మీ యిద్దరికీ పంచి పూర్తిగా ఇచ్చివేసినందుకు నా యెడల కృతజ్ఞతలేక నన్ను అవమానిస్తూ బాధించి నందుకు దుఃఖించవలసినదే కాని పౌరుషము గల వాడను గనుక దుఃఖించను. కంటతడిపెట్టను. భగవంతునిపై భారము వేసి నా బ్రదుకు నేనే చూచుకొంటాను. కృతఘ్నత గల నా కూతుళ్ళ పంచనుండను. తల్లీ నా తప్పు క్షమించి నీ పంచనుంచుకొని కూడు గుడ్డా పెట్టమని యాచించను" అని కోపముతో గేయసును, విదూషకుని వెంటబెట్టుకొని లియరు వెడలిపోయెను. అప్పుడయినా తండ్రిని ఆగుమని రీగన్ పలుకలేదు. పోతేపో మంచిదే అన్నట్లు ఊరకొన్నది. కార్నవాల్ ప్రభువుకూడా ఏమీ అనలేదు.

లియరు, విదూషకుడు, గేయస్ (కెంటు) ఈ ముగ్గురును ఎక్కడికో తెలియకుండానే నడచుకొంటూ వెళ్ళారు. ఆ రాత్రి ఆకాశమంతా మేఘావృతమై దగ్గర దగ్గరగా ఉన్నవారయినా ఒకరి కొకరు కనబడనంత దట్టముగా చీకటి కమ్మినది. గాలివానా కూడా ఎక్కువయినది. వానకు తడిసిపోతూనే వారు నడుస్తూ వెడలినారు. కొంత దూరం నడిచిన గేయసుకు లియరు విదూషకులు కనబడలేదు. లియరుకు మతి చెడినది. అతడేదో పిచ్చి ధోరణిలో అంటూ వుండేవాడు. ఆ మాటలకు అనుబంధముగానో, వ్యాఖ్యానముగానో విదూషకుడు పద్యాలు స్వకపోల కవిత్వములు పలుకుతూ ఉండేవాడు. అప్పుడప్పుడవి లియరుకు వినోదకరములుగా వుండేవి.

గేయసు వారిద్దరిని వెదుకుకొంటూ ఎక్కడయినా తలదాచుకొనుటకు కాస్త అనువుగల ఒక పాడుకొంపయినా కనబడునా ? అని చూస్తూ ఉండేవాడు. కొంతసేపటికి అతనికి లియరు విదూషకులు కనబడినారు. వారిని మరి విడిచిపెట్టక వారినంటబెట్టుకొని నడుస్తూ ఉండెను. మరి కొంతసేపటికి అతనికొక పాడుపడిన కొంప కనబడినది. అందులో ఒక గది విశ్రాంతి గైకొనుటకు తగినదిగా తోచినది. పిచ్చి తల

కెక్కుటవలన తాను వానకు తడిసి యున్నట్లు లియరు తెలిసికోక నడిచిపోవలెననియే అన్నాడు. కాని అక్కడ విశ్రమించుటకు సమ్మతింపలేదు. కేయసు బలవంతముగా అతనిని ఆ గదిలో కూర్చుండబెట్టినాడు. ఆ గదిలో ఆదివరకే ఒకరు ఒక మూల కూర్చుండి "దిక్కులేక దీనుడవై, దేశ ద్రిమ్మరివై తివా! ఓ టామ్ ! టామ్ టామ్!!" అని పిచ్చిపిచ్చిపాటలు పాడుకొంటూ ఉండెను. ఆ పాటలువిని లియరు సానుకంపముగా "ఏమి నాయనా! నీవుకూడా నీకున్న ఆస్తి అంతా నీ కూతుళ్ళ కిచ్చివేసి ఈ దుస్థితి తెచ్చుకొన్నావా?" అన్నాడు.

ఆ పిచ్చిపాటలు పాడుతూ ఆ మూల కూర్చుండినవాడు మరి ఎవరూ కాదు. గ్లస్టర్ ప్రభువు ధర్మపత్ని కుమారుడు ఎడ్గర్. ఎడ్మండ్ అతనిమీద లేనివి కల్పించి తండ్రికి కోపము తెప్పించి అతనిని మండలము నుండి వెళ్ళగొట్టించినాడు. తాను గ్లస్టరు ఉంపుడుకత్తెకు కొడుకై ఎడ్గరును ప్రవాసునుజేసి గ్లస్టరు ప్రభువు అగుటకు ఆశించినాడు. అంతేకాదు శీఘ్రముగా ఆ పదవిని పొందవలెనన్న ఆశతో తండ్రిని చంపుటకు యత్నిస్తూ వుండెను. పాపము ఎడ్గరు అంగబలములేక, తండ్రికిగాని, ఎడ్మండుకుగాని పట్టుబడిన ఎడల చావు తప్పదన్న భీతికలిగి దిక్కులేని బిక్షుకుని వేషముతో పిచ్చివానివలె నటిస్తూ తిరుగుతూ వుండెను. లియరు అడిగిన ప్రశ్న వినీ వినిపించుకోకుండా ఉండెనే కాని తానెవరో బయల్పెట్టుకోలేదు.

ఇట్లుండగా గ్లస్టరు ప్రభువు రీగన్ తండ్రి యెడల నిర్దాక్షిణ్యముగా ప్రవర్తించినందుకు దుఃఖించి, తనకు సాధ్యమయినంత వరకు లియరు క్షేమమునకు తోడ్పడవలెనన్న ఉద్దేశముతో అతనిని వెదకుకొంటూ ఆ పాడుకొంపవద్దకే వచ్చి రాజును, కేయసును, టామ్ పేరనున్న ఎడ్గరును, విదూషకుని కలుసుకొన్నాడు. కేయస్ మారువేషములోనున్న కెంటు ప్రభువని ఎరుగడు. ఆ టామ్ తన కొడుకు ఎడ్గరే అయినా దరిద్రవేషములో పిచ్చివాడుగా ఉండుటవలన పోల్చుకోలేక పోయెను. లియరు ఆ పాడుకొంపలో ఉండలేడని నెంచి తన కోటకు సమీపమందుండిన తన పొలమున ఉండిన చిన్న భవనమునకు తోడ్కొని

పోయి అక్కడ నివసింపజేసి అతనికి కావలసిన భోజనాది సౌకర్యము లన్నీ సమకూర్చినాడు. లియరుకు ఇప్పుడు తగిన వసతి దొరికినది. ఇది జరిగిన కొద్దికాలములోనే గేయన్ తాను కెంటు ప్రభువు అన్న విష యము తెలియజేసి తన డోవరు పట్టణమునకు లియరును తోడ్కొని పోయెను. అది ఎక్కువ సురక్షితమయిన ప్రదేశము, అంతేకాక లియ రుండదగిన మందిరము కలది.

డోవరు పట్టణము ఇంగ్లండు దేశమునందు దక్షిణతీరమున ఫ్రాన్సు దేశమునకు ఎదురుగా నున్న రేవు పట్టణము, అక్కడ లియరును సురక్షి తముగా విడియించి కెంటు ప్రభువు ఫ్రాన్సు దేశమునకు పోయి జరిగిన సంగతులన్నీ కార్డిలియాకు తెలియజేసి అతని క్షేమమును కాపాడవల సినదని బోధించెను. కార్డిలియా అందుకు సమ్మతించి తన భర్తకు నివేదించి లియరుకు సహాయముగా సైన్యము సమకూర్చుకొని ఇంగ్లండు దేశముపైకి దండెత్తి వచ్చినది.

ఈలోగా గ్లస్టరు ప్రభువు లియరుకు తోడ్పడి నాడన్న కోప ముతో రీగన్ అతనిని పట్టించి తెప్పించి అతని కనుగ్రుడ్లూడ దీయించి దేశమునుండి వెడలగొట్టినది. ఈ పని గావించుటలో ఎడ్మండున్ను ఆమె భర్త ఆయిన కార్నవాల్ ప్రభువున్ను ఆమెకు తోడ్పడినారు. ఎడ్మండు గ్లస్టరు ప్రభువైనాడు.

కార్డిలియా తోడ్పాటువలన లియరుకు మంచి దినములు రావలసి యుండెను. కాని అతని పిచ్చి తల కెక్కినది. ఎడ్గరున్ను, కెంటున్ను తామెవ్వరో తెలియ జెప్పినా అతడు సరిగా పోల్చుకోలేదు. కనులు పోయిన గ్లస్టరును ఎడ్గరు, టామ్ అన్న పేరనే ఆదరించి లియరు వద్దకు తోడ్కొని పోయెను. కాని ఏమి లాభము! లియరు ఎవరిని సరిగా గుర్తించలేదు. ఆ డోవరు పట్టణము వద్దనున్న కొండలపై మతిచెడి తిరుగుతూ ఉండే వాడు. అక్కడి ఆకులూ పువ్వులూ తలకు చుట్ట బెట్టుకొని ఇది నా కిరీట మనేవాడు. నేనింకా రాజునే అనేవాడు.

కార్డీలియా అతనిని చేరి "నాయనా! నీ మూడవ కూతురిని కార్డీలియాను" అని పెక్కుసార్లు చెప్పగా మతి కుదట పరచుకొని అతడు ఆమె నుద్దేశించి "నిన్ను వెడల గొట్టితినిగదా? నామీద నీకు కోపము లేదా? రాజ్యము పంచి ఈయగా పుచ్చుకొన్న ఆ కూతుళ్ళకే నా మీద దయలేనప్పుడు నా వద్దనుండి తిరస్కారము తప్ప ఏమీ పుచ్చుకోని నీకు నామీద ప్రేమ ఎట్లుండగలదు" అన్నాడు. "నీవు నా తండ్రివి. నన్ను పోషించి పెంచిన వాడవు. యథోచితమైన ప్రేమ చూపుట నాకు విహితమైన ధర్మము అని అప్పుడన్నట్లే ఎప్పుడును అందును" అని ఆమె నచ్చచెప్పినది. అందుకాతడు సంతోషించినాడు. కాని అతనికి మతి స్థిరముగా ఉండేది కాదు. అంతలో పిచ్చి ఎక్కుతూ వుండేది. అంతలోనే తెలివి వస్తూ ఉండేది.

ఫ్రెంచి సైన్యము ఇంగ్లండుకు వచ్చినదని తెలిసికొని రీగన్, గొనరిల్ ఒక సైన్యమును సమకూర్చుకొని ఫ్రెంచి సేనలను వెడల గొట్టుటకు సిద్ధమైనారు. లియరు పక్షము పోరుటకు వచ్చిన ఫ్రెంచి సైన్యమునకు, ఎడ్గరు, కెంటు ప్రభువు నాయకులు. ఆంగ్ల సైన్యమునకు ఆల్బెని, కార్న్ వాల్ ప్రభువులున్ను, ఎడ్మండున్ను నాయకులు, డోవరు వద్ద యుద్ధము జరుగనుండెను. గొనరిల్, రీగన్లు కూడా యుద్ధభూమికి ప్రయాణములయినారు. వారిరువురు తండ్రి యెడల కృతఘ్నలయినట్లే భర్తల యెడల ద్రోహమును చూపించినారు. ఇద్దరును ఎడ్మండును మోహించినారు. ఎడ్మండుకు ముఖ్యముగా కావలసినది రాజ్యము. గ్లస్టరు మండల ప్రభువయినాడు. ఇంగ్లండు దేశమునకు రాజుకూడా కావలెనని కోరినాడు.

ఫ్రెంచి సేనలకున్ను ఆంగ్ల సేనలకున్ను జరిగిన యుద్ధములో ఆంగ్ల సేనలకే విజయము కలిగినది. లియరును, కార్డీలియాను పట్టుకొని కారాగారమునందుంచ వలసినదని ఎడ్మండు ఆజ్ఞాపించినాడు.

కార్న్ వాల్ ప్రభువు మరణించినాడు రీగన్ ఎడ్మండును పెండ్లి యాడ దలంచినట్లు ప్రకటించినది. ఆ ఎడ్మండును తాను కూడా మోహించి యుండుటచేత గొనరిల్ అసూయాగ్రస్తయై విషప్రయో

గము వలన తన సోదరియైన రీగన్‌ను చంపినది. దుష్టురాలైన తన భార్యను పట్టుకొని ఆల్బనీ ప్రభువు కారాగారమున బంధించినాడు. ఆమె తనకు కలిగిన దుఃఖము అవమానము సహింపలేక ఆత్మహత్య చేసికొన్నది.

కారాగారమున పడియుండిన కార్డియాలును ఎడ్మండు చంపించినాడు. మరల మరియొకసారి జరిగిన యుద్ధములో ఎడ్గర్ విజయుడయి ఎడ్మండును వధించినాడు.

అప్పుడంతవరకును జరిగిన సంగతులు లియరుకు నివేదించుటకు కెంటు ప్రభువు ప్రయత్నించినాడు గాని కృతకృత్యుడు కాలేదు. లియరుకు మతి పూర్తిగాపోయినది. ఒక్క కార్డియాలి విషయముతప్ప మరియేదిన్నీ అతని ఆలోచనలో లేదు. ఆ సన్నివేశము షేక్స్పియరు హృదయ విదారకముగా చిత్రించినాడు. ఆమె చనిపోయినా బ్రతికియున్నదేమో అన్న భ్రమతో లియరు తనకు కాస్త తెలివి వచ్చినప్పుడు చూచేవాడు. ఆమె పెదవులవద్ద చెవులుపెట్టి ఊపిరి ఆడుతున్నదేమో వినేవాడు. తుదకు చనిపోయినదన్న నమ్మకము తోచగానే "అయ్యయ్యో! చనిపోయినది. మరిలేదు. మరిరాదు. మరిరాదు." అంటూ ఆమె ప్రక్కనే పడుకొని ప్రాణములు విడిచినాడు.

యుద్ధము మాత్రము వృధా కాలేదు. దుష్టురాండ్రయిన గొనెరిల్, రీగన్లున్ను, దుర్మార్గులయిన కార్నవాల్ ఎడ్మండులున్ను మరణించినారు. ధర్మచిత్తుడయిన ఆల్బనీ ప్రభువు ఇంగ్లండు దేశమునకు రాజయినాడు. అతనికి గ్లస్టరు ప్రభువయిన ఎడ్గరున్ను, కెంటు ప్రభువున్ను రాజ్యపాలనము నందు ఆల్బనీ ప్రభువుకు సహాయులయినారు.

* * *

# కింగ్‌లియర్ - విమర్శ

ఈ కింగ్‌లియర్ నాటకము చదువుతూ ఉన్నప్పుడునూ అంత కంటె ఎక్కువగా చదివిన తర్వాతను చాలా బాధపడ్డాను. ఇది అతి ఘోరమైన ట్రాజడీవలె కనబడినది. ఇది విషాదాంతమైనది మాత్రమే కాదు. మొదటి నుండి చివర వరకును విషాదపూరితమైన నాటకము. ఈ కథలో పేర్కొనబడిన వారిలో ఎవరున్ను సౌఖ్యమన్నది పట్టుమని రెండేండ్ల పాటయినా అనుభవించినట్లు కనబడదు. అందరున్ను - కాస్త ఎక్కువగానో తక్కువగానో దుఃఖాన్ని అనుభవించినవారే అయినారు. ఇట్టి వైపరీత్యము అసంభవము కాకపోయినా అసాధారణ మని చెప్పక తప్పదు, లియరు చాలా కాలము రాజ్యమేలినవాడు. అనుభవము కలవాడు. ఇంత అవివేకముగాను పిచ్చిగాను వ్యవహరించే వాడు కాగలడా? అనిపిస్తుంది. షేక్స్పియరు కావించిన రచనకూడా ఏదో ఉద్దేశముతో తీర్చి దిద్దినట్లు కనబడుతుంది. మొట్ట మొదటి అంకము, మొదటి దృశ్యము ఒద్దికలుచేసి ప్రదర్శించిన నాటకమువలె సాగినది. ఎవరితర్వాత ఎవరు ప్రసంగించవలెనో ఎట్లు ప్రసంగించవలెనో అంతా పాత్రధారణ చేసినవారు మొదట కూడబలుకుకొని పలికి నట్లుగా రచన సాగినది. దర్బారు దృశ్యము గనుక అట్లుండుట సహజ విరుద్ధము కాదనునుగాని అందులో ప్రకృతి విరుద్ధములయిన ప్రసంగ ములు కలవని చెప్పుటకు సాహసిస్తున్నాను. లోకములో వార్ధక్యము చెందిన రాజులు తమ రాజ్యాధికారము ఈడువచ్చిన తమ పుత్రులకు - పురుష సంతానము లేనప్పుడు తమ పుత్రికలకు అప్పగించి విశ్రాంతి తీసికొనడము సహజమేకాని "మీకు ఈ రాజ్యము (ఒక్కరయితే పూర్తిగాను, అనేకులయితే విభజించియ్ని) అప్పగించబోతున్నాను. నా యెడల మీకు గల ప్రేమ ఎట్టిదో తెలియచేయండి" అని ఏ రాజున్ను సాధారణముగా ప్రశ్నించడు. అట్లు ప్రశ్నించుటలో లియరు కావించిన దోషమేమీ లేదుగాని అట్టి ప్రశ్నకు రాగల సమాధానము లెట్టివో

సరిగా అర్థము చేసికోలేని లోపము మాత్రము కనబడుతున్నది. కని పెంచిన తండ్రి అయిన లియరు తన కూతుళ్ళకు తన యెడల ఎట్టి అనురాగము కలదో అది వరకు గుర్తించి యుండలేదా! వారి వదవడిని బట్టి గుర్తించనివాడు తన ప్రశ్నకు వారు పలికే సమాధానమునుబట్టి ఒక్కసారిగా గుర్తించ దలచినవాడు ఏదో ఒక లాంఛనమనుకొన్నాడా! అట్టి ప్రశ్నకు రాజ్యకాంక్ష గలవారు అతిశయోక్తులు పలుకుతారన్న అంశము తెలిసికోలేనంతమూర్ఖుడా! తన అక్కలిద్దరున్నూ అతిశయోక్తులు పలికినారన్న విషయము కార్డీలియా అనేచిన్నది తెలిసికో గలిగినప్పుడు లియరు తెలిసికోలేకపోయినాడా? అక్కలట్లు పలికినారు గనుకనే ఆమెకు రోతపుట్టి ఉన్నదున్నట్లుగా పలికినది. ఆమె తనకు ప్రేమ లేదన్నాదా? ఆమె పలుకులో తండ్రికి బాధ కలిగించే అంశమేమీ లేదు. అంతేకాక ఆమె తనకు ముద్దుబిడ్డయై యుండినట్లు లియరే తెలియజేస్తున్నాడు. కృత్రిమ ప్రపంచమందలి మాయా మర్మము లెరుగని చిన్నపిల్ల ఉన్నదున్నట్లుగా తన ప్రేమ వ్యక్తము చేసినది. అది యథార్థమైనదీ, యథోచితమైనది అని తెలిసికోలేనంత వివేకశూన్యుడా! "వృద్ధుల బుద్ధులు చంచలింపవే" అన్నట్లు లియరు ప్రస్థరించినాడని సమాధానము చెప్పవచ్చును. అదే నిజమయినప్పుడు లియరు ఆమెకపకారము చేసినాడని అనవలెను.

మరియొక విషయము బుద్ధిపూర్వకముగా తనకూతుళ్ళకు రాజ్యమప్పగించినవాడు. విరాగియై విశ్రాంతి తీసికొనుట ధర్మము కాని లియరు "చింత చచ్చినా పులుపు చావ"దన్నట్లు రాజ్యాధికార తృష్ణ ఆడంబరము,అహంభావము అతనినివీడలేదు. అట్టివాడుతనతనువున్నంత కాలము తన ఆధీనములో ఒక భాగమయినా ఉంచుకోవలసియుండెను. ఆపని చేయకపోవుట అతని దోషమే. ఇట్టి స్వయం కృతాపరాధముల వలన కలుగగల ఫలము తాననుభవింప వలసినదేకదా!

గొనెరిల్, రీగన్లు ఒకరిని మించిన వారొకరుగా దురాశకు, దుష్ప్రవర్తనకు అలవాటు పడినవారయినారు. తండ్రి యెడల ఎంత విపరీతమైన ప్రేమ గలదని డాంబికముగా పలికినారో అంత విపరీత

మయిన నిర్దయులూపి పరుషముగా పలికి క్రూరముగా ప్రవర్తించినారు. తండ్రి వార్ధక్యము వలన తొందరపాటున పొరపాట్లొనరించినప్పుడు సహించలేకపోయినారు. అంతేకాదు పతివ్రతలు కానేకారు సరికదా వ్యభిచరించుటకు కూడా దిగజారి ఎడ్మండును ప్రేమించుటలో పోటీ పడినారు. తన భర్త కార్న్వాలు హతుడైన తర్వాత రీగన్ ఎడ్మండును వివాహమాడునట్లు ప్రకటితమైనంతనే అసూయతో గానెరిల్ ఆమెను విష ప్రయోగము వలన చంపినది.

కారన్‌వాలు దుర్మార్గుడై తన సేవకునివలన హతుడయి నాడు. ఆల్బనీ ప్రభువు మొకటి భార్యకు దాసుడైనా శాస్త్ర మానవ హృదయము గలవాడు గనుకనే తన భార్య దుశ్శీలయని గుర్తించి ఆమెను చెరసాలలో పెట్టించినాడు. ఆమె గర్వభంగము వలన భగ్న హృదయై కోపోద్దీపితయై ఆత్మహత్య గావించుకొన్నది.

కెంటు ప్రభువు మాత్రము వివేకముకలిగి కార్డీలియా పక్షము వహించి పలికినంత మాత్రమున లియరు అతనిని రాజ్యమునుండి వెడలి పొమ్మని దండించినా తొందరపడి ప్రతీకారమునకు పూనుకోక గేయస్ అను మారుపేరుతో తన ప్రభువన్న కృతజ్ఞత చూపి లియరుకు అంగ రక్షకుడుగా సేవచేసి తుదకు తన మండలమందలి డోవరులో తన భవనమునందు లియరును విడియింపజేసి ప్రభు భక్తిని ప్రదర్శించి నాడు.

గ్లస్టరు కథ లియరు కథకు అనుగుణముగాను ప్రధాన కథావస్తువునకు సహాయక కథా వస్తువుగాను రూపొందినది. విషయలంపటుడైన గ్లస్టరు ఉంపుడు కత్తెకు పుట్టిన ఎడ్మండు స్వార్థపరత్వముతో పలికిన చాడీలువిని ధర్మపత్నికి పుట్టిన ఎడ్గరును చంపుటకు యత్నింపగా అతడు పారిపోయి బిచ్చకాని వేషముతో తలదాచుకోవలసి వచ్చినది. కూతుళ్ళ అనాదరమువలన లియరుమతిచెడి తిరుగుతున్నాడని తెలిసికొని గ్లస్టరు అతనిని వెదుకుతూపోయి ఒక పాడు కొంపలో అతనిని కలుసుకొని తన మందిరమునకు చేరువగా నుండిన పొలమునందు గల గృహము నందు విడియించినాడన్న కోపముతో ఆల్బన్ ప్రభువు, గానెరిల్, రీగన్లు

అతని గ్రుడ్లు పెగలదీయించి పూర్తిగా గ్రుడ్డివానిని చేసి వెడల గొట్టినారు. అట్టి దురవస్థకు పాల్పడినా అతడు లియరు సేవ చేయుటకే పూనుకొన్నాడు. అంత్యకాలమున లియరు కార్డీలియాలు కలిసికొనుట సంభవించినట్లే, గ్లస్టరు ఎడ్గరులు కలిసికొనుట సంభవించినది. ఆపాడు కొంపలో గ్లస్టరు లియరును కలుసుకొన్నప్పుడే గ్లస్టరు ఎడ్గరులు కలిసినారు. ఎడ్గరు తన తండ్రిని గుర్తించినాడు. కాని బికారి వేషములో నుండుటవలన అతనిని గ్లస్టరు పోల్చుకొనలేదు. డోవరు మెట్టలందు లియరుండగా గుడ్డివాడయి వచ్చిన గ్లస్టరును కలిసికొని ఎడ్గరు తన నెరిగించుకొన్నాడు. అన్యాయముగా అతనిని వెడల గొట్టినందుకు గ్లస్టరు దుఃఖించినాడు. ఎన్నటికైనా తండ్రి తనకు ఆప్తుడైనాడని ఎడ్గరు సంతోషించినాడు. కాని వారిసంతోషము ఆట్టేకాలము నిలువలేదు. గ్లస్టరు మరణించినాడు.

ఫ్రెంచి సేనలకున్ను, ఆంగ్ల సేనలకున్ను జరిగిన యుద్ధములలో తొలియుద్ధమున ఆంగ్ల సేనలకు విజయము సమకూరుటవలన లియరు కార్డిలియాలను ఆల్బనీ, గొనెరిల్, కార్న్వాల్, రీగనులు చెరసాలలో పెట్టించిరి. అందుకు లియరు సంతోషించినాడు. యుద్ధము గొడవ లేకుండా తన యెడల వాస్తవమయిన ప్రేమగల కూతురుతో సుఖముగా కాలక్షేపము చేయవచ్చునని లియరు సంతోషించినాడు. కాని అతని ఆశ అచిరకాలములో నశించినది. ఆ కార్డిలియాను ఆమె అక్కలే రహస్యముగా విషముపెట్టి కాబోలు చంపించినారు.

రెండవసారి యుద్ధము జరిగినప్పుడు ఎడ్గరు ఎడ్మండును వధించినాడు. ఎడ్గర్, కెంటులు విజయులయినారు. పైని వివరించిన రీతిగా గొనెరిల్, రీగన్, కార్న్వాలు మరణించిన తరువాత ఆల్బన్ ప్రభువు పశ్చాత్తాప్తుడై ఎడ్గరు, కెంటులను కలుసుకొని వారికి మిత్రుడైనాడు.

తుదిదృశ్యమునందు లియరు, కార్డీలియాలసన్నివేశము హృదయవిదారకముగా రచితమయినది. ఫ్రాన్సు దేశమునుండి వచ్చిన కార్డిలియా తనను కలిసికొన్నప్పటికే మతి చెడియున్న లియరుకు మతి

భ్రమణము గడియ గడియకూ మారుతూ ఉండెను. కార్డిలియా చనిపోయిన వెంటనే దుఃఖించి దుఃఖ మాపుకొనలేక బిగ్గరగా అరచిన లియరు మరింత ఎక్కువగాను తరచుగాను మతి భ్రమణకు లోనయినాడు. కార్డీలియా ఇంకను కొన ఊపిరితో ఉన్నదనిన్ని, బ్రతికే ఆశ లేక పోలేదనిన్ని తలచి ఆమెవైపే చూస్తూ ఉండేవాడు. అద్దము తెప్పించి ఆమె ముక్కుమీద పెట్టి ఊపిరి విడిచినప్పుడు కలిగే చిహ్నము ఏదైనా అద్దముమీద కనబడునేమో అని చూచేవాడు. సున్నితమైన పక్షి ఈక తెప్పించి ఊపిరి విడిచినప్పుడు అది కదలునేమో అని చూచేవాడు. తన చేయి బలములేక కంపించుట వలన ఆ ఈక కంపించునప్పుడు ఊపిరి ఆడుచున్నదని ఆనందించి ఆమె బ్రదుకవచ్చునని ఆశించేవాడు.

అం V దృ 3 పం 306-లో

"Why should a dog, a horse, a rat have life
And thou no breath at all? Thou'lt come no more.
Never, never, never, never, never."

అని విలపిస్తాడో 'never' అనే మాట పెక్కుసార్లు పలుకుటలో ఆమె చనిపోయినది. మరిరాదు అన్న విషయము ఎంత దుస్సహాముగా అతనిని వేధించినదో తెలియగలదు. మరల మతి భ్రమణము వలన ఆమె బ్రతుకునేమో అన్న ఆశతో

అం V దృ 3 పం....310-లో

Do you see this, look on her ! look her lips
Look there...... ., look there....................(dies)

అని ప్రాణములు విడిచిపెట్టినాడు. పాపము! చివరకు ఆమె బ్రతుకుతుందన్న నమ్మకముతోనే చనిపోయినాడు శాబోలు! అతని ఆత్మకు అదే శాంతినిచ్చినదేమో!

ఇట్టి నాటకము షేక్స్పియరు ఎందుకు రచించినాడా అనిపిస్తుంది. చదివినప్పుడుగాని ప్రదర్శింపగా చూచినప్పుడుగాని ఆనందించు

టకు తగిన సన్నివేశములు లేవు; సంఘటనలు లేవు. శాస్త్ర హాస్య రసము అప్పుడప్పుడు గోచరించినా విదూషకుని పిచ్చిమాటలు విన్నప్పుడు శాస్త్ర నవ్వు వచ్చినా అవన్నీ వెంటనే దుఃఖము కలిగించేవిగానే గోచరించి కలిగిన నవ్వు నిట్టూర్పులతో మిళితమయి అంతరిస్తూ ఉంటుంది. ఇదే వాస్తవికతను తెలియజేయునా అంటే ఇందలి కథా వస్తుసన్నివేశములు అసంభవములు కాకపోయినా అసాధారణము లవక తప్పదు. కర్మ ఫలానుభవమును బోధించు నందుమా! పాపము! కార్డీలియా చేసికొన్న పాపమేమి? ఆమె అట్లు నశించిపోవలసినదేనా! పశ్చాత్తప్తులకు నిష్కృతి లేదా! ఈ ఘోరమైన ట్రాజడీ చదివిన వారికి ప్రాపంచికములు; ఆధ్యాత్మికములు కాగల ప్రశ్న పరంపరలు అనేకముగా మనస్సుకు స్ఫురిస్తవి. అందుకు తగిన సమాధానము కన బడదు.

* * *

# మెక్ బెత్

ఈ ట్రాజడీ 1606 లో రచితమైనది. హేమ్లెట్ ఓతెలో, లియర్ ట్రాజడీ నాయకులకు బలియైనవారు మెక్ బెత్ ట్రాజడీ నాయకుడైనవాడు.

కథా సంగ్రహము :-

చాలా కాలము క్రిందట డన్కన్ స్కాట్లండ్ దేశమునకు రాజుగా నుండినప్పుడు నార్వే సైనికుల తోడ్పాటుతో ఒక శత్రు సైన్యము స్కాట్లండులో విప్లవము గావించినది. డన్కన్ కొలువులో నుండిన మెక్ బెత్ బేన్కో అనే ఇద్దరు సైన్యాధ్యక్షులు ఆ శత్రుసేనలను ఓడించి తమనగరములకు మరలివస్తూ ఉండగా త్రోవలో

ముగ్గురు అభిచారిణులు ఎదురయి ఈ సైన్యాధ్యక్షుల నిద్దానిని పలుక రించారు. మెక్‌బెత్‌ను చూచి "ఓయి! గ్లామిన్ మండల ప్రభూ! అని ఒకరు ఓయీ! కాడోర్ మండల ప్రభూ అని మరియొకరు ఓయీ స్కాట్‌లండ్ దేశరాజా!" అని మరియొకరు పలుకరించారు. బెన్‌క్వో వైపు తిరిగి "నీ పుత్రులు దేశరాజులుగా సింహాసన మధిష్ఠిస్తారు" అని ఒకరు భావి సూచనలు చేశారు.

మెక్‌బెత్ అప్పటికి ఒక్క గ్లామిన్ మండలమునకు మాత్రమే ప్రభువు "కాడోర్ మండల ప్రభువు ఇంకా సజీవుడుగా ఉన్నాడుగదా! ఆ మండలమునకు కూడా నేనే ప్రభువు అయినట్లు ఆ అభిచారిణులెట్లు నన్నిట్లు పలుకరింపగలిగినారు! ఎట్లు కాగలను!" అని ఆలోచిస్తూ ఉన్నంతలో డన్కన్ రాజువద్ద నుండి రాజదూతలు వచ్చి కాడోర్ మండల ప్రభువు శత్రుసేనలకు తోడ్పడి రాజద్రోహము చేసినాడు కనుక అతనిని తొలగించి ఆ మండలమునకు కూడా మిమ్మే ప్రభువుగా రాజుగారు నియమించినారన్న శుభవార్త తెలియజేసినారు. ఓహో అభిచారిణులు పలికిన మొదటి రెండు విషయములు యథార్థము లయి నవి. ఇక మూడవది అనగా దేశమునకు రాజు కావడమే మిగిలియున్నది. అదియెట్లు కాగలదో ఎంతలో కాగలదో అన్న ఆశాపూరితమయిన ఆలోచనలో మెక్‌బెత్ పడియుండెను. ఈ ముచ్చటలు ముందుగా తెలియజేస్తూ ఒక లేఖ వ్రాసి అతడు తన భార్యకు రహస్యముగా పంపి నాడు ఆ లేఖ చూడగానే తన భర్త తప్పక రాజు కాగలడన్న నమ్మ కము తోచినది. అది సాధ్యమయినంత వేగముగానే జరుగవలెనన్న ఆశ కూడా కలిగినది. అంతలో మెక్‌బెత్ విజయుడయి వచ్చినాడు గనుక ఆ రాత్రి అతని మందిరమునందే విందారగించి. శయనింపదలచి నట్టు వార్త కూడా వచ్చినది. ఇంకేమి కావలెను? వంటింటి కుందేలు వలెనే కాబోతున్నాడని సంతోషించి రాత్రి అతడు నిద్రలో ఉండగా అతనిని చంపివేయుటకు నిశ్చయించి మగనితో చెప్పినది. మెక్‌బెత్ కాస్త వెనుదీసినట్లు కనబడినపుడు అతనిని నిందించి పౌరుషము అత నిలో ప్రజ్వాలింపజేసినది.

రెండవ అంకము విందుకు వచ్చిన బెన్క్వో అతని కొడుకు ఫ్లియన్సు లిద్దరును 12 గం॥ రా॥కి దాటిన పిమ్మట వెడలుటతో ప్రారంభిస్తుంది. ఆ తర్వాత తను సిద్ధపరచిన కత్తితో మెక్ బెత్ డన్కన్ను చంపి ఆ నెత్తురు అంటిన కత్తితోను నెత్తురు మరకలుగల చేతులతోను తన గదికి దిగివచ్చి భార్యను కలిసికొన్నాడు. రాజు చచ్చిపడియున్న గదిలో అతని అంగరక్షకు లిద్దరు తప్పత్రాగి మొద్దు నిద్దరలో ఉన్నవారు హత్య జరిగినప్పుడు కాస్త తెలివి తెచ్చుకొని ఒకరి కొకరు కొద్దిగా పలుకరించుకొన్నారుగాని గది చీకటిగా నుండుట వలన హత్య జరిగినట్లు వారికి తెలియలేదు. మరల నిద్రాతురులయి పడుకొన్నారు. నెత్తురు పూతతో ఉన్న ఆ కత్తి వారిద్దరి ప్రక్కను పడవేసి రమ్మని మెక్ బెత్ ను అతనిభార్య హెచ్చరించినది. "మరల ఆ గదిలోనికి పోవుటకు భయపడుతున్నాను" అని అతడు పలుకుటచేత ఆమెయే ఆ గదిలోనికిపోయి ఆ అంగరక్షకుల చెంతను ఆ కత్తి పడ వేసి వచ్చినది. ఇద్దరును చేతులు కడుగుకొని ఏమియు నెరుగని వారి వలె నుండిరి. తెల్లవారినది ఎవరును లేవలేదు. రాజుగారి మనుష్యులు వచ్చి వీధితలుపుకొట్టినా ఎవరును లేవలేదు. తలుపులు గట్టిగాతట్టి కేకలు పెట్టగానే మెక్ బెత్ సేవకులు తలుపులు తెరచినారు. రాజుసేవకులలో ఒకరు రాజు పడుకొన్న గదిలోనికిపోయి చూడగా రాజు హత్యకు పాల్పడి చచ్చియుండుట, అంగరక్షకులు గాఢనిద్రలో ఉండుట వారి చేతులకు నెత్తురు మరకలు అంటియుండుట, వారి ప్రక్కను నెత్తురు పూతగల కత్తి పడియుండుట కనబడినవి. మెక్ బెత్ అతని భార్య నలుగురితో పాటు పోయి హత్య జరిగినందుకు ఆశ్చర్యము, దుఃఖము నటించినారు. అంగరక్షకుల చేతులు నెత్తురుతో కనబడుట వలనను, వారి ప్రక్కను నెత్తురు పూతగల కత్తి యుండుట వలనను వారే ఈ హత్య గావించి యుందురని అక్కడి ప్రేక్షకులు నమ్మినట్లు పలికినారు. అట్టి నమ్మకము కలుగవలెననియే లేడీ మెక్ బెత్ ఆ కత్తి అక్కడనే పడవేసి ఆ అంగరక్షకుల చేతులపై నెత్తురుపోసినది. డన్ కన్ రాజు కొడుకులు మాల్కమ్, డోనాల్ బెయిను లిద్దరును తమ్ము కూడా చంపుదు రేమో అన్న భయముతో దేశము విడిచి పారిపోయి

నారు. అందువలన రాజుగారికి బంధువు కూడా అయిన మెక్ బెత్
రాజయినాడు. ఆ అభిచారిణులు పలికిన మూడవ వాక్యము కూడా
సత్యమైనది.

మూడవ అంకము బేన్క్వో రాజ మందిరమునకు ఉదయమున
వచ్చుటతో ప్రారభించినది. తన సంతతివారు రాజులుగా సింహాసనము
నధిష్టిస్తారన్న వాక్యము ఆ అభిచారిణులు పలికినారు గదా! అది
యెట్లు జరుగగలదన్న ఆలోచనలో ఉండగా రాజుగా సింహాసన మధి
ష్టించిన మెక్ బెత్తు, రాణి అయిన అతని భార్య లెనాక్స్, రాస్
మొదలయినవారు దర్బారు మందిరమునకు వచ్చినారు. ఆ అభిచారి
ణులు చెప్పిన నాల్గవ వాక్యముకూడా నెరవేరునేమో అన్న అనుమా
నము మెక్ బెత్తునకున్ను, అతని భార్యకున్ను పెనుభూతముగా పట్టు
కొన్నది. అది నెరవేరిన యెడల తమ సంతతి వారికి రాజుకాగల అదృ
ష్టము పట్టదన్న విచారము కలిగినది. అందుచేత బేన్క్వోను, అతని
కుమారుడయిన, ఏకైక పుత్రుడయిన ఫ్లీయన్సు చంపవలె
నన్న కోరిక ఎక్కువయినది. అందుకు తగినపన్నుగడ వారు పన్నినారు.
ఆ రాత్రి విందుగావించి మిత్రులతో వినోదింపదలచినామని తెలియ
చేస్తూ బేన్క్వో, ఫ్లీయన్సు లిద్దరును విందుకు రావలసినదని
ఆహ్వానించినారు. అందుకు బేన్క్వో సమ్మతించినాడు. ఆ రాత్రి
విందుకు వస్తూ ఉండగా మెక్ బెత్తు నియమించిన బంట్లు అతనిని అతని
కుమారుని పట్టుకొని బేన్క్వోను చంపినారు. అతని కుమారుడు
ఫ్లీయన్సు మాత్రము ఎట్లో తప్పుకొని పోయినాడు. అనుకొన్న వేళకు
బేన్క్వో, ఫ్లీయన్సులు రాకపోయినా విందు ప్రారంభించినారు. ఆహూ
తులలో ముఖ్యమయిన నా మిత్రుడు బేన్క్వో ముఖ్యుడు. అతడు
రాలేదు గదా అని బాధపడుతున్నాను. అతని కోసము తక్కినవారు
నిరీక్షించుట మంచిదికాదు కనుక మనము విందారగింతామని మెక్
బెత్ పలికినాడు. కాని బేన్క్వో హతుడయినట్లు విన్న తర్వాతనే
మెక్ బెత్ ఈమాట అన్నాడు. విందుసాగుతూ ఉండగా బేన్క్వో
భూతము మెక్ బెత్తు ఆసనము వద్ద అతనికి గోచరించినది. అది చూచి
మెక్ బెత్తు హడలిపోయినాడు. అంతేకాదు పిచ్చివానివలె అసంగ

తంగా మాటలాడుతూ అటూ ఇటూ తిరగడం మొదలుపెట్టాడు. అతనికిది ఒక రోగమనిన్ని అప్పుడప్పుడు ఆ విధంగా కనబడుతూ ఉంటుందనిన్ని లేడీ మెక్‌బెత్తు విందులో ఉన్నవారికి నచ్చజెప్పి మెక్ బెత్తును లోనికి తీసికొనిపోయినది. విందు పూర్తిగా సాగలేదు. అక్కడివారు ఎవరికి తోచినట్లు వారనుకొన్నారు.

నాల్గవ అంకము – తాను రాజగుటకున్ను రాజ్యాధికారము తన సంతతి వారికే ఆచంద్రార్కం నిలిచియుండుటకున్ను అప్పటికి నాలుగు హత్యలు గావించినాడు. డన్‌కన్‌ను అతనిని చంపినవారు అతని ప్రక్కను పడుకొని ఉండినవారే అన్న అసత్యపు నేరము మోపి ఆ ఇద్దరిని చంపి, బేన్‌క్వోను చంపించినాడు. తన సంకల్పము పూర్తిగా నెరవేరడానికి ఇంకా తాను చేయవలసిన పని యేమో కనుక్కోవలసిన పని యున్నదని ఆ మరుసటి దినమే తనకు మొదట కనబడిన అభిచారి ణులు స్థలమునకు పోయి వారి కోసము నిరీక్షించినాడు. ఆ అభిచారి ణులు కనబడి "నీవు కావించిన హత్యల విషయం తెలిసికొన్న మెక్ డఫ్ అనే ఫైఫ్ మండల ప్రభువు నీకు అపకారము ప్రతీకారముగా చేయవచ్చును కనుక జాగ్రత్త" అని హెచ్చరించినారు. ఆ హెచ్చ రికతోపాటు "తల్లి కడుపునుండి సవ్యంగా పుట్టిన మానవ మాత్రు డెవడూ నీకు హాని కలిగింపలేడు" అని కూడా ఆశాజనకమైన వాక్యము పలికినారు "అంతేకాక డన్‌సినేన్ హిల్ అనే కోటకు దాని నావరించి యున్న బిర్నమ్ అడవి ఎదురు తిరిగి నీ మీదికి వచ్చువరకున్ను నీకు అపాయమేమీ కలుగదు" అని అభయము పలికినారు. దీనితో మెక్ బెత్ భయము అంతరించినది. "అడవి ఎట్లు ఎదురు తిరుగగలదు! నామీదికి రాగలదు? అంటే నాకేమీ అపాయము కలుగదన్నమాట" అని మెక్‌బెత్ ఆనందించినాడు "మెక్‌డఫ్ వలన హాని కలుగవచ్చు నని ఆ అభిచారిణులు పలికినారు. నాకును ఆ భయమే కలిగినది కనుక అతనిని కూడా చంపించవలెను" అని తలచినాడు.

ఇంటికి తిరిగి రాగానే మెక్‌డఫ్ ఇంగ్లండు దేశమునకు వెడలి నాడనిన్ని అక్కడి కదివరకే వెళ్ళి ఉండిన మాల్‌కమ్‌ను కలిసికొన

దలచినాడనిన్ని మెక్ బెత్ తెలిసికొని కోపోద్దీపితుడయి లేడీ మెక్ డఫ్‌ను, ఆమె బిడ్డలను అందరినీ వెంటనే చంపవలసినదిగా తన బంట్లను ఆజ్ఞాపించినాడు.

ఇంగ్లండులో మాల్‌కమ్ మెక్ డఫ్ లిద్దరును మెక్ బెత్తును ఎదిరించి యుద్ధము చేయుటకు పూనుకొని సేనలను సిద్ధము చేస్తూఉండగా మెక్ డఫ్‌నకు తన భార్య పిల్లలు అందరూ హత్యగావింపబడినారన్న వార్త అందినది. దానితో దుఃఖభారము సహింపలేక కోపోద్దీపితుడయి వెంటనే పగసాధింపవలెనన్న పట్టుదలతో మాల్‌కమ్‌తో కలిసి పెద్ద సైన్యమును వెంటబెట్టుకొని మెక్ డఫ్ స్కాట్లండు దేశమునకు దండెత్తి వచ్చినాడు. స్కాట్‌లండు దేశమును చేరగానే డన్‌కన్ కొలువులో ఉండిన ప్రభువులు మొదలయిన పెద్దలలో కొందరు తమ తమ సేనలతో మెక్ డఫ్ మాల్‌కమ్‌లకు తోడయినారు. అప్పటికి మెక్ బెత్ గావించిన అత్యాచారములు వెల్లడయినవి. దేశములో అతనికిగల సహాయ్య సంపత్తి తక్కువయినది. అయినా మెక్ బెత్ మొండి ధైర్యముతో నుండెను. డన్సినేన్ దుర్గమునకు తన వసతి మార్చుకొన్నాడు. ఒక పెద్ద సైన్యమును సమకూర్చుకొని దుర్గము వెలుపల నుంచినాడు.

ఐదవ అంకము :- మన ఏవ మనుష్యాణాం కారణం సుఖ దుఃఖయోః అన్నట్లు అతని మనస్సు మాత్రము పూర్తిగా చెడినది. డన్‌కను హత్య జరిపిన నాటినుండిన్ని అతనికి గాని అతని భార్యకుగాని నెమ్మదిలేదు. అనుక్షణమున్ను ఏదో భయము. ఏదో అలజడి కలుగుతూనే ఉండెను. వారిలో లేడీ మెక్ బెత్తుకు మెదడు చెడి పోయినది. ఆమె తన చేతులు చూచుకొని నెత్తురు మరకలింకను పోలేదని భ్రమపడి మాటి మాటికి చేతులు కడుగుకొనేది. ఏదో భయంకర దృశ్యమెదురయినట్లు త్రుళ్ళిపడేది. ఏదో రోగము పట్టుకొన్నట్లు నీరసించి పోయినది. చికిత్సకోసము వచ్చిన వైద్యులకు ఆమెను పీడిస్తూ ఉండిన రోగమేదో బోధపడలేదు. తుదకు దుఃఖభారముతో కృశించి భయమునకు లోనయి నిరాశచెంది మరణించినది. ఆమె చావువలన మెక్ బెత్ దుఃఖము దుర్భరమైనది. ఏదో అధికారము, ఘనత, గౌరవము,

సౌఖ్యము, సంతోషము రాజకుటుంబవలన కలుగుచున్న ఆశతో నుండిన మెక్ బెత్తునకు దుఃఖము. భయము,అనుమానము, అపవాదు దేశములో అంతకంతకు ఎక్కువగుతూ ఉండిన విరోధము పీడిస్తూ వుండెను. సుఖంగా ఉండిన బ్రతుకు దుఃఖానికి తెచ్చుకొన్నట్లయినది. అయినా అతనికి మొండి ధైర్యము మాత్రము ఆవహించి యుండెను. అంత వరకూ సాగిన పనులు పూర్తి కావలెనేకాని విడిచిపెట్టుటకు వీలు కాదన్నట్లు తోచినవి. శత్రుసేనలు తన దుర్గముమీదికి వస్తూ వుండినా బిర్నమ్ అడివి చలింపకుండా ఉన్నంతకాలము తనకేమీ హాని కలుగదన్న నమ్మకముతో అతడు ధైర్యము గలిగియుండెను.

అట్లుండగా ఒక సైనికుడు దుర్గమంగుండిన మెక్ బెత్తువద్దకు పరుగెత్తుకొని వచ్చి "బిర్నమ్ అడవి కదలి మన దుర్గమువైపు వస్తున్నది" అని చెప్పినాడు. "అసత్యము ! అసంభవము స్థావరములైన వృక్షములు కదులుట కల్ల ! పొమ్ము" అని మెక్ బెత్ కోపముతో అరచినాడు.

కాని, ఆ సైనికుడు చెప్పినదానిలో సత్యములేకపోలేదు. శత్రు సైన్య బలము ఎంత ఎక్కువగా ఉండెనో మెక్ బెత్తుకు తెలియనీయరాదని ఎంచి మాల్కమ్ ఒక ఉపాయమాలోచించినాడు. ఆ బిర్నమ్ అడవిలోగల చిన్న చెట్లను కొమ్మలతోను రెమ్మలతోను ఊడదీయించి అవి తమ ముందుగా పట్టుకొని నడవవలెనని సైనికులలో కొందరిని నియమించినాడు. వారి వెనుకను తమ సేనలు నడిచేటట్టుగా ఏర్పరచినాడు. ఈ చెట్ల వెనుక నున్న సేనలు కనబడక పోవుటచేతను, ఆచిన్న చెట్లను ముందుగా పెట్టుకొని సైనికులు నడచుట చేతను మెక్ బెత్తునకు ఆ బిర్నమ్ అడివి అమాంతంగా నడచి వస్తూ ఉన్నట్లు తోచినది. యథార్థముగా ఏమి జరిగినదో తెలియగానే మెక్ బెత్ తన సైన్యమును వెంటబెట్టుకొని శత్రు సైన్యముతో యుద్ధము చేయుటకు వెడలెను. మాల్కమ్, మెక్ డఫ్‌లతో యుద్ధము సాగినది. తల్లి కడుపునుండి సవ్యముగా పుట్టిన మానవ మాత్రుడు తనను జయింపలేరన్న మాంత్రిక బలము తనకు కలదు కనుక నిష్ఫలముగాగల యుద్ధమేల చేస్తావని మెక్ బెత్ మెక్ డఫ్‌ను బెదరించినాడు. సరేకాని "నేను సవ్యముగా

పుట్టలేదు. శస్త్రచికిత్స చేసి నన్ను నా మాతృగర్భమునుండి పైకి తీసినారు" అని మెక్‌డఫ్ చెప్పగానే మెక్‌బెత్ భయపడి యుద్ధము మాని శరణు జొచ్చుటకు సిద్ధపడి మరల వెంటనే పౌరుషము తెచ్చుకొని యుద్ధముచేసి మరణించినాడు. మాల్కమ్ రాజయినాడు.

*   *   *

## మెక్‌బెత్ - విమర్శ

ఇది "దురాశ దుఃఖానికి చేటు" అనే నీతికి దృష్టాంతముకాగల ట్రాజడీ. మెక్‌బెత్ రాజు కొలువులో సైన్యాధ్యక్షుడు. రాజ వంశమునకు చెందినవాడు. అప్పుడు రాజుగా ఉండిన డక్కనుకు ఇష్టుడు. యుద్ధములో బేంగ్‌క్వోతోపాటు విజయుడై గ్లామిస్ మండలమునకే కాక ఇప్పుడు యుద్ధములో విజయుడగుటవలన కాడార్ మండలమునకు కూడా ప్రభువుగా నియమితుడైనాడు. డక్కను రాజు తనంత తాను అతని మందిరమునకు అతిథిగా వచ్చి ఆరాత్రి అతని మందిరమందే విశ్రమించుటవలన అతనికి మెక్‌బెత్ యెడల ఎంత గొప్ప ఆదరాభిమానములు, విశ్వాసము ఉండెనో తెలియగలదు. అంత గొప్ప గౌరవాస్పదమయిన పదవి యందున్న మెక్‌బెత్ హాయిగా రాజభోగములు అనుభవిస్తూ ఉండగలడు కదా ! అంతకంటె రాజుగా ఉన్నవాడు ఎక్కువ సౌఖ్యములను ఏమి పొందగలడు ! "ఔత్సుక్య మాత్రమసా దయతి ప్రతిష్ఠా క్లిశ్నాతి లబ్ధ పరిపాలన వృత్తిరేవ" అని కాళిదాసు అభిజ్ఞాన శాకుంతలమనే నాటకములో పల్కినట్లు రాజు పదవి పొందిన వాడికి ఆ ఉబలాటము తీరవచ్చునే కాని అంతకంటె ఎక్కువ ఏమి రాగలదు ! మరి ఏమీ రాదు సరికదా ! పరిపాలన మనే భారమును మోయుటయే ప్రతిఫలము సంభవిస్తుంది. ఈ విషయము మెక్‌బెత్తుకు తెలియదా ! తెలిసిన్నీ ఆ రాజ పదవికోసమెందుకు అంత

దారుణమైన పనికి పూనుకొన్నాడు ? మానవునకున్న దౌర్బల్యము అతనికిన్ని ఉండెననవలెను. ఆ పదవి కావలెనని కోరుటలోను యదోచితముగా వచ్చిన యెడల అనుభవించుటలోను దోషములేదు. కాని ఆ పదవి దౌర్జన్యము, రాజద్రోహము, దేశద్రోహము, విశ్వాసభంగము మొదలయిన దుష్కృతములవలన సాధింపవలసి వచ్చినప్పుడు దానిని మెక్‌బెత్తు వంటివాడు ఆపేక్షించవచ్చునా ? అనేది ప్రశ్న. అట్టి అపేక్ష మెక్‌బెత్తుకు వాస్తవముగా పుట్టలేదు. ముగ్గురు ఢాకినుల (అభిచారిణుల) మాటల వలన కలిగినది. ఆ ఢాకినీ స్త్రీలు మెక్‌బెత్తును చూచి గ్లామిస్ ప్రభూ ! అని పలుకరించుటలో వింత లేదు. కాని కాడొర్ ప్రభూ అని పలుకరించుటలో భావిసూచన కలదు. అంతేకాక స్కాట్లండు దేశరాజా ! అని కూడా పిలిచినప్పుడు ఆశ్చర్యము కలిగినది. వారట్లన్న అనతికాలములోనే రాజు మెక్‌బెత్తును కాడొర్ మండలమునకు ప్రభువుగా నియమించిన వార్త తెలియ వచ్చుట వలన మెక్‌బెత్తునకు ఆఢాకినిల వాక్కు సత్యమైనట్లు రుజువయినది. వారికి ముందు కానున్నది తెలిసికొనే శక్తి కలదన్న నమ్మకము కుదిరనది. అందుచేత స్వతః సిద్ధముగా లేకపోయినా రాజు కావలెనన్న కాంక్ష ఆఢాకినుల వలన కలిగినది. కాడొర్ ప్రభువగుట ప్రయత్నముగానే సిద్ధించినట్లు రాజపదవి కూడా అప్రయత్నముగానే సిద్ధించునన్న అభిప్రాయము అతనికి కలుగుటలో వింతలేదు. అది అప్రయత్నమువలన శీఘ్రకాలములో కలుగవలెనన్న దురాశ మెక్‌బెత్తు భార్యకు కలిగినది. అప్రయత్నముగా రాజు మెక్‌బెత్తు మందిరమునకు అతిథిగా వచ్చి ఆరాత్రి విందారగించిన తర్వాత ఆ మందిరమందే శయనించుట ఆమె దురాశకు దోహదముగా పరిణమించినది. మెక్‌బెత్ భార్య దుశ్శీల గనుక తన భర్త శీఘ్రముగా రాజుకావలెనన్న దురాశకు లోబడి రాజును నిద్రలో చంపి ఆ కోరిక నెరవేర్చుకోవలెనన్న అభిప్రాయము కలిగి ఆ దారుణ కృత్యమునకు పూనుకొన్నది. అట్టి దారుణ కృత్యమునకు దిగజారవలెనన్న దురాశ మెక్‌బెత్తునకు ఏ కోశమునను లేదు. తన భార్య

ప్రోత్సహించుటవలనను, ఆఢాకినులు పలికినది అట్టి సాహసముచూపుట
వలననే నెరవేరునని హెచ్చరించుటచేతను ఆ పనికి అనుకూలమయిన
సంఘటన - అనగా రాజు తమ మందిరమందు శయనించుట - తాము
కోరకనే సిద్ధించుటవలన తమ పనికి విజయముకూడా ఆఢాకినులు పలికి
నట్లు దైవికముగానేసిద్ధించునని నచ్చచెప్పుటవలనను మెక్‌బెత్తు మెత్త
బడినాడు. తుదకు హత్యకూడా జరిపినాడు.

బేంగ్‌క్వో మాత్రము మెక్‌బెత్‌వంటి వాడుగా తొందరపడి
ఏమిచేయుటకును పూనుకోలేదు. "యద భావి నతద్భావి, భావి చేన్నత
తన్యథా! ఇతి చింతా విషఘ్నోఽయం అగదః కిం నపీయతే!"
అన్నట్లు కానున్నది కాక మానదు. అది మనం ప్రయత్నం చేస్తినా
చేయకపోయినా కాక తప్పదన్నట్లుగానే ఉండెను గాని దారుణ కృత్య
మేదీ తల పెట్టలేదు. కాని మెక్‌బెత్- భార్యాభర్తలకు మాత్రము
అతడు తమవలెనే దురాశ కలిగి ఎట్టి దారుణ కృత్యములకు పూను
కొనునో అన్న భయము పట్టుకొన్నది.

ఇట్టి సందర్భములో మానవుని చిత్త ప్రవృత్తులు ఎట్లు విపరీత
ముగాను అసంగతముగాను సంచరిస్తూ ఉంటవో మనము చూడవలసి
యున్నది. ఢాకినులు భావిసూచనలుగా చెప్పిన రెండు అంశములు
యదార్థములుగా పరిణమించినప్పుడు ఢాకినుల వాక్కు దివ్యజ్ఞానము
గలది అన్న నమ్మకము మెక్‌బెత్తు దంపతులకు కలిగినది గదా! అది
శీఘ్రముగా ఫలింపవలెననియే కదా ఆ దారుణ హత్యకు పూను
కొన్నారు. మూడవ అంశము బేంగ్‌క్వో పుత్రులా దేశమునకు రాజు
లగుదురు అన్నది కూడా యదార్థము కాక మానదన్న నమ్మకమున్ను
వారికి కలిగియుండవలెను. ఆ అనిష్టమైన దుస్థితితప్పించుకొనుటకు ఏమి
చేసినా నిష్ఫల మగునన్న ఆలోచన వారికేల కలుగలేదు. అది తమకు
అనిష్టమైనది కనుక కలుగలేదు. అందులోనే ఉన్నది మాన
వుని మాఢ్యము అంతేకాక బేంగ్‌క్వో పుత్రులు ఎట్లు రాజులు కాగ
లరో వా రూహించుటకు ప్రయత్నమైనా చేయలేదు. తండ్రి బ్రతికి
యుండగా తనయులు సాధారణముగా రాజులు కాజాలరు. బేంగ్‌క్వో

ఫ్లీయన్స్ అను వశవొక్కడే పుత్రుడు. ఢాకినులు చెప్పినది నిజము కాక తప్పనప్పుడు బేంగ్కో చనిపోయిన పిమ్మట కదా రాజు కావచుటే. కనుక బేంగ్కోను చంపించుటవలన జరగక తప్పని సంఘటన త్వరితముగా జరుగుటకు వీలయిన పనిచేసిన వాడనే కాగలనన్న ఆలోచన మెక్‌బేత్తుకు కలుగ లేదు. కలుగకపోలేదు, కలిగింది. కనుకనే ఫ్లీయాన్స్‌నుకూడా చంపించుటకే మెక్‌బెత్తు ప్రయత్నించినాడని కొందరనవచ్చును. ఢాకినుల వాక్కు సిద్ధింపక తప్పదన్న నమ్మకము కుదిరినవాడు ఈ ప్రయత్నము సిద్ధించునని ఎట్లు ఊహింపగలిగినాడన్న ప్రశ్న పుట్టకతప్పదు. ఈ ప్రశ్నలకు ఒకటే సమాధానము. ఈ సంఘటనల వలన దోషము చేసినామన్న విషయము అంతర్గతముగా హృదయమును కొరుకుతూ ఉన్నవారికి సరియైన ఆలోచనలు పుట్టవు. మెదడు సరిగా పనిచేయదు. అందుచేతనే విందు జరుగుతూ ఉన్న రాత్రి బేంగ్కో భూతము మెక్‌బెత్తుకు గోచరించి పిచ్చివానిని చేసినది. నిజము బయలు పడే మాటలెక్కడంటాడో అన్న భయము లేడీ మెక్‌బెత్తునకు తోచినది. భర్తను లోనికి తీసికొని పోయినది. విందు రసాభసయినది. ఈ దుష్కృత్యము ఎట్లు పరిణమిస్తుందో అన్న భీతివలన లేడీ మెక్‌బెత్తుకు మతి చెడినది. ఆరోగ్యము చెడినది. తుదకు మరణించినది. ఆమె మరణముతో మెక్‌బెత్తు మరింత మతిచెడిన వాడయినాడు.

విందు జరిగిన మరునాడు మెక్‌బెత్ ఆఢాకినులను కలిసికొనుటకు యత్నించి, కలిసికొని, తానేమి చేయవలెనో తెలిసికొన గోరినాడు. వారు కానున్నది యథార్థముగా పలికినా అతనికి సరిగా బోధపడని మడత మాటలతో పలికినారు. తుదకు మెక్‌బెత్తు యుద్ధములో ఓడిపోయి హతుడయినాడు. డన్కన్ కొడుకు మాల్కమ్ రాజయినాడు. మెక్‌బెత్ జీవితమేమయినట్లు? దురాశకుపోయి దుఃఖమును తెచ్చిపెట్టుకొన్నట్లయినది.

అసలీ ట్రాజడీ ఢాకినుల ప్రవేశముతోను, దుర్నిమిత్తములతోను ప్రారంభించినది. ఇంచు మించు సన్నివేశములన్నీ పగలు జరిగినా రాత్రి జరిగినా చీకట్లోనే జరిగినవి. "మేఘ చన్నే చదుర్దినమ్"

అనే అర్థములో నాటకమంతా దుర్దినములతోనే సాగినది. సంతోష దాయకమయిన దృశ్యము చెప్పుకోదగినది ఒక్కటయినను కనబడదు. 2100 పంక్తులలో నాటకమంతా ఎడిపడిగా నడిచేటట్టు షేక్స్పియరీ ట్రాజడీ రచించడములో గొప్ప ప్రతిభ చూపించినాడు.

మరియొక్క విషయము తెలియజేసి యీ ప్రకరణము ముగిస్తున్నాను. ఓతెలో, హామ్లెట్, కింగ్ లియర్, జూలియస్ సీజర్, ఆంటనీ అండ్ క్లియోపాత్రా నాటకములందలి కథానాయకులు అన్యాయముగా ఇతరులు పెట్టిన బాధలకు, హింసలకు బలియైగాని, బద్ధులైగాని మరణించినారు. ఈ నాటకములోని కథానాయకుడు మాత్రము హత్యలు గావించి స్వయంకృతాపరాధము వలన సుఖాన ఉన్న ప్రాణము దుఃఖాన పడవేసికొని యుద్ధములో అపజయముపొంది హతుడైనాడు. తక్కిన నాటకములలోని నాయకులు మరణించినప్పుడు అయ్యో పాపము ! అన్నవారు చాలామంది ఉండిరి కాని ఇతడు మరణించినప్పుడు పీడవదలినదని సంతోషించినవారే ఉండిరికాని అయ్యో పాపము అని విలపించినవారు ఒక్కరూ లేరు.

షేక్స్పియరు రచించిన నాటకములలో ఏ రెండున్ను ఒకే రీతిగా సాగలేదు. అందులో ఇది మరీ విపరీతముగా ఒక విధమయిన ప్రత్యేకత కలిగి నడచినది. ఈ నాటకము ప్రపంచమంతటను తరచుగా ప్రదర్శిస్తూ ఉంటారు.

* * *

# చారిత్రక నాటకములు

షేక్స్పియరు రచించిన చారిత్రక నాటకములు రెండు శాఖలుగా విభజింపవచ్చును. (1) ఆంగ్ల దేశ చరిత్రకు సంబంధించినవి. (2) గ్రీస్ రోము దేశచరిత్రకు సంబంధించినవి. మొదట శాఖలో

చేరిన నాటకము లందలి కథావస్తువునకు ఇంగ్లండ్ దేశమందుండిన చారిత్రక పత్రాలున్ను మరికొన్ని ఇతరపత్రాలున్ను ఆధారము. రెండవ శాఖలో చేరిన నాటకము లందలి కథా వస్తువునకు ప్లూటార్కు రచించిన జీవిత చరిత్రలు మొదలయిన చారిత్రక పత్రాలు ఆధారము.

కామెడీల విషయములోగాని ట్రాజడీల విషయములోగాని కథ నడిపించునప్పుడు నాటక రచయిత స్వతంత్రత ఎక్కువగా వహింపగలడు. కాని అవి చరిత్రతో ముడిపెట్టుకొన్నప్పుడు ముఖ్యమైన చారిత్రక విషయములను మార్చలేడు. జనులు కర్ణాకర్ణిగా విని యథార్థములని నమ్మిన విషయములు – అది అసత్యములని సప్రమాణముగా రుజువు చేయగలిగితేనే తప్ప మార్చలేడు. కాని కొన్ని అప్రధానములయిన విషయములను తన కళాశిల్పమునకు పోషకములగునట్లు కొద్ది కొద్దిగా మార్చుకోగలడు. కొత్త పాత్రలను – చారిత్రకాధారము లేకపోయినా సృష్టించుకోగలడు. అది కళాధర్మముగానే ఎన్నాట సంప్రదాయమైనది. రచనా సామర్థ్యము వలన నాటకములో చెప్పిన విషయములకు రాను రాను ఎక్కువ బలము సమకూడుటకూడా సంభవించినది. అవి యథార్థములుకావని చారిత్రక ప్రమాణములు చూపించినా నాటకము లందలి విషయములే ఎక్కువ ప్రమాణములుగా కనబడే అవస్థకూడా వచ్చినది. అందుకొక ఉదాహరణము, సారంగధర చరిత్ర నాటకములోని కథావస్తువునకు చారిత్రకాధారములేదు. రాజ రాజ నరేంద్రునకు సారంగధరుడనే కుమారుడే లేడు. అతని భార్య రత్నాంగి కాదు. అతడు చిత్రాంగిని పెండ్లి చేసికొన్నాడనుటకు చారిత్రకాధారము లేదు. అని నేటి చారిత్రకాచార్యులెందరు ఎంతచెప్పినా విద్వాంసులయినా నమ్మకుండా ఉన్నారు. చారిత్రక ప్రామాణ్యము గల పత్రాలు చూపే యాథార్థ్యం కంటే అనుశ్రుతంగా వస్తూ ఉన్న ముచ్చట్లు యథార్థములు కాకపోయినా సాధారణ జనులకు ఎక్కువ నమ్మదగినవిగా కనబడుతవి. ఈ దుస్థితి మన దేశంలోనే కాదు ఇంగ్లండు దేశములో కూడా ఉండేది. ఇప్పటికీ ఉన్నదని కూడా చెప్పగలమేమో ! షేక్స్పియరుమాత్రము చారిత్రకనాటకాలు రచిస్తూ ఉండినప్పుడు అనుశ్రుతములయిన విషయములను పరిశీలించకుండా తన

నాటకాల లోనికి ఎక్కించినవాడు కాడు. సాహిత్యరచయితగా మాత్రమే కాక చరిత్ర పరిశోధకుడుగా కూడా పేరు పొందినాడు. అయినా 'ప్రమాదో ధీమతా మపి' అంటారు గదా! కనుక షేక్స్పియరుకు కూడా ప్రమాదములు కలిగియుండవచ్చు. ఈ విషయములో కలిగే ప్రమాదములు రెండు విధములుగా ఉంటవి. (1) యథార్థములు కానివి యథార్థములుగా భావించుటలోను (2) యథార్థ సంఘటనలను, వ్యక్తులను అర్థము చేసికొనుటలోను కలుగుతూ ఉంటవి. మొదటిది మౌలికములైన ప్రదేశములందే ఉండవచ్చును. లేదా పరిశోధనలోగల లోపమువలన కలుగవచ్చును. రెండవది అనివార్యమైన విషయము. మనమెంత నిష్పాక్షికమైన బుద్ధితో ఉన్నా సమకాలపు సంఘటనలను వ్యక్తులను అర్థం చేసికొనుటలో పొరపాట్లకు గురియగుతూ వుంటామన్న విషయము అనుభవముగల వారికి తెలిసిన విషయమే. నేను ప్రత్యేకించి చెప్పనక్కరలేదు. చరిత్ర పరిశోధన ఈ 20వ శతాబ్దములో ఎక్కువగా జరిగినది. దాని ఫలితముగా షేక్స్పియరు తన చారిత్రక నాటకములో కొన్ని తప్పులు చేసినాడని విమర్శకులు ఇటీవల అనగా గత ముప్పది సంవత్సరములలోను ఆక్షేపించినారు. అవి ఏవో ఎట్టివో ఆయా స్థలములందు తెలియజేస్తాను. అంతకు ముందు ఇట్టి దోషారోపణ జరిగియుండలేదు. అంతేకాదు షేక్స్పియరు నాటకములోని చారిత్రక విషయములు ప్రమాణములుగా ఎత్తి చూపిన వారు కూడా ఉండేవారు. నేను కాలేజీలో చరిత్రాచార్యుడుగా ఉండినప్పుడు ఆంగ్ల దేశ చరిత్రలోని "నూరు సంవత్సరముల సంగ్రామము." "రోజా పుష్పముల సంగ్రామము" అనేవి విద్యార్థులకు బోధిస్తూ ఉన్నప్పుడు కొన్ని సంఘటనల ప్రాశస్త్యమును కొందరు వ్యక్తుల ప్రవర్తనము విద్యార్థుల హృదయములో లెస్సగా ముద్రితము కావలెనన్న అభిప్రాయముతో ఆయా విషయములకు సంబంధించిన దృశ్యములందలి భాగములు షేక్స్పియరు నాటకముల నుండి చదివి వినిపించేవాడను. ఆ విధముగా చేయుటవలన ఆయా సంగ్రామముల అంశములు విసువు పుట్టించకుండా బోధపరచుకొనుటకు విద్యార్థులు సంతోషిస్తూ వింటూ ఉండేవారు. నాటక రచయిత కావున షేక్స్పియరు ఎక్కడెక్కడ

చారిత్రాంశములను వ్యక్తులను అతడు తన రచనకు పాత్ర పోషణకు స్వతంత్రించి మార్చుకొంటూ ఉండెనో కూడా తెలియజేస్తూ ఉండే వాడను.

ఈ చారిత్రక నాటకములను పరిశీలించుటకు ముందు చరిత్రాంశ ములు తెలిసికొనుట మంచిది కనుక వాటిని క్లుప్తముగా సంగ్రహించి తెలియజేస్తాను.

ఆంగ్ల దేశ చరిత్రలో నార్మన్ వంశరాజుల పరిపాలనము అయిన తర్వాత ప్లాంటాజనెట్ రాజుల పరిపాలనము రెండవ హెన్రీతో (1154-89) ప్రారంభించినది. ఇతడు చాలాసమర్థుడయిన రాజు. కాని చివరి కాలములో అధికారము కోసము ఇతని పుత్రులే ఇతనిని ఎదిరించినారు. వారిలో ఇద్దరు అతని కంటె ముందుగానే చనిపోయారు. మిగిలిన ఇద్దరిలోను మొదటి రిచర్డ్ ఒక సంవత్సరము మాత్రమే రాజ్యము చేసి 1199 లో చనిపోయినాడు. ఆ తర్వాత జాన్ (1199-1217) రాజయినాడు. షేక్స్పియరు రచించిన కింగ్ జాన్ అనే నాటకము ఇతనికి సంబంధించినదే. ఇతడు చాలా అసమర్థుడైన రాజు. దేశ మందలి ప్రజలకు ప్రభువులకు మత విషయములలో తగవు పుట్టినందు వల్ల పోపుకు ఫ్రాన్సు దేశపు రాజయిన ఫిలిప్ అగస్టసకు విరోధి అయి నాడు. తత్ ఫలితముగా ప్రభువుల వత్తిడి వలన వారి హక్కులకు భంగము రాకూడదన్న మాగ్నాకార్టా (దొడ్డ హక్కుల పత్రము)పై జాన్ (1216లో) సంతకము పెట్టక తప్పినది కాదు. పోప్ అధికారము దేశముపై నిలచినది. ఫ్రాన్సు దేశములో రెండవ హెన్రికాలములో ఆంగ్ల రాజులకుగల ప్రదేశములు - ఒక్క అక్విటేన్ మండలము తప్ప తక్కినవన్నీ పోయినవి. ఈ అనిష్ట సన్నివేశములను షేక్స్పియరు తన నాటకములో చిత్రించినాడు. ఇందులో జాన్ 1199 కి పూర్వమే మృతు డైన తన అన్నగారి కుమారుడు ఆర్తరును కండ్లు పోకారులతో కాల్పించి చంపుట విషాదసంఘటనము. ఇది హృదయ విదారకముగా చిత్రితమైనది.

జాన్ కొడుకు మూడవ హెన్రీ (1217-1272) కూడా అసమర్థు డైన రాజే. కాని ఈ రాజుల అసమర్థత వల్లనే జాన్ కాలమున

మాగ్నా కార్టా లభించినట్లు ఈ హెన్రీ కాలమున పార్లమెంటు సభా వ్యవస్థకు బీజారోపణము జరిగినది ఇతనితర్వాత రాజ్యమునకు వచ్చిన మొదటి ఎడ్వర్డు (1272-1307) సమర్థుడు ప్రజలకు ఇష్టుడు. ఇతని కాలములో పార్లమెంటు రూపొందినది. వేల్జ్ మండలము ఆంగ్ల రాజ్యమందొక భాగమయినది. ఆంగ్ల రాజు పెద్దకొడుకు యువరాజుగాను వేల్జ్ ప్రభువుగాను ఉండవలెనన్న సంప్రదాయము ఏర్పడినది. ఇతని కుమారుడు రెండవ ఎడ్వర్డు (1307-1327) అసమర్థుడు. స్వార్థపరుల యిన ప్రభువుల సలహాలననుసరించి ప్రజలకు కీడు కలిగించు పరిపాలనము సాగించెను. ఇతడు డిస్పెన్సర్ ప్రభువు కుటుంబము వారిని చేరదీసి వారి దుర్బోధలవలన తప్పు త్రోవను నడచుచుండుట చూచి సహింపలేక కొందరు ప్రభువులు ఎడ్వర్డును రాజు పదవినుండి తొలగించి 1327 వధించినారు. ఈ రాజుకు సంబంధించినదే మార్లో రచించిన రెండవ ఎడ్వర్డు అనే నాటకము.

రెండవ ఎడ్వర్డు కొడుకు మూడవ ఎడ్వర్డు (1327-1377) తన తండ్రిని చంపిన ప్రభువులే తనను సింహాసనమందు కూర్చుండ బెట్టుట వలన రాజయినాడు. అప్పుడతడు 15 ఏండ్ల బాలుడు. అతని తల్లి ఇజబెల్ తన కిష్టుడైన రోజర్ మార్టిమరు అనే ప్రభువుతో కలిసి రీజెంట్లుగా రాజ్యముచేస్తూ ఉండేవారు. ఇది చూచి సహింపలేక మూడవ ఎడ్వర్డు 1330 లో యువకుడు కాగానే వారి అధికారము తొలగించి స్వతంత్రుడై రాజ్యపాలనము సమర్థతతో సాగించినాడు. ఫ్రాన్సు దేశమందు ఆంగ్ల రాజులు పోగొట్టుకొన్న ప్రదేశములను మరల సంపాదించుకొనుటకు 1338 లో దండయాత్ర సాగించుటకు మొదలు పెట్టినాడు. నాటి నుండి సుమారు నూరు సంవత్సరముల కాలము దండయాత్రలు యుద్ధములు సాగించు చుండుటవల్ల వీటికి నూరు సంవత్సరముల సంగ్రామమన్న పేరు సార్థకమయినది

ఇతని తర్వాత రాజయినవాడు ఇతని మనుమడు రెండవ రిచర్డ్. (1377-1400) రాజయిన నాటికి పదేండ్ల బాలుడగుట వలన రాజ్య పరిపాలనము సాగించినవాడు ఇతని మేనమామ జాన్ ఆఫ్ గాన్ట్. ఈ జాన్ గాన్ట్ స్వార్థపరుడు కనుక తక్కిన ప్రభువులు అసూయాగ్రస్తు

లయినారు. కాని బలము కలిగియుండెను. రిచర్డ్ కొన్ని సుగుణములు గలవాడే కానిసమర్థతగల పరిపాలకుడు కాలేకపోయినాడు. అందుచేత ప్రభువులలో కొందరు ఏకమయి సంక్షోభము కలిగించినారు. అది దుర్భరమగుట వలన అతడు తన రాజ పదవిని పరిత్యజింపవలసి వచ్చినది. ప్రభువుల తోడ్పాటుతో జాన్ ఆల్ గాంట్ కుమారుడు హెన్రీ, నాల్గవ హెన్రీ అనే పేరను రాజయినాడు. షేక్స్పియరు రచించిన రెండవ రిచర్డ్ నాల్గవ హెన్రీ నాటకములు వీరికి సంబంధించినవే. నాల్గవ హెన్రీ (1377-1418) సమర్థతగల రాజు. ప్రారంభములో కొన్ని కష్టములు కలిగినవి తలవని తలంపుగా రాజ్యమునకు వచ్చినాడన్న ఈర్ష్యతో ప్రభువులుకొందరు విప్లవములు సాగించి వేల్సు, స్కాట్లండు వారు కూడా ఇతని అధికారమును ఎదిరించుటకు యుద్ధములు సాగించినారు. మతాధికారులు కూడా ఎదిరింపబూనిరి. కాని సమర్థతతో ఈ నాల్గవ హెన్రీ అన్నిటిని ఎదుర్కొని విజయుడయి పరిపాలనము ప్రజా హిత పోషకముగా సాగించి దొడ్డ రాజన్న పేరు పొందినాడు. ఇతడు కళాప్రియుడు, ఆంగ్ల కవియైన చాసరుకు మిత్రుడు. ఇతని కారుగురు కొడుకులు కలిగినారు. వారిలో పెద్దవాడు ఇతని తర్వాత అయిదవ హెన్రీగా రాజయినాడు. (1418-1422) ఇతని తమ్ములు ప్రభువులయినారు. వారిలో ప్రసిద్ధి పొందినవారు బెడ్ఫర్డ్, కేరన్స్, గ్లస్టర్ ప్రభువులు. ఈ అయిదవ హెన్రీ బాల్యములో తుంటరులతో కలిసి తిరిగినా పెద్ద వాడయిన తర్వాత బుద్ధి తెచ్చుకొని 1418 లో తండ్రికి తగిన కుమారుడుగా సమర్థతతో రాజ్యపాలనము సాగించినాడు తండ్రి సలహాను పాటించి దేశమందలి వక్రబుద్ధులు, విప్లవబాధలుకలిగించకుండా ఉండేటట్లు ఫ్రాన్సులో ఆంగ్లేయుల అధీనములోనికి రావలసిన ప్రదేశములు అన్నీ రాలేదన్న సాకుతో నూరు సంవత్సరముల సంగ్రామము కొనసాగించుటకు పూనుకొని దుష్ట ప్రభువుల దృష్టి దేశాభిమానము వైపు మరలించి సఖ్యుడైనాడు. షేక్స్పియరు రచించిన అయిదవ హెన్రీ నాటకము ఇతని చర్యలకు యుద్ధములకు సంబంధించినది.

రెండవ రిచర్డ్, నాల్గవ హెన్రీ (రెండు) అయిదవ హెన్రీ అనే నాటకములు నాలుగున్ను లాంకాస్ట్రియన్ ట్రైలాంజీ అనే పేరను ఆంగ్ల చారిత్రక నాటకములుగా ప్రసిద్ధి పొందినవి.

అయిదవ హెన్రీ తర్వాత 1422 లో రాజ్యమునకు వచ్చినవాడు అతని కొడుకు (అతడు పెండ్లియాడిన కేతరీన్‌కుపుట్టిన కొడుకు) హెన్రీ ఆరవ హెన్రీగా రాజయినాడు. (1422-1471) రాజయినప్పుడు ఇతడు ఏడాది శిశువు. అందుచేత అయిదవ హెన్రీ తమ్ములయిన ప్రభువులు ఇతనికి పోషకులుగాను, రీజంట్సుగాను రాజ్యపాలనము చేయవలసివచ్చినది. అయిదవ హెన్రీ విజయముల వలన జరిగిన ట్రాయిస్ సంధి షరతుల ప్రకారము 6 వ హెన్రీ ఫ్రాన్సు దేశమున అర్ధ భాగమునకు సైతము రాజుగా ప్రకటితమైనది. బాలుడు గనుక ఇతని పేరను ఇతని పినతండ్రి బెడ్‌ఫర్డ్ ప్రభువు పారిస్ నగరమున రాజ్యాధికారము వహించి ఫ్రాన్సు దేశమందలి ఉత్తర భాగమును వశపరచుకొని 1450 వరకును పరిపాలనము కావించెను. కాని ఆ సంవత్సరమే ఫ్రెంచి వారికిని ఆంగ్లేయులకును మరల యుద్ధములు జరిగినవి. జోన్ ఆఫ్ ఆర్క్ అనే వీరకన్య అద్భుతమైన ధైర్యసాహసములతో ఫ్రెంచి సేనలను నడిపి ఆర్లియన్సు వద్ద విజయము పొందినది. తుదకు 1451 సరికి కాలే నగరము తప్ప ఫ్రాన్సులో ఆంగ్లేయులు వశపరచుకొన్న ప్రదేశములన్నీ ఫ్రెంచివారు మరల సంపాదించుకో గలిగిరి.

6 వ హెన్రీ అమలహృదయుడు, సాధువర్తనుడు కాని రాజ్యపాలనము విషయములో మాత్రము అసమర్థుడు. అతనికి పోషకులుగాను, రీజంట్సుగాను ఉండిన ప్రభువులు ప్రభుత్వము వహించి ఒకరితో ఒకరు ద్వేషముతో కలహించుకొన్నారు. దేశము బహునాయకత్వముకు లోబడవలసి వచ్చినది. ప్రజలు చాలా బాధలకు లోను కావలసి వచ్చినది. ఇది వారికి దుర్భరముగానే ఉండేది. కొందరు జాన్ కేడ్ నాయకత్వమున ప్రభుత్వమును ఎదిరించి విప్లవము కలిగించినారు. 3 వ ఎడ్వర్డు సంతతివారి లోని యార్క్ ప్రభువు పుత్ర పౌత్రులకున్ను, లెంకాస్టర్ ప్రభువు పుత్రపౌత్రులకున్ను జ్ఞాతి వైరములు పుట్టి విజృం

భించినవి. రాజు దుర్బలుడు, అసమర్థుడు అగుటవలన రాజపదవికోసము ఆ రెండు ప్రభువర్గములవారున్ను తమలో తాము యుద్ధములకు సిద్ధపడినారు. ఆరవ హెన్రీ లెంకాస్టరు వర్గమునకు చెందినవాడే, కాని, అతని పేరనే అన్నట్లు ఈ ఇరు వర్గములవారున్ను యుద్ధములు ప్రారంభించినారు. లెంకాస్టరు ప్రభుపక్షమువారు ఎర్రగులాబి పుష్పమును, యార్కిస్టు ప్రభుపక్షమువారు తెల్లగులాబి పుష్పమును తమ తమ పక్షమువారి పదవీలాంఛనముగా ధరించిన వారు కనుక ఈ ఇరు పక్షముల వారికిన్ని జరిగిన యుద్ధములకు గులాబీ సంగ్రామములు (వార్జ్ ఆఫ్ రోజెజ్) అన్నపేరు వచ్చినది. 1455లో ఈ యుద్ధములు ప్రారంభించినావి. సెంట్ ఆల్బాన్స్ వద్ద జరిగిన మొదటి యుద్ధములో ఆరవ హెన్రీ పక్షమువహించిన లెంకాస్టరియన్ ప్రభువర్గము వారు ఓడిపోయినారు. 1461 సరికి యార్క్ ప్రభు పక్షమువారికి బలము హెచ్చినది. ఆ పక్షమునకు రాజసంతతికి చెందిన ఎడ్వర్డు ప్రభువు 4వ ఎడ్వర్డుగా రాజయినాడు. 1470లో లెంకాస్టర్ పక్షము వారికి జయము కలిగినందున 6వ హెన్రీ మరల రాజయ్యెను. అయితేనేమి ఆ మరుసటి సంవత్సరమే 4వ ఎడ్వర్డు విజయుడై మరల రాజయినాడు. 6వ హెన్రీ చెరసాలలో పెట్టింపబడినాడు. 1483 లో ఈ 4వ ఎడ్వర్డు చనిపోగా ఇతని కుమారుడు 5వ ఎడ్వర్డును రాజుగా సింహాసనమునందు కూర్చుండపెట్టి ఇతడు బాలుడైనందున ఇతని సంరక్షకుడుగా నుండిన రిచర్డు స్వార్థపరుడై ఇతనిని ఇతని సోదరుని 6వ హెన్రీని, 6వ హెన్రీ కుమారుని వధించి రాజయినాడు. ఇతడు యుద్ధములో ఆరితేరిన వీరుడే కాని, దుష్టుడు, దుర్మార్గుడు, స్వార్థపరుడు, అంతే కాక రాజ్య పరిపాలనమున ప్రజలను అనేక విధముల బాధిస్తూ శాసించినాడు. అందుచేత లెంకాస్ట్రియను పక్షమువారికి బలము హెచ్చినది.

తుదకు 1485 లో బాస్వర్త్ వద్ద రిచ్మండు ప్రభువు ఇతనినోడించి వధించి 7-వ హెన్రీగా రాజయ్యెను. అంతటితో రోజాపుష్ప సంగ్రామము అంతమొంది ట్యూడర్ రాజుల యుగము ప్రారంభించినది. ఈ 7వ హెన్రీ (1485-1509) కుమారుడు 8-వ హెన్రీ (1509-47).

ఈ కడపటి హెన్రీకి సంబంధించినదే షేక్స్పియరు రచించిన "కింగ్ హెన్రీ ది ఎయిత్" అనే నాటకము.

ఈ పది చారిత్రిక నాటకములలో మొదటిది "కింగ్ జాన్" కడపటిది "హెన్రీ ది ఎయిత్" ఈ రెండింటికి నడుమనున్న ఎనిమిది నాటకములున్ను రెండు వర్గనామములలో నున్నవి లెంకాస్ట్రియన్ టెట్రాలజీ అనగా లెంకాస్టర్ వర్గ చతుష్టము, ది యార్క్ సిస్ట్ టెట్రాలజీ అనగా యార్క్ వర్గ చతుష్టము. మొదటి చతుష్టములోని నాటకములు - రెండవ రిచర్డ్, నాల్గవ హెన్రీ మొదటిది; నాల్గవ హెన్రీ రెండవది. అయిదవ హెన్రీ నాటకములు. రెండవ చతుష్టములోని నాటకములు 6-వ హెన్రీ మొదటిది 6—వ హెన్రీ రెండవది; 6-వ హెన్రీ మూడవది; మూడవ రిచర్డ్ నాటకములు ఈ నాటకములలో కవితా శిల్పమునకు, నాటక రచనకు పేరు పొందినవి; 4వ హెన్రీ నాటకమున్ను, 5—వ హెన్రీ నాటకమున్ను, మూడవ రిచర్డ్ నాటకమున్ను కనుక వీటిని గూర్చి కొన్ని అంశములు తెలియజేస్తాను.

* * *

# 4 వ హెన్రీ నాటకములు (రెండున్ను)

ఈ నాటకములలో రెండు ప్రధాన చరిత్రాంశములున్నవి. రెండవ రిచర్డ్‌ను పదవీ భ్రష్టునిచేసి విజయుడై రాజయిన నాల్గవ హెన్రీ భద్రతకు భంగకరములయిన తిరుగుబాట్లను అణచివేయుటకు సంబంధించిన అంశమున్ను అందులో ప్రిన్స్‌హాల్ (యువరాజు)కు గల సంబంధమున్ను; ఈ యువరాజున్ను ఇతని కుర్రతనపు చేష్టలలో ఇతనికి మిత్రులుగా తిరిగిన ఫాల్‌స్టాప్ మొదలయిన వారికిన్ని గల సంబంధమున్ను, ఈ కథావస్తువులు రెంటను యువరాజు (ప్రిన్స్‌హాలు - కాబోయే 5వ హెన్రీ) ముఖ్యపాత్ర వహించినవాడు కనుక అతనిపాత్ర

గురించి ముందుగా చెప్పవలెను 4-వ హెన్రీకి విరోధులైన వారిలో ముఖ్యులు పెర్సీ కుటుంబమునకు చెందిన నాయకులు వారిలో హాట్ స్పర్ అనే పేరుగల యువకుడు గొప్ప వీరుడు. అతనిని యుద్ధములో ఎదుర్కొనుట అపాయకరమనిన్ని. తన పుత్రుడు ప్రిన్స్ హాల్ కూడా గొప్ప వీరుడే అయినా చిల్లర మల్లరగా తిరుగుతున్నాడు గదా అనిన్నీ నాల్గవ హెన్రీ విలపిస్తూ ఉన్న సమయములో తలవని తలంపుగా ప్రిన్స్ హాలు తండ్రికి సహాయుడై యుద్ధములో ఆ హాట్ స్పర్‌ను వధించి తండ్రి పదవీ భద్రతకు తోడ్పడి తండ్రి ప్రేమను సంపాదించు కొంటాడు.

నాల్గవ హెన్రీ ధైర్యము తెచ్చుకొని తన రెండవ కుమారుడును, లెంకాస్టరు ప్రభువును అయిన జాన్‌ను ప్రోత్సహించి హాట్ స్పరు తండ్రితోను, తిరుగుబాటు దారులలోనున్న యార్క్ ఆర్చ్ బిషప్పుతోను యుద్ధములు చేయుటకు పంపి తాను ప్రిన్స్ హాల్‌తో కలిసి వేల్జ్ ప్రభువైన సర్ ఒవెన్ గ్లెండోవరును యుద్ధములో ఎదిరించుటకు సాహసిస్తాడు. అన్ని యుద్ధములందును 4వ హెన్రీకి విజయము కలిగినది. ఆ విజయములు ప్రిన్స్ హాలు తోడ్పాటువలననే కలిగినవి కనుక తండ్రి కొడుకు లిరువురున్ను పరస్పర ప్రేమాస్పదులైనారు.

షేక్స్పియరు సృజించిన కామిక్ (హాస్యాస్పద) పాత్రలలో ఫాల్‌స్టాఫ్ పాత్ర చాలా దొడ్డది. ఫాల్‌స్టాఫ్ పాత్ర నాటక ప్రదర్శన శాలలో కనపడగానే పెద్దలు, చిన్నలు, పురుషులు స్త్రీలు అందరు ముచ్చటపడి కుళికిపాట్లు పడుతూ ఉన్నవారయినా మెలకువ తెచ్చుకొని చూస్తారు. ఫాల్‌స్టాఫ్ చేష్టలు అందరికీ ఆకర్షకములుగా ఉండే టట్లు షేక్స్పియరు అతని పాత్రను నేర్పుచూపి పోషించినాడు ఆ ఫాల్‌స్టాఫు దేహము, వేషముచూడగానే అందరికీ నవ్వువస్తుంది అతని మాటలు వినగానే ఆనందం కలుగుతుంది. అతడు దుర్మార్గులలో దుర్మార్గుడుగాను పెద్ద మనుష్యులలో పెద్ద మనిషిగాను వ్యవహరించే వాడు. అతడున్నచోట పదిమంది చేరి ప్రసంగిస్తూ ఉన్నప్పుడు అతని మాటలే ఎక్కువ వినబడేవి. అతనితో ప్రసంగిస్తున్నప్పుడు అక్కడ నున్న తమ కష్టములు మరచిపోయేవారు. పెద్దవారితో ప్రసంగిస్తూ

వున్నప్పుడు మంచి వివేకము, ఔదార్యముగలవాడుగా ఆతడు వ్యవహరించేవాడు. ప్రిన్స్ హాలుకు ఎప్పుడూ విధేయుడుగా ఉండేవాడు. అయినా ప్రిన్స్ హాలుకు అతనిలో మంచిచెడ్డలు రెండూ తెలుసును. వీడు గొప్ప పిరికిపంద డాంబికముగా పలుకుతూ ఉంటాడేకాని వట్టి పిరికివాడు. కొన్ని విషయములలో ముద్దత్తుచేసి సహాయముగా ఉన్నా వీడిని నమ్ముకొని పెద్ద పనులు ఏవీ చేయగాదన్న అభిప్రాయము ప్రిన్స్ హాలుకు కలిగినది. ఒకసారి ఈ ఫాల్ స్టాఫు తన అనుచరులతో యాత్రికులను దోచుకొన్నప్పుడు ప్రిన్స్ హాలు మరికొందరు మిత్రులను చేరదీసి తానున్న యాత్రికులను దోచుకొనుటకుబయలుదేరి, ఈ ఫాల్ స్టాఫు బందిపోటునే దోచుకొని దోచుకొన్న వస్తువులను దాచిపెట్టి సారాదుకాణములో ఈ ఫాల్ స్టాఫు తన ప్రతాపములు డాబుగా వర్ణిస్తూ తమను మాగిరియొక బందిపోటువారు దోసుకొన్న విషయము దాచిపెట్టుట చూచి ప్రిన్స్ హాలు అతనిని అవహాస్యం చేస్తూ తాను దాచిపెట్టిన వస్తువులు సాక్ష్యంగా ప్రదర్శించి నలుగురి ముందర ఫాల్ స్టాఫును తక్కిన వారి దృష్టిలో చులకనచేసినప్పుడు ఈ ఫాల్ స్టాఫు తమాషాగా పరువు దక్కించుకొన్నాడు. "ఔనయ్యా ఈ బందిపోటు దొంగ మన ప్రిన్స్ హాలుగారే అని పోల్చుకొని వీరిని గౌరవించుటకు దొరికి పోయినట్లు ఆచరించాను ఇదే మరెవ్వరయినా అయితే లొంగేవాడనా?" అన్నాడు. ఇతరులు ఎట్లు భావించినా ఈ ఫాల్ స్టాఫు తాను రాజయినప్పుడు తన మిత్రబృందములో ఉన్నయెడల తన రాజపదవీ ప్రఖ్యాతికి భంగము కలుగక మానదని ఎంచి, ఎడబెట్టె పాపమతడు ఒక యుద్ధములో చనిపోయినప్పుడు సానుకంపము గలవానిగా వెళ్ళి అతని భౌతిక దేహము చూచి

"Poor jack, fare well I could have better spared a better man" అన్నాడు. అయ్యో ! పాపం ! సెలవు (నిన్నువిడిచి పెట్టుకోవలసిన దుస్థితి నాకు కలిగింది) నీ కంటె ఎక్కువ ఆ వృద్ధైన వానినైనా ఎక్కువ తేలికయిన హృదయములో విడిచిపెట్టుకోగలిగి యుందును. అని తన భావమును తెలియజేస్తూ పలికిన మాటలవి. ప్రిన్స్ హాలు హృదయపూర్వకంగా అన్నమాటలే అని కొందరు, తాను

రాజుగా ఉన్నప్పుడు ఇటువంటి నీచుడు తనకు మిత్రుడుగా ఉంటే తన గౌరవమునకు లోపము కలుగుతుందన్న బాధ మనసులో ఉండబట్టి ఈ ఫాల్‌స్టాఫు మరణమునకు ప్రిన్స్‌హాలు లోపల సంతోషించే ఉంటాడని కొందరు విమర్శకులలో ఉన్నారు. ఫాలుస్టాఫు వాస్తవంగా దుశ్శీలుడే అని షేక్స్పియరు ఏ నాటకములోను స్పష్టంగా తెలియజేయలేదన్న విమర్శ షేక్స్పియరునాడే జరిగినదేమో అందుచేత ఈ నాటకము ప్రకటితమైన తరువాత వెంటనే రచితమైన తన "ది మెరీ వైవ్జ్ ఆఫ్ విన్జర్" (అనగా విన్జరు నగరములోని వినోద విలాసినులయిన గృహిణులు) అనే నాటకమందు ఈఫాల్‌స్టాఫు పాత్రను షేక్స్పియరు మరల ప్రవేశపెట్టి మగవాండ్రును సుశీలవగలును అయిన ఇద్దరుస్త్రీలను కామించి ప్రేమలేఖలు పంపి మూడుసార్లు వంచితుడై పడరాని భంగపాట్లుపడి ఛీ యనిపించుకొన్నట్లుచిత్రించినాడు.

ఈనాల్గవ హెన్రీ రెండవనాటకములో 4-వ అంకము 5-వ దృశ్యము ఎన్నిసారులైన చదువదగినది. అందులోను 4-వ హెన్రీ తన తలగడ వద్ద కిరీటము పెట్టుకొని నిద్రపోవుటకు పూనుకొని తన చేరువనున్న ప్రభువులతో తన నిద్రకు భంగకరములయిన శబ్దమేదీ కలుగనీయవద్దని నిద్రించి నప్పుడు ప్రిన్స్‌హాలు గదిలోనికివచ్చి తక్కిన ప్రభువు లందరినీ బయటకుపంపి తానొక్కడును తండ్రిని కనిపెట్టుకొని ఉండి ఆ కిరీట మక్కడెందుకని తీసికొని పోవునప్పుడు అతడు తనలోతాను అనుకొన్న మాటలు మొదలుకొని ఆ దృశ్యము అంతమొందిన వరకునుగల భాగమంతా చాలా ముఖ్యమయినది. అందులో కిరీటమును గూర్చిన తత్త్వము కిరీటము కోసము మానవునికి కలిగే ఔత్సుక్యము, 4-వ హెన్రీ తన కుమారునికిచేసే ఉపదేశము మొదలయిన విషయములు స్మరింపదగినవి.

*  *  *

# 5-వ హెన్రీ

4 వ హెన్రీ నాటకములో కథావస్తువులు రెండును మిళితము లైనవి. కాని 5 వ హెన్రీ నాటకములో ఒకే కథావస్తువు కలదు. ఇదిన్ని ప్రధానముగా 5వ హెన్రీకి సంబంధించినదే. ఇక్కడ అంశములు అప్రధానములు వాటిలో కొన్ని తీసివేసినా ప్రేక్షకులకు నష్టము వాటి ల్లదు. 5వ హెన్రీ ఫ్రాన్సు దేశమునకు దండెత్తి వెళ్ళి యుద్ధములో విజయుడై ఫ్రాన్సు రాజకన్యయైన కేతరీన్‌ను వివాహమాడుటయే ముఖ్యమైన కథావస్తువు. అది కాలక్రమమును అనుసరించి నడచును. కనుక కథలో గ్రంథకర్త కల్పన చేయవలసిన అవసరమే లేదు.

ఫ్రాన్సు దేశమునకు దండెత్తి వెడలుటకు హెన్రీ నిశ్చయించు కొనుటలో అతని ముఖ్యోద్దేశము స్పష్టమయినది. తండ్రి చేసిన సల హాయే కారణము ఇతర దేశములో యుద్ధము తలపెట్టి సాగిస్తూ ఉన్న ప్పుడు స్వదేశమందలి కుట్రదారులు దేశభక్తి పరులై యుద్ధమందే మనసునిల్పి తమ కుట్రలు కొనసాగించరు. కనుక ఫ్రాన్సు దేశమున యుద్ధములు నడుపుటకు 5వ హెన్రీ పూనుకొన్నాడు. యుద్ధము సాగిం చుటకు తగిన కారణముండవలెను. కనుక ఫ్రాన్సు రాజ్యమును పొందు టకు తగిన హక్కు తనకు గలదని నిరూపించవలెను. అందుకు ప్రధాన న్యాయమూర్తులైన మతాధికారులతో మంతనము సాగించినాడు. యుద్ధము కొనసాగవలెనన్న కోరిక వారికిని గలదు. అందుకు కారణమే మనగా ఆ సమయమందే చర్చి తాలూకు ఆస్తులు కొన్ని రాజు తీసి కొనుటకు సంకల్పించినాడు. యుద్ధములు సాగినయెడల ఆ సంకల్పము వాయిదా పడక తప్పదు. అందుచేత మతాధికారులున్ను న్యాయస్థాన మందలి న్యాయవాదులవలె ఫ్రెంచి రాజ్యమునకు వారసత్వపు హక్కు వారు రుజువు చేసినారు.

దండయాత్రకు బయలుదేరుతూ ఉన్న సమయములో కొందరు కుట్రదారులు విప్లవము కలిగించుటకు యత్నిస్తున్నారని తెలిసికొని ఈ

హెన్రీ తండ్రివలె కాక తండ్రిని మించిన కొడుకువలె ఆ కుట్రదారుల నాయకులను తన విచారణకు పట్టి తెప్పించి కఠినముగా దండించి తన శక్తి సామర్థ్యములను ప్రదర్శించుకొని గలిగినాడు. మరియొక సంఘటనలో కూడా ఈ హెన్రీ ఘనత ఎక్కువయినది. ప్రిన్స్‌హాలుగా ఉన్నప్పుడు చిల్లరమల్లరగా క్రీడాసక్తుడయి ఊరేగినన్న విషయము నలుగురికీ తెలిసినదే కనుక ఫ్రాన్సుదేశపు డాఫిన్ ఎగతాళిసూచనగా టెనిస్ బంతులు బహుమతిగా పంపి రాయబారము నడపినాడు. "ఏదో ఈ బంతులతో ఆడుకుంటూ ఉండు. నీకెందుకు యుద్ధాలు!" అనే భావం సూచించేటట్టు ఆ కానుక పంపించాడు. అందుకు తగినట్లుగా ఆ బంతులాటకు సంబంధించిన పరిభాషలో తాను ఫ్రాన్స్‌లో ఆడబోయే గుండు బంతుల యుద్ధక్రీడ ఎట్లు సాగుతుందో హెన్రీ తెలియజేశాడు. పద చమత్కారము చక్కగా ప్రదర్శితమైన దృశ్యము (చూ. మొదటి అంకము రెండవ దృశ్యము)

ఫ్రాన్స్ దేశములో హార్ ఫ్లోర్ ముట్టడి ఫలించినది. అప్పుడు హెన్రీ తన సైనికులకు చేసిన హితోపదేశము అతని ఔదార్యమును సూచిస్తుంది. విజయులముగదా అని నగరమును ధ్వంసము చేయరాదు. సాధువులయిన పౌరులను పీడింపరాదంటాడు.

ఆ తర్వాత కాలే ముట్టడించుట కొరకు ఆంగ్ల సేనలు నడుస్తూ ఉండగా ఫ్రెంచివారి బలము హెచ్చినది. ఆరోగ్యము చెడి ఆంగ్ల సైనికులు చాలామంది మరణించిరి. అప్పుడు డాఫిన్ మరియొకసారి అపహాస్యం చేస్తూ మీరుగుమూకెంత ప్రతిఫలంచెల్లిస్తారు, మీకు అపాయం లేకుండా మిమ్ము రక్షించి సురక్షితంగా మీ దేశమునకు మిమ్ము పంపిస్తాను అని తలబిరుసుగా కబురు చేస్తాడు. అందుకు తగినట్లు సమాధాన మిచ్చి హెన్రీ యుద్ధము సాహసముతో సాగించి విజయుడై ఫ్రెంచివారిని ఓడార్చి సంధిచేసుకొంటాడు. విజయఫలముగా ఫ్రెంచి రాజకన్య కేతరీన్ తనకు ఇల్లాలయినది. హెన్రీకిన్ని కేతరీన్‌కున్ను జరిగిన సమావేశము సరససల్లాపములు అం 6. దృ 2లో చక్కగా రచితములయినవి.

ఈ నాటకములోని నీచపాత్రలు ప్రిన్స్‌హాలు పాత మిత్రులు కనబడతారు. యుద్ధవీరులలో వేల్స్, ఐర్లాండ్, స్కాట్‌లండ్ ప్రదేశముల ప్రతినిధు లుంటారు. వీరందరికీ పాత్రోచిత భాష మాండలిక పద ప్రయోగములు ఎట్లుంటవో వారి ప్రసంగములందు బయల్పడు నట్లుగా రచన సాగినది. కేతరీన్ పాత్రపోషణము కడు నేర్పుతో సాగినది. నాటకమంతా ఆదర్శ ప్రాయమయిన చారిత్రక నాటకముగా రచిత మయినది.

* * *

## ఆరవ హెన్రీనాటకములు (మూడు)

మొదటి దానిలో 5-వ హెన్రీ కథాశేషము నడచినది. ఫ్రాన్సు దేశమందలి ఉత్తర భాగము ఆంగ్లపరిపాలనములో బెడ్‌ఫర్డ్ ప్రభువు నాయకత్వము క్రింద ఎట్లు సాగినదో నిరూపింపబడినది. జోన్ ఆఫ్ ఆర్క్ ప్రోత్సాహముతో మరల సంగ్రామము ఎట్లుఉత్పన్నమై నడచి నదో ప్రదర్శితమైనది. 5-వ అంకము రెండవ దృశ్యములో మార్గరెట్ అనే కన్య సఫక్ ప్రభువుకు పట్టుబడినది. ఈమె ఆంజు ప్రభువున్ను, నేపిల్స్ రాజున్ను అయిన రెయినియర్ కూతురు. ఈమెను చూడగానే సఫక్ ప్రభువు మోహించినాడు. కాని ఇతనికి భార్య ఉన్నది. కనుక పెండ్లియాడలేదు. అందువల్ల తన రాజయిన 6-వ హెన్రీని పెండ్లి యాడవలసినదని కోరినాడు. ఆమె అందుకు సమ్మతిస్తే చెరనుండి విముక్తి రాలగుటే కాక, ఇంగ్లండు దేశమునకు రాణికాగలదని చెప్తాడు. తండ్రి సమ్మతించినయెడల తానిష్టపడగలనని ఆమె బదులు చెప్తుంది. ఆమె ఇంగ్లండులో రాణిగా ఉంటే ఆమె తనకు కూడా లభ్యముకాగ లదన్న ఆశ సఫక్‌కు ఉండినట్లు సూచితము. ఆమె వివాహము నిశ్చ యము చేసికొనుటకు సఫక్ 6-వ హెన్రీని, అతని పినతండ్రులను, తక్కిన

ప్రభువులను కలిసి ప్రోత్సహిస్తాడు. ప్రభువులకు ఇష్టము కాకపోయినా 6-వ హెన్రీ ఆమెను పెండ్లియాడుటకు సమ్మతిస్తాడు. వివాహము నిశ్చయమయినది. కాని 6-వ హెన్రీ ఫ్రాన్స్ దేశమునకు వెళ్ళుటకు వీలులేకపోవుట వలన సఫక్కె వెళ్ళి అతని తరపున పెండ్లికొడుకుగా ఆమెను పెండ్లియాడి లండను చేరుకొని నిండుకొలువున 6-వ హెన్రీకి అప్పగించుటకు నిర్ణయమయినది. దీనితో యీ మొదటి నాటకము పూర్తియయినది.

రెండవ నాటకము 6-వ హెన్రీ దర్బారు దృశ్యము సఫక్ మార్గరెట్‌ను 6-వ హెన్రీకి ప్రభువుల సమక్షమున అప్పగిస్తాడు. వర శుల్కము లేదు సరిగదా 6-వ హెన్రీయే అంజుమండలమును ఆమె తండ్రికి ఎదురు కన్యాశుల్కముగా ఇచ్చుటకు ఒప్పందమయినందున ప్రభువులు విలపిస్తారు. ఈ రెండవ నాటకములో ప్రభువులు రెండు కక్ష్యలుగా చీలి పరస్పర ద్వేషములతో ఒకరి నొకరు నింధించికొంటారు. చివరకు రోజా పుష్పముల సంగ్రామము సంభవిస్తుంది. లెంకాస్ట్రియన్ పక్షము వారు ఎరగులాబీని యార్కిస్టు పక్షము వారు తెల్ల గులాబీని లాంఛనముగా ధరించుటవల్ల ఈ పేరు వచ్చినది 6-వ హెన్రీ లెంకాస్ట్రియన్ పక్షమువాడు. అతడు రాజ్యపాలనమునకే కాదు యుద్ధమునకున్ను అసమర్థుడగుట వలన మార్గరెట్ మగ వీరునివలెనే యుద్ధములందు నిలచినది. లెంకాస్ట్రియన్ పక్షము సెంట్ ఆల్బన్స్ వద్ద జరిగిన యుద్ధములో ఓడిపోయినది. రాజు లండన్ నగరమునకు పారిపోయినాడు. అక్కడ పార్లమెంట్ సభను సమావేశపరచి తదనంతర కార్యక్రమము నిర్ణయించుటకు సంకల్పించినాడు. ఆ విషయములను గుర్తించి యార్కిస్ట్ ప్రభువు తన పుత్రులతోను తన పక్షపు ప్రభువులతో లండన్ నగరము చేరుకొనుటకు నిశ్చయించుకొన్నాడు ఈ సంఘటనతో ఈ నాటకము పూర్తి అయినది.

మూడవ నాటకములో ఈ సంగ్రామము ఎట్లు విజృంభించినదో తుదకు యార్కిస్ట్ పక్షము చే వారివిజయముకూరినదీ ఎట్లుయార్క్ ప్రభువు యొక్క కుమారుడు ఎడ్వర్డ్ 4-వ ఎడ్వర్డుగా రాజయినదీ,6-వ హెన్రీ ఒక యుద్ధమందు విజయుడై మరల రాజుగా ప్రకటితమైనా తుదకు యార్క్

ప్రభువు కుమారులలో గ్లస్టరు ప్రభువయిన రిచర్డ్ కుట్రలకు లోనయి మృతిపొందినదీ, అతని కుమారుడైన ప్రిన్స్ ఆఫ్ వేల్జ (ఎడ్వర్డుకూడా) ఎట్లు మరణించినదీ ప్రదర్శింపబడినది. తుదకు యార్కిస్టు ఎడ్వర్డు 4-వ ఎడ్వర్డుగా రాజగుటతో ఈ మూడవ నాటకము పూర్తి అవుతుంది.

* * *

# మూడవ రిచర్డ్

యార్క్ ప్రభువు కుమారులలో ఎడ్వర్డు 4-వ ఎడ్వర్డుగా రాజు అతని తమ్ములు జార్జి (క్లారెన్స్ ప్రభువు) రిచర్డ్ (గ్లస్టర్ ప్రభువు); కొడుకులలో ఎడ్వర్డు (ప్రిన్స్ ఆఫ్ వేల్జ్) ఆ తర్వాత 5-వ ఎడ్వర్డు అను పేర రాజు), రిచర్డ్ (యార్కు ప్రభువు), యార్క్ ప్రభువు కొడుకులలో ఐక్యము చెడినది. వారిలో గ్లస్టరు ప్రభువు కడు సమర్థుడు, నేర్పుగలవాడు. ఇతని వక్రబుద్ధికి, కుట్రలకు సాహస కార్యములకు ఎవ్వరును నిలువలేకపోయినారు. ఒకరి తర్వాత ఒకరు అందరున్ను లోబడుటయో హతులగుటయో తప్పినది కాదు. లెంకాస్ట్రియన్, 6-వ హెన్రీ, అతని కొడుకు హతులైనారు. మార్గరెట్ పారిపోయి మరణించవలసి వచ్చినది. తుదకు 4వ ఎడ్వర్డు, క్లారెన్స ప్రభువు, నాల్గవ ఎడ్వర్డు కుమారు లిద్దరున్ను మొదట బంధింపబడి (చెరలో ఉండగానే)హతులైనారు. గ్లస్టరుప్రభువు 3-వ రిచర్డ్ గా రాజయినాడు. ఈ నాటకములో 6-వ హెన్రీ కోడలయిన ఏన్ ఏ విధముగా ఈ 3వ రిచర్డుకు భార్య అయినదో తెలియచేసే దృశ్యము (చూ అం 1 దృ 2) అద్భుతముగా చిత్రింపబడినది. నాల్గవ అంకము రెండవ దృశ్యములో ఈ గ్లస్టరు ప్రభువు 3-వ రిచర్డ్ అను పేర రాజుగా కనబడుతాడు. అంతవరకును అతని దుశ్చరితులు, దారుణ హత్యలు వక్రమార్గములు ప్రదర్శితము లయినవి.

అయిదవ అంకమందలి 3-5 దృశ్యములు ఈ 3-వ రిచర్డు పతనమును చూపును. రిచ్‌మండు ప్రభువు విజయమున్ను కడునేర్పుతో రచితములయినవి. ఇందులో భీభత్సముతోపాటు ప్రేక్షకులకు ఆనందము కలిగించే దృశ్యములు మనోజ్ఞముగా చిత్రితములయినవి.

3-వ రిచర్డు పాత్రపోషణము విషయమై విమర్శకులు కొందరు ఇటీవల ఆక్షేపించుటకు మొదలుపెట్టినారు. చరిత్ర పరిశోధకులు కొందరు ప్రామాణిక పత్రములు ఆధారముగా చూపి ఈ రిచర్డు షేక్స్పియరు చూపినంత దుర్మార్గుడున్ను, దుశ్చరితుడు కాడనిన్ని తక్కిన వారివలె స్వార్థపరుడు మాత్రమే అనిన్ని ఇతడు వాస్తవముగా సమర్థుడైన రాజనిన్ని చెప్తున్నారు.

* * *

చారిత్రక నాటకములలో కాలక్రమమువనుసరించి మొదటిదైన కింగ్ జాను నాటకమున్ను కడపటిదైన 8వ హెన్రీ నాటకమున్ను ఎక్కువగా విమర్శించుటకు అవకాశము చాలదు. కింగ్ జాన్ నాటకములో ఆర్థర్ కన్నులు పెకలించిన దృశ్యము కడువిషాదముగా రచితమయినది. ఎనిమిదవ హెన్రీ నాటకమందు వుల్సీ భంగపాటు కడు దుర్భరమయినదిగా రచితమయినది.

* * *

# పంక్తిజ్ఞ ప్రకరణము

వ్యవధిచాలక పోవుటవల్లను గ్రంథ విస్తీర్ణ భీతిచేతను ఈగ్రంథమునకు సంబంధించిన విషయములే కొన్ని విడిచి పెట్టవలసి వచ్చినది. అయినా వాటిని కూర్చి కొద్దిగానైనా చెప్పక తప్పదని ఇక్కడ వ్రాస్తున్నాను.

వివరించి చెప్పక పిడిచిపెట్టిన నాటకముల ప్రసక్తి :-

లవ్జ్ లేబర్ లాస్ట్, ట్రాయిలస్ అన్డ్ క్రెసిడా, ఆల్ ఇజ్ వెల్ దట్ ఎన్డ్జ్ వెల్, మెజర్ ఫర్ మెజర్, ది టూ జన్ట్లమెన్ ఆఫ్ వెరోనా మెరి వైవ్జ్ ఆఫ్ విన్జర్ సింబలైన్, విన్టర్ జుటేల్, కొరియలానస్, ఆన్టనీ అన్డ్ క్లియోపాత్రా, టైమన్ ఆఫ్ ఏతెన్జు, పెరిక్లీజ్.

వీటిలో లవ్జ్ లేబర్ లాస్టు ఒక విశిష్టమైన కామెడీ. యిది సాధారణ ప్రేక్షకులకు కాక విద్వద్దరిష్టులయిన సభ్యుల వినోదార్థము 1594 లో ప్రదర్శితమయినది. ప్లేగ్ వ్యాధి లండన్ నగరములో ఎక్కువగా ఉండుటవలన నాటకశాలలు మూసివేసివారు. అందువలన ఈ నాటకము ఒక ప్రభువు మందిరమున ప్రదర్శితమైనది. అట్లు జరుగుటకు ఒక కారణము లేకపోలేదు. సర్ వాల్టరాలే రాణిగారి దయతప్పి పతితుడయినాడు. అతని శత్రువు ఎసెక్స్ ప్రభువు సౌతాంప్టన్ ప్రభువు తనకున్న పగతీర్చుకొనుటకు సమయము చిక్కినదని సంతసించారు. సౌతాంప్టన్ షేక్స్పియరు శ్రేయస్సును గోరి అతనిని ఆదరించినవాడు కనుక ఒక వినోదకరమయిన నాటకము కావలెనని కోరినాడు. అట్టి పరిస్థితులలో షేక్స్పియరు ఈ లవ్జ్ లేబర్ లాస్టు అనే నాటకము రచించినాడు. రాలె మొదలయినవారు సంప్రదాయ సిద్ధాంతములకు విరుద్ధముగా కొన్ని నూతన (కొపర్నికస్) సిద్ధాంతములు ప్రచారములోనికి తెస్తూ ఉండిరి కనుక ఒక నూతన వైవాహిక సిద్ధాంతము ఆచరణలో పెట్టిన ఒక సంఘము కల్పించి షేక్స్పియరు ఒక హాస్యరస ప్రధానమయిన నాటకముగా ఈ లవ్జ్ లేబర్ లాస్టు అనే నాటకము రచించినాడు. ఈ నాటకములోని పాత్రలుకూడా ఆరాలేను అతని మిత్రులను మనసులో పెట్టుకొని కల్పించినవే అని అనాటి పరిస్థితులు తెలిసినవారి అభిప్రాయము.

[Holo fernes = florio - cum - vives = chapman cum Harvey = Ralegh............Moth = Na she చూపుట 160 K. R. Srinivasa Iyengar's Shake speare - His world and his art]

# ఈ నాటక మందలి ఇతివృత్త వివరణము

1. నలుగురు పెద్దలైన పురుషులు స్త్రీలకు దూరముగా నుండుటకు దీక్షవహిస్తారు. కాని నలుగురు స్త్రీలు వీరి దీక్ష వదలగొట్ట డానికి సిద్ధంగానే ఉంటారు.

2. ఈ నలుగురు ఆ నలుగురు తలవని తలంపుగా కలియడం సంభ విస్తుంది. పురుషులు మోహావేశమున తమ వ్రతమునకు కట్టు బడి ఉండలేక ఆ స్త్రీలను ప్రేమిస్తారు. ఆ స్త్రీలు మెత్తగానే లోబడతారు.

3. ఈ నలుగురిలోను ఒకడు దారితీస్తాడు. రహస్యముగా తాను వలచిన స్త్రీకి ఒక ప్రేమ లేఖ పంపుతాడు. తానొక్కడే ఈ తప్పుచేసినట్లు అనుకొంటాడు. కాని మిగిలిన ముగ్గురు అతని వలెనే ఆచరించి అతనివలెనే అనుకొంటారు.

4. నలుగురు క్రమక్రమముగా బయలు పడతారు.

5. చివరకు నాలుగు జతలవుతారు. వివాహ కార్యక్రమమునకు సిద్ధమవుతారు. కాని ఈ జతలలో స్త్రీలదే పైచెయ్యి. పురు షులే దురితమునకు పాల్పబడిన దుష్టులని స్త్రీలు నిందించి మేఘ దూతలోని యక్షునికి విధింపబడిన ఒక సంవత్సరము (వర్ష భోగ్యేనశాపేన) శిక్షవలెనే వీరికిని ఈ స్త్రీలచేతనే విధింపబడినది.

ట్రాయిలస్ అన్డ్ క్రెసిడా అనే నాటకము గ్రీకు పురాణ కథలపై ఆధారపడినది. చాసరు రచించిన Troilus and Criseyde అనే పద్యకావ్యమును దగ్గర పెట్టుకొని ఈ నాటకము రచితమయి ఉంటుంది. రెండింటను కథాక్రమములో పోలికలున్నవి. ఒక ముఖ్య మయిన విషయములో చాల వ్యత్యాసమున్నది. చాసర్ కావ్యమందలి క్రెసిడా యౌవన దశలో ఉన్న విధవ. షేక్స్పియరు నాటకమందలి క్రెసిడా అంతకంటె చిన్నది కన్య.

ప్రియమ్ పుత్రులలో కట్టకడపటివాడు ట్రాయ్‌లస్ 22 ఏండ్ల యువకుడు. నాయకునికి గల సాహసము ఈ యువకునికి లేదు. ప్రేమ ప్రదర్శింపలేడు. వాక్ చాతుర్యము లేదు. మధ్యవర్తిత్వమునకు పూను కొన్న పండారస్ ధూర్తుడయిన దూతగా వర్తిస్తాడు. అందువల్ల ఈ నాటకము రెండు కథావస్తువులు కలదిగా పరిణమిస్తుంది. (1) ప్రేమ కలాపము (2) స్పర్థా ద్రోహ జనితమయిన కలహము. తుదకు ట్రాయ్ లస్ క్రెసిడాను మాత్రమే కాదు. హెక్టరును కూడా పోగొట్టుకొన్నాడు. ఆ పిమ్మట ట్రోజన్లు ట్రాయ్‌లస్ మీదనే ఆధారపడినారు. ఈనాటక మునకు ఆత్మ, హృదయమూ ట్రాయ్‌లస్సే అయినాడు. ఇతడు యుద్ధ ములో గౌరవము ప్రేమ విషయములో ఆదర్శప్రాయమైన పవిత్రత చూపించినాడు.

మెజర్ ఫర్ మెజర్ (దెబ్బకు దెబ్బకు) నీతిదాయకమైననాట కము. ట్రాజడీగా పరిణమిస్తుందేమో అనిపించినది సుఖాంతముగా పరిణమిస్తుంది. 1604లో ప్రకటితమయినది. రచన ప్రౌఢమయినది. భావస్ఫూర్తి మెచ్చుకోదగినదిగా విడంబించినది. క్రైస్తవ గోస్పెల్ సెంట్ మాత్యూ (1-5)లో చెప్పినది. ఈ నాటకము విశదపరచు నట్లుగా కథ సాగినది. ఆ గోస్పెల్‌లో (ఓ న్యాయమూర్తీ) నీ వే విధ ముగా అభియోగమునకు తీర్పుచెప్తావో ఆ విధంగానే (నీమీద వచ్చిన అభియోగమునకు భగవంతుడు) తీర్పుచెప్పడం జరుగుతుంది....నీ సోద రుని కంటిలోని పుట్టుమచ్చ నీకు కనబడుతున్నది కాని నీ కంటి లోని శూలం ఇతరులకు కనబడదను కొంటున్నావా ! ఆ మచ్చ తీసివేయడానికి చూస్తున్నావు మరి నీ కంటిలోని శూలం మాటేమి ! అది పెకిలింపచూసే ముందు నీ కంటిలోనిది పెకిలింప చూసుకోవాలి. ఈ భావమే ఈ నాటకంలో వ్యక్తమవుతుంది.

విన్‌సెంటియో ప్రభువు తన పరిపాలన ధర్మము తన సహాయ ప్రభువు అయిన ఆంజలోకి అప్పగించి తానేదో తీర్థయాత్రలు సేవించు కొని వస్తానన్నట్లు దేశమునుండి వెడలిపోయినట్లు నటించి ఆ దేశము లోనే తన రాజధాని నగరమందే మారువేషమున ఆంజలో పరిపాల నము పరీక్షిస్తూ ఉంటాడు. వ్యభిచార దోషమ్మునకు గురియైన వాని

మరణ దండన విధించి అతని సోదరిని తన కామతృష్ణకు బలిగా యిచ్చిన యెడల నిందితుడిని విడిచి పెట్టుటకు సిద్ధపడతాడు. ఆ సోదరి ఇజ్ బెల్ పవిత్ర శీల భగవత్ సేవ చేయుటకు వ్రతముబూనిన పరిశుద్ధ. ఇందుకు ఒడబడదు. సోదరుని రక్షించుటకు మార్గము మరిలేదా! అన్న విచార సాగరమున మునిగియున్న సమయంలో మారువేషమున ఉన్న ప్రభువే ఉపాయమాలోచించి "పడక మార్పుల తంత్రము"తో ఆ ఆంజలో కోరిక నెరవేరునట్లున్ను, ఈ పావన చరిత శీలమునకు భంగము వాటిల్లకుండు నట్లున్ను చేస్తాడు. ఏమయినా ఆ ఆంజలోపై విశుద్ధ చరితునివలె కనబడవలెనని నిందితునికి మరణదండన విధింపడు. అంతలో విన్ సెంటియో తన నగరమునకు వచ్చి అధికారము మరల వహించి ఆ అభియోగమే స్వయంగా విచారించి ఆ ఆంజలోను దోషిగా నిరూపించి అతడు అనుభవించిన్ని త్రోసివుచ్చిన మారియానాను పెండ్లియాడవలెనని విధించుట తప్ప వేరే దండనము విధించక తిరుగ చెప్తాడు. ఓహో అతని ఔదార్యము.

కామెడీ ఆఫ్ ఎరర్జ్ (15[illegible]), టూ జెంటల్ మెన్ ఆఫ్ వెరోనా (1594), టేమింగ్ ఆఫ్ ద ష్రూ (1594)లో కామెడీవిధాన మెట్లుండ వలెనో నిరూపించుటకు షేక్స్పియరు ప్రయత్నించినాడంటున్నారు విమర్శకులు. అతడు తన సంఘమునందలి సభ్యులను, పరిచితులను, చూస్తూ ఉన్నప్పుడు వారి ప్రేమలు, నడవడి కనిపెడుతూ ఉండేవాడు. ఆ గుణాలు తన మొదటి కామెడీలలో చిత్రించేవాడు. కామెడీ ఆఫ్ ఎరజ్ లో కథ ఎట్లు అల్లవచ్చునో చూపించినాడు. టేమింగ్ ఆఫ్ ది ష్రూలో పాత్రపోషణము కంటె కథ పన్ని వేషములతో ఎట్లు వడి వడిగా నడిపించవచ్చునో కనబరచినాడు. టూ జెంటల్ మెన్ లో కామెడీ విధానము ఎట్లుండిన యెడల ప్రేక్షకులకు ఆకర్షకముగా నుండ గలదో తెలియజేసినాడు. ఈ నాటకములో వాస్తవ ధర్మము, శృంగార లక్షణము సమమైన పాళ్ళతో పొదిగించి ఏదన్నీ అసంగతం కాదనిపించాడు. అనగా రెండున్నూ యథోచితములుగానే నడచినవి అనిపించినాడు. ఇందులో నలుగురు యువతీ యువకులున్నారు. వేలం

సైలన్ సిల్వియాలు, ప్రోటియస్ జూలియాలు వీరు తుదకు యథోచితము గానే జతలుగాకూడినారు. అనగా ఎట్లుచక్కెర, పటిక ఒకే పాత్రలో కలిపి పోసి, నీరు కలిపి ద్రవము చేసినప్పుడు వాటి భిన్నత్వము తెలియక పోయినా ఆ ద్రవము పళ్ళెములో పోసి ఆరబెట్టినప్పుడు సహజ సిద్ధముగా ఉప్పు కణములు (క్రిస్టల్జ్) చక్కెర కణములు (క్రిస్టల్జ్) భిన్నములై ఏర్పడతవో అట్లే ఈ యువతీ యువకులు మొదట తారుమారైనట్లు కలిసినా తుదకు సహజసిద్ధముగాను యథోచితములుగాను సమకూడినారు.

ఈ నాటకమందలి జూలియా యువకునివలె వేషం ధరించడంతో షేక్స్పియరు ఇట్టి చమత్కృతి ప్రారంభించినాడు. ఈ విధముగానే అతడు ఆ తర్వాత రచించిన కామెడీలలోకూడా ఈ చమత్కారము కనబడుతుంది. ఉదా॥ రోజలిండు, పోర్షియా, వయోలా, ఏ విధంగా జూలియా తాను ప్రేమించిన యువకుని వద్దనుండి ఆ యువకుడు ప్రేమించిన స్త్రీవద్దకు ప్రేమలేఖలు తీసికొని వెళ్ళి అందజేస్తూ ఉండేదో ఆ విధంగానే ట్వెల్ఫ్తునైట్ నాటకములో వయోలా చేసినది. ఈ నాటకములోని సిల్వియా "Good greenwood" కు పోరిపోయినట్లే మిడ్ సమ్మర్ నైట్స్ డ్రీమ్‌లో హెర్మియా, హెలీనాలు, ఏజ్ యూ లైక్ ఇట్‌లో రోజలిండ్ సీలియాలు చేసినారు.

ఇక మెరీ వైవ్జ్ ఆఫ్ విన్‌జర్ అనే కామెడీ ఎట్లు నడచినదో చూడండి ఇది 1600లో ప్రౌఢమైన కామెడీలలో ట్వెల్ఫ్తునైటు తర్వాత రచితమయినది. ఇది షేక్స్పియరు ఒక ఉద్దేశము మనసులో పెట్టుకొని రచించినాడేమో అన్న అనుమానము కలుగుతున్నది. ఎందుచేతనంటే ఈ నాటకములోని ప్రధానపాత్ర అతని అనుచర శిష్యవర్గములోనివారు. బార్డాఫ్, పిస్టల్, నిమ్‌కూడా కనబడతారు. 4-వ, 5-వ హెన్రీలలోని నీచపాత్రలకు సంబంధించినవారు. 5వ హెన్రీలో తక్కిన వారందరూ కనబడినా ఫాల్‌స్టాఫ్ కనబడడు. 4వ హెన్రీలో 2వ భాగములో అతనిని 5-వ హెన్రీ తన్ని పొమ్మన్నట్టుగా ఫాల్‌స్టాఫ్ మరణించి అదృశ్యుడైనాడు. ఇది 5-వ హెన్రీ శీలమునకు అనుచితము

కాదా! అనే ప్రశ్న ఎవరికైనా పుట్టక తప్పదు. ఎలిజబెత్ రాణికి కూడా పుట్టినదట! ఆ పాత్రకు తగిన అవకాశమిస్తూ ఏదైనా మరి యొక నాటకము రచించవలసినదని రాణిగారు కోరినట్లు కొందరు అన్నారు. అందువలన షేక్స్పియరు ఈ నాటకము రచించినాడని కొందరన్నారు. అయితే కావచ్చును. అయినా షేక్స్పియరు ఈ నాటకములో కొందరాశించినట్లు ఫాల్స్టాఫ్ను సుగుణములు గల వానిగా చిత్రించలేదు. ఇతని పొత్తు 5-వ హెన్రీ ఎందుకు విడిచిపెట్టవలసిన అవసరము కలిగినదో చూపించే ఉద్దేశంతో ఈ నాటకము రచితమయినట్లు కనబడుచున్నది.

ఏదో చిల్లర మల్లరగా తిరిగినా, అపహాస్యం చేస్తూఉన్నా అసభ్యము, దూష్యము, మహాపాతకము అయిన పనులకు దిగజారిపోలేదు గదా అనిన్ని, వేడుకలకు, వినోదాలకు మాత్రమే పరిమితమయిన హాస్యగాడు గదా అని 5-వ హెన్రీ తాను ప్రిన్స్హారీగా ఉన్నప్పుడు ఈ ఫాల్స్టాఫును చేరదీసికో గలిగినాడు. ఈ నాటకములో ఫాల్స్టాఫు ఎంత నీచానికి దిగజారి పోగలడో తెలిసినది. భర్తలతో హాయిగా కాపురము చేస్తూ ఉండిన గృహిణులను కామించి ప్రేమలేఖలు పంపి వారి మానమును చెడగొట్టుటకు పూనుకొన్నాడు. వారు యితనికి తగిన శాస్తి చేసినారు. "సరే ఈ రాత్రి రావచ్చు" నని కబురుచేసి వేశ్యలెట్లు తమ పోషకుడు వచ్చినప్పుడు తాత్కాలికముగా వచ్చిన సరసులనుమంచముల క్రిందనో అటకమీదనో, గాదెలోనో దాచిఉంతురో అట్లే ఇతనిని కుళ్ళు బట్టల బుట్టలోపెట్టి మురుగుడు కాలవలో పారవేయించుట జరిగినది. మూడుసార్లు ఇతనికి ఇట్టిదుర్గతి పట్టినది. మూడవ సారి అందరిముందు హాస్యాస్పదుడు కావలసి వచ్చినది. ఇట్టి వానిని 5-వ హెన్రీ తాను రాజయిన తర్వాత తన అనుచరుల బృందములో ఇంకను ఉండనీయగలడు. ఫాల్స్టాఫు ఇటువంటి వాడని తెలియనివారు ఏమనుకొన్నా తెలిసినవారు మాత్రము 5-వ హెన్రీని మిత్రద్రోహిగా ఎంచి నిందించజాలరు. ఇట్లు కావలెనని ఎంచి షేక్స్పియరు ఈ నాటకము రచించినాడని విమర్శకులు కొందరు ఊహించుట సబబుగానే ఉన్నది.

పెరిక్లిజ్ అనే నాటకము 1608-1609 లో రచితమయినది. ఇది వాస్తవంగా షేక్స్పియరు రచించలేదని కొందరు, 3, 4, 5 అంకములే షేక్స్పియరు రచించినవి మొదటి రెండు అంకములున్నూ మరియొకరు రచించినవని కొందరున్నూ అంటున్నారు. ఈ వాదనలోనికి దిగి నేను విమర్శించలేను. నా కందుకు తగిన అర్హతాలేదు; అవకాశమూ లేదు. కనుక నాటకమెట్లు రచితమైనదో మాత్రము సంగ్రహించి వ్రాస్తున్నాను. ఇది పెరిక్లిజ్ జీవితము, అందును అతని యాత్రలు-అయాత్రలందలి ముఖ్యములయిన సన్నివేశములు. సంఘటనలు తెలియజేసే నాటకము. ఏంటియోకు నుండి టైరుకు, టైరు నుండి, టార్సస్ వరకు, టార్సస్ నుండి పెన్టాపొలిస్ వరకు, పెన్టాపొలిస్ నుండి ఎఫిసస్ వరకు, అక్కడ నుండి మరల టైరు వరకు, అక్కడ నుండి టార్సస్ వరకు, అక్కడనుండి మైటలీని వరకు, అక్కడ నుండి ఎఫిసస్ వద్దనున్న డయానా దేవాలయమువరకు ఎట్లు ఈ పెరిక్లిజ్ సంచరించినాడో, ఎట్లు తుపాను వచ్చినప్పుడూ, సముద్రము ప్రశాంతముగా ఉన్నప్పుడూ యానము సాగినదో దృశ్యములందు చిత్రింపబడినది. దీర్ఘకాలముల సన్నివేశములు పడవతలెనే వడివడిగా నడచినవి.

మొదటి అంకం మొదటి దృశ్యంలో సిరియాలోని ఏంటియోక్ ప్రభువయిన ఏంటియోకస్ (ది గ్రేట్) కూతురిని కామిస్తాడు, ఈ టైరు ప్రభువయిన పెరిక్లిజ్! అప్పుడొక పొడుపు కథ వంటి పద్యం అతని ముందుపెట్టి "దీని భావమేమి తిరుమలేశ!" అన్నట్లు అడుగుతారు. ఆ ఏంటియోకస్ అది చెప్పకోలేకపోయినా చావు తప్పదు, చెప్పకొన్నా చావు తప్పదు. ఆ కట్టుకథ పెరిక్లిజ్‌కు బోధపడినది. తండ్రి కూతుళ్ళకు జరిగిన మహాపాతక పు కలయికను సూచిస్తుంది. ఇకను అక్కడను అపాయము తప్పదని పెరిక్లిజ్ ఏంటియోక్ నగరం విడిచి టైరుకు పారిపోతాడు. అప్పటి నుండి అతని సంచారములు ఎగుడు దిగుడుగా సాగినవి. ఈ నాటకములో పెరిక్లిజ్ కూతురైన మెరీనా కథ అద్భుతమైనది. ఆమె ఓడప్రయాణంలో ఓడ బద్దలవుట చేత సముద్రంలోపడి ఒక సముద్రయాన దొంగకు చిక్కి అతడామెను అమ్మకొనుటవలన ఒక గుడిసెట్టులో చేరి ఆ వృత్తి సాగించుటకు

సమ్మతింపక తెలివి తెచ్చుకొని పరమ సాధ్విగా మాగుట అద్భుత మయిన సంఘటన. ఆమె ఆ వృత్తిని ఖండిస్తూ, సంఘ సంస్కరణకు పూనుకొన్నది. విశుద్ధ చరితగా ప్రఖ్యాతి పొందినది. ఈమె చనిపోయి నదని విని పెరిక్లీజ్ సన్యాసివలె దీక్షబూని యావజ్జీవం స్నానమైనా చేయక గడ్డమైనా గీచుకోనక ఉంటాడు. తుదకు డయానా దేవాల యంలో తండ్రి వద్దికి మెరినా కలుసుకొంటారు. ఏంటియోకస్ అతని కూతురు మొదలయిన మహాపాతకులు మరణించిన వార్త తెలుస్తుంది. ఎన్ని కష్టాలుపడినా పెరిక్లీజ్ కథ సుఖాంతమయినది.

* * *

# సింబలైన్

ఇది కొంత పురాతన చరిత్రాంశముల మీదను కొంత వినికిడి మీదను ఆధారపడిన కల్పిత కథ. సింబలైన్ బ్రిటన్ రాజు ఇతడి మొదటి భార్య కూతురు ఇమొజెన్. ఇతని రెండవ భార్య ఈ నాటక మందలి రాణి. ఈమె తన మొదటి మగడు చనిపోయిన తర్వాత సింబ లైన్‌ను పెండ్లియాడి రాణియైనది. ఈ నాటకములో ఇమొజెన్ పాత్ర ప్రధానమైనది. ఈ పాత్రను షేక్స్పియరు చాలా చక్కగా తన అభిమాన పాత్రగా పోషించినాడు. విమర్శకులు అనేకులు యీ ఇమొజెన్‌ను బహువిధముల శ్లాఘించినారు. సిల్వియా, పోర్షియా, బియాట్రిస్, రోజలిండ్, వయోలా, హెలీనా, ఇజబెలా, మెరీనా పెర్ డితా, మిరాండా పాత్రల కంటె! చాలా ఘనమైన పాత్ర అన్నారు ఈమెను ఎక్కువగా పొగిడినవారు చాలామంది కలరు. కాని యీ నాటక రచనను పొగిడినవారు ఎక్కువగా లేరు. ఈ ఇమొజెన్ భర్త పాస్తుమస్ లియొనేటస్ ఈమెకు తగిన భర్తగాని, ఈ నాటకమునకు తగిన నాయకుడుగాని కాజాలడన్నారు.

ఈమెను పాస్తుమస్సుకు మిత్రుడైన ఫిలారియోకు మిత్రుడు. ఇయాకిమో ఎట్లు వంచించి ఈమెశీలమునకు భంగము కలిగించినాడో అం. 1 దృ. 6 లోను అం. 2 దృ. 2 లోను షేక్స్పియరు కడు నేర్పుతో చిత్రించినాడు. ఆ దృశ్యములు చదివిన వారికే కాని సారాంశము తెలిసికొన్నవారికి బోధపడదు. ఓహో మానవుడు ఎంత నీచము నకయినను దిగజారిపోగము గదా! అని ఏమాత్రము మెత్తని హృదయుడైనను కంటతడి పెట్టక మానడు. కథవిస్తరించి చెప్పుటకు వ్యవధి చాలదు ఆమె అపవాదు పాలయినది. బాధలు పడ్డది. దుఃఖమున మునిగినది. అందరికీ ఆదరణీయురాలైనది. ఆమెను వంచించి ఆమెకు ద్రోహముచేసిన ఇయాకిమోయే "She is alone, the Arabian bird" అన్నాడు.

పెరిక్లీజ్, సింబలైన్, వింటర్జ్ టేల్, టెంపెస్ట్ — ఈ నాలుగు నాటకములున్నూ ఒక కోవకు చేరినవి పెరిక్లీజ్ లో మెరియానా వంటిది [అంత కంటెను ఎక్కువ ఘనత కలదే] ఈ ఇమొజన్ ఈ నాటకము లందు పాపులు దండనమునకు పశ్చాత్తప్తులను క్షమించుట తుదకు అందరును పొందిక సమకూర్చుట జరుగుతుంది

*　　*　　*

# వింటర్జ్ టేల్

ఇది 1601 లో రచితమైనది. షేక్స్పియరు ఆ నాటికి ప్రౌఢమయిన రచన సాగించగల కళాభిజ్ఞుడు, సాహిత్యశిల్పి. అయినా నిర్లక్ష్యముగా ఈ నాటకము రచించినాడు. మొదటి మూడంకములలోని రచనకు కడపటి రెండంకములలోని రచనకు వ్యత్యాసము కనబడుతున్నది. రెండు భాగములకు పొందిక పొడిమి తగ్గినది. మూడవ అంకములోని కథ జరిగిన మరి పదిహేను సంవత్సరములకు నాల్గవ అంకములోని కథ దాని పర్యవసానంగా అందుకొంటుంది. కాని యిది

మన భారతీయ నాటక సంప్రదాయమునకు దోషముగా తోచదు. సిసిలియా రాజు లియోంటజ్ బొహిమియా రాజు పోలిక్సెనీజ్ బాల్యస్నేహితులు. నాటక కథ ఈ బొహిమియా రాజు సిసిలియాకు అతిథిగా వచ్చి కొన్ని దినములుండి తన దేశమునకు వెడలనున్న సమయముతో ప్రారంభించినది. అం. 1 దృ. 2 లో రేపు నేను మాదేశానికి వెళ్ళుచున్నాను అని బొహిమియా రాజు అన్నప్పుడు ఏదో మర్యాద లాంఛనముగా మరియొక వారముండుమని లియోంటజ్ అన్నా పని తొందరవల్ల వెడలక తీరదన్నవాడు. లియోంటీజ్ రాణి హెర్మియోన్ హాస్యరసముతో 'మీరు ఉండనంటే మిమ్ము చెరలో బంధించి ఉంచుతాను' అన్నంత మాత్రాన ఉండడానికి సిద్ధపడతాడు. అదివరకే అతనికి తన భార్యకు సంబంధము కలదనిన్ని తన కొడుకు మమిల్లియస్ అతనికి పుట్టినాడనిన్ని అనుమానము తలకెక్కి అతనిని ఆ రాత్రి వధించుటకు తన కొలువులో ఉన్న కమిల్లో ప్రభువుతో కుట్ర పన్నుటకు ఆలోచిస్తాడు. కమిల్లో అందుకు సమ్మతించిన వానివలె నటించి బొహిమియో ప్రభువుకు ఈ విషయము తెలియచేస్తాడు. బొహిమియో ప్రభువు తన పరివారముతో, కమిల్లో తోడ్పాటుతో రహస్యముగా పారిపోతాడు. లియోంటు పెండ్లాన్ని దూషించి కులటగా ఎంచి చెరసాలలో బంధిస్తాడు. చెరసాలలో ఉండగా ఆమె బిడ్డను కంటుంది. అంటిగనస్ అనే ప్రభువు అతని భార్య పాలినా ఆ రాజుకు, రాణికి అత్యంత ప్రియులయిన స్నేహితులు. పాలినా ఆ బిడ్డను ఎత్తుకొని లియోంటీజుకు చూపించుటకు పూనుకొని రాజమందిరమునకు వెళ్ళినా రాజు చూడలేదు. ఆ కులటకు పుట్టిన కూతురు నా కూతురు కాదు. పొమ్మని కేకలు పెడతాడు. ఆ తర్వాత హెర్మియోను కులటయన్న అభియోగం తెచ్చి న్యాయసభలో విచారణ జరిపిస్తాడు.

సరిగా ఈ అధర్మమార్గముననే కాకపోయినా ధర్మముగా కనబడే మరియొక రీతి అన్యాయ మార్గముననే కదా శకుంతల కథ, సీతా వనవాసము మన దేశమున జరిగినది. భారతములో ఉన్న కథ ప్రకారము దుష్యంతుడు తన ప్రజలు ఏమనుకొంటారో అన్న భయముతో శకుంతలను ఎరుగనని పలికి ఆకాశవాణి పలుకుటవలన అందరికీ నమ్మ

కము కుదిరిన తర్వాత శకుంతలను స్వీకరిస్తాడు. కాళిదాసు రచించిన అభిజ్ఞాన శాకుంతల నాటకము ప్రకారము దుర్వాస శాపము వలన మరచిపోయి శకుంతలను నిరాకరించి, ఉంగరము, కనబడగానే పశ్చాత్తప్తు డగుతాడు. కాని అప్పటికి శకుంతల అదృశ్యమయినది. మరి పది పండెండేండ్లకుగాని అతనికి ఎంత వెదకినా కనబడ లేదు.

బాల్య దశలో శకుంతలను శకుంతల పక్షులు రక్షించినవి. హెర్మియోన్ కూతురయిన పెర్డితాను గ్రద్దలు, రాబందులు రక్షించినవి. హెర్మియోన్ కథ సీత కథవలె కూడా నడచినది. సీత శీలమును జనులు సందేహిస్తున్నారన్నంత మాత్రాన రాముడు అడవికిపొగదోలినాడు. కుశలవులు పుట్టిన తర్వాత వాల్మీకి ఆశ్రమములో అందరూ కలిసికొన్నారు. ఆ విధముగానే 16 ఏండ్లకు అందరూ కలుసుకొంటారు. లియోంటీజు పశ్చాత్తప్తు డగుతాడు. బొహిమియా రాజును కమిల్లోను కూడా కలిసికొని సంతసిస్తాడు.

కోరియలానస్, ఆంటనీ అండ్ క్లియోపాత్రా నాటకాలు ట్రాజడీలుగా పరిణమించిన చారిత్ర నాటకాలు చరిత్ర చదివిన వారికి కథ చెప్పనక్కరలేదు. నాటక రచనకు కావలసిన కూర్పులు చేర్పులు జరిగినవి. ఇవిన్ని జనరంజకముగా ఉన్నందున పెక్కుచోట్ల ప్రదర్శితములగుతూ ఉన్నవి.

*   *   *

# II. షేక్‌స్పియరు ప్రపంచము

ప్రపంచమందలి రచయితలలో మరి యే రచయితా షేక్‌స్పియరు తన రచనలద్వారా చూపించినంత విశాలముగా ప్రపంచమును చూపించలేదు. ఇతని 37 నాటకములందున్ను గల పాత్రల సంఖ్య మొత్తము 750 కంటె అధికము. ఈ పాత్రలలో రాజులు మొదలు,

నౌకర్లు, బెస్తలు, జానిసలు వరకును పండితులు మొదలు నోరెరుగని పామరుల వరకును, నాగరకత గల పౌరులు మొదలుకొని, పల్లెలందుండే గొల్లలవరకును, పవిత్ర చరితలు మొదలుకొని, పాపులవరకును, అన్ని తరగతుల వారు అన్ని శ్రేణులకు చెందినవారున్ను కలరు. నాటకములో దృశ్యములు ఆసియా మైనరు మొదలుకొని ఇంగ్లండు వరకును గల సకల దేశములకును వ్యాపించినవి. కథలు ప్రాచీన తమ కాలము మొదలుకొని 8-వ హెన్రీ వరకును నడచినవి. ఇట్లుండుటకు షేక్స్పియరు ఎన్ని గ్రంథములు చదివి యుండెనో, ఎంత అనుభవము సంపాదించి యుండెనోగనా !

III. షేక్స్పియరు పేరనున్న రచనలు షేక్స్పియరు రచించ లేదన్న వాదము అడుగంటినది కనుక నేను చర్విత చర్వణముగా వ్రాయనక్కరలేదు.

IV. అతని కవిత్వ కావ్యములు వీటి గురించి వ్రాయవలెనంటే అధమము మరి ఇరువది పుటలు అయినా వ్రాయవలసి వస్తుంది. అందుచేత ఇక్కడ వ్రాయలేదు. మరియొక గ్రంథము వ్రాయుటకు సంకల్పించినాను.

* * *

# షేక్స్పియరు సూక్తులు

సూక్తులు అనేక విధములయినవి. కొన్ని నీతిని బోధించేవి కొన్ని ప్రకృతి తత్త్వమును తెలియజేసేవి. కొన్ని ఆధ్యాత్మిక విద్యకు సంబంధించినవి. కొన్ని మనజీవిత రహస్యములకు, ప్రవర్తనకు, ఆచార వ్యవహారములకు, నమ్మకములకు, అవస్థలకు, పరస్పర సంబంధములకు

సంబంధించినవి. ఈ విధముగా ఉండే సూక్తులు ఆ సూక్తులు పలికే వారి సంస్కృతిని తెలియజేస్తవి. ఇవి అన్ని దేశములందును అన్ని భాషలలోను కలవు. కేవలము సూక్తులు తెలియజేసే ఉద్దేశముతోనే రచితములయిన గ్రంథములున్నవి. వేమన శతకము, సుమతీ శతకము మొదలయినవి. ఇట్టి గ్రంథములు, ప్రబంధములు, నాటకములు, నవలలు, కథలు మొదలయిన రచనలలో కూడా సూక్తులు గలవు. కాని ఈ రచనలలో సూక్తులు సందర్భోచితములుగా ఉండవలెనే కాని తీరి కూర్చుండి సూక్తులు అతికి పెట్టుట కవితాశిల్పము కానేరదు. నాచన సోముడు తన ఉత్తరహరి వంశమునందును, జక్కన తన విక్రమార్క చరిత్రలోను సామెతలు కడునేర్పుగా సందర్భోచితముగా ప్రయోగించినారు. ఆ విధముగానే షేక్స్పియరు కడు నేర్పుతో అనేక సూక్తులు తన నాటకములందును పద్యకావ్యము లందును రచించినాడు. హామ్లెట్ నాటకములో పొలోనియస్ తన కుమారునికి బోధించిన వాక్యములు, మర్చంట్ ఆఫ్ వెనిస్‌లో పోర్షియా కృపను గురించి పలికిన వాక్యములు, ఏజ్ యూ లైక్ ఇట్ లో జేక్విజ్ మానవ జీవితమునందలి ఏడు దశల లక్షణములు ఘన పాఠకులందరికీ మనోరంజకములయినవి. కంఠస్థము చేయదగినవి. వంగదేశ విద్వాంసుడయిన సేన్ షెక్స్పియరు గ్రంథముల నుండి నాలుగువేల సూక్తులు మూడువందల విషయముల క్రింద వర్గీకరించి ప్రకటించినాడు. వాటిలో ముఖ్యములయినవి కొన్ని ఎంచి ఇక్కడ ప్రకటిస్తున్నాను. కొన్నింటికి సదృశ్యములు కాదగిన సూక్తులు మన భాషలో ఉన్నవి తెలియజేస్తున్నాను. ఈ గ్రంథము వ్రాస్తూ ఉన్నప్పుడు ఝటితిస్ఫూర్తిని ఆశువుగా వచ్చిన చోట పద్యరూపమున తెలియజేసినాను. కొన్ని గద్యములుగానే రచించినాను.

....   ....   ....

## అసూయ

Trifles light as air
Are jealous confirmations strong
As proofs of holag writ

అసూయాగ్రస్తులకు ఇసుమంతైన
విలువలేనివి వేద ప్రమాణాలు

[ఓతె III 3]

* * *

## అమాయకత్వము

The silence after of Pure innocense
Persuades when speaking fails

వాగ్జాలం కంటె నోరెరుగని అమాయకత్వము
ఎక్కువ ప్రోత్సాహకరము.

[మిచెల్ III 2]

* * *

## అనుమానము

Suspician always haunts the guilty mind.

అనుమానము పెనుభూతము
తన దురితమే పాపి వెంట దగులుచు నడుచున్.

[6_వ హెన్రీ (౩. 20) V. 6]

* * *

## ఆలోచనలు - ఊహలు

Our thoughts are ours
Their ends are not our own.

మన ఆలోచనలు మనవే కాని
వాటి ఫలితము మాత్రం మనది కాదు.

[హామ్ IV. 2]

Thy wish was father to thy thought.

నీ కోరికకు పుట్టింది నీ ఆలోచన.

[4-వ హెన్రీ] - 2-IV. 5]

*　　*　　*

## ఆత్మ

I have a kind soul that
would give you thanks
And Knows not how to do it
but with tears.

నీకు కృతజ్ఞతాభివందనము లర్పించే ఆత్మ నాలో ఉన్నది; ఐన నేమి కన్నీళ్ళతోనే కాని మరియొక రీతిగా ఆపని చేయనేరదు.

[కింగ్ జాన్- V 7]

*　　*　　*

An evil soul producing holy witness
Is like a villain with smiling cheek
A goodly apple rotten at the heart.

పవిత్ర గ్రంథం పట్టుకొని ప్రమాణంచేసే ఆ దుష్టాత్ముడు. పైకి నవ్వుతూ గొంతుకోసే ద్రోహి వంటివాడు.

"మేడి పండు చూడ మేలిమై యుండును
పొట్ట విచ్చి చూడఁ బురుగులుండు."

(మర్చెంట్- I - 3)

*　　*　　*

## ఆత్మ

Not on thy sole but on thy
Soul, harsh jew
Thou makeet thy knife keen.

కఠిన హృదయుడ ! జూదుఁడా !
కత్తి వదను
పట్టుచున్నావు నీ యాత్మపైని; చూడు
మంతియే కాని నీ పాద
మందుఁ దొడుగు కొన్న
కొన్న చెప్పుట్టుపై కాదు
క్రూరచిత్త.

(మర్చంట్ ఆ. వె. IV. 1)

*　　　*　　　*

## ఇచ్చకము (పొగడ్త)

O ! that men's ears should be
To counsel deaft; but not to flattery.

ఓహో ! మానవుల చెవులు !
ఇచ్చకాలకు తెరచుకొంటవి
ఉపదేశాలకు మూసుకొంటవి.

*　　　*　　　*

## కాలము

Things growing are not ripe
until their season.

"పచ్చికాయ తెచ్చి పడవేయ ఫలమగునె
విశ్వదాభి రామ వినుర వేమ."

[మిడ్. స. డ్రీమ్ II. 2]

I wasted time and now time
doth waste me.

నే నప్పుడు కాలం వృథా పుచ్చినాను
నన్నిప్పుడు కాలం వృథా పుచ్చుతున్నది.

[2 వ రిచ. V. 5]

*　　　*　　　*

# కిరీటము

Uneasy lies the head that wears a crown.

కిరీటము ధరించిన రాజు తల ఎప్పుడూ బాధ పడుతూనే ఉంటుంది.

ఇది విన్నప్పుడు అభిజ్ఞాన శాకుంతలములో కాళిదాసు చెప్పిన శ్లోకము –

"ఔత్సుక్య మాత్ర మవసా దయతి
ప్రతిష్ఠా క్లిశ్నాతి లబ్ధ పరిపాలన వృత్తి రేవ"
జ్ఞప్తికి వస్తుంది.

*　　　*　　　*

# గానము

Orphens with his lute made trees
etc...................spring.
Every thing that heard him play
etc...................or hearing die.

మురళీ కృష్ణుడు వేణువు ఊదినప్పుడు పశువులు కూడా తమ మేత మాని మధుర గానము వింటూ నిలబడి పోయినవని చెప్పినట్లే, ప్రాచీన కాలపు యువక గాయకుల ఆర్ ఫ్యూస్ గానమహిమ వర్ణింప బడినది.

మను చరిత్రలో "ఆల్లరిగించు గాంధర్వ విద్యమాకు వెన్న తోడ పెట్టినది మాకు" అన్నట్లు షేక్స్పియరు గచనలలో పెక్కు చోట్ల చిత్రింపబడినది.

* * *

## కృప (Mercy)

The Quality of mercy is not strained
It dropeth....................

..................................
When mercy seasons.

కృపారసము పిండితే వచ్చేదికాదు. స్వర్గమునుండి

[మర్చెంట్ ఆ. వె. పేజీ 246 పంక్తులు 5-18]

* * *

## పతనము

Some falls are means the
happier to arise.

పతన మొక్కొక్క వేళ సు
ఖ తరమైన
యున్నతికి హేతు వగుచు ను
త్కృష్ట మగును.

[సింబ. IV. 2]

* * *

## పసికూనలు (శిశువులు)

My tender babes - my un bloon flowers.

ముక్కు వచ్చలారని నా శిశువులు
రేకులు విడని కుసుమములు.

[రిచ. 3: IV. 4]

# ప్రార్ధన

If you require a little space for prayer
I grant it pray; but be not tedious
For the gods are quick of ear.

దేవతుల నీవు భక్తిఁ బ్రార్థింప దలతె ?
మంచి దవకాశమిత్తు బ్రార్థించుకొనుము
కాని విసువు పుట్టింప బూనుకొనకు
ఇట్టె గ్రహింపగలరు నీ హృదయ మిపుడు.

[పెరి IV. 1]

* * *

# పిరికితనము

Cowards die many times before their death
The Valiant never taste of death but once.

కల్ ఫర్నియా దుశ్శకునములకు భయపడి తన భర్త జూలియస్ సీజర్‌తో "మీ రిప్పుడు సభకు వెళ్ళవద్దు." అని బతిమాలినప్పుడు సీజరన్న మాటలు

వాస్తవముగా వచ్చే మృత్యువు రాకమునుపే పిరికి పందలు ఎన్నోసార్లు చచ్చి బ్రతుకుతూ ఉంటారు.

ధీరులకు మృత్యువు ఒక్కసారే కలుగుతుంది. (అది వాస్తవంగా వచ్చినప్పుడు తప్పించుకోవడం బ్రహ్మకైనా శక్యముగాదు. ఈ విషయము మన భారతీయులకు లెస్సగా తెలుసును.)

* * *

# బలము

It is excellent
To have a giant's strength
But it is tyrannous
To use it like a giant.

రాక్షస బలంబు మించి దే
రహిం జెలంగుం
గాని దాని రాక్షసుల మాడ్కిం
గరుణ లేక
ప్రజల జంపంగ వినియోగ
పరతు వేనిం
గ్రూర కృత్యాంబు; యోజింపు
కొమ్ము ప్రభువ !

[మె. ఫ. మె. II. 2]

* * *

## మూఢులు

Lord ! what fools the mortals be
అయ్యో దేవుడా ! మానవులెంత మూఢులో.

[వేశయూ iii. 2]

Better a witty fool than a foolish wit.
తెలివి లేని చమత్కృతి కంటె
చమత్కారముగల మూఢుడు మేలు.

[ట్వెల్ఫ్తు I. 4]

* * *

## మాట (లు)

Far better said than done.
మాటలకేమి కోటలు దాటును.
అడుగు మాత్రము గడప దాటదు.

* * *

## మృత్యువు

All that lives must die

[ Ham. యాక్టు 1. 2]

జాతస్య మరణం ధ్రువమ్.

ఇది భారతీయుల కందరికీ లెస్సగా తెలిసిన విషయము. అర్జునుని విషాదము పోగొట్టుటకు కృష్ణ భగవానుడు బోధించిన తత్త్వమే కదా!

*　　　*　　　*

## తారాబలము

The stars above us govern our
Conditions.

[కింగ్. లి. IV. ౩]

జన్మ నక్షత్రమునుబట్టి జరుగుచుండు
మన మనుగడల పనులును మంచి చెడుగు.

*　　　*　　　*

## దయ

Kindness.

దయా సింధు. దయారసము అని దయ ప్రధానపదార్థముగా మన కవులు పరిగణించినట్లే షేక్స్పియరున్ను పరిగణించి వర్ణించినాడు.

Yet do I fear thy nature
It is too full of the milk of human
kindness.

ఈ పలుకులు మెక్‌బెత్ భార్య పలికినవి. తన భర్త తనకు ముందుగా పంపిన లేఖ చదివి అతడు రాజు కానున్నట్లు కామినులు చెప్పినారన్న వాడి పలుకులు తెలిసికొని వెంటనే హత్య గావించుటకు

పన్నుగడ యోచించి అందుకు తన భర్త సాహసించి తనకు తోడ్పడ దన్న భయముతో భర్తను గూర్చి పలికినవి.

[మెక్ I. 5]

* * *

## ద్రోహము

Treason is not in herited. mylord,

ద్రోహచింత వంశ వారసత్వమువల్ల రాదు ప్రభూ !

[ఏజ్ యూ— I. 3]

* * *

## దయ

Kindness in women, not theirb eauteous looks
Shall win my love

[ఇవి బియాన్కాను గూర్చి హార్టెన్సియో అన్న మాటలు]

స్త్రీల కనులలోగల అందమైన దృక్కులకన్న వారిలోగల దయకు ప్రాధాన్యమిచ్చే సూక్తి ఇది.

[టేమింగ్. ఆ. ది ష్రూ IV. 2]

ఇందుకు కాస్త భిన్నముగా.

Beauty lives with kindness.

(Twolgn of verona IV. 2)

అందమెప్పుడు దయతోడ చెందు పొత్తు

ఈ మాటలు సిల్వియాను గూర్చి ఒక గేయమందు రచితములైనవి.

Is she kind as she is fair ?
For beauty lives with kindness.

* * *

## నమ్మకము

Trust not him that hath once broken faith.

ఒకసారి నమ్మించి మోసపుచ్చిన వానిని
మరి యెన్నడూ నమ్మరాదు.

[6వ హెన్రీ (౩వది) IV. 4]

*   *   *

## రాజులఘనత

As jewels lose their glory if neglected
So princes their renown if not respected.

వాడుక తప్పిన వస్తువులకు ప్రయోజనములేదు.
అధికారముపోయిన రాజులకు ఘనతలేదు.

(Per-II. 2)

*   *   *

## సహనము

What cannot be eschew'd
must be embraced
(cf. What cannot be cured
must be embraced)

పడక తప్పని బాధనోర్వంగ వలయు

[మెరీవైవ్జ్ V. 5]

Asses are made to bear

బరువు మోయుటకు గాడిద
ధరణిఁ బుట్టె.

*   *

## సాధుత్వము

Your gentleness shall force
More than your force more us to
gentleness

ఇతరులను సాధువులుగా చేయుటలో
నీ బలప్రయోగము కంటె నీ సాధువర్తనమే
బలవత్తరమయినది.

*  *  *

## ధూర్తలక్షణము

Who makes the finest show
means most deceit.

(per I. 4)

పైకి ప్రదర్శించిన నటన [వేషము]
ఎంత ఎక్కువగా ఉంటుందో
అంత ఎక్కువగా మోసమున్నదన్నమాట
అతి వినయం ధూర్తలక్షణము.

*  *  *

## పిచ్చి భయము

Be not afraid of shadows.

[రిచ (III)V. 3]

నీ నీడ చూచుకొని నీవు భయపడుతున్నావు.

*  *  *

## విధి

What can be avoided
Whose end is proposed by the mighty God?

[జూ. సీ II.2]

లలాటే లిఖితం ప్రోక్తం.
బ్రహ్మణాపి.నశక్యతే॥
నుదుటన్ వ్రాసిన వ్రాత తప్పదు గదా
మూర్ఖులు చింతించినన్.

*　　　*　　　*

## వివాహములు

[తొందరపాటు]

Hasty marriages seldom proveth well.
తొందరపడి చేసికొన్న పెండ్లిళ్ళు సుఖముగా
పరిణమించవు.

*　　　*　　　*

## మగవారు

Sigh no more ladies? Sigh no more
Men were deceivers ever
one foot is in sea and on the shore
To one thing constant never.
నమ్మకరాదె కొమ్మ! మగవారల
కమ్మని మాటలచే....

[మచ్. అడూ.... II. 3]

*　　　*　　　*

## MAIDEN

A maiden hath no tongue
but thought

[మర్చంట్. ఆ. వె. III. 2]

ముగ్ధమైన కన్యకు ఆలోచన ఉంటుంది గాని
నోరు విప్పి మాటాడలేదు.

*  *  *

## వి ష ము

Hide not thy poison with such
sugured words.

చక్కెర కలిపిన పలుకులతో నీలోగల
విషము కప్పి పుచ్చకు.

cf. మధు తిష్ఠతి వాచి యోషితాం
హృది హాలాహల మేవ కేవలమ్॥
పెదవుల తీపి మదిలో విషము.

(Ant & cl I.5)

*  *  *

విషమె యొకట ! కమ్మని యాహారమాయె నాకు.

In poison there is physic.

(H. IV (2) 1. 1)

మందు కలదు విషమునందు కూడ.

*  *  *

## ఆ ల స్య ము

Delay not time, delays have dangers.
(Hen VI (1) III. 2)

cf. ఆలశ్యం అమృతం విషం.

The sun shines hot and if we use delay
cold biting winter mars our, hoped for.

cf. వెలుగున్నప్పుడే చక్కబెట్టుకోవాలి.

Make hay while the sun shines.

*  *  *

## కృ త జ్ఞ త

God will send more if the man
will be thankful

(A. V. L III. 2)

చేసిన మేలుకు కృతజ్ఞత చూపిన వానికి
భగవంతుడు మరింత మేలు చేస్తాడు.

*                    *                    *

## దుః ఖ ము

[దుఃఖము కలిగించు ఆపదలు]

(SORROWS)

When sorrows come they come not single
But in battations.
తగిలిన కాలే తగులును.

*                    *                    *

A heavy heart bears not a miserable
tongue.

(L. L. loot V. 2)

హృదయం దుఃఖ భరితమైనప్పుడు
నోరు పెగలదు.

*                    *                    *

## ఎ త్తు

బేడలుడి స్తే వడ్లు పండవు.

(L. L. Lost IV. 3)

*                    *                    *

## మా ట లు

Talkers are no good doers
మాటలు కోటలు దాటుతవి; కాలు మాత్రము
గడప దాటదు.

[రిచ్ III–I. 3]

*                    *

How can I grace my talk
waiting a hand to give to action.

(Tites And V. 2)

చేయుటకు చేతులు రానప్పుడు
నాకేమి సౌష్ఠవము కలదు కలుగు.

*　　　*　　　*

## PATENCE

How poor are they that have not practice
what wound did ever heal but by
dangerous.

[ఓ. II. 3]

ఓర్మిలేనివారికి బాధ మరింత ఎక్కువగుతుంది.
గాయం అకస్మాత్తుగా తగుల్తుంది.
గాని ఒక్కసారిగా మానుతుంది.
మానడానికి కొంత కాలం పట్టకమానదు.

*　　　*　　　*

## WIFE

స్త్రీని చెరపడానికి మంచి సమయం చెప్తున్నాడు.

I have heard it said that the fittest time to cor-rept a man's wife is when she is fallen out with her husband.

*　　　*　　　*

The wife is proud, she holdeth
thee in awe
More than God or religious
Churchmen may

H VI (p. i.) I.

*　　　*　　　*

## WISDOM

The fool doth think he is wise
but the wise man knows himself to be
a fool.

తెలివి తక్కువవాడు తను బుద్ధిమంతు డనుకొంటాడు.
తన తెలివిలోకల లోపము బుద్ధిమంతుడు మాత్రము
తెలిసికోగలడు

*           *           *

## విలువ
## VALUE

On the finger of a throned Queen
The bascat jewel will be well esteemed.

(Son X CVI)

రాజుగారి చేతి నిమ్మపండు.

*           *           *

## ఆ ప ద
## (ADVERSITY)

ఆపద వలన కలిగే ప్రయోజనాలు మధురమయినవి. ఇట్లు
విషజాతి మండూకము (toad) వికృతాకారము కలది.
"విషమయు మయినది" అయినది అయినా దాని తలలో
అమూల్యమైన ఆభరణమున్నది అట్లే

Sweet are the uses of adversity

(Ay. L. I–II–1)

## HEAVEN

The heaven is on earth

H. VI (P. r.) I-1

స్వర్గం మరెక్కడో లేదు భూమిమీదనే ఉంది.

## రాజసేవ

Had I but served my God with half the zeel
I served my king he would not in my age
Have left me naked to mine enemies.

(H viii - iii 3 Sc. 2)

నా రాజుకు సేవచేయుటలో ఎంత ఆసక్తి చూపించేనో దానిలో సగమాసక్తి చూపి భగవంతుని సేవచేసిన యెడల నన్ను (ముదుసలి) వయస్సున్న భగవంతుడు శత్రువులకు అప్పగించి ఉండడు.

* * *

## మాటలు

I understand a fury in your words. But not the words.

(Oth. IV. 2)

నీ మాటలలోగల కోపావేశము బోధపడుతున్నది గాని నీ మాటలు తెలియడం లేదు.

* * *

Talkers are no good doers.

(Rich iii - i. 3.)

మాటలకేమి కోటలు దాటుతవి.
కాలు మాత్రం గడప దాటదు.
అరిచే కుక్క కరవదు.

* * *

The words are razors to my wounded heart.

Titus. Hr-I. 1

అసలే నా హృదయం గాయపడింది.
దానిపై క్షారం పోసినట్లున్నవి ఈ మాటలు.

* * *

## దేశభక్తి

Who is here sovile that not love his country.

[జూ. సీ. iii. ౨]

దేశభక్తి లేని నీచుడెవడైనా ఎక్కడైనా ఉంటాడా ?

*  *  *

God the best maker of all marriages combine your earts in one

(H. V V. 2)

వధూవరుల వివాహములు సమకూర్చు భగవంతుడు మీ ఉభ యుల హృదయముల కైక్యము సమకూర్చుగాక !

*  *  *

## HUSBAND

The husband is thy lord, thy life thy keeper etc.

(Taming of the Shrew V. 2)

పతియే దైవము.